# INDIAN PHILOSOPHY



## శ్రీ నిర్గుణతత్త్వ బోధకరతలామలకము

గ్రంధకర్త

పరమహంస శ్రీ జ్ఞానదేవ్

# శ్రీ నిర్గుణతత్త్వ బోధకరతలామలకము

(భగవాన్ శ్రీ వసిష్ఠ, శ్రీ త్రిదశాద్వయాంశ శ్రీ రమణభాషణ,
శ్రీ బాబా శ్రీయుక్తేశ్వరాది యవతార పురుషతత్త్వబోధ సహితము)



జననం : 1-6-1910

క॥ తాననుభవించి యొరులకు
జ్ఞానము నుపదేశములను గావించుటకై
మేనుగొనినట్టి శ్రీభగవా
నునకున్ స్వాత్మదేవునకు వందనమిడెదన్.


గ్రంధకర్త

పరమహంస, బ్రహ్మవిద్వర, అపరోక్షానుభవి,

**శ్రీ జ్ఞానదేవ్**

పెరవలి, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్, భారత్



ప్రతులు: 2000 కాపీలు : వెల :రూ॥ 50-00

ద్రవ్యసహకారులు : **తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి**

ముద్రాపకులు: శివశ్రీ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, ఖమ్మం, ఫోన్ :23976,

# ఉపయుక్త గ్రంధములు

1. శ్రీ శంకరాచార్యులు — శంకర విజయము
2. శ్రీ విద్యారణ్యస్వామి — దృగ్దృశ్యవివేకము
3. శ్రీ వసిష్ఠమహాముని — వాసిష్ఠరామాయణము, వసిష్ఠగీత, జ్ఞానవాసిష్ఠము యోగవాసిష్ఠము, జ్ఞానప్రాప్తివిచారము, పశ్నోత్తర రత్నమాల.
4. శ్రీ రమణ మహర్షి — రమణగీత, రమణ భాషణములు.
5. శ్రీ జిడ్డు కృష్ణమూర్తి — అవగాహన తత్త్వదర్శనము.
6. శ్రీ రామతీర్థ — ప్రాక్టికల్ వేదాంత ఆఫ్ రామతీర్థ (ఇంగ్లీష్) శ్రీ రమతీర్థ జీవిత చరిత్ర (తెలుగు) 3 భాగములు వేదాంత భాష్యము
7. శ్రీ బ్రహ్మానందగిరిస్వామి — బ్రహ్మవిద్యామహోదధి పూర్వార్థము, బ్రహ్మవిద్యామహోదధి ఉత్తరార్థము,
8. శ్రీ బాబాజీ (సజీవి, 2వేలసం॥ ములనుండి ఉన్నారు), శ్రీలాహిరి మహాశయ (మహావతార్, యోగావతార్) శ్రీ యుక్తేశ్వరగిరి జ్ఞానావతార్ శ్రీ యోగానంద పరమహంస. — (ఒక యోగి ఆత్మకథ (ఇంగ్లీష్) ఒక యోగి ఆత్మకథ (తెలుగు)
9. విచారసాగరము
10. వేదంత పంచదశి
11. వివేక చూడామణి
12. ఆత్మపురాణము
13. పక్షపాతరహిత అనుభవ ప్రకాశము
14. శ్రీ భగవద్గీత
15. బ్రహ్మసూత్రములు
16. బ్రహ్మవిద్యాదర్పణము
17. సత్యార్థ ప్రకాశిక
18. అద్వైతబోధామృతము
19. ఉపనిషద్వాణి
20. అవధూతగీత
21. బ్రహ్మానందదర్శనము
22. బ్రహ్మసూత్రార్థదీపిక
23. జ్ఞానప్రాప్తిబిచారము
24. ఉపనిషత్తుల బోధలు, కథలు,
25. గీతామకరందము.

# పండితాభిప్రాయములు.

## పరిచయం -1

'తత్త్వదర్శనరసిక' జనస్వామి సుబ్రహ్మణ్యశాస్త్రి
మండలాశ్రమము, తెనాలి

'నిర్గుణతత్త్వభోద కరతలామలకము' అనే యీ పుస్తకాన్ని ఆధ్యాత్మ జిజ్ఞాను లోకానికి అందించచున్నవవారు శ్రీ జ్ఞానదేవ్‌గారు. వీరు నిరంతరం ఆత్మానుసంధానంలో మునిగి ఉంటారు. జీవ బ్రహ్మైకత్వానుభూతి, వీరికి పరమ అభిలషనీయమైన విషయము. కనకనే, ముముక్షుజనుల శ్రేయస్సుకై శ్రీ జ్ఞానదేవ్‌గారు ఈ పుస్తకాన్ని రచించారు. ఈ పుస్తకనామమే రచయితకుగల ధీరత్వాన్ని తెలియజేయుచున్నది. నిర్గుణతత్త్వబోధకరత లామలకం చేసికొన్న ధీరులైన వ్యక్తి, వీరు ఈ పుస్తకం అద్వైతానుభూతి ప్రకాశిక. ఆ అనుభూతి ప్రకాశంలో యుక్తితో అనుభవంతోను తమకు సంమతమైన, అనుకూలమైన రీతిలో వేదాంతవిషయ పరిశీలనం ఈ పుస్తకంలో శ్రీ జ్ఞానదేవ్‌గారు చేశారు.

రచయిత, షడ్విధలింగవిచారణ చేసి ఈశావాస్యాది ఉపనిషత్తులలో ఉపక్రమ, ఉపసంహారాదిషడ్విధలింగములచేత అద్వయ బ్రహ్మతత్త్వం ఎలా ప్రతిపాదింపబడ్డయో వివరించారు. జీవ, బ్రహ్మలకు భేదం, మాయోపాధివల్ల, అవిద్యోపాధివల్ల వచ్చిందేగాని వాస్తంవలో లేదని, జీవబ్రహ్మైకత్త్వమే శ్రుతి, శృతులకు సంమతమని తమకుగల అనుభూతిని వెలిబుచ్చారు. బ్రహ్మాత్మైక్యజ్ఞానం వల్లనే మోక్ష్యం లభిస్తుందిగాని, కర్మోపాసనలవల్ల మోక్షం సిద్ధించదని తెలియజేశారు. జ్ఞానాదేవతుకైవల్యమ్ అనే ఉపనిషత్సిద్ధాంతాన్ని దృఢనిశ్చయంతో అనుభవంతో చెప్పడం ముదావహం.

సత్త్వ, రజ స్తమోగుణాల స్వరూప స్వభావాలను వివరించి , పరమాత్మ నిర్గుణ స్వరూపుడని అనుభవపూర్వకంగా తెలియజెశారు. చిధాభాసుడు జ్ఞానా జ్ఞానాలు కలవాడుగాని, ఆత్మ జ్ఞానా జ్ఞానాలకు అతీతుడని రచయిత, తమ అనుభూతిని ప్రదర్శించి తమకుగల అద్వైతాభినివేశాన్ని విస్పష్టంచేశారు.

ఆత్మస్థితిని పూర్ణానంద స్వరూపంగా తెలియడమే, ఆత్మానుభవమని, మమతను విడిచి పెట్టడమే చిత్తశుద్ధి అని . అహంకార రాహిత్యమే జ్ఞాన మని స్వానుభవాన్ని వివరించి, మోక్షేచ్ఛగలవారికి సాధనమార్గాన్ని నిర్దేశించారు. సాధకజనులు ఆచరించి, దీన్ని సాధనా భ్యాసంలో ఉంచుకొంటారని రచయిత యొక్క ఆశయం.

జ్ఞానదేవ్‌గారు అద్వైత వేదాంత గ్రంధాలను పరిశీలించి తదర్థాన్ని యుక్తి, అనుభవపూర్వకంగా మననం చేసిన , చేస్తున్న వ్యక్తి. అస్తి, భాతి, ప్రియం, అనేవి, బ్రహ్మ రూపాలని,నామ రూపాలు, జగద్రూపాలని చెప్పి,బ్రహ్మసత్యత్వాన్ని, జగన్మిధ్యాత్వాన్ని ప్రతిపాదించడానికి చేసిన ప్రయత్నం, హర్షణీయంగా, అద్వైత వేదాంతానుగుణంగా ఉందనడం సత్యదూరంకాదు. 'నేను కృతకృత్యుడను, ప్రాప్త ప్రాప్తవ్యుడను అనియే నానిశ్చయమని భావించడమే బ్రహ్మాత్మైక్యాభ్యాసమని జ్ఞానదేవ్‌గారు స్వానుభవాన్ని ప్రకాశింపజేయడం. సాధకుల స్థైర్యాన్ని పెంపొందించేదిగా ఉంది. సంచితకర్మలు కేవలం బ్రహ్మ జ్ఞానం మాత్రంచేతనే నశిస్తాయిగనుక, ప్రతి ఒక్కరు బ్రహ్మజ్ఞానం పొందడానికి తీవ్రతర కృషిచేయుదురుగాక యని మేల్కొలపడం. జ్ఞానదేవ్‌గారికి గల అద్వైత పారమార్థ్యాన్ని సూచిస్తున్నది.

రచయిత 'బ్రహ్మవిద్యా మహోదధి' సారాన్ని ఈ పుస్తకంలో పొందుపరచడం శ్రీ

బ్రహ్మానంద దర్శనం అనే ప్రకరణాన్ని చేర్చడం, ఆధ్యాత్మ జిజ్ఞాసగల సాధకులకు మహోపకారకం, రచయిత యీ వార్ధక్యంలో రచనావ్యాసంగ రూపమైన విక్షేపాన్ని దూరంగా త్రోసివైచి, బ్రహ్మాత్మైక్యానుభూతి సాధనలో నిరంతరం నిమజ్జితులగుదురుగాక.

జనస్వామి సుబ్రహ్మణ్య శాస్త్రి

## పరిచయం.-2

శ్రీరాం పూర్ణచంద్రరావు
ప్లాట: నెం: 5, హెచ్.ఐ.జి.ఫేజ్-4, వనస్థలిపురం,
హైదరాబాదు -500 070

తేది: 28-06-19995.

మీరు నాయభిప్రాయమడిగితిరి. అయినను మీరు జ్ఞానదేవులు, వయోవృద్ధులు, జ్ఞానవృద్ధులు, అపరోక్షానుభవులు. కనుక మీరు చెప్పినదే శాసనం, వేదం, అందునను గ్రంధము పండిత పరిశోధితము. అట్టి స్థితిల్లో గ్రంధమును పరిశీలించుటకు నేనెంతవాడను. ఎవ్వరితోడను పనియుండదు. అయినను బాలురు వచ్చిరాని మాటలవలెనుండు నా భావములలోని మంచిని క్షీరోదక న్యాయమున గ్రహించ ప్రార్ధన.

ప్రప్రధమముగ షడ్లింగ విచారణం ఎత్తుకొంటిరి. ఇది సరిఅయిన సంశయనివృత్తి గావించి బ్రహ్మసాక్షాత్కారమునకు మిక్కిలి ఉపకరించును. వేదాంత శాస్త్రమును పరిశోధించి బ్రహ్మమును కనుగొనుటకు ఇది మంచి ఉపాయము. గనుక మీ ఎత్తుగడ బాగున్నది. కాని దీని మధ్యలో తత్త్వబోధములు యింద్రియములకు ఏపనియు లేకుండచేయుచున్నది. అని వ్రాసినారు, ఇదియును ఉపనిషత్ భావమేకాని దీనిని యింక కొంచెము వ్యాఖ్యానము చేసియుండిన ఎవ్వరికి అనుమానమునకు తావుండేదికాదు. ఎందుకనగా జ్ఞానులందరు యిట్లే వ్రాయవలెను, అవయవములను గదలింపక కూర్చుండవలెనేమోయని పామరులకు భ్రాంతి జనించును. ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయచ అని స్వామి వివేకానందులనిరికద. అను శంకలకు తావుండేడిది. కాదు. కొంచెమాభావమును విశదపరిచినచో అన్ని ఉపనిషత్తులకు గూడ షడ్లింగ సహితముగ విచారింపవలెనని కొన్ని ఉపనిషత్తులను గూడ ఉదాహరించితిరి. బాగున్నది, ఈ గ్రంధములో మీభావములను విడదీసి ఏ భాగమున కాభాగమున కొన్ని ప్రకరణములుగా విభజించిన బాగుండెడిది. గ్రంధములోని విషయములను ఎట్లు తెలియజేసిన ప్రజలు సులభముగా గ్రహించగలరో అట్టి పంథాను ఎన్నుకొని సాధ్యమైనంత తక్కువ శాస్త్ర ప్రమాణములను చూపుచూ అనుభవములను గూడ తెలియజేయుచుండవలెను. ఒకేభావము చాల తావులందు కలదు. అయినను వేదాంత శాస్త్రమునకు పునరుక్తి ఒక దోషముగాదు.

ఉపయోగమేయని పెద్దలంగీకరించిరి. "బ్రహ్మవిత్ బ్రహ్మైవభవతి" అను శృతులకనుగుణంగ మీరు వ్రాసినది సమంజనముగనున్నది. నకర్మచా జయాధనైనతో గేనేకైన అమృతత్త్వమానశుః అను కైవల్యోపనిషద్భావనలను తెలియపరిచినారు. సంశయవిషయములలోఒక ప్రమేయ సంశయమునే తెలియపరచితిరి. తక్కిన సంశయములనుగూడ వివరించియుండిన బాగుండెడిది. కర్మము, జ్ఞానము,భక్తి, ప్రపత్తి అను నాలుగు యోగములను మోక్ష సాధములగును అనినారు. భక్తి, ప్రపత్తులను వేరువేరు యోగములనుగా వ్రాసినారు. సాధరణముగ కర్మయోగము,భక్తియోగము, రాజయోగము, జ్ఞానయోగములని యోగములు నాలుగని చెప్పెదరు. జ్ఞానయోగము -3 పరమేశ్వరునియందు ఏకాంతికమగు ప్రపత్తితో ధ్యానార్చనాదులయందు నిమగ్నమైయుండుట అని కొట్టివేసి

భక్తియోగ మాసర్వధర్మ పరిత్యాగపూర్వక మగు శరణాగతి ప్రపత్తి దీనివలన మోక్షముగలుగును అని వ్రాసినారు. - జ్ఞానయోగములో నెవరికి నర్చనచేయుట, సగుణునికా, నిర్గుణునికా, ఉదాహరణః అహం బ్రహ్మాస్మి అను భావమున్నదనుకొనుడు, ఇందు అర్చన ఎట్లుండును. జ్ఞానాదేవతుకైవల్యం.అనిరిగద పెద్దలు, ఇచ్చట విశదముగ వివరించయుండిన బాగుండెడిది. నిత్యనైమిత్తిక కర్మానుష్ఠానము. యజ్ఞ,దాన తపస్సులు కర్మయోగము, వీనియనుష్ఠానమువలన జ్ఞానము కలుగును, అని వ్రాసితిరి, దీనివలన చిత్తశుద్ధి కలుగును. ఉత్తమలోక ప్రాప్తికలుగునా,జ్ఞానము కలుగునాయను సందేహము ఎందువలననగా జ్ఞానము అజ్ఞాననివృత్తి వలనకలుగును. సాధన చతుష్టయ సంపత్తిపూర్వకసమ్యగ్ విచారణవలననిది ఏర్పడును. ఆత్మనుగూర్చి మొదట వినవలెను, తరువాత మనసున విచారించుకొనవలయును. అనంతరం అనుభవమునకు తెచ్చుకొనవలయును. అందులకే యాజ్ఞవల్క్యుడు మైత్రేయితో, ఓ మైతేయా! ఆత్మావారే శ్రోత్రవ్యోమరిత వ్యోనిదిధ్యాసితవ్యః అని బోధించెను. ఆత్మకాని దానిని ఆత్మయనుకొనుటే అజ్ఞానము " దేహాత్మ భావేనచిరంబద్ధోసిపుత్రక బోధోహం జ్ఞానఖడ్గేన తన్నికృత్య సుఖీభవ" అని అష్టావక్రులు పలికియున్నారు. ద్రష్టవునీవు ద్రష్టగాసేయుండు చూడటానికి వేరేయేముంది? నిద్రలోని స్థితి యిట్టిది. ఈవాక్యమును రెండుతావుల వాడినారు. దైవబలమువల్లనే కాని తిండిబలమువలన బ్రతికుతానని ఎన్నడు నమ్మకు అని వ్రాసితిరి. ఇది" నప్రాణేనాపానేన మర్త్యోజీవతి కశ్చన ఇతరేణ తుజీవన్తి యస్మిన్నేతావుపాశ్రితౌ," అను కఠోపనిషద్భావమునకు జ్ఞప్తికి తెచ్చు చున్నది. పై పంక్తుల్లో ఒకచోట పరిత్యాగపూర్తక శరణాగతి- ప్రపత్తి అని వ్రాసినారు. ప్రపత్తిలో పరిత్యాగములేదా? పరిత్యాగమే లేనియెడలనది శరణాగతి ఎట్లగును? సందర్భముకానిచోట గుణములు వాని ధర్మములు తెలుపుచు పంచవాయువులు, ఉపవాయువులు వాని ధర్మములు చెప్పితిరి. అందువలననే పుస్తకములో ప్రకరణావసరమును నేను నొక్కి సూచింతిని. క్షమించెదరుగాక. ప్రేమనుగూర్చి తెలియ జేయుచూ తదుపరి ప్రయత్నములో తాను శ్రమించవలసినది బహు స్వల్పమని తెలిసికొనుట అతిశయోక్తి కాదేమో, ఇట్లోనర్చుట మోక్షార్థులేకాని తదితరులకు కాదని గుర్తింతురుగాక; అని వ్రాసితిరి పైవాక్యములకు వరుసక్రమము (Continuation) ( సరిగాలేదని తలంచుచున్నాను. జ్ఞానావతారుడగు శ్రీయుక్తేశ్వరుని ఉపదేశము తెల్పినారు- చక్కగా ఉన్నది ఇట్లే యోగావతారు లాహిరిగారి సందేశము గూడా వ్రాసినచో యింకను బాగుండేడిది. అది ఎమనగా " Remember that you belong to no one and that no one belong to yous Reflect that some day you will suddenly have to leave every thing in the world. So make the acquaintance of God now" దృగ్దృశ్య వివేకములోని కొంత హేతు బద్ధమైన విషయములను వ్రాసితిరి. బాగున్నది.

శ్రీశ్రీ బ్రహ్మానందగిరి స్వాములవారి బ్రహ్మ విద్యా మహదధినుండి తరంగముల వారీగా వ్రాసి సారములను వ్రాసితిరి. బ్రహ్మానంద దర్శనములోని కొన్ని విషయములను వ్రాసితిరి. ఇది చాల సమంజసముగానున్నది. వీనిని పరిశీలించ నవసరములేదనుకొందును. ఏది ఎట్లైనను గ్రంధమునకు నిర్గుణ తత్త్వబోధయని పేరుపెట్టితిరేకాని వేదాంత శాస్త్రమునంతను చవిచూపించుట అయినది.

అశ్చర్యమేమనగా మీరాపెద్ద వయస్సులో శ్రమయని భావించక అకుంఠిత దీక్షతో నవిశ్రాంతకృషి సల్పిగ్రంధమును పూర్తిచేయుటయే, శ్రీ వివేకానంద స్వాములవారన్నట్లు "Arise, awake and stop not till the goal is reached " లెమ్ము మేల్కొనుము గమ్యము చేరువరకు ఆగకుము, అను దానికి సరిపోయినది. జ్ఞానమార్గ క్షేత్రమున మీరింత

కృషిచేయుట నిజముగ అభిలషనీయము.అభినందనీయము. అభివందనీయము. నేవ్రాయుదానిలో నేమైనా పొరపాట్లుయున్న క్షమించప్రార్థన.
మీ మిత్రుడు
శ్రీరాం పూర్ణచంద్రరావు,

## పరిచయం.-3

బ్రహ్మవిద్యాశ్రయం. రఘుదేవపురం.
తేది : 13-03-1995.

గౌరవనీయులు జ్ఞానవృద్ధులు, దైవ్యాత్మ స్వరూపులు ఆత్మ సాక్షాత్కార పరిశోధకులు నగు శ్రీ జ్ఞానదేవ్‌గారూ ఇదే నాప్రేమ పూర్వక నమస్కారములు.

మీరు ప్రేమచే పంపించిన పుస్తకము, ఉత్తరాలు చేరినవి. అమూలాగ్రముగా చదివినాను, మీరు సేకరించిన భావములు- అమోఘముగా యున్నవి. ఇవి కేవల అద్వైతపరముగా యున్నవి. చాల ఉత్కృష్టము ఇందలి ప్ర[illegible]వాక్యము మీరు అనుభూతిని పొందే అద్వైతామృతమునకు నిదర్శనము. ఇవి చూచి [illegible]ల సంతసించితిని, ఈ భావనలు ఈజన్మలో ఇచ్చుటనే, ఇప్పుడే తరించువార్కి భోదపడును ఇది వజ్రాలకొట్టు. మీయొక్క భావనలకు సరిపోవు గ్రంధములను సేకరించితిరి. మీయొక్క భావన రమణ మహర్షి శంకరుల బొధనలవలెయుండును
మీరు జీవన్ముక్తులు. మీయొక్క దృఢ భావనకు సంతసించుచున్నాను.
(1) సమ సముచ్చయం (2) క్రమ సముచ్చయం ఇందులో లోకులు సముసముచ్చయవాదులు 2 కొందరు క్రమ సముచ్చయవాదులు. మీరో కేవలా ద్వైత భావనకల్గి ఈ రెండింటికి అవల ఆలోచించినవారు. అని నాభావన. మీలో జిడ్డు కృష్ణమూర్తి భావనలు యున్నవి. మీరు కృష్ణమూర్తి గారి రచనలు భావనలు చదువగలరు -ఆచార్యలందరు ఒక యెత్తు, కృష్ణమూర్తి గారి భావన ఒకయెత్తు. కాన లోకులకొరకు మీగ్రంధం ఉపయోగపడగలదు. మీ కొర్కై మనకొర్కై కృష్ణమూర్తిగారి భావన అవసరం. నేను నిరంతరం కృష్ణమూర్తిగారి భావనలు జ్ఞప్తికి దెచ్చుకొనుచున్నాను.

మీరు ఈ పుస్తకం ప్రింటు చేయించండి. నాకు ఆరోగ్యముగాలేనందున, బి.పి. షుగర్ వచ్చినందున ఆశ్రమములో లేక తొందరగా ఉత్తరం వ్రాయలేక పోయానని చింతించుచున్నాను.
ఇంతేసంగతులు.
ఇట్లు
ఈశ్వరానందబ్రహ్మచారి.

## పరిచయం-4

తేది.28-2-96

శ్రీ శంకర నివాస ఆశ్రమము, వెలటూరు.

దైవాత్మస్వరూపులు, వయో వృద్ధులు, ఆత్మసాక్షాత్కార పరిశోధకులు జ్ఞానదేవులు అయినటువంటి అద్వైతస్వరూపులకు ప్రేమాస్పాద్ నమస్కారములతో

నిర్గుణతత్త్వబోధకరతలామలకము, అనే పుస్తకము మీరు ప్రచురించడము సర్వదా అభివందనీయము. మీరు ఇంతట వృద్ధాప్యములో ప్రచురించిన ఈ గ్రంథము పూర్తిగా

అద్వైత పరముగా చాల ఉత్కృష్టము. ఇందులో ఉన్నటువంటి ప్రతివాక్యము మీరు అనుభూతి చెందే అద్వైతామృతమునకు పరమనిదర్శనము. దీనిలో మీరు ప్రచురించే ధరత్వము మీ అనుభవానికి ఒక తార్కాణము. ఇందులోని ఆత్మానుసంధాన మైనటువంటి వేదాంత విషయములు చాల ఉత్కృష్టము.

రచయిత ప్రచురించే అంశములు నవీనయుగములో శ్రీ శ్రీ ఆదిశంకరులు. రమణమహర్షి మున్నగువారి ఆచరణ పూర్వకమైనటువంటి పోలికలు ఇందులో ఉండడము చాల సుజ్ఞానము. షడ్లింగములు. విచారణ ఉపనిషత్తులలో ఉపక్రమోప సంహారములచేత జీవ బ్రహ్మైకత్వము శృతిస్మృతులకు సంబంధించినటువంటి. మీ అనుభూతి అమోఘము.

శ్రీ జ్ఞాన దేవుగారు మీరు ముఖ్యముగా అద్వైత వేదాంత గ్రంధములయిన బ్రహ్మవిద్యా మహోదధి. జిడ్డుకృష్ణమూర్తిగారి రచనలు, శ్రీ బ్రహ్మానంద దర్శనం అనే ప్రకరణము మీరు అమూలాగ్రముగ పరిశీలించి బ్రహ్మసత్యత్వాన్ని, జగన్మిధ్యత్వాన్ని అనుభవ పూర్వకముగా ఇందులో పొందుపరచడము చాల ముదావహము.

మోక్షము కర్మోపాసనవల్లకాక కేవలము బ్రహ్మాత్త్యైక్యజ్ఞానము వల్లనే మోక్షము లభిస్తుంది. అనేటటువంటి మీ దృఢనిశ్చయముచాల అభిలషణీయము.
ఉపనిషత్సారాంశము. ఇంకా వివరము ఉంటీ బాగుండునని నా అభిప్రాయము. art is difficult but criticism is easy అనేటట్లు నా అభిప్రాయము ఏమైన పొరపాటు ఉంటే క్షంతవ్యుడను. మీమహత్తరమైన ఈ గ్రంధాన్ని అచ్చు వేయించడానికి కావలసిన సాధన సంపత్తిని సద్గురువు మీకు అనుగ్రహించుగాక!

ముఖ్యముగా "అద్వైతామృతము" అనుభవపూర్వకముగా చెందే జ్ఞానపిపాసులకు మీ గ్రంధము ఒక మంచి " సాధనముగా" ఉండగలదనీ నా అభిప్రాయము.

ఇట్లు,
స్వామి కృష్ణానందగిరి.
వెంటూరు
28-2-96.

## పరిచయం -5

Sri Shanti ashram,
Date 12-12-96.

Dear Atman Sri Jnanadav,

devoted pranams. Greetings of peace heath and love to your goodself from santi Ashram,

Very glad to reecive your kind letters written to pujya sri mataji and secreatary along with the copy of manscript of the book you have written . we thank you very much for your regards and affcction towards santi Ashram and for the pains taken to send the book to us the presentation of the book is nice to attract the sadhakas we wish the grace of God the book may get published early for the use. with kind blessings of pujya sri mataji,
yours devotedly Lokesh,
fot Secreatary.

# విషయసూచిక

ఓంఓం ఓం

# అవతారిక

సర్వం ఖల్విదం బ్రహ్మ:

ఆత్మీయులారా శ్రీ మన్నారాయణుని నిశ్వాసము వలన దేవతలు పుట్టెనుగాన, ఆ దేవతలు నారాయణుని స్వరూపమనబడును. నువ్వుల యందు నూనె యుండునటుల, అట్టిచతుర్వేదములందలికడపటిభాగములందు బ్రహ్మాత్మైక్య జ్ఞానము చెప్పబడును. అట్టివేదాంతములైన ఉపనిషద్వాక్యముల చేతనే బ్రహ్మము యిట్టిదని, బ్రహ్మము యొక్కలక్షణమున్ను, బ్రహ్మాత్మైక్య జ్ఞానమున్ను, బ్రహ్మము యొక్క నిజస్వరూపమును యెరుంగవచ్చును గాని తర్కినతర్క,వ్యాకరణ,మీమాంసాది శాస్త్రములచే నెఱుంగబడదు. అజ్ఞానమును బోగొట్టి బ్రహ్మమిట్టిదని, బ్రహ్మ లక్షణమున్ను,బ్రహ్మాత్మైక్య జ్ఞానమున్ను బోధించునట్టి వాక్యములే వేదాంతములనియు, ఉపనిషత్తులనియు చెప్పబడెను, కాబట్టి ఉపనిషద్వాక్యముల యొక్క అర్థమును ఎఱుగనివారు, బ్రహ్మము, జగత్తు యీ రెంటి యొక్క లక్షణమునెఱుంగ జాలరు,వారికి బ్రహ్మాత్మైక్య జ్ఞానమున్ను కలుగ జాలదు, బ్రహ్మాత్మైక్య జ్ఞానము వల్లనే జనన మరణములు లేనివిదేహ కైవల్యమనెడినిజమోక్షము లభించునుగాని కర్మానుష్ఠానము సాంఖ్య యోగము, హఠయోగాభ్యాసము, దేవతోపాసన వానిచే లభింపదు, కాబట్టి యెల్లవారును ముఖ్యముగా ఉపనిషత్తువాక్యముల అర్థమునుచక్కగా విచారించి తెలియవలసింది సుమా.

పుణ్యాత్ములారా! జిజ్ఞానువులారా! నివృత్తి మార్గంబగు కేవలం అద్వైత మతప్రచారకులగు శ్రీ శంకరాచార్యులు శ్రీమత్పరమహంసేత్యాది బిరుదాంకిత శ్రీ విద్యారణ్య స్వామి, శ్రీవశిష్ట మహాముని, శ్రీ రమణ మహర్షి, మహాతాత్వికుడు, విఖ్యాత తత్త్వవేత్త శ్రీ జిడ్డు కృష్ణమూర్తి, శ్రీ రామతీర్థ, జగద్గురు శ్రీ బ్రహ్మానందగిరి స్వాములవారు, మహావతార్ శ్రీ బాబాజీ, యోగావతార్ లాహిరి మహాశయ, జ్ఞానావతార్ శ్రీ యుక్తేశ్వరగిరి, పరమహంస శ్రీయోగానంద మొదలగువారు రచించిన యేబది అద్వైత గ్రంథములను ఆమూలాగ్రముగ చదివి, అర్థమును స్వయముగా తెలిసికొని, అందలి ముఖ్యవిషయములను మననముగావించి కేవల బ్రహ్మాభ్యాసములోనే మునిగి తెలియా డుచున్న శ్రీ జ్ఞానదేవునిచే రచింపబడిన వేదాంత సారంబగు యీ "నిర్గుణ తత్త్వబోధ కర తలామలకము" అను గ్రంథమును మోక్షార్థులు, మోక్షార్థులునగు మీరందరును చదివి, అవగాహనచేసికొని మననము చేయుటచే ప్రాప్తించు శాశ్వత బ్రహ్మానందమున గ్రుంకులిడుదురుగాక. దీనిం జదువుట వలన కలుగు ఫలంబనంతమని స్వానుభవము వలన మాత్రమే తెలియనగును. ఇది సత్యము, ఇది సత్యము , ఇది సత్యము,

సర్వేజనా స్సుఖినో భవంతు!

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

ఇట్లు
సజ్జన విధేయుడు

**జ్ఞానదేవ్,**

పరమహంస, బ్రహ్మవిద్వర, అపరోక్షానుభవి .
పెరవలి (గుంటూరు జిల్లా) ఎ.పి.

# 1. వేదాంత పంచదశి

జ్ఞానమనునగ్ని కర్మలనొక్క క్షణంబులో భస్మము చేయును మనస్సు ఏ ..ార్థమును గ్రహింపవలయుననన్నను, వృత్తి రూపమున దానిపైకి బ్రసరించికాని గ్రహింపదు. ..త వృత్తియు పదార్థాకారమును జెందినదియయ్యే దానిపై వ్యాపించును ఇదియే మనస్సు . విషయాభిముఖమయ్యె ననుటకు నర్థము. కావున సమాధి యందును యిట్లే మనస్సునుండి బ్రహ్మా..ర వృత్తి పరంపర జనించుచుండు ననియే యూహింపవచ్చును ఇట్లగుటచే సమాధియందు మనస్సు బ్రహ్మమును మాత్రమే ధ్యానించుచున్నది.

మనస్సు అంతర్ముఖమగుట యొక్కటి తప్ప తక్కిన విషయముల యందంతను, సుషుప్తి, సమాధులకు భేదము లేదు.

అపరోక్షజ్ఞానము ..యుత్పత్తితోనే, మూలా విద్యాంధకారమున జనించును. అవయవములకల ప..ర్థములు నాశనమునొందుననుట నియమము కావున ప్రపంచ ప్రథమావస్థారూపమగు సత్పదార్థమునకు నవయవములు ఉండుటకు వీలులేదు.'సత్ ' అనగా ఉనికి. ఇదియే భావము.

సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ-బ్రహ్మము సత్యరూపము, జ్ఞానరూపము అద్యంతములు లేనిది. భేదవాది తనవాదమును సాధింపలేక పోవుటయే ఐక్యవాదికి ప్రబల ప్రమాణము. "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అని శృతియుక్తి."ద్వితీయాద్వైభయం భవతి అని శృతియు..క్తి. రెండవ పదార్థముండిననే కాని, భయం కలుగదని తేలుచున్నది, బాగుగా విచారింతురేని , భక్తియోగ, కర్మయోగములయందే భయము కలదుగాని, జ్ఞానయోగమున' 'దానిచే సాధింపబడు సమాధి యందు భయములేదు. దీనికి అస్పర్శ "యోగము" అనికూడ పేరు. ఇది యందరకును సాధ్యముకాదు జీవుడు తన జ్ఞాన, కర్మములచేత ఏడు అన్నములను సృష్టించెను. సప్తాన్నముల విభజించి మర్త్యాన్న మొకటి, దేవాన్నములు రెండు, విశ్వాన్న మొకటి చేరి నాల్గు, మిగిలిన మూడున్నములు తననిమిత్తము, అని చెప్పబడెను.

వడ్లు మొదలగు ధాన్యములు సామాన్య మర్త్యాన్నము. అమావాశ్య పూర్ణిమలు దేవాన్నములు, క్షీరము విశ్వాన్నము, మనస్సు, ఇంద్రియములు ప్రాణవర్గమును, అత్మాన్నములు. ఇట్లు సప్తాన్న స్వరూపము . (వివరణ) లింగదేహము మొదలగు సర్వకల్పనల కాధారమైన "చైతన్యమును", చైతన్యము నందు కల్పింపబడిన లింగదేహమును, లింగదేహమున ప్రతిబింబించిన చిదాభానుడును, యీ మూడు చేరి "జీవుడనబడును" ,(బింబరూపము యొక్క ప్రతిబింబము చిదాభాసుడు.)

## మహావాక్యార్థ నిరూపణ :

మోక్షాపేక్షగల వానికి మోక్షసాధనము బ్రహ్మాత్మైక్యజ్ఞానము.

1. ఋగ్వేదము :-"ప్రజ్ఞానం బ్రహ్మ"
   నేత్రేంద్రియాది జ్ఞానేంద్రియముల ద్వారా అంతః కరణవృత్తి రూపమున వెలుపలికి వ్యాపించిన చైతన్యము"ప్రజ్ఞాన" మనబడును,
   నేత్రేంద్రియము :- దర్శనము: శ్రవణేంద్రియము:- శబ్దమును గ్రహించుట,
   ఘ్రాణేంద్రియము:- ముక్కు - వాసన : వాగింద్రియము:- శబ్దోచ్చారణ
   రసనేంద్రియము:- నాలుక - రుచిచూచుట మొదలగునవి.
2. యుజుర్వేదము:- "అహంబ్రహ్మాస్మి"
   పరమాత్మ మాయచే కల్పితమైన ప్రపంచమందలి, యెల్ల శరీరములకు సాక్షియై

జీవేశ్వరుల కిద్దరికి నైక్యము గూర్చి 'నేనే' బ్రహ్మము అను శబ్దవాచ్యమే అహంబ్రహ్మాస్మి యనబడును.

3. సామవేదము:- "తత్త్వమసి" తత్+త్వం+ అసి
తత్: సజాతీయ, విజాతీయ, స్వగత భేదమున్ను , నామరూపములు లేనిదైన
త్వం: సద్వస్తువు. అసి:అగుచున్నావు. ఆ సద్వస్తువు "నీవేయగుచున్నావు.

4. అయమాత్మాబ్రహ్మ:అధర్వణవేదము,
అయం+ఆత్మా+బ్రహ్మ= స్వయం ప్రకాశ స్వరూపము గలిగి, సర్వజన ప్రత్యక్షమయినట్టియు, దేహేంద్రియ మనోహంకారాదుల కంటె వేరైనట్టియు, సర్వాధారమైనట్టియు, సర్వము నెరుంగునట్టిదియునైన ప్రత్యగాత్మ "నేనే",

పరమాత్మయందు నాలుగవస్థలు కలవు. 1. చిత్తు,2. అంతర్యామి, 3. సూత్రాత్మ 4. విరాట్టు, మాయయు, తత్కార్య సంబంధములేని పరమాత్మను"చిత్తు" అందురు.

మాయా సంబంధము కల్గియున్న ఆత్మను "అంతర్యామి" అందురు. పంచీకరణము చేయబడని పంచభూతముల కార్యమైన సమిష్టి సూక్ష్మ శరీరోపాధిగల పరమాత్మను "సూత్రాత్మ లేక హిరణ్యగర్భుడందురు పంచీకరణము చేయబడిన పంచభూత కార్యములయొక్క సమిష్ఠ స్థూల శరీరోపాధిగల పరమాత్మను "విరాట్టు" అనుచున్నారు.

వస్త్రమునందలి బొమ్మలకు నేర్పరచిన, ఆబొమ్మ వస్త్రములవలె. చైతన్యమునందారోపితులైన జీవులకే "చిదాభాసు"లను నామము ప్రత్యేకముగా పెట్టబడు చున్నది. అది పర్వతాదులకు లేదు. అనేక విధములగు జనన మరణముల ,నిట్టి చిదాభాసులనబడు జీవులే పొందుదురు. తక్కినవానికి లేవు. చిదాభాసులనగా చిత్ప్రతిబింబములు " చైతన్య వ్యవహారము, జీవించియుండియే, సంసారబంధమునుండి విడువబడుట "జీవన్ముక్తి " యని చెప్పబడును.

విచారణచేయగా రెండు విధములుగా జ్ఞానము కలుగుచున్నది. 1. పరోక్ష జ్ఞానము 2. అపరోక్షజ్ఞానము, బ్రహ్మమనునది యున్నదనెడు జ్ఞానము పరోక్ష జ్ఞానము. బ్రహ్మము "నేనే" యనెడి, బ్రహ్మమునకు తనకు నభేద జ్ఞానము కలుగుటకు "అపరోక్ష జ్ఞాన" మని పేరు.

ఆత్మ చైతన్యము, 1. కూటస్థుడు 2.బ్రహ్మము 3. జీవుడు 4. ఈశ్వరుడు అని 4విధములు. అవిద్యచే కల్పింపబడిన 1. స్థూల శరీరము 2. సూక్ష్మశరీర వివరణము.

## దేహత్రయ వివరణ

1. స్థూలదేహము పంచీకృత భూతముల కార్యము 2. సూక్ష్మశరీరము అపంచీకృతములైన భూతముల కార్యము, పైరెండు శరీరములతో గూడిన "ఆత్మచైతన్యము' ' యే వికారమును జెందకుండుటచే" కూటస్థు" డనబడుచున్నది. కూటస్థునియందు బుద్ధి కల్పింపబడి యాబుద్ధియందు కూటస్థుని ప్రతిబింబమైన చిదాభాసుడు "జీవు" డని వ్యవహరింపబడుచున్నాడు. చిత్ప్రతి బింబిత, చిదాభాసుడు అనబడు "జీవుడే" సంసారమును పొందుచున్నాడు, దార్ష్టాంతిక స్థలమైన ప్రత్యగాత్మ యందు గల్పితుడైన చిదాభాసుని పేరు "అహం" (నేను) అని చెప్పెదరు. కారణశరీరము. అవిద్యాకార్యము. జ్ఞానియగువాడు అప్రాప్తముగ లభించినదానిని పరిత్యజింపడు, లభింపని వానికై యాశపడడు. ఇంకనేమి చేయుననగా నేమియుపనిలేనివలే నూఱక కూరుచుండియుండును. చిదచిద్గ్రంధి వీడినవాని తెఱంగిట్టిదని కృష్ణపరమాత్మచే భగవద్గీత యందనుగ్రహింపబడినది.
సుఖాపేక్షగల వాడెల్లప్పుడును విషయాసక్తిని విడువలయును. ఇదియే వైరాగ్యము యొక్క స్వరూపము,

వైరాగ్యము, బోధ, ఉపరతి - యీమూడును నొకటొకటి కలిసి తత్త్వ బోధకుతోడ్పడుచునుండును. ఒక్కొక్కానియందు నొకటిగాని, రెండుగాని లేకను పోవచ్చును, వైరాగ్యమును, ఉపరతియు పూర్ణముగా నుండి తత్త్వ జ్ఞానము లేకపోయిన యెడల మోక్షము కలగదు. కాని పుణ్యాత్ములు నివసించెడి లోకముల యందు చిరకాలముండి శిష్టాచార సంపత్తిగల శ్రీమంతుల యింటిలో తపోవిఘ్నము గలవాడుగ పుట్టునని భగవద్గీతయందు చెప్పిన చొప్పున వైరాగ్యోపరతులనెడు తపోబలము వలన పుణ్యలోకావ్యాప్తి కలగుచున్నది. ఎప్పటికిని మంచిపని వ్యర్థము కాదు.

తత్త్వజ్ఞానము పూర్ణముగానుండి వైరాగ్యోపరతులు లేనియెడల మోక్షము తప్పక కలుగును. కాని జీవన్ముక్తి సుఖము గలుగ నేరదు, ప్రారబ్ధము వలన గలుగు దుఃఖము నశింపదు.

1. వైరాగ్యమున కవధి సత్యలోకాధి పత్యము లభించునను అపేక్ష లేక పోవుట 2. జ్ఞానమున కవధి దేహము నేననియెడి దృఢ జ్ఞానమవివేక దశయందెట్లుండెనో యట్లు ఆత్మ స్వరూపము నేననెడి దృఢనిశ్చయము గలిగియుండటయే ఉపరతిక వది గాఢముగా నిదురించునపుడు ప్రపంచ సంబంధములగు సర్వవ్యవహారములను మఱచినట్లు, నిఖిల వ్యవహారములయందు జోక్యము లేకుండుట, వీనిలోనేది యెంతవరకు తనకు గలిగినదియు తన బుద్ధికే విశదమగును.

ప్రారబ్ధకర్మ యనేకరీతులుగా నుండుట చేత ఆయాజ్ఞానులు ఆయా విధముల వర్తించినను, స్వరూపబోధయందేమాత్రము తారతమ్యము లేదనియు, అట్టి సర్వాత్మబోధ ననుసరించి ముక్తియందు తారతమ్యము లేదనియు, నిది వేదాంత సిద్ధాంత మనియు నిస్సంశయముగా పండితులగువారు గ్రహింతురుగాక!

అచింత్యరచనగల మాయచేత తన స్వరూపమైన బ్రహ్మ చైతన్యమునందు నానావిధములైన ప్రపంచము కల్పింపబడినదిగనుక, మాయాకల్పితమైన యీ ద్వైత ప్రపంచమును మిథ్యయని, నిరాకరించి, శుద్ధ చైతన్యము మాత్రము మిగిలియున్నదని సూక్ష్మదృష్టితో దెలియబడుగాక.

ఆత్మజ్ఞానము కలిగియుండినను, నాయందు ఆకలియు, దప్పికయు మొదలగు ననర్థములట్లె ప్రత్యక్షముగా గనుపడుచుండగా, నద్వైతాత్మ జ్ఞానము సర్వానర్థ నివారకమని యెట్లని నొప్పుననియు శంకించుచున్నాడు.

అవివేక దశయందువలె నిప్పుడద్వైత జ్ఞానము గలిగిన తర్వాత కూడా క్షుత్పిపాసాదులుండనే యున్నవనెదవేమో, అవి "నేననెడి శబ్దమున కర్థమైన అహంకారమునవిగా దలంపుము" చిదాత్మ యసంగుడును, నవిషయుడునై యున్నాడు గనుక క్షుత్పిపాసాది ధర్మముల కచ్చట ప్రసక్తిలేదు.

ఆ చిద్రూప వస్తువునందును, నధ్యాస వశముగా క్షుత్పిపాసాదు లుండునని అనగూడదా! యని శంకించి యుత్తరము చెప్పుచున్నాడు. అన్యోన్యాధ్యాసము వలన క్షుత్పిపాసాదులు చిద్రూపునియందే, ప్రసక్తములగునని యంటివా? "అధ్యాసమునే చేయకు" కూటస్థ చిదాత్మను, అహంకారాదులను విభజించి క్షుత్పిపాసాదులు అహంకార ధర్మములని తెలిసికొనుము.

అనాది వాసన చేత నన్యోన్యా ధ్యాసము శీఘ్రముగా నివర్తింపక పోయెనేని కూటస్థ చిదాభాసుల స్వరూప విచారమును గట్టిగా చేయగా నిది పూర్తిగా నివర్తంపగలదని భావము.

జాగ్రత్స్వప్న సుషుప్తుల యందు వేర్వేరుగా గనుగొన్న వస్తువులు , ఆయాదశలయందే కన్పట్టునుగాని , వేరు దశలయందు కనిపించక యుండును ఆత్మయన్ననో యన్ని దశలయందొక్క రూపై కన్పట్టును. (ఇవియే అన్వయ వ్యతిరేకములగును.)

"ఏదికాదో యదికానే కాదు. కాదగినది కాకమానదు" మనుష్యునకు గలిగెడి విచారములనేడి విషమును బోగొట్టునట్టి యిట్టి జ్ఞానము భ్రాంతిని తొలగించును, లభింపని వస్తువు లభించుట యోగమనబడును. లభించిన వస్తువు రక్షింపబడుట క్షేమమనబడును.

## బ్రహ్మాభ్యాసము

ఎల్లప్పుడును బ్రత్యగాత్మ పరమాత్మలయొక్క స్వరూపమును గూర్చియు, నా రెంటి యొక్క యేకత్వమును గూర్చియు నాలోచించుచుండుటయు, నెప్పుడును బ్రహ్మతత్త్వమును గూర్చియే భాషించుటయు, అభ్యాసకులతో తమ తమ యనుభవములను దెల్పుకొనుటయు, ప్రత్యగ్బ్రహ్మముల యఖండైక్యమే పరమోత్కృష్టమని యాసక్తి గలిగియుండుటయు బ్రహ్మాభ్యాసమగునని తెలిసిన పెద్దలు చెప్పెదరు.

చిత్తైకాగ్రతను సంపాదింపవలయునని చెప్పెడి స్మృతిని జెప్పుచున్నాడు.

"అనన్యాశ్చింతయంతోమాం యేజనాఃపర్యుపాసతే!

తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమ వహామ్యహమ్" భగవద్గీత

ఏజనులు నేను బ్రహ్మమునైతి నను జ్ఞానము చేత
నాతో నైక్యము జెంది నన్ను నిరంతరము ధ్యానించుచు నాస్వరూపులై యుందురో యట్టి వారి యోగక్షేమములను నేను సంపాదించెదని శ్రీకృష్ణ భగవానుడు దెవిపెను,

సంకెళ్లచే నిర్బంధింపబడిన దేహమునకు గల నిర్బంధము వంటి
నిర్బంధము, బ్రహ్మస్వరూప విషయక సంభాషణ చింతనాది రూపమగు బ్రహ్మాభ్యాస మందు లేకపోవుటయేగాక, యితిహాసము (పూర్వుల యొక్క చరిత్రము) చేతను, అపరిమిత లౌకిక కథానుకూల యితి వృత్తాంతములను జూపుటచేతను, నాట్యక్రియను జూచునప్పుడు బుద్ధికి వినోదముగ నున్నట్లును, యీ బ్రహ్మాభ్యాసమందు గూడా బుద్ధికి ఉత్సాహ మతిశయించును.

కథాదులచేత చిత్తైకాగ్రతారూపమగు నిధిధ్యాసమునకు విఘాతము గలుగును కదా!

ప్రత్యగాత్మ చిన్మాత్రుడగును, జగత్తు మిథ్య యగును, అనెడి అర్థమునందు పర్యవసించుటవలన పూర్వచరిత్రలు మొదలగు వానిచేత "నేను" (బ్రహ్మము నైతిని) అనెడి బ్రహ్మ భావమునకు (నిధిధ్యాసమునకు భంగముగలుగదు,

బ్రహ్మాభ్యాసము చేయువాడు, వ్యవసాయమును, వర్తకమును, నౌకరిని, కావ్య తర్కాదుల నభ్యసించుటయు మొదలగు వ్యవహారములను చేయునపుడు వానిచిత్తము యితరత్ర ప్రవర్తించుట చేత నేను బ్రహ్మమైతిననెడి నిధిధ్యాసనలే లేనిదగుచు విక్షేపమును బొందుచున్నది. కావున బ్రహ్మాభ్యాసమునకు కృషి వాణిజ్యాదుల వలన భంగముగలుగును,

## నిర్వికారుడగు కూటస్థుడే ఆత్మ,

జ్ఞాని జగత్తునసత్యముగను, తనను అసంగునిగను గ్రహించును, కాన నిజముగా భోక్త లేనందున నెవ్వని కోరికకై పరిపించునని భోక్త నిషేధింపబడియెను.

అసంగుడగుట చేత కూటస్థుడు నిర్వికారుడగుట వలన భోక్తృత్వమును పొందడు, సుఖ, దుఃఖాభిమానరూపమగు వికారము భోగమనబడును, కూటస్థుడన, నిర్వికారుడు, నిర్వికారత్యమును, వికారత్వమును నొకనికి సంభవింపవు.

మోక్షకాముడు స్వస్వరూపమును సర్వదా విచారించుకొనవలయును జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపంచమును బ్రకాశింపజేసెడి బ్రహ్మమే తానని యెరింగినచో సంసారబంధము శమించును (కైవల్యోపనిషత్తు )

అవస్థా త్రయమునందు ఆత్మ యొక్కడే, నేనవస్థాత్రయములనంటని వాడనని

యెరింగినవానికి తిరిగి జన్మములేదు, మోక్షమేయగును

అనేక జన్మముల యందీశ్వరారాధనన జేయుటచే ఆత్మ విచారమున కిచ్చపొడమును, విచారము చేయగా"మాయ" నశించును. మాయ నశింపగా ఆత్మ స్వరూపమగు "తాను " మిగులును.

చేయువానిని, చేపెడివనిని, శబ్దాది విషయములను నొక్కమారుగా బ్రకాశింప జేయువాడు "సాక్షి చైతన్యమనబడను," ఎక్కడ అంతరింద్రియములుగాని, బహిరింద్రియములుగాని ప్రవేశింపవో అక్కడ స్వయం ప్రకాశమానుడై సాక్షియున్నాడు,

పదార్థముల యొక్క నామరూపాలను గమనింపకుండా వానియందున్న ఆనంద సత్తాంశములయందు చిత్తమును లగ్నము చేయుట ఉపాసన,

వాంఛా పరిత్యాగము చేత వాంఛాపూర్ణత కలుగును. త్యాగము, జ్ఞానము, హృదయములో నిండిన కొలది శాంతి తాండవింపసాగును. ప్రత్యగాత్మామననము (సదా) యీ అసత్య అహంకారమును నిజ ఆత్మనుండి తొలగించవలెను. స్మరణలు, ఆశలు మనస్సునుండి తొలగించవలెను ఆశారహిత పదవియే శాంత పరిపూర్ణ సహితాహంకార రాహిత్యమే, దైవత్వము, ఈగొప్ప జీవిత పదవిని సదా జ్ఞానము వలన, సన్మార్గ జీవితము వలన పొందనగును,

త్యాగము లేనిదే నిత్య జయము లేదని మానవ జీవత చరిత్ర తెలుపుచున్నది. ప్రకాశము, శక్తి జ్ఞానము, ఆనందము అనునవియే ఆత్మకు సంసారముగా నున్నవి, పరమాత్మ సర్వభూతాంతర్యామి అని ఉపాసించు సాధకుడు తాను ధ్యానించు ధ్యేయవస్తువగుచున్నాడు. అందువలన తన తరము నందలి మానవ సమాజమంతయు అతనిని ప్రేమించి గౌరవించుచున్నది.

ఓంకార శబ్దవిభాగము : అధిదేవతలు

| | | | |
|---|---|---|---|
| అకారము | ఉకారము | మకారము | అర్థమాత్ర |
| విశ్వుడు | తైజసుడు | ప్రాజ్ఞుడు | తురీయము |
| విరాట్ | హిరణ్యగర్భుడు | ఈశ్వరుడు | పరమాత్మ |

## మనస్సు అనగా నేమి?

మనస్సు అనగా వాసనల రాశి. ఆలోచనల ప్రవాహము. జ్ఞాన జ్యోతి వలన ప్రకాశించుచున్నది.

ఆత్మ సాన్నిధ్యమున మండుటచేత మనస్సు కూడా సత్యము నిత్యము నని భ్రమించుచున్నది. మనస్సుచేత ఏది తెలియబడదో , దేనివలన మనస్సు తెలియుచున్నదో అదియే బ్రహ్మము అని తెలయనగును, ఆత్మమరుపే ఆవరణ మనియు, భ్రమయే విక్షేపమనియు తెలుపబడుచున్నది.

ఏకాలమందు బ్రహ్మజ్ఞాన రూపాగ్నిచే యీ సంసార దుఃఖరూప శూలమునకు మూలభూతమై అజ్ఞానము నాశమొందుచున్నదో, మనోవాక్కులకు అవిషయమైన ఆనందరూపాద్వితీయాత్మను విద్వాంసుడు అవిషయతారూపముచే గాంచుచు, విషయతారూపముచే గాంచడో, "ఇతడు నేను , ఇతడు యితరుడు" యిత్యాది భేదములను గాంచడో, భేదాభావమునే చూచునో "నేను జీవించు చున్నాను , నేను మృతినొందుదును, " అను నీభేదములగాంచడో, ఆ కాలమందు స్థిరమైన చైతన్య రూపాత్మను వేదవేత్తలు అనికల్పనామముచే కథనము చేయుచున్నారు, మనయందుండు అసత్య తాదాత్మ్యములను తొలగించుకొనిన, మన నిజస్వరూపమును స్థాపించుకొనజేయు ప్రయత్నమును "ఆత్మ సాక్షాత్కారమందురు.'

మనస్సనగా ఆలోచనల ప్రవాహము. ఆలోచనలు లేకపోయినచో మనస్సు లేదు,, మనసు లేకపోయినచో యోగికి ఆత్మానుభవము కలుగుచున్నదనిశృతితీర్మానము ఇంద్రియానందములు, ఇహపరసఖములు ఆశించి ఉపాసన చేయకూడదు. సాధకుడు తన మానసిక కోరికలను తిరస్కరించగల ధైర్యసాహసములు ఉండెనేని పారమార్థిక మార్గమున అభివృద్ధి పొందగలడు.

తపస్సు , దమము, నిష్కామకర్మ - యివి మానవుని తరింపజేయు (యోగ) మార్గములు , నిరంతరము బహిర్ముఖత వదలి మనస్సును అంతర్ముఖము (చేయుము) మనస్సును బహిర్ముఖము చేయవలదు. జ్ఞాన తేజోమండలములో జీవించుము. జ్ఞానములో జీవించు. జ్ఞానంలో సంచరించు. జ్ఞానరూపుడవై జీవించు . తేజస్సుతో ఏకీభావం పొందు . అంతర్జ్యోతి నిరంతరం ప్రకాశిస్తున్నది.

జాగ్రస్థితికి, స్వప్నస్థితికి పరిమాణమందు భేదమేగాని, స్వభావమందు భేదములేదు. మరణమన, ద్రష్టయొక్క ఉపశాంతియేగాని, దృశ్యముయొక్క ఉపశాంతి కాదు.

## 2. శ్రీ విచారసాగరము

ముక్తికి హేతువేది? ఒక్కడే యాత్మ. నివృత్తి రహితుడు అగుటవలన సత్తందురు. జడముకన్న విలక్షణుడై, ప్రకాశ రూపుడగుట వలన చిత్తందురు. దుఃఖముకన్న విలక్షణుడై , ముఖ్య ప్రీతికి విషయము అగుటవలన ఆనందమందురు, " ఎట్లు ఉష్ణ, ప్రకాశ రూపుడై అగ్ని ఉన్నదో " అట్లు సచ్చిదానందరూపుడై "ఆత్మ ఉన్నది".

మరియు సచ్చిదానంద స్వరూపమునే శాస్త్రమునందు "బ్రహ్మమందురు" కనుక ఆత్మ బ్రహ్మ స్వరూపుడుగా నున్నాడు. వ్యాపక పదార్థమునకు బ్రహ్మమని పేరు.

ఒక్కడే చైతన్యము సర్వప్రపంచమునకును, మాయకును అధిష్ఠాన మగుట వలన దానిని బ్రహ్మమందురు. అదే చైతన్యము

జీవునకును, ఈశ్వరునకును ఉపాధి భేదమువలన భేదము కలదు.!!
కాని స్వరూపమున భేదములేదు. వస్తువొ ఒక్కటే.

అబ్రహ్మస్వరూపుడైన ఆత్మ అజన్ముడగుచున్నాడు. మిథ్యాజగత్తునకు ఆధారము అజ్ఞానము . జగత్తునకు ఆధారమును, అధిష్ఠానమును బ్రహ్మరూపమే.

ఆత్మ పరమానంద స్వరూపుడగుట వలన గృహ స్థిత నిధి న్యాయమున పరమానంద ప్రాప్తియును. ఆత్మయందు నిత్యసిద్ధము. ఈ రీతిగా స్వభావసిద్ధమైన మోక్షము యొక్క ఉత్పత్తి కర్మము వల్ల ఘటిల్లదు. ఆత్మ నిత్యము కర్మము లేక వాసన మోక్షమునకు హేతువు కాదు. కేవల జ్ఞానమే మోక్షమునకు హేతువు. జ్ఞానవంతుని ప్రాణము బయటికి పోదు. ఇది వేదమందు చెప్పబడియున్నది.

సంసృతి= జనన మరణ రూప సంసారము.

ఎవనికి జీవన్ముక్తి యందు యిచ్ఛయగునో, వాడే బ్రహ్మాకార వృత్తి నిమిత్తము వేదాంతచింతనచేయును. ఉపాసన చేయడు, ఏలయన అంతఃకరణ నిశ్చలతా మాత్రము వలన బ్రహ్మానంద భావము (ప్రకాశము) విశేషరూపముచేత గానేరదు. మరేమనగా బ్రహ్మాకార వృత్తి చేతనేయగును. అబ్రహ్మాకార వృత్తి, వేదాంత చింతన చేతనే యగును, ఉపాసన చేతకాదు. అంతఃకరణ చాంచల్యము విద్వాంసునకు వేదాంత చింతనము చేతనే దూరమగును.

జగత్తునకు, ఈశ్వరుడు కర్త, అతడు నీకంటె భిన్నుడు కాడు, సచ్చిదానందుడైన బ్రహ్మము నీవే".

నీవు దీనత యొక్క పరిత్యాగము చేయుము, నీ స్వరూపమును ,చూడుము ఓయీ

నీవు శుద్ధ బ్రహ్మముగా నున్నావు . ఓయీ నీవు అజ్ఞానముచే జగత్తు యొక్క ఉత్పత్తి, స్థితి, లయముల (సంహారమును) చేసియును, నీవు స్వయముగా అవినాశిగా నున్నావు, ఇట్లుండగా యీమిథ్యా ప్రపంచమును చూచి ఎందుకు భయపడుచున్నావు? నీవు సుఖ రాశిగా నున్నావు. జీవుడు, జగత్తు ఈశ్వరుడు వీరిని నీమాయా యోగముచే నీవు ప్రకాశితుల జేయుచున్నావు, ఎట్లనగా,రజ్జు సర్పమును, శుక్తి రజతమును ప్రకాశము చేయును, సత్తా స్ఫూర్తి యిచ్చును.

జ్ఞాన సాధనములు : 1. వివేకము 2. వైరాగ్యము 3. శమాదిషట్కము 4. ముముక్షత,జ్ఞానము యొక్క స్వరూపము జీవేశ్వరుల ఏకత. (వృత్తి=పదము యొక్క అర్థముతో సంబంధము ఏదికలదో దానిని వృత్తి యందురు.)

## 3. జ్ఞాన వాసిష్ఠము

విషయరాసులయందుగల రుచిని వదలలేక కడు కష్టములను సహించు మనస్సును అరికట్టి, సత్యమార్గమునకు మరల్చి ముందుకు పోగలిగిన సాధకునకు ఫలము త్వరలో చేకూరును,

తపస్సు అనగా యిహలోక సుఖానందములను కోరు యింద్రియములు విషయ సంపర్కములను పొందనీక చేయగల్గుట. మనస్సునందు కోరికలను వృద్ధి పొందనీయక అణచివేయుట దమము. ఆత్మ నిగ్రహము లేక ఆత్మసంసారములభించదు సాధకుడు శారీరకముగా, మానసికముగా నిర్మలత పొంది అభివృద్ధి పొంది దైవగుణముల పొందగలిగిన పిమ్మట అతడు నిష్కామ కర్మచేయుచుండవలయునని శృతి ఆశించుచున్నది.

ఆత్మకు వేదములు అంగములు . సత్యము దాని పునాది సత్య వాక్పరి పాలనైనను - దీక్షలేనిది సత్యనిలయమును ప్రవేశింపజాలము. సాధకుడు భావములు, కోరికలు, కర్మలు ఒకదానికొకటి, అనుగుణముగా నుంచుకొనవలెను సత్యమునకు సత్యమే నిలయము. బ్రహ్మను తెలియునతడు, బ్రహ్మమగుచున్నాడు. బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి శృతి.

మన నిజస్వరూప జ్ఞానము లేని దోషమును నిర్వీర్యపరిమితులలో ఊపిరి తిప్పుకొనలేకున్నాము. మన స్వరూపము కోల్పోయియున్నాము అను భావములో సర్వ దుఃఖములను అనుభవించుచున్నాము. ఇది కేవలము భ్రమ మనకుఎట్టినష్టము కలిగియుండలేదని తెలిసికొనవలెను. తక్షణమే పరిపూర్ణానందమగు మన నిజ స్వరూపమునుఅనుభవించగలము. అజ్ఞాన రోగమునకు జ్ఞానమే చక్కని ఔషధము. త్రాటిని తెలిసికొనుటవలన , పాముకాటు నివారణ అగుచున్నది.అట్లే మనము ఆత్మ స్వరూపులము, అనితెలిసికొనవలెను.

" సమోదతేనియం హిలబ్ధి:- ఆనంద స్వరూపమైన ఆత్మను పొంది అతడు ఆనందించుచున్నాడు, నిత్యానందమే ఆత్మ స్వరూపము " ఆత్మయే ఆనందమునకు ముఖ్యకారణము. ఆ ఆత్మయే "తాను" అనునది. ప్రతివాడును దానిని పొందియే యున్నారు, కావున దానిని పొందుట అనగా దానిని తెలిసికొనుటయే సూటిగా ఆత్మను తెలిసికొనుటకు చిత్తైకాగ్రత, ధ్యానము తప్పక యుండి తీరవలెను.

ఈశరీరము దుర్గంధాది దోషములచే యుక్తమైయున్నను కర్మము , కామము, అవిద్య - యీ మూటి యొక్క ప్రభావముచే జీవుల కిది అమృత సమానముగ, ప్రియముగ ప్రతితమగుచున్నది.

(ఇట (ప్రారబ్ధ కర్మ) సంబంధ ఫలమునకు కర్మమనియు, రాగమునకు కామమనియు, అధ్యాసమునకు అవిద్య యనయు పేర్లు)

బ్రహ్మాత్మాజ్ఞానముచే తప్ప కర్మోపాసనాద్యుపాయములచేత అజ్ఞానమునకు నివృత్తి సంభవింపదు.

మోక్షప్రాప్తి కొరకు ఆత్మ జ్ఞానము వినా వేరు మార్గము లేదు. ఏ అధికారి పురుషులు అద్వితీయ బ్రహ్మమును తన ఆత్మ రూపముగా నెరుగుదురో, ఆ అధికారి పురుషులు బ్రహ్మరూపులే యగుదురు.

శ్లో॥ సర్వ భూత స్థమాత్మానం, సర్వ భూతాని చాత్మని
సంపశ్యన్ బ్రహ్మ పరమం, యాతి నాన్యే నహేతునా!!

" దేహేంద్రియాది యభిమానములను వీడిన జిజ్ఞాసువు "అహం" నశించి ఆత్మ స్వరూపు డగుచున్నాడు. అనుభవముచే సిద్ధించిన యే సచ్చిదానందరూపాత్మగలదో ఆసర్వ క్లేశ రహితుడగు ఆత్మ దేవుడు నీవైయున్నావు.

సంపూర్ణ సంతృప్తిలో అన్ని ఆశలు, ఆకాంక్షలు అంతమగుచున్నవి. గతము యొక్కగాని, భవిష్యత్తుయొక్కగాని సంకెళ్లనుండి ఒకక్షణమాత్రము విడివడినచో అదియే సాధకుని పరమావధి యగుచున్నది. దీనినే సమాధి అని పిలుచుచున్నారు దీనియందలి అనుభమును ఆ సత్యము యొక్క అనుభవమే. జ్ఞానే నైవతు కైవల్యం . జ్ఞానము చేతనే ముక్తి అనునది సర్వ వేదాంతుల యొక్క మూల సిద్ధాంతము.

మానవుడు భగవంతుడు కాగోరిన యెడల, అతడు తన మలిన మసస్సునందలి పిశాచరూపములను దాల్చిన తన భావములను, శని గ్రహమువంటి కిచకిచలను, అహంకార గర్వమును పూర్తిగా త్యజించవలయును, అసత్యము నుండి సత్యమునందు సంసక్తులు గండు. దానిలోనే నిజమైన ముక్తి , విజయము సిద్ధి గలదు, మనము మహర్షుల యొక్క మార్గమును నిరంతరముగా, నిష్కపటముగా, విశ్వాసముతో అనుసరించవలెను, శ్రద్ధతో ఆత్మను అన్వేషించు వానికి ఆత్మ స్వయముగనే తనను వెల్లడి చేసికొనునని శృతి చెప్పుచున్నది మానవుడొక్కడే ఆత్మ జ్ఞానమునుండి వెలువడు మహత్తరా నందములకు ఏకైక వారసుడు అగుచున్నాడు, కావున నాతడు సర్వజీవులలో పరిపూర్ణత్వము గలవాడగుచున్నాడు. వాక్కును మనస్సులోను : మనస్సును జ్ఞానములోను : జ్ఞానమును మహత్తత్త్వము లోను, : మహదాత్మను, అశాంతాత్మలోను, ప్రాజ్ఞుడు ఉపసంహరింపవలెను, ఇంద్రియములు, ఇంద్రియవిషయములు, మనస్సు, బుద్ధి, మహత్తత్త్వము, అవ్యక్తము, పురుషుడు, సత్యము - యివి ఒకదానికంటె మరియొకటి సూక్ష్మములైనవి. పురుషునికన్న సూక్ష్మమైనది లేదు."

స్వయంభూవైన బ్రహ్మ, బాహ్యమునకు [illegible]లు స్వభావముగల ఇంద్రియములను సృష్టించెను, అందువలననే, మానవుడు అంతరాత్మను చూడక, బాహ్యవిషయములనే చూచుచున్నాడు, కాని కొంతమంది ధీమంతులు అమరత్వమును కోరినవారై, విషయములనుండి దృష్టిని లోనికి మరలించి ప్రత్యగాత్మను కనుగొనుచున్నారు.

" ఏ ఆత్మ చేత మానవుడు శబ్ద , స్పర్శ, రూ[illegible]స, గంధములును కామాదులు మొదలగు వానిని తెలిసికొనుచున్నాడో, అట్టి ఆత్మక [illegible]చము తెలియనిదేమున్నది? ఇదియే అది (నీవు తెలిసికొనగోరినది ఆ ఆత్మయే)

ఉత్కృష్ట పరిపూర్ణత్వ దృష్ట్యా యీ జగత్తు పుట్టనే లేదని జీవుడు స్వమనో భ్రాంతి మాత్రము చేతనే కలిగినదనిన్ని తెలియవలెను.

తనను సర్వాత్మగా భావించిననే, మానవ జీవతము మహనీయఫలంగా మారుటకు సంపూర్ణముగా వికసించుచున్నది. మనస్సును పూర్తిగా వశపరచుకొని యంతమొందించిననే యట్టి భావన కలుగును. మనస్సు అంతమొందించుట యనగా సంకల్ప వికల్పములు నశించుటయేయగును.

ఆత్మ యీదేహమును వదిలి, యాదేహమునకు సంబంధించిన సమాచార వ్యాపారములును ఆత్మతోపోయి, యీ దేహమునువదలి అంతమున యే

పంచభూతములనుండి పుట్టినదో యా పంచభూతములలోనే కలిసిపోవుచున్నవి. అమానుష శక్తులతోను , దైవ శక్తులతోను నిండిని ఒక మహత్తర యంత్రమే మానవుని మనస్సు

జీవమునకు కారణము ప్రాణముకాదు. దానికి కారణభూతమైన ఆత్మ తన యాలయమైన దేహమును విడిచి పెట్టగానే , ప్రాణములు తమంతటాతామే నశించుచున్నవి. శాస్త్ర పరిభాషలో దేహ మనోబుద్ధుల వ్యాపారములను ప్రాణ వృత్తులందురు. జనన మరణముల భ్రాంతి కల్పితములు (అహంకారము యొక్క మనోబుద్ధులలో ప్రతిబింబితమైన ఆ పరమాత్మయే యిదివరకు తెలిసికొన్నట్టి జీవుడు లేక అహంకారము, ఈ అహంకారము నేను, నాది, అను భావముతో మృత దేహమును వదలిపోవుచున్నది. కొంతకాలము వరకు దేహములేకయుండి. అటు పిమ్మట దేహమును పొందవలెనని కోరిక కలిగించుకొన్నదై మరియొక దేహమును పొందును.

జీవాత్మ యీదేహమును విడిచిన తర్వాత మరియొక దేహముతో సంబంధము కలుగువరకు ఒక భావరూపములో తేలుచుండును, అట్లు తేలుచున్న జీవుడు క్రొత్త రూపములో తాను అనుభవించుటకు తగినట్లుగా తన కర్మ ఫలములే అతనికి సహాయపడుచున్నవి.

పూర్వము మనము చేసిన కర్మలకు అనుగుణముగా మనము భవిష్యత్తులో ఆ కర్మఫలము అనుభవించుటకు తగినట్టి రూపమును దాల్చి తదనుగుణ్యమగు పరిస్థితులలో జన్మమెత్తు చున్నాము.

భవిష్యజ్జన్మ కేవలము మన పురాకృత కర్మ ఫలము మీదనే గాక మనము ఆజన్మలలో ఆర్జించిన ఆత్మజ్ఞానము మీదను, దానికి తగినట్లు గడిపిన జీవనము మీదను గూడ ఆధారపడియుండును,

ఏది నిద్రలో కూడా సమస్త విధములైన విషయేచ్ఛలను స్వప్నము లోకి రూపొందించుచు మేలుకొనియుండునో అదియే పవిత్రమైన బ్రహ్మ, దానినే అమృతం (చావనిది) అనికూడా పిలుచుచున్నారు సర్వ ప్రపంచము దానిమీదనే ఆధారపడియున్నది. దీనిని దాటి యెవ్వరును పోలేరు.

శుద్ధ చైతన్యమగు ఆత్మ, జాగ్రత్స్వప్న సుషుప్తులనెడి మూడుఅవస్థలలోను సదా సాక్షియై యున్నది., కాని అది మేలుకొనదు. స్వప్నముచూడదు. సుషుప్తిని చెందదు. దాని సాన్నిధ్యములో యీ మూడవస్థలు పందెము లాడుచున్నవి.

మన మనస్తత్వములో భేదమున్నది గాని, ఆత్మలో లేదు, మన చైతన్యమ్ము శుద్ధ చైతన్యమగు ఆత్మయని తెలిసికొను క్షణమే ఆత్మజ్ఞానము లేక ఈశ్వర దర్శనము యొక్క సమయము.

ఇట్టి సరమానంద రూపమగు పరమ జ్ఞానముయొక్క క్షణమును అనుభవించుట కొఱకు నొకడు తప్పక నున్నత పరిణామము పొందిన ధీరుడుగా నుండ వలయును. అట్టి వాడే నిత్యానందము ననుభవించుచున్నాడు. వివేచనాబుద్ధి గల మానవులు గాఢ ధ్యానములో సర్వ వ్యాపి, సత్యమును ఆత్మీయముగా నిదియేయది,యని తెలిసికొనుట యనెడి దివ్యసిద్ధిని పొందుచున్నాడు.అత్మ జ్ఞానమును పొందినట్టి ధీమంతులే ఆనందముననుభవించు వారు తది తరులు కారు, జ్ఞానియైన సాధువు ఇంద్రియ మనోబుద్ధుల తోడిగల ఐక్య భావమును ఉపసంహరించు కొనినచో, అట్టి ఇంద్రియ మనోబుధ్యతీతా వస్థ ఆత్మయే అని తెలిసికొన గలుగుచున్నాడు.

ధ్యానియైన వాడు తన మనోబుద్ధులను అణచివేయుటలో సఫలుడు అయినట్లైతే, ఆ నిశ్శబ్దావస్థలో చైతన్యము తనను తానే తెలిసికొనుచున్నది, ఇట్లు తెలిసి కొనుట అనునది

సహజ జ్ఞానానుభూతియేకాని భౌతిక జ్ఞానము కాదు.

" ఆత్మ సమస్త వస్తు ప్రకాశమునకు కారణము".

భగవంతుడు తన్ను చూచుటకు భక్తులు చర్మ చక్షువుల యెదుట కనబడదని స్పష్టముగా సూటిగా నవరించుటకు సాహసించుచున్నది. ఇంద్రియములగు సమస్త జ్ఞానము లెంత దివ్యమై తృప్తి నిచ్చేడివని తోచినప్పటికిని , మానవ మనోభ్రాంతి కల్పింతములేయని చెప్పనగును.

"ఆత్మను తెలసికొనుటయనగా, తనను తాను తెలిసికొనుటయే",

ఎవడైతే యాజీవితములోనే తనలోనుండు నాత్మ శుద్ధ చైతన్మము కంటే వేరైనది కాదని తెలిసికొనుచున్నాడో అతడు జనన మరణ రూపమైన సుడిగుండము నుండి బయటపడి అమృతత్త్వమును పొందుచున్నాడు . జీవిత యంత్రమును త్రిప్పునది ఆత్మయే ఇంద్రియ మనోబుద్ధులు జీవిత కేంద్రముచే నడుప బడునదై, గ్రహించి, యనుభవించి. తెలిసికొనునట్టి యితర విషయముల వలె ఆత్మవైపు తిరిగి దానిని తెలిసికొనలేవు. ఓం, అనుదానిని సగుణమైన సత్య చిహ్నముగా భావించిన హిరణ్య గర్భ స్థితియందలి యానందమును పొందుచున్నాడనియు, ఆ "ఓం" నే నిర్గుణ బ్రహ్మగా భావించిన తానే యా చైతన్యమై సర్వవ్యాపియగు నాత్మతత్త్వముగా నగుచున్నాడు.

ఆత్మను తత్త్వసారమైన సత్పదార్థముగా నెవడు తెలిసికొనునో, వాడే నిజముగా జ్ఞానముగలవాడు, ఈ ఆత్మ జ్ఞానము బాహ్య మైనదిగాక, పరవిషయమును కనుగొనునదై యున్నది, విషయముల మనస్సును , ఇంద్రియములను ఉపసంహరిచుకొనిన, వివేచన ఆగిపోవుచు ఉన్నది మనస్సులోని సమస్త కోరికలను నశింపజేసిన మానవుడు అమరత్వమును పొంది యీ జన్మలోనే బ్రహ్మైక్యమును పొందుచున్నాడు.

ఈ జీవితములోనే హృదయగ్రంధులను భేదించిన మానవుడు అమరత్వమును పొందునని సమస్త వేదాంతమును బోదించుచున్నది. అవిద్య కామ,కర్మలనే వేదాంతములలో హృదయ గ్రంధులను చున్నారు.

అస్తి మాంసాముతమైన యీ దేహములో నివసించియుండగనే తన స్వప్రయత్నము చేత నార్జించిన యా పరిపూర్ణ జ్ఞానముగల మానవుడే యీ భూమిమీద దేవుడు. దేహ మనోబుద్ధులను వశపరచుకొని నడపునట్టి శుద్ధ _ తన్యమే మానవునిలోని ఆత్మతత్త్వము.

"పరమాత్మ ప్రాప్తి వల్లనే ఆనందము కలుగును", ఏవస్తువు నందైనను తనదను ఆత్మవ్యాప్తి కలిగినప్పుడు, ఆనందము కలుగును, కొంచమైనను భేదముగాని అస్వతంత్రతగాని యున్నయెడల ఆనందము కలుగదు, పరబ్రహ్మ యగు ప్రత్యగాత్మ యొక్క అపరోక్షాను సంధాన తత్పరులు అభయమును , ముక్తిని పొందుగురు.

స్వప్నమందలి సృష్టి స్వయముగా వాస [illegible] సా [illegible] ుగ జరుగును. "ఆనందము ఏ విధముగా గల్గినను అది ఆత్మదే" ఆత్మవ్యాప్తి లేక ఆ[illegible]దము కలుగదు". ఆత్మజ్ఞానులకు సమ్యగ్దర్శనము కలిగి సర్వము తమలోనే యున్నదను జ్ఞానము ఉండును. కాని యొక శరీరమందున్నామని తలంపక సమస్త సృష్టి స్థితి సంహారము చేయు సర్వవ్యాపకుడగు పరమాత్మ తామను అపరోక్ష జ్ఞానము కల వారైయుందురు.

ఈ లోకములో యీ శరీరమున్నప్పుడే సమ్యగ్దర్శనము సంపాదింపవలెను. అట్లు చేయని యెడల చాల నష్టము కలుగును, శుద్ధ సత్త్వ స్వభావము గల మనస్సుచే ఆత్మకంటె వేఱేమియు లేదని తెలిసికొనవల[illegible]ను.

"మౌనత్రయము:- ఇంద్రియ, మనో, కాష్ఠ మౌనములు,

సమస్త జ్యోతి స్వరూపములకు తేజస్సగుపరమాత్మ యందే సర్వము సృష్టి, స్థితి

లయమును పొందుచున్నదని తెలిసికొని యుపాసింపవలెను. సమస్తము దేనిపై ఆధారపడియున్నదో యదియే ఆత్మ స్వరూపమని తెలిసికొనుటే అమృత లక్షణము. ఎపుడు తత్త్వమాలోచింపబడెనో అపుడు చీకటి తొలగినట్లయ్యెను (అజ్ఞానము నశించెనని తాత్పర్యము) అన్యుల కనుభవము లేని యేకాత్మత్వమును ఆత్మయందు కనుగొనెను. అన్వయ వ్యతిరేక దృష్టాంతములతో తన యాత్మనెపుడు పురుషుడు ప్రత్యగాత్మ యందనుసంధానము చేయునో, యపుడు నేను బ్రహ్మమునని తెలియును (చూచును)

## జీవుని పుట్టుక - ధర్మములు

బ్రహ్మము సర్వ పరిపూర్ణ మయ్యును వ్యష్టియందు ఉపాధి పరిగ్రహము. వలన ప్రత్యగాత్మ లేక కూటస్థాత్మయనబడును. ఈ కూటస్థాత్మ బుద్ధి యందు ప్రతిఫలించగా ఆ ప్రతిబింబము "చిదాభానుడు" లేక "జీవుడు" అనబడి కర్తృత్వాది సాంసారిక ధర్మములతో సంచరించును.

చేతన ప్రతిబింబముతో కూడుకొనియున్న అంతః కరణము (లింగశరీరము) (సూక్ష్మశరీరము) సుఖ దుఃఖములకు కర్త, భోక్తయు నగుచున్నది.

జీవుని పుట్టుక: ఈ అంతః కరణము నందు ప్రతిబింబించిన చైతన్యమునే జీవుడందురు. లింగశరీరము (అంతఃకరణము) దానియందలి చైతన్య ప్రతిబింబము, దానికాశ్రయమైన అధిష్ఠానము యీ మూడును కలిసి జీవుడనియు, మఱియు మాయ, మాయయందలి ప్రతిబింబము, మాయాధిష్ఠానము యీ మూడును చేరి ఈశ్వరుడనియు చెప్పిరి, జీవునకు, ఈశ్వరునకు భేదము ఉపాధుల వల్లనేగాని వాస్తవమునందు లేదు.

అంతయు బ్రహ్మము, అంతయు మాయ. సచ్చిన్మయమే, ఆధ్యాత్మిక, అధిభౌతిక, అధి దైహికములుగాని , తైజస ప్రాజ్ఞులుగాని, విరాట్, సూత్రాత్మ , ఈశ్వరులు గాని ఏమియు లేవు. అనుద్వేగ (భయ) రాహిత్యమే, రాజ్యాది విభవములకు మూలము: దీనివలననే మనోజయము సిద్ధించును. మనస్సును జయించినచో నిక త్రిలోకములున్ను తృణము వలెతోచును." వ్యావృత్తి:- చిత్తమును విషయములనుండి తొలగించి ఆత్మయందు నిలుపుట. ఈమనస్సు (జీవుడు) యిటనుండి పరలోకమునకు బోవుట, మఱియొక రూపమును స్ఫురించుట యనునది మోక్షప్రాప్తి పర్యంతమును మనః కల్పనచే సంభవించుచునే యుండును. కానీ యిక మరణ భయమెచట?

జాగ్రస్థితికి, స్వప్నస్థితికి పరిమాణమందు భేదమేగాని స్వభావము నందుభేదములేదు. మరణమన - ద్రష్టయొక్క ఉపశాంతియేగాని దృశ్యము ఉపశాంతికాదు.

Man's mind is great machine filled with extraordinary human power and Godly powers.

ఓం ప్రణపము. పరబ్రహ్మ నామవాచకము, నిర్గుణ బ్రహ్మమునకు ప్రతీకము. అ,ఉ,మ, లతో కూడి వచ్చు నిశ్శబ్దముతో కలిసి చతుష్పాద మనబడును , శాంతం శివం సుందరం అనబడు పరమాత్మకునామము కనుక మంగళకరము , ఏకాక్షర మంత్రము, మంత్రరాజము, సర్వమంత్రములకు మంత్రబలమొసగు తేజోబిందువు, వేదములు, ఉపనిషత్తులుచ్చరించుటకు పూర్వపదముల స్మరించ వలసిన పరబ్రహ్మనామము,

మనస్సునకు చింతించు శక్తి యొసగునది ఆత్మచైతన్యము. ఆచైతన్యమును మనస్సు కనుగొనజాలదు "ఆత్మ సాన్నిధ్యమున మనస్సు లీనమగుచున్నది". అట్లు లీనమగుటయే విశేషముగ చింతించుట. ఆత్మ ఇంద్రియగోచరము కాదు గనుక అవ్యక్తము. ఆత్మలేక రూపములు ఉండజాలవు. కనుక ఆత్మ అనంతరూపములాయెను.

చిత్:- చైతన్య స్వరూపము. జ్ఞానము, సర్వశక్తులకు శక్తిత్వము నొసగు చైతన్యము. రూపములు ఆత్మగాదు. రూపములు ప్రకాశించుట కాస్పదమొసగునది ఆత్మ.

జాగ్రత్, స్వప్న, సుషుప్తులు, భూతభవిష్యద్వర్తమానములు, సత్వ, రజస్తమోగుణములనే త్రిపుటియందురు. ఈ త్రిపుటిని తెలియుటే త్రినేత్రము లాయెను. నీలకంఠం= జ్ఞాన (అగాధ) కంఠము.

ప్రాణమనగా:- శరీరమును చైతన్యయుతము చేయుచుండు శక్తి, వైశ్వానరుడు ఆహారమును పచనము గావించి, దేహమునకు. ఉష్ణత్వము నొసంగును అతడే మనస్సు రూపమున వివిధ సంకల్ప వికల్పములను గలిగించుచున్నాడు. సుషుప్తినుండి, పూర్వవాసనల బలము వలన జీవుడనబడు ఆ పరమాత్మ జాగ్రత్తు పొందుచున్నాడు. స్వప్న, సుషుప్తులు తనకు అన్యమని తృప్తి ననుభవించుచున్నాడు.

కైవల్యోపనిషత్తు: 1. ప్రజ్ఞానం బ్రహ్మ: ఋగ్వేదము, యితర ఉపనిషత్తుల లక్షణ లేక విధివాక్యము.

2. అహం బ్రహ్మాస్మి: యజుర్వేదము: బృహదారణ్యకోపనిషత్తు: అనుభవవాక్యము.

3. తత్త్వమసి: సామవేదము: ఛాందోగ్యోపనిషత్తు: ఉపదేశవాక్యము.

4. అయమాత్మా బ్రహ్మ: అథర్వణ వేదము: మాండూక్యోపనిషత్తు: సాక్షాత్కారవాక్యము

జ్ఞానేంద్రియములద్వారా వ్యాపించిన అంతః కరణ వృత్తులతో గూడినట్టి యే చైతన్యము చేత గ్రహించుటకు యోగ్యమైన అనుభవములను ఏపురుషుడు గ్రహించుచున్నాడో ఆ చైతన్యమునే ప్రజ్ఞానమని చెప్పెదరు.

తత్త్వమసి: తత్+ త్వం+అసి: అది నీవు అగుచున్నావు. అయమాత్మాబ్రహ్మ: అయం+ ఆత్మ+బ్రహ్మ: ఈ ఆత్మ (ప్రత్యగాత్మయే) బ్రహ్మము తత్: ఈశుడు: త్వం: జీవుడు

ధనమనగా: రాగద్వేషముల సమృద్ధితో గూడినదని తెలియవలెను, నిరంతరం బహిర్ముఖత వదలి అంతర్ముఖం చెయ్యి. మనస్సును బహిర్ముఖం కానీయకుము, జ్ఞాన తేజో మండలంలో జీవించు, జ్ఞానంలో జీవించు, జ్ఞానంలో సంచరించు, జ్ఞాన స్వరూపుడవై జీవించు, తేజస్సులో ఏకీభావం పొందు. అంతర్జ్యోతి నిరంతరం ప్రకాశిస్తున్నది.

మనస్సంటే ఏమిటి? ప్రమాణం, మిథ్యాజ్ఞానం, కల్పన, నిద్ర, స్మృతి, (పతంజలి యోగశాస్త్రము) ఈ ఐదులక్షణాలు కలది మనస్సు,

అంతఃకరణము : బుద్ధి : లింగశరీరము.

దేహభావమును పొందిన, చిత్తమునకును, ఆత్మాకాశమునకును దృఢతరమైన ఐక్యాభ్యాసము వలన నాకగపడిన వారందరును వాస్తవముగా నితరులే యయ్యును తనవారుగా గూడ నగుచుందురు. వాని చిత్తము యీ ప్రకారముగా దేహభావమును బొంది యుదయించినప్పటికిని, యీ సంసారము నందు కొంచెమేనియు బుట్టినది లేనేలేదు. అంతయు నిర్మలమయిన యాకాశమే యగుచున్నది. స్వప్నసమయమున ద్రష్టయందే విధముగా చిత్తుండునో దృశ్యము నందును ఆ చిత్తట్లే యుండును. చేతన సంవిత్తు (చైతన్యజ్ఞానము) నందే ప్రకారముగా చైతన్య భావము భాసించునో అట్లే యీ జగత్తు కూడ భాసించును. స్వప్నమునందెట్లు ద్రష్ట, దర్శనము, దృశ్యము అను మూడును భాసించునో అట్లే ఆత్మ సత్త యందే జగత్తు కూడ నేమియు లేనిదే యయ్యును భ్రాంతిచే తాను ఉన్నట్లు భాసించును. వాస్తవముగ జూచినచో నానాత్వమించుకయు కలుగనే లేదు. స్వప్నమునందు కారణము లేకుండనే నానావిధలైయిన జగత్తు భాసించునట్లే పరలోకము నందును నానావిధములైన జగత్తు కారణము లేకనే భాసించును. అది యాకాశరూపమేగాని వేరుగాకున్నను భ్రాంతివలన వేఱుగ భాసించుచుండును, స్వప్న జగత్తునకును, పరలోక

జగత్తునకును జాగ్ర జ్జగత్తునకును భేదమించుకయు లేదు. అది భ్రాంతి మాత్రమయినట్లే యిదియును భ్రాంతిమాత్రమేగాని వాస్తవముగ నేదియు బుట్టినది కాదు. సముద్ర జలమునందు తరంగము నిజము కానియట్లే ఆత్మయందును జగత్తు నిజముకాదు. లేనిదియే యున్నట్లు భాసించుచు ఉండును. ఇది యే కారణము వలన నుండియు బుట్టినది కాదు. కనుక నశించునదియు కాదు. సముద్రమునందు తోచిన తరంగము జలమున కంటె వేఱుగాక జలమయినట్లే ఆత్మయందు దోచిన జగత్తు కూడా ఆత్మయేగాని యితరముకాదు.

నిజముగ నాలోచించినచో జలమునందు తరంగము మాదిరిగా గూడ ఆత్మయందు జగత్తులేదు.

"తన వాసన ననుసరించినయే అనుభవము కలుగుచుండును". భావనకంటె వేఱుగా అనుభవముండదు. భావన , దేశము, కాలము, క్రియ, ద్రవ్యము అనునవి కలుగుట వలనను కలుగును. భావనయెట్టిదో సిద్ధియు అట్టిదే కలుగును.(యద్భావం తద్భవతి)

ఎవరి సంవేదనము (సంకల్పము) తీవ్రమైన అభ్యాసము వలన నిర్మల భావమును బొందునో, వాని సంకల్పము సత్యమే అగును, కనుకనే భావన యెట్టిదో సిద్ధియు అట్టిదియే కలుగును, భావనయే తీవ్రమైనదిగ తెలిసికొనుము.

మొట్టమొదట శుద్ధ సంవిన్మాత్రము వలన నుండి, యే సంవేదనాభ్యాసము కలిగిదో, దానివలననే జీవునికి సంకల్ప రూపమైన యాతి వాహిక శరీరమేర్పడినది. దానియందు దృఢమైన అభ్యాసము కలిగి నప్పుడు సంకల్ప రూపమయిన యాశరీరమే ఆదిభౌతిక శరీరమై భాసింపమొదలిడును,

శరీరము= నసించునది, దేహము = దహింపబడునది, జలము, జలత్త్వము వలన మంచుగడ్డ యగునట్లే జీవుని ప్రమాదము (భ్రాంతి) వలన సంకల్పా భ్యాసమును బట్టి యాది భౌతిక స్వరూపముగా నేర్పడును, ఆయాది భౌతిక శరీరమునకు మూడు లక్షణములు కలవు. అది పెద్ద శరీరమగుటయు, శిథిలమగుటయునే; వాని వలన, నహం ప్రతీతి కలుగును. కనుక దాని కాది భౌతిక శరీరమని పేరు కలిగినది. యదార్థ జ్ఞానము కలుగగానే అది యాకాశరూపమే యగును.

ఆత్మసత్తయే సంవేదనము వలన జగద్రూపమై భాసించును. అంతియే గాని రెండవ వస్తువేలేదు.

జీవుని హృదయమునందనేక వాసనలుండును వానిలోనేది తీవ్రముగ నుండునో దానికే జయము కలుగును.

ఒకొక్క చిదణువు నందనేక కోట్ల బ్రహ్మాండములున్నవి. కాని, వాస్తవములో నేమియు లేవుసుమా! కేవల చిదాకాశమే చిదాకాశము నందున్నది. చిత్తునందు సంవేదన స్ఫురించునప్పుడు జగత్తు భాసించును.స్ఫురింపనప్పుడు జగత్తు భాసింపదు. ఎప్పుడయితే భోగముల విషయమున చిత్త వృత్తులు ప్రసరింపవో అప్పుడు జీవుని కాత్మ పదప్రాప్తి కలుగునని తెలిసికొనుము, ఇది శృతుల తాలూకు నిశ్చయము.

సర్వపదార్థముల యందలి మమకారము దూరమగుచున్నకొలదియు జీవుని బంధనములు వదలుచుండును . అహంకార మంతరించిన తోడనే జన్మము లస్తమించును. కేవలము శుద్ధ స్వరూపమే మిగులును. అపుడు స్థావర జంగమ రూపమయిన జగత్తంతయు ఆత్మ స్వరూపముగానే తోచుచుండును.

ఈ జగత్తు బ్రహ్మమనెడి రత్నము తాలూకు ప్రకాశము, ఎల్ల జగత్తునకును, యెల్ల వాసనలకును బీజము సంవేదనమే, కావున అది భ్రాంతియేయని తెలిసికొని, సంవేదనము

బొత్తుగా అభావమును పొందినట్లు ప్రయత్నించుము. సంవేదన బొత్తుగా అభావమును పొందినంతేనే జగద్భ్రాంతి యంతయు నష్టమై పోవును. వాస్తవములో పుట్టునదిగాని, గిట్టునదిగాని యేమియులేదు. సర్వమును శాంతరూపమయిన చిద్ఘనమే. రాతిరీతిని చలనము లేనిదై తనయందే తానున్నదని తెలిసికొనుము.

చిత్పరమాణువునందు చైతన్యమువలన అనేక సృష్టి భాసించుచుండును. ఆ సృష్టి యందలి పరమాణువుల లోపలను సయితము పెక్కు సృష్టులున్నవి ఇట్లు చూచినచో వాని నన్నింటికిని లెక్కయే ఉండదు. శుద్ధమైన ఆత్మ సత్తయందు యే వేదన స్ఫురించెనో, అది తనను ఆత్మరూపముగానే తెలిసికొనెను. (బ్రహ్మ) భావన చేసి సంకల్పరూపమయిన నానాజగత్తునురచించెను. కాని దాని లోపలనుండు అనుభవము ఆ సత్యరూపముగా చేసినది (జగత్తును) దాని యందు ఒకప్పుడు నిమేషమునందనేక యుగములు భాసించుచుండును ఒకప్పుడు అనేక యుగములలో ఒక్క నిమేషము అనుభవమునకు విషయమగును.

బ్రహ్మము సదాభాసము అనగా అసద్రూపమయిన జగత్తు. దానివలన సద్రూపముగా భాసించునన్నమాట. స్వచ్ఛము- అనగా ఆభాసరుపమయిన జగత్తులో సయితము శూన్యరూపమయినదన్నమాట.

మనస్సు తాలూకు స్ఫురణమునకే కర్మమని పేరు. అస్ఫురణముకే చిత్తమనియు, దైవమనియు పేరు. దానివలననే జీవునకు శుభాశుభములు కలుగుచుండును.

ఆది కారణమయిన బ్రహ్మము వలన నుండి మనస్సు పుట్టినది. అమనస్సు సంకల్పమే రూపముగా గలది. మనస్సు వలననే యీజగత్తు అంతము అయినది. ఆత్మయందు మనస్సురూపముగనున్నది. ఆ మనస్సు భావాభావ రూపమయిన యీ జగత్తును కల్పించినది.

బ్రహ్మ, జీవుడు, మనస్సు, మాయ, కర్మము, జగత్తు, ద్రష్టమొదలగు సమస్త భేదములును మనస్సువలననే కలిగినవి. ఆత్మయందే భేదమును లేదు. జగత్తు,దీర్ఘకాల స్వప్నమువంటిది.

జీవచైతన్యము బ్రహ్మచైతన్యముతో మిళితమైనంతనే జగద్భ్రాంతి పోయి కేవలము బ్రహ్మ సత్తయే భాసించును, బ్రహ్మమన్న సంగతి తెలియనంత వరకును జగత్తు భాసించును. అది తెలియబడగానే జగద్భ్రాంతి పోయి కేవలము శుద్ధ బ్రహ్మసత్తయే భాసించును.ఈ జీవునకు దృశ్య రూపమయిన వ్యాధి తగులుకొన్నది. దానికి మందు జ్ఞాన మొక్కటియే. ఎంతవరకు చిత్తము బహిర్ముఖమై దృశ్యమును చూచుచుండునో అంతవరకు శాంతికలుగదు. చిత్తము అన్ని వాసనలను విడుచుకొని తన స్వరూపమునందున్నదై అనగా ఏవికారములు లేనిదై అంతర్ముఖమగునప్పుడు తత్కాలమందే మోక్షరూపమైన శాంతి కలుగును. ఇందులో సందేహమెంత మాత్రమును లేదు. జగత్తు ఆత్మ తాలూకు నివృత్తి (లేనిది) స్వరూపము. చిత్తము బహిర్ముఖమై చూచినచో జగత్తుగా భాసించును. అంతర్ముఖమై చూచినచో జగద్భ్రమపోయి ఆత్మయే భాసించును. కావున పుట్టిన కోరికలన్నింటిని విడుచుకొని నిష్కాముడవై ఆత్మపదమునందు విశ్రమింపుము.

దేహమునందు ఆత్మాభిమానముంచుకొనవలదు. చిత్తమునందు కలుగు కోరికలను విడుచుకొనుము. అట్టి నిశ్చయము వలన ముక్తిలభించును. ఆత్మ గోచరము కాకుండటకు కోరికలున్నంత వరకు మీకు ఆత్మ భాసింపదు. కావున. సంపూర్ణమైన దృశ్యమునందు యిచ్ఛను విడుచుకొందురేని ఆత్మ మీకు కరతలామలకమగును. అనగా ప్రత్యక్షమగును. అపుడు జగత్తంతయు ఆత్మరూపముగనే భాసించును.ఆత్మతత్వము తెలియకపోవుటకే బంధమని పేరు. దానిని తెలియుటకే మోక్షమని పేరు.

మనుజుడు తానొక పనిని చేయగూడదనుకొనినను, తన స్వాభావిక కర్మ ప్రభావముచే నద్దానిని చేసియే తీరునని వచించుచున్నారు.

స్వభావము: పూర్వజన్మ సంస్కారము ప్రకృతిసిద్ధము.

ఏకమును, అద్వితీయమును అగు బ్రహ్మమే "నేను" అను విషయమున సందియము లేదు, నేను సంపూర్ణ ఆరోగ్యమును నేనే ఆరోగ్యమును, పూర్ణమైన ఆరోగ్యంనాదే అని సంభావించు. శరీరం దానంతట అదే వెంటనే ఆరోగ్యం పొందుతుంది. ఇదీ రహస్యం. ప్రయత్నించి చూడు నిజమో, అబద్ధమో నీకే తెలుస్తుంది. నిన్ను నీవు మరువు, శరీరం స్వస్థతపడుతుంది.

ఊర్ధ్వ, అధో, మధ్యలోకములందు బహువిధ జన్మములను గలిగించునది గావున యీ మనస్సుకు సంసారము (త్రిప్పునది) అవిపేరు. స్వస్వరూపమును ఎఱుగనీక అసత్యపదార్థములను ఆత్మగ జేయునది కావున దీనికి మోహమని పేరు "ఉన్నది" అనిగాని,"లేదు" అనిగాని నిరూపించుటకు వీలులేనిదగుటచే దీనికి మాయ యను నామధేయము వచ్చెను, దేని తోడను సంబంధములేక, దేనికిని బద్ధుడు గాకయుండు ఆత్మునకు రాగ ద్వేషాది బంధములు కల్పించునది యగుటచే దీనికి బంధమనియు పేరు. మరియు సర్వకర్మలకు కారణమగుటచేత "మల" మనియు, అంధకారము వలె తత్త్వమును ఆవరించుట చేత తమస్సనియు దీనికి పేరు.

ఏపురుషుడు మృతి చెందవలయునో, వాని కర్మములే వానిని సంహరించును. ఇంతకంటె యితరమేదియును లేదు. ఒక్కొక్క జీవుడు వ్యష్టి జీవుడు. సర్వజీవులును ఏకముగ వ్యవహరింప బడినప్పుడు నాతడు సమిష్టి జీవుడని ఆసమష్టి జీవునకే హిరణ్యగర్భుడని పేరు. వ్యష్టి జీవునకు జనన మరణములున్నవిగాని: సమిష్టి జీవునకు జనన మరణములును, సర్వావయములును ఉన్నట్లు తోచినను ఏవియు లేవు, ఈ విధముగా హిరణ్యగర్భుడు పరాకాశరూపుడై, నిర్వికారుడై, బ్రహ్మమై, మనోమయ రూపుడగు సూక్ష్మశరీరము మాత్రమే గలవాడు . కావున, అజ్ఞానబలముచే భ్రాంతినొంది, మనస్సు పూర్వ కల్పానుసారముగ ప్రస్తుత ప్రపంచమును సంకల్పించుచున్నది.

తిమిర రోగముకల కన్ను ఒక సూర్యబింబమును రెంటినిగా జూచునట్లు, బ్రహ్మ, ప్రపంచములను భిన్నముగ జూచుచున్నది. కావున ఎప్పుడు ఏదేది కనబడుచున్నదో ఆ పదార్థమంతయు మనోమయమేగాని యదార్థము కాదని గ్రహించవలెను. మనస్సు సర్వవ్యాపకమై యున్నది.

ఎదుటనున్న పదార్థమునుగాని, దూరముననున్న పదార్థమును గూర్చిగాని జనించునట్టి "ఇది ఘటము"," ఇది స్వరము" అను మొదలగు ప్రతిభా జ్ఞానము లేక సంకల్పము ఏది ప్రసిద్ధమైయున్నదో అదియే "మనస్స"ని తెలిసికొనుము. నిర్వికారుడై, నిరాకారుడై,పరబ్రహ్మము ఏక స్వరూపముతో నుండగ, ఆయన యందు "ఇది ఘటము" "ఇది గోడ" అని నామరూపాత్మకములగు ఏపదార్థములు రజ్జు, సర్పము, శుక్తి , రౌప్యము మొదలగు వాని వలె. తోచుటయే "మనస్స"ని చెప్పబడును. ఇంతకంటెను యితరము మనశ్శబ్దము చేత చెప్పదగిన వస్తు వెద్దియును, లేదు ఈ మనస్సునకు సంకల్పమే అనగా నిరాకార బ్రహ్మమునందు ఇది ప్రపంచము. అని కల్పించుటయే స్వరూపము. ఎన్నటికిని సంకల్ప మనస్సులకు భేదము లేక రెండును సర్వ వ్యాపకమైయున్నవి.

అవిద్య, సంసారము, మోహము, బంధము, మాయ, తమస్సు అనునవి యన్నియు యీ సంకల్ప సమూహము యొక్క పేరులే. ఈ కారణము వలన, యీ ప్రపంచమంతయు సంకల్ప మాత్రము, దీనికి బ్రహ్మభిన్నమగు రూపము లేదు - అను యదార్థ జ్ఞానము

కలుగుట వలన యీ దృశ్యమంతయుశూన్య రూపమై పోవగా ఆపరమాత్మ యొక్క శుద్ధ స్వరూపము అట్లే ప్రకాశించును. ఇది ప్రపంచము. బ్రహ్మమునందు కల్పింపబడుట చేత, ఆ బ్రహ్మముకంటె భిన్నము కాదు - అని యెఱింగినచో సర్వకాలముల యందును బ్రహ్మరూపమే ప్రకాశించును.

జీవన్ముక్తి, విదేహముక్తు లొక్కటియే, ప్రపంచము కానవచ్చుట, కానరాకుండుట అనునదియే కదా. యీ రెంటికిని గల భేదము!

ఎవడు లోకముల వలన భయమునొందడో, ఎవని చిత్తమునకు ఎప్పుడు ను సంతోషము, క్రోధము, భయము, బెదురు అనునవి కలుగవో అట్టివాడును, ఎవనికి సంసార సంక్షోభము లేదో, నీవు -నేను అను విభాగమున్నను ఎవని యందు లెనిదేయగునో, సంకల్పములు కలిగియుండియు, నెవడు నిస్సంకల్పుడగునో అనగా వ్యవహారస్థితిలో సర్వమున్నను పరమార్థ విజ్ఞాన సామర్థ్యము వలన నెవనికి వానితో సంబంధము లేదో, అట్టివాడే జీవన్ముక్తుడు. ఎవడు సమస్త వ్యవహారములను ఆచరించుచున్నను సర్వ పరిపూర్ణుడై యున్నాడో అట్టివాడు జీవన్ముక్తుడు. ఇట్టి జీవన్ముక్తి స్థితిని జెందిన పురుషుడు ప్రారబ్ధ కర్మాధీనమగు తన శరీరము కాలాను సారముగ నశింపగనే తాటిచెట్టుయొక్క ఆకులు (విసనకఱ్ఱ) మొదలగు వానిచేత జనింపబడుచున్న గాలి ఆ తాటిచెట్టు యొక్క ఆకులు (లేక విసనకఱ్ఱ) నశింపగనే నిశ్చలత్వము నొందినట్లు నిశ్చలత్వము నొందును. ఇదే విదేహముక్తి:- ఈ విదేహముక్తుడు కేవలము బ్రహ్మయే.!

ప్రస్తుతము స్థావరములై యున్న పర్వత వృక్షాదులు జ్ఞాన మయములై మనోబుద్ధ్యాదులు లేనివై యుండెనేని అప్పుడు వాని రూపమును బ్రహ్మరూపమునకు బోల్చవచ్చును. సర్వ కాలములయందును ఆ పరబ్రహ్మమునే ధ్యానించుచుండుట, ఆ పరబ్రహ్మముయొక్క స్వరూపమును గూర్చియే మాటలాడుచుండుట, మిత్రులతో జేరినప్పుడు ఒకరికొకరు ఆ పరబ్రహ్మమునే బోధించుకొనుచుండుట, సర్వకాలములయందును మనస్సును ఆ పరబ్రహ్మము నందే చేర్చియుండుట అనునవియే బ్రహ్మభ్యాసమని పెద్దలు చెప్పుదురు,

మిక్కిలి గొప్పదనము, రమ్యత్వము గలిగి దుఃఖస్పర్శ యించుకైనను లేక ఏమహాత్ముల యొక్క మనస్సు సర్వకాలముల యందును ఆనందమును వర్షించుచుండునో అట్టివారికి అభ్యాసస్థితి కలిగెనని ఊహించవలెను,

ఇది - యీ ప్రపంచము, యిది-నేను, అను భేద రూపమగు దృశ్యము సృష్టియే కాలేదు. కావుననిది ఎప్పటికిని లేదు. కేవలము భ్రాంతి చేత ఉన్నట్లు మాత్రమే తోచుచున్నది- అను దృఢజ్ఞానము అలవాటు సేయుటయే బ్రహ్మ భ్యాసము లేక జ్ఞానాభ్యాసము. మఱియు దృశ్యముండుటకే వీలులేదని తెలిసికొనుటచేత యీ దృశ్యపదార్థ సంబంధములగురాగద్వేషములు కేవలము భ్రాంతి సిద్ధములే కదా! "ఈ కారణము వలన యీ రాగద్వేషములను నశింప జేయవలయును" అను నిచ్ఛ బలవంతముగ గలుగును. ఇదియే (ఇట్టి దృఢవైరాగ్యమే) బ్రహ్మ భ్యాసము.

జ్ఞాన మనినను, జ్ఞేయమనినను దృశ్యపదార్థము బొత్తిగ లేదు-అని తెలిసికొనుటయే "బ్రహ్మ స్వరూపము". ఈ తెలివిచేతనే స్పష్టమగును గావున దానికి జ్ఞానమని పేరు. జ్ఞాన స్వరూపుడు బ్రహ్మమే కావున జ్ఞేయమనియు, (తెలిసికొనదగిన పదార్థము - బ్రహ్మ వస్తువు అనియు) దీనికి పేరు. ఈ బ్రహ్మభ్యాసమే (దృశ్యము లేదనుటయే బ్రహ్మభ్యాసమని చెప్పియున్నారు )- మహాసమృద్ధి; యింతకంటె శ్రేష్ఠమగునది ప్రపంచమున నెద్దియునులేదు. బ్రహ్మభ్యాస మెంత దృఢమైనను జ్ఞానికి గూడ భ్రాంతి మయమైన ప్రపంచము (బ్రహ్మాండములు) ప్రపంచముండుటచేత ఛాయా మాత్రముగ కనబడవచ్చును. వారివారి సంకల్పమే వారివారికి

సర్వఫలములను సంపాదించును"ఇదియే" దేవతానుగ్రహమునకు స్వరూపము.

మనస్సు అనగా సంకల్పములు నశించెనేని స్వతస్సిద్ధమగు ముక్తియే. నిర్వికల్ప స్థితియే మిగులును. కావున సత్యమునకు మనోజయమే మూలము . దానికి బ్రహ్మవిచారమే ముఖ్యోపాయము. ఇంతకంటే నిర్వికల్ప స్థితికి వేఱొక సాధనము ఏమియు నక్కరలేదు.

మనస్సు స్వయముగా శూన్యరూపమైయుండదానికి యిట్టి సామర్థ్యము కలదా? దానియొక్క విజృంభణము వలన నిర్వికారుడు కూడ బద్ధుడైనట్లు తోచునా? అని యెదవేమో! దానియొక్క విజృంభణము వలన తప్పక అటులనే తోచును.! మనస్సు యొక్క సామర్థ్యము యింతయని వర్ణింపనలవి కాదు.! ఇదియు మననశక్తియుక్తుడైన పరబ్రహ్మమే కదా!! సర్వశక్తుడైన బ్రహ్మమునకు అట్టిశక్తి, యుండుననుటలో సంశయమేమి? అది విజృంభింప నారంభించిన నూరు యోజనములైనను ఒక్క గోష్పాదమగును. ఒక్క గోష్పాదము కూడ అనేక సహస్ర యోజనములై పరిణమించును. ఒక బ్రహ్మకల్పము క్షణమగును. క్షణము అనేక బ్రహ్మ కల్పములగును.

"సర్వ సామర్థ్యములును కలిగి సర్వ పరిపూర్ణమై నాశరహితమై యున్న పరబ్రహ్మము ఏదికలదో అదియే మనస్సు", దానికంటె భిన్నమై మనస్సను ఒక పదార్థము లేదు. ఆ పరబ్రహ్మమునందు లేనిశక్తులు ఎచ్చటను లేవు.

జ్ఞానశక్తిచే ప్రకాశించు దేహమునకు బ్రహ్మమనియు, చలనశక్తితో ప్రకాశించునప్పుడు వాయువునకు బ్రహ్మమనియు, గట్టిగనుండుట అను శక్తితో ప్రకాశించునప్పుడు ఆ బ్రహ్మమునే ఱాయి యనుచున్నాము. నీటియందుగల తడి లేక పలుచన, అగ్నియందుగల దాహకశక్తిని , ఆకాశమందు గల శూన్యశక్తిని , నశించు పదార్థముల యందెల్ల ' నశించుట' 'యీ సర్వశక్తులును పరబహ్మమునందే గలవు.

మననశక్తితో ప్రకాశించు బ్రహ్మమే మనస్సగును. సృష్ట్యాదులన్నింటికంటె మొట్టమొదట మనస్సు , తరువాత వాసనారూపమగు బంధము, దానికి వ్యతిరిక్తమగు మోక్షము అనగా వాసన గూర్చిన సంకల్పము, సర్వము సంకల్పమయమే కదా! పిమ్మట ప్రపంచము, భోగముల యందు యిచ్ఛ జనించును. కాని యదార్థములు (బ్రహ్మభిన్నములుగ) కానేరవు. పండితుని బుద్ధికి ఎప్పటికి ని తత్త్వవిచారమే స్వభావము. సంసారమనగా మనస్సుయొక్క రూపాంతరము.త్రాటిని చూచి పామనినట్లు మనస్సునే జూచి సంసారమని తలంచుచున్నాము. సర్వశక్తులుగల ఆ పరబ్రహ్మము యొక్క మనన శక్తితో కూడిన రూపమైన మనస్సేగదా యీ ప్రపంచము! మనస్సు దేనిని చేయునో అదే పని.ఇంతియేగాని శరీరముతో అగునట్టి కార్యమేదియు లేదు. శరీరముతో చేసెనేని ఏపనియు పనియే కానేరదు.

ఎవని మనస్సు సంకల్పములను విడిచినిశ్చలమగునో, వానికి పరబ్రహ్మ ధ్యానమును, ఆధ్యానము వలన ఉత్తమ పదప్రాప్తియు దొరుకును. మనస్సు నియమింపబడునేని యీ సంసార భ్రాంతి యంతయు శాంతినొందును.

మనోజయమునుగోరు పురుషుడు మొట్టమొదట బాహ్య విషయములను పరిత్యజింపవలయును. ఎట్లనిన తనకు ఏయే పదార్థములయందు యిష్టముండునో వానినే బలాత్కారముగ విడిచిపెట్ట వలయును. ఇట్లు చేసిన మనస్సు స్వాధీనమగును, దీనిని ఎప్పుడు కష్టమని తలంచునో, ఛీ, వాడు నేలను పొరాడు పురుగగును గాని పురుషుడు అగునా? కాదు.

సంకల్పనాశమే మనస్సును ఛేదించుటకు ప్రబలమగు ఆయుధము. ఎట్టి అభివృద్ధి కావలయునన్నను ఏమాత్రమును కూడ జంక కూడదు. సంశయము ఏమియును

లేకుండా, విడువక ప్రయత్నించినచో మనోజయము సులభముగనే సిద్ధించును.

నీ మనస్సును జయించుటకు గల శక్తులలో సంతోషశక్తి ఒక్కటియే చాలును అటులయుండియు నీవు అశక్తునివలె మనస్సునకు లోబడనేటికి? సంతోషశక్తి యుక్తమగు దృష్టిచేత (నేను పరమానంద రూపుడను, లోకమునందు. రమ్యములుగా దోచు పదార్థములన్నియు నా సంబంధము వలననే అటుల తోచుచున్నది.కాని వాస్తవ స్థితిలో దేనికిని ఆనందరూపత్వము స్వభావము కాదుఅని తెలిసికొనుట చేత యించుక వీక్షించితివేని యా మనస్సు మరల తలజూపదు. సమచిత్తత్వము (భేద భావము నశించుట) ప్రకాశించిన సర్వమును బ్రహ్మమేఅగును. మనస్సునందు ఏది తలంపునకు వచ్చునో, దాని దానికి అభ్యాస వైరాగ్యముల చేత విడచుటయే మనోనాశము. ఇదియే అవిద్యా నాశము. దీని వలన మోక్ష సిద్ధి కలుగును. "ఆశ లేకుండుటయే మోక్షము" ఆశకలిగియుండుటయే బంధము. ఆశా జయమును గూర్చి ప్రయత్నించినచో ఒక నిమిషమున పరబ్రహ్మ ప్రాప్తి కలుగును. ఆ బ్రహ్మను చలనశక్తితో ప్రకాశించునప్పుడు మనస్సని పిలువబడుచు ఉన్నాడు "ఇది బ్రహ్మము బ్రహ్మమునకును నాకును భేదము లేదు" అని తెలిసికొనుటయే జ్ఞానమనబడును' 'జ్ఞానమునకు భూమికలు (మెట్లు) ఏడు: 1. శుభేచ్ఛ 2. విచారణ 3. తను మానస 4.సత్త్వాపత్తి 5. అసంసక్తి 6.పదార్థాభావన 7. తుర్యగ,

1.శుభేచ్ఛ:- శుభమనగా మోక్షము. దానియందలి యిచ్ఛ శుభేచ్ఛ.

2. విచారణ:- వైరాగ్యవంతుడై సత్పురుషులను జేరి, శాస్త్రములను విమర్శించుచు సదాచారయుక్తుడగుచు ముక్తిని సంపాదించు ప్రయత్నము నందుండుట ఏదికలదో అదియే విచారణ.

3. తనుమానస:- శబ్దాది విషయములందు వైరాగ్యము కలుగుట, వాని వలన వాసనలు సన్నగిల్లుట. వాసనలే మనస్సగుట చేత దీనకి తనుమానస అనిపేరు.

4. సత్త్వాపత్తి:- పదార్థములందు మనస్సు సన్నగిల్లి పరబ్రహ్మము నందే నిలిచి ఉండుట. నిర్వికల్ప సమాధి అనికూడ పేరు. సత్త్వమనగా ఉనికియే స్వరూపముగా గల పరబ్రహ్మము. దానిని సమాధినిష్ఠచే పొందుట సత్త్వాపత్తి (బ్రహ్మవిదుడు).

5. అసంసక్తి :- దృఢమగు సమాధి నిష్ఠచేతను, బ్రహ్మసాక్షాత్కారము మఱింత దృఢమగును. పరులు ప్రేరేపించినగాని కదలకుండునంత స్థితి వచ్చును. దేనితోను సంబంధింపని స్థితి.

6. పదార్థభావన:- (బ్రహ్మ వ్యతిరిక్త పదార్థములను భావింపకుండుట). చిత్తము పరులు ఎంతయో ప్రయత్నించినను ఎప్పటికో సమాధినుండి మరలును. బ్రహ్మమే తానగును. రెండవ పదార్థమే తోచదు.

7. తుర్యము:- తుర్యమనగా నాలుగవది. (అనగా బ్రహ్మవిదుడు మొదలగు బ్రహ్మవేత్తలలో నాలుగవవాడు.) కావున వీనికిగల అవస్థగ తుర్యము అగును. ఇది అవస్థాత్రయమును (మోహాత్మకములైన) అతిక్రమించిన అవస్థ. మఱియు, విశ్వ, తైజస, ప్రాజ్ఞులను మువ్వురు జీవులకంటెను విరాట్పురుషుడు, హిరణ్యగర్భుడు అంతర్యాముల కంటెను, వేఱై నాలుగవదియగు బ్రహ్మమునకు సంబంధించినది. కావున తుర్యగయగును. దీనిని ఆశ్రయించినవాడు పరులు ఎంత ప్రయత్నము చేసినను మేలుకొనడు, వానికి భేదమనునది ఎప్పటికిని తోచదు. వీడే బ్రహ్మవిద్వరిష్ఠు డనబడును. ముక్తి, దీనికంటె యితరముగ లేదు. ఈ అవస్థ తుర్యగ అనుపేర జీవన్ముక్తులయందు గానవచ్చుచున్నది. ఇంతకంటె అధికమై తుర్యాతీతమను ఒక అవస్థ కలదుగాని, అది విదేహముక్తులకు కలుగ వలసినదియే. కావున జీవన్ముక్తులు యథేచ్ఛముగ వ్యవహారమును ఆచరింపవచ్చును. పూర్వజన్మ సిద్ధి కలిగినచో అప్రయత్నముగనే యీ భూమికలను పొందుదురు. వారు తక్షణమే ముక్తులగుదురు.

"అహంకారము మోక్షము కలుగ కుండుటకు కారణమగు పెద్దముడి". జ్ఞానమనగా ఆముడిని ఛేదించుటయే.

## బ్రహ్మస్వరూపము

ఆ మహాత్ముడు (పరబ్రహ్మము) మన అనుభవములోనున్న సుఖమునకంటె అధికమగు సుఖమే స్వరూపముగా గలవాడు. మఱియును ఆ బ్రహ్మమును తెలిసికొనువాడు ఎవ్వడును లేడు. ఆయన తనంతతానే తెలిసికొనవలయును. మనస్సు సంకల్పమును పరిత్యజింపగానే స్వరూపము స్వస్వరూపముగానే నిలచును. వాస్తవస్థితిలో పరబ్రహ్మ విషయమునందు జ్ఞానమనునదియే సంభవింపదు. సర్వసాక్షియగు వానిని తెలిసికొను వాడెవ్వడు? ఆబ్రహ్మము సర్వవ్యాపకుడు కావున రెండవ వస్తువు ఏమియు ఉండుటకు వీలులేదు.

దృఢమగు పురుషప్రయత్నముతో మనస్సును అంతర్ముఖము చేసి, అభీష్టవస్తు పరిత్యాగ పూర్వకముగ సంకల్పముల నణచుటయే చేయదగిన పని. సర్వమును దీనివలననే సిద్ధించును.

**తత్త్వోపదేశము:-**

మనస్సును సంపూర్ణముగా వదలివేయుము. సంకల్పములను పూర్తిగా పరిత్యజించుము. చిత్త నిగ్రహ రూపమగు పరమయోగమును ఆశ్రయించి నిశ్చలుడవు కమ్ము. మనో వృత్తులయందు ప్రతిబింబించియుండు ఆత్మనే లోకమునందు భ్రాంతి చేత ఆత్మ భిన్నునిగా దలంచి "జ్ఞాన" శబ్దము చేత వ్యవహరించుట మాత్రమేగాని ఆత్మ భిన్నమై జ్ఞానమనునది ఒకటి ఎప్పటికిని లేదు. ఇదియునుగాక యీ జ్ఞానము కూడ ఒక చేతనమే అగుట చేత ఎట్లును బ్రహ్మ భిన్నము కానేరదు.

బ్రహ్మమును తెలిసికొనుట అనునది ఎప్పటికిని సంభవింపదు. ఆయన స్వయముగ ప్రకాశింపవలసిన వాడే . సర్వ ప్రపంచోత్పత్తికిని కారణములగు సంకల్పములే భేదభ్రాంతిని కలిగించి, బ్రహ్మమును తనకంటె అన్యునిగాను, ప్రకాశ శూన్యునిగాను చేసినవి. కావున. పురుష ప్రయత్నము చేత మనస్సును అంతర్ముఖము చేయుము. సర్వమును తనంతతానే సంభవించును. జీవన్ముక్తి కలుగును.

మనస్సు అన్యశరీరమును అభిమానించుటయే మరణము. ఎవరు అమనస్కస్థితిని జెందెదరో వారే శాశ్వత సుఖమును చెందినవారు. వారే బుద్ధిమంతులు. వారే జ్ఞానవంతులు జంతువులను ఉద్ధరించుటకు ఆయన మనస్థితి కంటె ఉత్తమమగు గతి వేఱొకటి లేదు.

**సమాధి లక్షణము:-**

శాంతి గలిగినట్టియు , ఎప్పుడును, తృప్తి నొంది యున్నట్టిదియు, యదార్థమగు పరబ్రహ్మమును ప్రపంచ రూపముగ చూచునట్టిదియునగు ప్రరబ్రహ్మమునుదివ్యమైనదిగ చూచు దివ్యజ్ఞానము ఏదికలదో అదియే సమాధి.

జ్ఞానవంతుని మనస్సు (మహాత్ముని) దృఢమగు బ్రహ్మజ్ఞానము కలిగి శాంతమై సర్వ ప్రపంచమును ఆత్మమాత్రముగ భావింపుచుండును.

చిత్త సత్త యనగా కేవలము మూఢ స్థితి, అది నశించుట యనగా సత్త్వగుణావిర్భావము.

ఇచ్చటి దేహము యిచ్చట నుండగానే మఱియొక స్థూలదేహముతో మరియొక స్థలమునందు కొన్ని కొన్ని వ్యవహారములను గావించిన యట్లు, స్వప్నములు సామాన్యముగ

నందఱును కనుచునే యున్నారు కదా! అప్పటి దేహమే శుక్ల శోణిత పరిణామము వలన వచ్చినది. కావున దేహము సంకల్పమాత్ర జన్యమే. మనో వృక్షములకు బీజములు రెండు కలవు. ప్రాణచలనము మొదటి బీజము. సంసారము రెండవ బీజము. ప్రాణము సర్వనాడులను సృజించుచు ఎప్పుడు కదలునో అప్పుడు సంకల్ప రూపమగు చిత్తము ఉదయించును. ఈ సంకల్పమునకు కూడ జ్ఞానమే స్వరూపము. జ్ఞానమే పరమాత్మ. ఆయన సర్వవ్యాపకుడై నిశ్చలుడై యున్నాడు. తాను చలించి, ఆత్మ చలించునట్లు తోపించును. అట్లు చాంచల్యముతో గానవచ్చు ఆత్మయే మనస్సు, ఆ మనస్సు వలననే సర్వము కలుగును. కావున ఆత్మయొక్క చాంచల్యమును నిరోధించుటయే అనగా మనస్సును నిగ్రహించుటయే మోక్షము. ప్రాణనిరోధమే సర్వకార్య సాధనము. అది చిత్త శాంతిని కలిగించును. సమత్వము జెందించును. ఆత్మకు సౌఖ్యము కలిగించును, కేవలము అనాది నుండియు, ఏక రూపముతో భాసించుచుండుటను మాత్రమే ఆధారము చేసికొని, ముందు వెనుక విచారింపక ఏదియైన ఒక పదార్థమును "ఇది సత్యము, ఇది అసత్యము" అని గ్రహించుట ఏది కలదో అదియే వాసన అనబడును.

భగవద్ధర్మనమైనను, తత్త్వజ్ఞాన నిర్ణయముకానంతవరకు, భ్రమ అట్లేయుండును.
సూక్ష్మశరీరము= లింగశరీరము= అంతఃకరణము =బుద్ధి
జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ మనోబుద్ధులు అన్నియు, కామమునకు [illegible] వలన వీనితో గూడుకొని యుండును. ఈ కామము జ్ఞానమును ఆవరించుకొని జీవుని మోహింపజేయుచున్నది.



<u>జీవనసమాధులలో లీనమైన మహానుభావులు:-</u>

వీరు ఒకటి లేక రెండు వందల సంవత్సరముల లోపువారు.
1. ప్రొద్దుటూరులో చేరిన రామేశ్వరంలోని మునుస్వామివారు. 2. ప్రొద్దుటూరులో [illegible] ప్రక్కన చాహసేన్ సాహెబు. 3. మైదుకూరు కడ లింగాలదిన్నె గ్రామంలో [illegible] స్వామి వారు. 4. పలుగురాళ్లపల్లెలో గోవిందయ్యగారు 5. కందిమల్లాయ పల్లెలో పోతులూరి వీరబ్రహ్మంగారు 6. ముడిమాల గ్రామంలో వీరబ్రహ్మం శిష్యుడు దూదేకుల సిద్ధయ్యగారు. 7. ఆళ్లగడ్డ వద్దగల లింగంపల్లెలో ధరణి సీతారామస్వామి గారు 8. ప్రొద్దుటూరు వద్దగల శంకరాపురంలో అవధూతస్వామివారు.

శరీరత్రయము:- చేతులు, కాళ్లు మొదలైన అవయవములకు చెందిన స్థూల శరీరము పదునేడు (17) విధములైన కర్మ, జ్ఞాన, ఇంద్రియములు, ప్రాణపంచకము మనోబుద్ధులతోడి భావముల వలన ఏర్పడుచున్నది. స్థూల, సూక్ష్మ శరీరాల కార్యములకు, కారణభూతమైన తత్త్వానికి కారణ శరీరము (అజ్ఞానము) అందురు.

### ఓం ఓం ఓం : జ్ఞానవివరణము:

<u>ప్రజ్ఞానము:</u> అంతః కరణమునుగాని, దానివృత్తులను గాని యంటకవాని నన్నిటిని ప్రకాశింపజేసెడి సాక్షియగు "చిదాత్మ" "ప్రజ్ఞానము" అనబడును. అంతః కరణరూపమగు ఉపాధియందున్న "ప్రజ్ఞానము" చిదాత్మ యొక్కస్వరూపము, చేతన భాగమగు నంతః కరణవృత్తితో గూడిన చైతన్యము "సంజ్ఞానము" అనబడును,. గ్రంథధారణా శక్తిగలయంతఃకరణ వృత్తితో గూడిన చైతన్యము "మేధా" యనబడును. దేహేంద్రియములను దరించెడి వృత్తితో గూడిన చైతన్యము "ధృతి" "యనబడును. మననవృత్తితో గూడిన చైతన్యము "మతి" యనబడును. మననము చేయుటయందుగల స్వాతంత్ర్య రూపముగు వృత్తితో గూడిన చైతన్యము "మనీషా" యనబడును. దుఃఖరూపమగువృత్తితో గూడిన చైతన్యము "జూతి"

యనబడును. స్మరణవృత్తితో గూడిన చైతన్యము "స్మృతి" యనబడును. రూపాదులయందు శుక్ల , కృష్ణాది భావరూపమగు వృత్తితో గూడిన చైతన్యము "సంకల్పము" అనబడును. అధ్యవసాయ, వృత్తితో గూడిన చైతన్యము 'క్రతువు" అనబడును. శ్వాసోచ్ఛ్వాసరూపమగు వృత్తితో గూడిన చైతన్యము "అసువు" అనబడును.

ఉపాధుల దృష్టిని విడిచి చూచినచో శుద్ధ చైతన్యము ప్రతి జీవునియందున్న "ప్రజ్ఞానము"న కంటె భిన్నముకాదు. కావున ప్రజ్ఞాన స్వరూపమగు ప్రత్యగాత్మయే "బ్రహ్మము" అగును క్షుద్రములగుక్రిమికీటకాదులు మొదలు మనుష్యులవరకు గలసర్వప్రాణులును "బ్రహ్మమే" అగును. కనిపించెడి కార్యకారణములన్నియును "బ్రహ్మస్వరూపమే యగును"ప్రజ్ఞానము జీవులయంతః కరణములతో సంబంధపడి సర్వము నెఱుంగుటచే, నాయంతఃకరణముతో కూడిన చైతన్యము"ప్రజ్ఞానేత్రము" అనబడును, అదేసర్వజగత్కారణమగు మాయతో గూడి సర్వము నెఱింగెడి చైతన్యము కూడ "ప్రజ్ఞానేత్రము" యనబడును. అంతఃకరణమును విడిచినచో ప్రజ్ఞానము బ్రహ్మ స్వరూపమేయగును. ప్రత్యగాత్మ బ్రహ్మరూపముకంటే వేరు కాదు. సర్వోపాధులను విచారించి "ఇది బ్రహ్మము కాదు. ఇది బ్రహ్మముకాదు" అని త్రోసివేయగా, నద్వితీయమగు బ్రహ్మమొక్కటి మాత్రమే శేషించియుండును. అ బ్రహ్మము శాబ్దిక జ్ఞానమునకు విషయము కాదు. సర్వేజనా స్సుఖినో భవంతు.

నీవు ఏ సంకల్పమునుచేయకుము. ఏ పదార్థమును కలదని తలంపకుము. ఈకార్యమును మాత్రము ఆచరింతువేని నీకు పరమాభివృద్ధి కలుగును, ఎట్లు కావలయునో అట్లు అగుదువు, ఎవ్వని రూపమును జెందవలయునో వాని రూపమును జెందెదవు. సాధకుడగు వాడు ఏమియునుజేయక, దేనిని గుఱించియు. విచారింపక ఊరకయుండిన చాలును. ఆ సంకల్పము తనంతట తానే నశించును. తలంపులు లేకుండుట యనగా ఊరకకూర్చుండుటయే కదా! ఇదియే వేదాంత సర్వస్వమని తలంపుము, ప్రపంచమంతయు యింతియేయని తలంపుము. పిమ్మట యీ వాసనా పరిత్యాగమును, ఏ ప్రయత్నము చేత ఆచరించితివో ఆ ప్రయత్నమును వదలుము. ఆ కారణమును పరిత్యజింపుము. ఈ విధముగా మనస్సుకు శుద్ధి కలుగునేని అతనికి కర్మ పరిత్యాగముతో పనిలేదు. సర్వ సంకల్ప పరిత్యాగమైన మౌనమునకంటెను ఉత్తమమగు జ్ఞానము మఱియొకటి లేదు. ఎవనికి ఉత్తర జన్మము [illegible] అట్టి వానికి గాని యీ వివేకము ఉదయించదు. అన్ని కార్యములను ఆచరించుచున్నను మనస్సుచేత వానినెల్లను విడిచియుండుట జీవన్ముక్తి.

<u>ముక్తి మార్గములు రెండు:-</u> గురువు నాశ్రయించి, చెప్పినట్లు ఆచరించుట వలన ఒక జన్మకుగాని పెక్కు జన్మలకుగాని ముక్తి సిద్ధిని జెందుట మొదటి మార్గము. కొందఱు దీనిని అశ్రయించి క్రమక్రమముగ బహుకాలమునకు జ్ఞానవంతులై ముక్తిని జెందుదురు. ఇట్లుగాక ఆకాశమునుండి ఆకస్మికముగ పడిన ఫలమువలె కొంచెము జ్ఞానముగల మనస్సునందు విచారవశమున బ్రహ్మజ్ఞానము అకస్మికముగ ఉదయించుట గలదు. ఇదియే రెండవ మార్గము.

చూచినప్పటి ఆనందము, గ్రహించినప్పటి జ్ఞానము, వాయువు, ఆకాశముల వలన గలిగిన ఉనికి (సత్తలు) అనగా ఆనంద, జ్ఞాన, సత్తలు, జీవుడగుటయే బ్రహ్మము. ఈ మూటి సముదాయమే బ్రహ్మము.

కలదక కూర్చుండుట, హస్తములను కదలింపక ఊరకుండుట, కన్నులను మూసికొనుట,కర్ణములను మూసికొనుట మొదలగునవి చేసిన మనస్సు నశించును.

ప్రత్యగాత్మ: మనస్సులేక, అనగా సంకల్ప రూప వ్యాపారములు లేక కేవలమైయుండు

చేతనము ఏది కలదో అదియే ప్రత్యగాత్మ అనబడును. దృశ్యములంతయు లేక ముఖ్యవిషయము బాగుగ అభ్యసింపబడుట వలన మోక్షరూప స్థానము దొరకును!

సూక్ష్మమగు బుద్ధికి (జ్ఞానవంతమై, చురుకుగలదియై, పరిశుద్ధమైయున్న బుద్ధికి) వైరాగ్యాదులగు యితర సామాగ్రులు లేకపోయినను ముక్తి కలుగును.

బ్రహ్మజ్ఞాని , దృశ్యములతో నాకు సంబంధము లేదు. అని నిశ్చయించుకొనియే యుండును. పరమార్థ స్థితిలో మౌనమే మహోపదేశము, నీవు చేయవలసినది ఆత్మవిచారమే (నేనెవ్వడను?) ఈ ప్రపంచమేది? ఉత్పత్తి, వినాశము లెట్లు కలుగును?) ఆత్మరూపము ఏకమగుటచేత అది ప్రకాశించుకొలది ప్రపంచము తనంతనే అణగిపోవును. ఈ ప్రపంచమంతయు విడువబడిననే గాని ఆత్మరూపము ప్రకాశింపదు. సర్వపదార్థములను నిషేధింపగా అంతమునందు మిగులువాడే ఆత్మయని సర్వవేదాంత సిద్ధాంతము.

## 4. యోగ వాసిష్టము:-

మనస్సు జాగ్రత్స్వప్నముల నుండి విడివడిన మహాచైతన్యమే సుషుప్తి దశ యందుండునో చరాచర విశ్వము లయమైనట్టి స్థితి యందు పరమాత్మ యండును. ఈ జగత్తు అజ్ఞాన దృష్టియందు స్థూలమైనను గవాక్ష క్షిద్రము ద్వారా పడు సూర్య కిరణముల ప్రకాశించు పరిమాణు సమూహమువలె సూక్ష్మమై జ్ఞాని యొక్క దృష్టి కగుపించుచున్నది. సూర్య కిరణ సహాయము లేకున్న పరమాణువుల గాంచజాలనట్లు బ్రహ్మ జ్ఞానము లేకున్న జగత్తు యొక్క భావ మగుపించదు. ఈ జగత్తు చిన్మయ ఆకాశము. అనగా చిన్మయ బ్రహ్మము యొక్క రూపాంతరము. దృఢ విచారమున దృశ్య వస్తువుల అత్యంతాభావము. బోధపడిన, వాసనలన్నియు వినాశము నొందును. అప్పుడు దృశ్య సత్త గూడ క్షీణించి పోవును. తత్త్వ దృష్టిగల జ్ఞానియు, అవికారియునగు జీవుడు భ్రాంతి సముచితమగు యీ జగత్తును తత్త్వ దృష్టి వలన మిథ్య యని గ్రహించి , ద్వైత వాసనా హీనుడై భవ భయమునుండి ముక్తుడగును. ఈ ముక్తాత్మ స్వరూప మొక్కటియే సత్యము. ఇతరములన్నియు మిథ్య.

దేహము ఛేదింపబడినను,అఖండమగు చైతన్యము ఛేదింపబడకుండును. దేహము నశించినను, అజ్ఞాని యొక్క ఆత్మయే నశింపకయుండ, నిక సమ్యగ్దర్శియగు జ్ఞాని యొక్క ఆత్మ యెట్లు నశించును? ఈ సుఖ దుఃఖములన్నియు శరీరమునకే. జీవుని, దాని యుపాధిని పరిత్యజించి సత్య స్వరూపమగు బ్రహ్మమును భావింపుము. నశ్వర దేహాదులందాత్మ భావన చేయకుము. ఇచ్ఛా రహితమును, శుద్ధుడునునగు పరమాత్మకు ఏ విధమగు యిచ్ఛయు నుండజాలదు.

సర్వులకు సాక్షి భూతమును, సర్వత్ర సమమును. నిర్మల రూపమును, నిర్వికల్పుడును, వికల్ప రహితుడునునగు చిదాత్మయందు, అద్దమందు వస్తువుల వలె, అని చ్ఛాపూరకమగు బ్రహ్మాండ[illegible]లన్నియు ప్రతి బింబితములయి, జగత్సమూహములన్నియు గోచరించుచున్నవి.

దర్పణ ప్రతిబింబముల సంబంధము వలె, ఆత్మజగత్తుల భేద సంబంధమున్ను భావనా మాత్రముచే భిన్నముగను, యదార్థముగ అభిన్నముగ నుండును, ఆకాశము శూన్యమేయైనను, సర్వులచే సమభూతమును,నీలత్వము నెట్లు కల్పించెనో, అట్లే పరమాత్మ నుండి మొమ్మొదట మనస్సు ఉత్పన్నము కాగా, అయ్యది తన వికల్పములచే యీ జగదాడంబర మంతయు రచించెను. ఎట్టి వాసనలు లేకున్న అసలు శరీరమే ఉండదు. శుద్ధ వాసనాబలమున్నంత వరకు ఆతివాహిక శరీరముండును.

నామరూపాత్మకమగు యీ జగత్తునకు హేతువగు అజ్ఞానముచే

శమించినను,(క్షీణించినను) మరల జగత్తు ఏల దృగ్గోచరమగురున్నది?

పరబ్రహ్మము తన రూపముననె యెల్లప్పుడు ఉన్నవాడై, అటనుండి చ్యుతిని పొందక యుండును కాన సృష్టి యని పేర్కొనబడు యిదంతయు ఆ బ్రహ్మమునకు వేఱుగలేదు. బ్రహ్మమే యిద్దాని స్వరూపమై యున్నది. ఫలమును పొందు మిక్కుటమగు కోర్కెతో తీవ్రముగ ఒనర్పబడు కర్మయే దైవమన బడుచున్నది. దీనినే దైవమని కూడా అందురు.

పౌరుషమే పనులన్నిటిని ఒనర్చుచున్నది. ఫలితముల నన్నిటిని అదే అనుభవించుచున్నది. దైవము లేక మఱింకొక వస్తువు కర్తయునుగాదు, భోక్తయునుగాదు దైవమొనర్చున దేదియులేదు.ఇది భోగించున దేమియు లేదు. దీని నెవ్వరు గనుటలేదు. ఆదరించుట లేదు. ఇది కేవలము కల్పనా మాత్రమే. ఒక్క పురుషార్థము వల్లనే యీలోకమున ఫల మవశ్యము లభించుచున్నది. దీనినే జనులు దైవమనుచున్నారు.

వెనుకటి జన్మలలోనివగు వాసనలు ప్రబోధితములై, కర్మలుగ మారును, వాసనల ననుసరించియే జీవుడొనర్చు కర్మ గూడ యుండును. ఎవని కెట్టి వాసన యుండునో వాడు వాటి నిమిత్తమే ఎల్లప్పుడు ప్రయత్నించుచుండును.బలమును గూర్చు కొనిన వాసనలే కర్మలు. ఈ వాసనలు మనస్సుకంటె భిన్నములు కావు. మనస్సు కూడ ఆత్మ కంటె వేఱుగాదు.. దైవమని చెప్పబడునదే కర్మ,ఈ కర్మయే మనస్సు .ఈ మనస్సే పురుషుడు. అందువలన పరుషకారము కంటే వేఱొకటి లేదని తెలుచున్నది. దైవము మిధ్య.

మనస్సు, చిత్తము వాసన, కర్మ దైవము - ఇవన్నియు చిజ్జడ భేద భావన లేని మనస్సు గల పురుషుని పర్యాయపదములని మావలన (సాధువుల వలన) చెప్పబడుచున్నది. ఇట్లు పురుషకారము ఒక్కదాని వలననే అభీష్టములన్నియు సిద్ధించుచున్నవి. అదృష్టము వలన కాదు.

బ్రహ్మతత్త్వము స్వయం ప్రకాశము . ఇది సచ్చిదానంద రూపమున సర్వత్ర వెలయుచున్నది. ధీని సత్త వలననే యితరములన్నియు వెలుగొందుచున్నవి. ఇదియే భవిష్యత్కాల వ్యవహారమున నియతి (బ్రహ్మసత్త) అనబడుచున్నది. కార్యకారణ స్వరూపము గూడ నిదియే.

అనంతమాయా విలాసమునకు కారణమును, సర్వాంతర్యామియును, సర్వాధారము[illegible]ాకాశమును, ప్రత్యక్ చిద్రూపమును, అవినశ్వరమునునగు ఆత్మ తత్త్వ మొక్కటి ఉన్నది. తపస్సు, ధర్మము, దానము, సత్యము, తీర్థములు, దుఃఖ శుద్ధి సాధనములు(నివారణోపాయములు) ఆనందదాయకమగు జ్ఞానమును విరక్త చిత్తులగు జ్ఞానులకు మాత్రమే బోధింపవలెను. శమము, విచారణ, సంతోషము సాధు సంగమము, వీనిలోనే ఒక్కదాని నైనను, అలవరచుకొని ప్రాణములు తెగించియైన యత్నించుము.ఏలయన ఒక్కటి వశమైన, తక్కిన వన్నియులోబడును.

'ఓం నమో భగవతే వాసుదేవాయ' ఇదియే ద్వాదాశాక్షర మంత్రము, ఈ మంత్రము నెవడైన నిద్రింపక ఏడు దినములు నిరంతరము జపించిన వానికి ఏడు దినములలోనే బుద్ధి నిర్మలమై ఆకాశమున నెగురు విమానములు ప్రత్యక్షముగ గోచరించును.

## ఎఱుక పిడికెడు రూకల మూట -యోగ వాసిష్ఠము.

అంతర్ముఖుడవు కాసర్వము తనంత తానే సంభవించును. జ్ఞానము. జ్ఞ+న ఈ రెండు పదములు కలిసి "జ్ఞానము" అగుచున్నది. ".జ్ఞ" అనగా తెలియుట లేక ఎఱుక. "న'

' అనగా లేకుండుట.జ్ఞానము అనగా ప్రపంచము యొక్క "ఎఱుక" లేకుండుట. ''ఆత్మ' 'అనగా బ్రహ్మ స్వరూపము ఈ "జ్ఞానము" అనుభవ విషయముగాని , బోధకు విషయము కాదు. మానవునకు సాధకుడనియు కూడా పేరు.

సాధకుడు తన సన్నిహిత అనుభవములుగ, బాహ్యమున కనబడు శాశ్వత సచ్చిదానందమే తన నిజస్వరూపమని అనుభవించవలెను. చిరకాలము నిరంతర వేదాంత సాధనల వల్ల "బుద్ధి"కి గల బాహ్యదృష్టి తొలగుచున్నది. ఆత్మ కిరణములు బుద్ధియందు ప్రతిబింబించి బాహ్యమున చిదాభాసుడు లేక "అహంకారము" అనబడుచున్నది. సాధనవల్ల ఆత్మ సంస్కార ఫలితముగ సాధకుడు అంతర్ముఖము పొందుకొలది యీ కిరణములు వెలుపలికి పోక ఆత్మవైపు సమీపించును. తుదకు ఆత్మలో ఏకమై పోవును. అప్పుడు అహంకారము పూర్తిగా లయము అగుచున్నది. అట్టి అనుభవము "మనస్వస్వరూపము" లేక "ఆత్మపదవి". అదియే జీవిత పరమ పదవి. జీవిత ఫలము . ఆత్మవల్ల వీర్యమును, జ్ఞానము వల్ల " అమృతత్త్వము"ను పొందుచుచున్నాడు.

మనయందు "అధిష్ఠానము"గ నుండు "పరమాత్మ" మనకు కలుగు మూడవస్థలకు "సాక్షి" యని తెలియుట వల్ల అతనిని మనము బాగుగ తెలిసికొనగలుగుచున్నాము. విచక్షణలో ప్రతి నామరూపమున యందు గల "ఏక ఆత్మ"ను కనుగొనవలెను. ఇదియే "ఉత్కృష్ట ఉపాసన". అత్మను చూచిన వ్యక్తి "ఆత్మ" యగుచున్నాడు. బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి.

నామరూపములలో అంతర్భూతమై యుండు "ఆత్మ" రూపమును కనుగొనిన మానవుడు ఆత్మ జ్ఞానమున పరిపూర్ణానందమును అనుభవించును. ఆతడు జీవరూపమును వదలి ఆత్మ స్వరూపుడు అగుచున్నాడు. ఈ లోకమును వదలి ఆత్మపదవి పొందుచున్నాడు. అను శృతి వాక్యములో అభిప్రాయ మేమిగా నుండును? ఇచ్చట వదలుట అనగా మరణము వల్ల దేహమును వదలుట గాదు, మర్త్యబంధములను తొలగించుకొని, మృగ చేష్టలు, విలువలు వదలి దివ్య "ఎఱుక" వల్ల తాను 'బ్రహ్మ" మని తెలియుటగా నున్నదని శంకరుల అభిప్రాయము.

బ్రహ్మమును మనస్సుతో తలచునట్లు, మనస్సు కోరునట్లు "మనోవేదన"తో "ఆత్మ దర్శనము" పొందవచ్చును.

దేహము మరణించునప్పుడు ఆత్మ చైతన్యము వెళ్లుట, అస్తిత్వము ఉండుట ఎట్లు జరుగుచున్నది? సత్యము,శుద్ధ అస్తిత్వము, సర్వత్ర సమ వ్యాపకముగ నున్నది. కాని అంతః కరణ మనబడు జీవుని ద్వారా మనో బుద్ధుల ద్వారా ఆత్మ ప్రతిబింబము ప్రకాశించుచుండును. అంతః కరణము వెళ్లిపోగా. ప్రత్యగాత్మ ప్రకాశము తొలగిపోవును. ఈ దేహము శవమగుచున్నది. కాని శవము నందలి భాగములు, సర్వ వ్యాపక " ఆత్మ" అస్తిత్వముననే ఉన్నవి. అవి మురిగి అందులోనే ఉంటున్నవి.

ఆత్మమానవులు, జంతువులు, మొదలగు అన్నిటి యందును ఏకముగ నుండినను బింబము కలుగ, అంతఃకరణ దోషము వలన భేదము లేర్పడు చున్నవి.

## 5. షడ్లింగములుః-

### 1) ఈశావ్యాస్యోపని షల్లింగములుః-

1) ఉపక్రమోపసంహారములుః- ఈశావాస్య మిదగం సర్వం"

ఈ సమస్త ప్రపంచము ఈశ్వరునిచే నాచ్ఛాదింపబడియున్నది' అనుమొదటి మంత్రము ఉపక్రమమగును.

"సపర్యగాచ్ఛుక్ర" - ఆ బ్రహ్మము నలుమూలల, వ్యాపించి నిత్యశుద్ధమై యున్నది

అనుమంత్రముపసంహారమగును.

2) అభ్యాస లింగముః- ఆ బ్రహ్మము అచంచలమును, ఏకమును, మనస్సుకంటె వేగవంతమును నగుననియు, సర్వమున కంతరమును బాహ్యము గలదనియు నిటువంటి శృతులచే మరల మరల ప్రతిపాదించుట అభ్యాసమనబడును.

3) అపూర్వత ః- ఆ బ్రహ్మము ఇంద్రియముల చేతగాని, మఱియే ప్రమాణముల చేత గాని తెలియబడక స్వయముగా ప్రకాశించుచున్నది.

4) ఫలముః- ఆ యద్వితీయ బ్రహ్మ తత్త్వము నెఱింగినవానికి శోకమోహములులేవు- అనుశృతి చేత ఫలము నిరూపించబడెను.

5) అర్థ వాదముః- ఈ లోకములో కర్మములు చేయుచునే, నూరు సంవత్సరములు జీవించవలయుననెడి జీవితేచ్ఛగల భేదదర్శి కర్మములు చేయుచుండునని, యతడు భోగవాంఛతో పూర్వము చేయుచున్న కర్మములనే యనుసరించి, పిదప నట్టివానికి - అజ్ఞానాంధకార బంధురములైన ,నీచయోనుల ప్రాప్తి కలుగునని, భేదజ్ఞాని నిందయు, నభేద జ్ఞాన స్తుతియునగునర్థవాదమును జెప్పుచున్నది.

6) ఉపపత్తి ః- వాయువు జలమును ధరించునట్లు సమస్త ప్రపంచమును బ్రహ్మము ధరించుచున్నదను నుపపత్తితో నభేద బోధకయుక్తిని చూపుచున్నది.

## 2. కేనోపనిషల్లింగములుః-

1) ఉపక్రమోపసంహారములుః- "శ్రోతవ్యశ్రోత్రం" - ఆ బ్రహ్మము శ్రోత్రమునకు శ్రోత్రము అనునిటువంటి శృతి వాక్యములచే ఉపక్రమమునందును, "ప్రతిబోధవిదితం" బుద్ధివృత్తి లన్నిటియందు స్వయం ప్రకాశమై ప్రకాశించుచున్నదనియును పసంహారము నందును శృతి యద్వితీయ బ్రహ్మమునే ప్రతిపాదించుచున్నది ఈ ఉపక్రమోప సంహారములు రెండును కూడి ప్రథమలింగ మనబడును.

2) అభ్యాసలింగముః- నేత్రమునకు ,నేత్రమును, శ్రోత్రమునకు శ్రోత్రమును, వాక్కునకు వాక్కును, మనస్సునకు మనస్సునై, సమస్తమును ప్రకాశింపజేయుచున్న స్వయం ప్రకాశమునే, నీవు బ్రహ్మమని తెలియుము, ఇటువంటి శృతులు అభ్యాసలింగమనబడును.

3) అపూర్వత ః- ఆ బ్రహ్మతత్త్వమే ప్రత్యక్షాదీతర లౌకిక ప్రమాణముల కవిషయము.

4) ఫలముః- ధీరుడు సర్వభూతముల యందాత్మ నెఱుంగుచున్నాడను నాత్మజ్ఞానము ననుసరించిన బ్రహ్మవేత్త శరీరరూపమగు లోకమును విడిచి, యమృతరూపమగు నాత్మలోకమును చూచుచున్నాడను ఫలము చెప్పబడెను.

5) అర్థవాదముః- బ్రహ్మ దేవతల కొఱకు విజయమొసంగుచున్నాడను నిటువంటి వాక్యముల చేత సాఖ్యాయికా రూపమగు నర్థవాదము చెప్పబడెను.

6) ఉపపత్తి - ఎవ్వడు ఇంద్రియ మనస్సులచేత బ్రహ్మము నెఱుంగజాలడో వానికి ఆ బ్రహ్మము తెలియబడుచున్నది. ఇటువంటి స్వయం ప్రకాశ, అద్వైత బ్రహ్మమును తెలియజేయు వాక్యముల చేత నుపపత్తి చెప్పబడెను.

## 3. 111 కఠోప నిషల్లింగములుః-

1) ఉపక్రమోప సంహారములుః- యేయం ప్రేతే విచికిత్సా మనుష్యే -మరణించెడి మనజుల యందే సంశయము గలదో శృతి తీర్మానము ఉపక్రమము "అన్యత ధర్మాదన్యత్రా ధర్మాదన్య త్రాస్మా త్కృతాకృతాత్. ఆ బ్రహ్మము ధర్మము కంటెను. నధర్మము కంటెను భిన్నమగును. ఇట్టి వాక్యములచే విశేషముగ నుపక్రమింపబడినది. మఱియు అంగుష్ఠమాత్ర పురుషోంతరాత్మ " - అంగుష్ఠపరిమాణముగల పురుషుడే "అంతరాత్మ" అనునది మొదలు

ఆయుపనిష దంతము వఱకునుప సంహార రూపమగు లింగము ప్రతిపాదింపబడినది.
2) అభ్యాసము :-ఆయాత్మ పుట్టునది కాదు. మరణించునది. కాదనియు. అస్థిరమగు శరీరమునందున్న "యశరీరి" స్థిరుడనియు, ఆయాత్మ నిత్యమైనదానిని కూడ నిత్యమైనదనియు ఆయాత్మ చేతనమునకు చేతనమగును, అనేకమునందేక మగును. కామములకు కామమగు ననియు ఉన్నదని తెలియుటకు యోగ్యమైనదనియు నిటువంటి శృతులచేత ఆ బ్రహ్మము మరల మరల ప్రతిపాదింపబడుటచే నిది అభ్యాసలింగ మనబడుచున్నది.
3) అపూర్వత :- వాక్కుచేతను, మనస్సు చేతను, చక్షువు చేతను బ్రహ్మము తెలియుటకు శక్యము కానిదని చెప్పెడి శృతుల చేతనది లౌకిక ప్రమాణముల కవిషయమనెడి యపూర్వతాలింగము ప్రతిపాదింపబడెను.
4) ఫలముః- ఇతరు లెవరైన నీయధ్యాత్మ విద్య నెఱింగినచో "మోక్షము పొందగలరు" ఆనందానుభవముగలవాడు ("ప్రమోదతే మోదనీయంహిలబ్ధా") ఆ బ్రహ్మానందమునే పొందుచున్నాడని శృతి స్పష్టముగ ఫలమును నిరూపించెను.
5) అర్థవాదముః- దేనికి బ్రాహ్మణ, క్షత్రియులు అన్నమగుచున్నారో యనెడి యద్వైత బ్రహ్మస్తుతి రూపమగు నర్థవాదము చెప్పబడెను. నానా విధములుగ తెలియబడెడి సమస్తమును మృత్యువునుండి మరియొక మృత్యువును బోందుచున్నది అను నిటువంటి శృతులచేత భేదజ్ఞాన నిందారూపమగు నర్థవాదము చెప్పబడెను.
6) ఉపపత్తిః- అగ్ని యొక్కటియే లోకమునందు గల పదార్థములందు ప్రవేశించి వానిని దహించునప్పుడా పదార్థాకారముగ గనుపించునట్లును, ఒక్కటియగు వాయువు సర్వదేహములందు బ్రవేశించి, యా దేహముగ దెలియబడునట్లును, సూర్యుడొక్కడే సర్వ పదార్థములను ప్రకాశింపజేయుచున్నను. వాని గుణదోషముల నంటనట్లును. "ఆత్మ యొక్కడే సర్వదేహములందు అతి సూక్ష్మ రూపముననుండి యా దేహములకు తగిన యాకారములు గలవాడుగ నగుపడుచున్నాడు. సర్వ పదార్థములతో సంబంధ పడియుండియు, ఆ పదార్థముల యొక్క గుణదోషముల నంటక ప్రకాశించుచున్నాడు. ఇటువంటి, శృతులచే యుక్తి రూపమగు నుపపత్తి చెప్పబడెను.

## 4. ప్రశ్నోపనిషలింగములుః-

1. ఉపక్రమోప సంహారములుః- 'బ్రహ్మ పరాబ్రహ్మనిష్ఠా పరంబ్రహ్మాన్వేషమానాః" బ్రహ్మతత్పరుడైన బ్రహ్మనిష్ఠుడు పరబ్రహ్మమునువిచారించవలయునని యుపక్రమించి "తాని హోదాచైతానదే వాహమేతత్పరం బ్రహ్మ వేదనాతః పరమస్తి" -నేనీ విధముగ పరబ్రహ్మమును ఎఱుంగుచున్నాను, అంతకంటె అన్యము నేను ఎఱుగను- అని యుపసంహరించెను ఈ రెండును గూడి యుపక్రమోప సంహారములను ప్రధమ లింగమగును.
2) అభ్యాసలింగముః- నిశ్చయముగ ప్రరబ్రహ్మము. నపరబ్రహ్మము "ఓంకా ర' మగును. మఱియు నా పరబ్రహ్మము శాంతము, అజరము, అమృతము అభయమునగును. ఇట్టి వాక్యములచే బ్రహ్మము ప్రతిపాదింపబడుటవలననివి అభ్యాసలింగమనబడును.
3) అపూర్వతః- ఈ శరీరమునకు లోపలనుండు "పురుషుడు" షోడశకళా పరిపూర్ణుడని చెప్పబడుట చేత నతడు ఉపదేశము వలన మాత్రమే తెలియబడతా వాడనియు, యితర లౌకిక ప్రమాణములచే తెలియబడదనియు సూచనా పూర్వకముగ అపూర్వతక చెప్పబడెను.
4) ఫలముః- ఆ తెలియదగిన పురుషుని తెలిసికొనుము, నీకు మృత్యుభయముకలుగదు. అనునటువంటి వాక్యములచేత ఫలము నిరూపింపబడెను.
5) అర్థవాదముః- అజ్ఞాన రహితమును, అశరీరుడును, అలోహితుడును, నిత్య శుద్ధుడునునగు

నక్షర పరబ్రహ్మమును తెలిసికొనినవాడు, సర్వజ్ఞుడును, సర్వస్వరూపుడునగుచున్నాడను శృతి వాక్యముచేత స్తుతి పరమగు నర్థవాదము చెప్పబడెను.
6) ఉపపత్తిః- నదులు సముద్రమును పొంది తమ నామరూపములను విడిచి సముద్రమే యైనట్లు ప్రాణాది షోడశ, కళలును పురుషుని పొంది తమ నామరూపములను విడిచి యా పురుష రూపమును పొందుచున్నవి - అను నిటువంటి దృష్టాంతముల చేత పరమాత్మ వలననే షోదశకళల యుత్పత్తియు వినాశము కలుగుచున్నది.

## 5. ముండకోపనిషత్తుః-

1) ఉపక్రమోప సంహారములుః- అయక్షర పరబ్రహ్మ మదృశ్యమగును -ఉపక్రమము. అ పరబ్రహ్మమును తెలియుచున్నాను -ఉపసంహారము,
2) అభ్యాసముః- అ బ్రహ్మము ప్రత్యక్ష మనియును, సమీపమనియును, అయక్షర రూపము బ్రహ్మమే -అను నిటువంటి వాక్యములను అభ్యాసలింగము ప్రస్తావించబడినది.
3) అపూర్వతః- ఆ బ్రహ్మము చక్షువుచే గ్రనాంపబడడు. వాక్కుచే చెప్పబడడు. అను నిటువంటి వాక్యములచే లౌకిక ప్రమాణముల కవిషయమను నపూర్వత చెప్పబడెను.
4) ఫలముః- అ పరాపరమగు బ్రహ్మము నెఱింగినచో హృదయగ్రంధి చేదింపబడు చున్నదను నిటువంటి వాక్యములచే ఫలము చెప్పబడెను.
5) అర్థవాదముః- నిర్మలాంతః కరణముగల బ్రహ్మవేత్త యేయే లోక భోగములను కోరుచున్నాడో వానిని బొందుచున్నాడు. అత్మశ్రేయమును గోరెడి బ్రహ్మవేత్తను అందఱును పూజింపవలయునను నిటువంటి వాక్యముచే స్తుతి పరమగు నర్థవాదము చెప్పబడెను.
6) ఉపపత్తిః- ప్రజ్వలితాగ్నినుండి వేలాది విస్ఫులింగములు ఉద్భవించునట్లు బ్రహ్మమునుండి వివిధ పదార్థములు త్పన్నమై తిరిగి వానియందే లీనమగు చున్నవను నిటువంటి వాక్యములచే నుపపత్తి, చెప్పబఢెను. ఈ లింగము చేత ముండకోపనిషత్తునకు అద్వైత బ్రహ్మమునందే తాత్పర్యము గలదని పండితులు అంగీకరించుచున్నారు.

## 6. మాండూక్యోపని షల్లింగములుః-

1) ఉపక్రమోప సంహారములుః- ఈ సమస్తము ఓంకార మగు నక్షర రూపమను వాక్యముతో నుపక్రమించి, అమాత్ర రూపమగు బ్రహ్మము చతుర్థపాదమను వాక్యముచే నుపసంహరింపబడెను.
2) అభ్యాస లింగముః- ఆ బ్రహ్మము నిష్ప్రపంచ రూపమును, శాంతమును నగు నను నిటువంటి వాక్యములచే నభ్యానలింగము చెప్పబడెను.
3) అపూర్వతాలింగముః- ఆ బ్రహ్మము ఏ ప్రమాణమునకు గోచరముగాని దనియు, వ్యవహారరహితమైనదనియు చెప్పెడి వాక్యములచే అది. యే ప్రమాణమునకు విషయము కాదను నపూర్వత తెలుపబడెను.
4)ఫలముః- ఎవడు యీ యాత్మను యీ విధముగ నెఱుంగుచున్నాడో వాడు అయాత్మనే పొందుచున్నాడను నిటువంటి వాక్యములచే ఫలము ప్రదర్శింపబడెను.
5) అర్థవాదముః- బ్రహ్మవేత్త సర్వ కామములను పొందుచున్నాడను నిటువంటి వాక్యములచే నవాంతర ఫలము చెప్పబడెను.
6) ఉపపత్తిః- ఈ యుపపత్తి యొక్క మంత్రములయందు బ్రహ్మప్రాప్తి నిమిత్తము నాలుగు పాదములు కల్పింపడినవి. అ కల్పనా రూపమగు యుక్తియే యుపపత్తి యనబడును.

ఈ లింగముల చేత మాండూక్యోపనిషత్తు నద్వైత బ్రహ్మము నందే తాత్పర్యము గలదని తెలియవలయును.

## 7. తైత్తిరీయోపనిషల్లింగములుః-

1) ఉపక్రమోప సంహారములుః- "బ్రహ్మ విదాప్నోతి పరం" బ్రహ్మవేత్త పరబ్రహ్మమును పొందుచున్నాడని యుపక్రమించి, పురుషునియందు ఉన్నదే ఆదిత్యుని యందున్నది. ఈ రెండును నొక్కటే యను నిటువంటి వాక్యములచే ఉపసంహరింపబడెను.

2) అభ్యాసముః-ఈ యాత్మ నుండి ఆకాశము పుట్టెను. ఈ యదృశ్యుడును, అశరీరుడును, అవాచ్చుడును, అసాధారుడునునగు బ్రహ్మమును పొందువాడు భయరహితుడగుచున్నాడను నిటువంటి వాక్యముల చేతను, ఈ పరమాత్మ యొక్క భయముచే వాయువు వీచుచున్నదను నిటువంటి వాక్యముల చేతను, అభ్యాసలింగము ప్రతిపాదింపబడెను.

3) అపూర్వతః- మనస్సుతో గూడ వాగింద్రియములా బ్రహ్మమును పొందజాలవు. ఎ ప్రమాణము చేతను తెలియబడదు.-అనునపూర్వత చెప్పబడెను.

4)ఫలముః- జ్ఞాని, జ్ఞాన స్వరూపుడగు బ్రహ్మమును పొంది సర్వకామముల ననుభవించుచున్నాడను నిటువంటి వాక్యములచే ఫలము చెప్పబడెను.

5) అర్థవాదముః- భేద దర్శియగు వానికి సంసార భయము కలుగును. అను నిటువంటి వాక్యములచే భేద జ్ఞానము యొక్క నిందయును విద్వాంసులీ నామమునుగానము చేయుచు నేను భోగ్యమును, నేను భోక్తను అను నిటువంటి వాక్యములచే అభేదజ్ఞాని యొక్క సుత్తియు చేయబడెను. కావున నిదియర్థవాదమనబడెను.

6) ఉపపత్తిః- ఈ బ్రహ్మము నుండి యీ భూతములు పుట్టుచున్నవనియు, ఆ భూతములను సృజించి వానియందు ప్రవేశింతుననియు నిటువంటి కార్యకారణాభేద బోధనమగు సృష్టి వాక్యముల చేతను, ప్రవేష్టా ప్రవిష్ట ప్రవేశ్యముల యభేద బోధకములగు ప్రవేశ్య వాక్యముల చేతను, అంతముయొక్క యుపపత్తి చెప్పబడెను. ఈ లింగములచేత తైత్తిరీయోపనిషత్తునందు అద్వైత బ్రహ్మమునందే తాత్పర్యము గలదని తెలియవలయును.

## 8. ఐతరేయోపనిషత్తుః-

1) ఉపక్రమోపసంహారములుః- ఈ సృష్టికి పూర్వము ఆత్మయే యుండి యుండెను. ఉపక్రమము -ప్రజ్ఞానం బ్రహ్మ. ప్రజ్ఞాన స్వరూపుడగు నాత్మయే బ్రహ్మము అను మహావాక్యము ఉపసంహారము.

2) అభ్యాసముః- బ్రహ్మము యీ లోకములను సృజించెననియు, యీలోకములను లోకపాలురను సృజించెదననితలచెననియు అందుచే ఇంద్రనామము కలిగెననియు చెప్పబడెను - ఇత్యాది వాక్యములచే అభ్యాసలింగము చెప్పబడెను.

3) అపూర్వతాలింగముః- ఆ ప్రకటనమైన భూతములను స్పష్టముగా నెఱుగుచున్నానను నిటువంటి వాక్యములచే సర్వభూతములకు ప్రకాశకుడగు ఆత్మ ఆ భూతములకు విషయుడు కాడనియును సర్వజగత్తు స్వప్రకాశ చైతన్య రూపుడగు పరబ్రహ్మము వలెనే ప్రకాశింపబడుచున్నదనియు నిటువంటి వాక్యములచే స్వప్రకాశ రూపుడగు బ్రహ్మము ఏ ప్రమాణము చేతను తెలియబడదను నపూర్వత ప్రదర్శింపబడెను.

4) ఫలముః- జ్ఞానముచే యీ లోకముల నుల్లంఘించి, మోక్షలోకమునందు సర్వకామములను పొంది అమృతుడగుచున్నాడు. ఇది సత్యమని ఫలము చెప్పుచున్నది.

5) అర్థవాదముః- ఈ యుత్పాదిత దేవతాస్తుతి చేయబడుచున్నదనియు, నేను తల్లి గర్భము నందుండియే యీ దేవతల యొక్క జన్మముల నన్నింటిని ఎఱుంగుచున్నాను. ఇటువంటి వాక్యముల చేత అద్వితీయ బ్రహ్మస్తుతి రూపమగు నర్థవాదము చెప్పబడెను.

6) ఉపపత్తిః- ఆ బ్రహ్మము యీలోకములను సృజించెననియారంభించి ఆ బ్రహ్మము

యీ మస్తకగత (తల) ప్రదేశమును పొందెను . ఇటువంటి వాక్యములతో యుక్తి రూపమగు ఉపపత్తి చెప్పబడెను.

## 9. చాందోగ్య షష్ఠాధ్యాయ లింగములుః-

1) ఉపక్రమోప సంహారములుః- ఓ ప్రియ దర్శనుడవగు శ్వేతకేతూ! ఈ పరి దృశ్యమానమగు (భ్రాంతిరూప) ప్రపంచము, తనయుత్పత్తికి పూర్వము సద్రూపమగు బ్రహ్మముగనే యుండెను. ఆ బ్రహ్మము సజాతీయ, విజాతీయ స్వగత భేద రహితమని యుపక్రమించి, ఈ సమస్త ప్రపంచము అద్వితీయ బ్రహ్మమే యగును. ఆ యద్వితీయ బ్రహ్మము కంటె యీ జగత్తు భిన్నముగ లేదు. అని ఉపసంహరించెను.
2) అభ్యాసముః- ఓ శ్వేతకేతుడా! ఆ బ్రహ్మమే నీవని అనేక ఉపమానములతో తొమ్మిది మారులు బోధింపబడినది కావున నిది అభ్యాసలింగమనబడును.
3) అపూర్వతాలింగముః- ఓ సౌమ్యుడా! ఆ సద్రూపమగు బ్రహ్మము అచార్యోపదేశము వలన మాత్రమే తెలయబడుచున్నది. అది ఇంద్రియ మనస్సులకు గోచరముకాదు. ఇట్టి వాక్యముల చేత బ్రహ్మము లౌకిక ప్రమాణముల కవిషయమగును. ఇట్లు అపూర్వత ప్రదర్శింపబడెను.
4) ఫలముః- అధికారి బ్రహ్మవేత్తయగు గురునివలన తత్త్వమస్యాది మహావాక్యములను శ్రవణము చేసి ప్రత్యగభిన్న (వేరు) పరబ్రహ్మమును సాక్షాత్కరించుకొనుచున్నాడు. ఆ బ్రహ్మ సాక్షాత్కారమును పొందినగాని బ్రహ్మవేత్త ప్రారబ్ధ కర్మముల యొక్క ఫలము ననుభవించిన పిదప బ్రహ్మమేయగు చున్నాడు. ఇటువంటి శృతుల చేత ఫలము ప్రతిపాదింపబడెను.
5) అర్థవాదముః- ఓ శ్వేతకేతూ! ఏ యొక కారణ వస్తువును వినుటచేత వినబడని కార్య జాతము వినబడినదగుచున్నదో, ఏయొక కారణ వస్తువును మననము చేయుటచేత మననము చేయబడని కార్య జాతమంతయు తెలియబడిన దగుచున్నదో అయొక కారణ వస్తువును గూర్చి నీవు నీగురువు నడిగితివా? అనునిటువంటి వచనములచేత అద్వితీయ బ్రహ్మము యొక్క స్తుతి రూపమగు నర్థవాదము చెప్పబడెను.
6) ఉపపత్తిః- ఓ సౌమ్యుడా! కారణమగు నొక్క మృత్పిండము నెఱిగినచో దాని కార్యములగు ఘట శరావాదులన్నియు తెలియబడిన వగును, ఇటువంటి వాక్యములచే, దృష్టాంతరూపమగు నుపపత్తి చెప్పబడెను.

ఈ లింగముల చేత చాందోగ్యోపనిషత్తు యొక్క షష్ఠాధ్యాయమునకు అద్వితీయ బ్రహ్మమునందే తాత్పర్యము గలదని తెలియవలయును.

## 10 చాందోగ్య సప్తమాధ్యాయ లింగములుః-

1) ఉపక్రమోప సంహారములుః- ఆత్మజ్ఞాని జనన మరణ రూపమగు సంసార దుఃఖములను దాటుచున్నాడు, ఇట్లుపక్రమించి ఆయాత్మను యీ విధముగ జూచువానికిని, మననము చేయువానికిని, తెలియువానికిని ఆత్మయే ప్రాణము. ఆత్మయే ఆశ అగును. ఇటువంటి వాక్యములచే ఉపసంహరింపబడెను.
2) అభ్యాసలింగముః- ఆ బ్రహ్మము క్రిందనున్నది, మీదనున్నది. అట్లే నేను క్రిందనున్నాను, మీదనున్నాను. ఆత్మయే క్రిందనున్నది ఆత్మయే మీదనున్నది. ఇటువంటి వాక్యములచే అభ్యాసలింగము ప్రతిపాదింపబెను.
3) అపూర్వతాలింగముః- నారధుడు సనత్కుమారునితో -భగవంతుడా! నేను ఋగ్వేదాది సమస్త శాస్త్రములను చదివితిని అను ఇటువంటి వాక్యములచే ఆ బ్రహ్మము ఋగ్వేదాది

శాస్త్రప్రమాణముల చేతగాని, ఇతరములగు లౌకిక ప్రమాణముల చేతగాని తెలియబడదనియు యిది ఒక్క గురూపదేశముచేత మాత్రమే తెలియబడుననియు ఇటువంటి వాక్యములచేనపూర్వత ప్రతిపాదింపబడెను.

4) ఫలముః- జ్ఞాని మృత్యువును చూడడు". అను నిటువంటి వాక్యమములచే ఫలము ప్రదర్శింపబడెను.

5) అర్థవాదముః- జ్ఞాని సర్వమును ఎఱుంగుచున్నాడు. అతడన్ని వైపులనుండి అన్నిటిని పొందుచున్నాడు -అను నిటువంటి వాక్యములచే అర్థవాదము సూచింపబడినది.

6) ఉపపత్తిః- బ్రహ్మవేత్త ప్రాణము, ఆశయు ఆత్మయే. ఇటువంటి వాక్యముల చేత ఆత్మైకత్వ బోధకయుక్త రూపమగు ఉపపత్తి చెప్పబడెను.

## 11. ఛాందోగ్యాష్టమాధ్యాయ లింగములుః-

1) ఉపక్రమోప సంహారములుః- ఈ యాత్మ పాపరహితమైనదని ఉపక్రమించి ఆ యాత్మను దేవతలు ఉపాసించుచున్నారు. ఇటువంటి వాక్యములచే నుపసంహరిపంబడెను.

2) అభ్యాసముః- ఈ యాత్మ అమృతము అభయము బ్రహ్మరూపమునగును. ఇటువంటి వాక్యములచే అభ్యాస లింగము చెప్పబడెను.

3) అపూర్వతాలింగముః- బ్రహ్మచర్యము చేతను, శాస్త్రాచార్యోపదేశముల చేతను మాత్రమే ఆ బ్రహ్మమును పొందుచున్నాడు. ఇతర లౌకిక ప్రమాణములకు ఆ బ్రహ్మము విషయముకాదు - అను నపూర్వత సూచింపబడెను.

4) ఫలముః- బ్రహ్మవేత్త బ్రహ్మ స్వరూపమను పాదుచున్నాడు. తిరిగి జన్మమునకు రాడు - అను నిటువంటి వాక్యములచే ఫలము నిరూపింపబడెను.

5)అర్థవాదముః- ఇంద్రుడు పొందిన ఆత్మతత్త్వము యొక్క స్తుతియు, విరోచనుడు పొందిన అనాత్మ తత్త్వముయొక్క నిందయుగల యాఖ్యాయిక (ప్రకరణము) అర్థవాదమనబడును.

6) ఉపపత్తిః- వాయువు, మేఘము, మేఘగర్జనము, విద్యుత్తు, అశరీరము లనెడి అభేదరూపమగు యుక్తులచే నుపపత్తి ప్రతిపాదింపబడెను.

## 12. బృహదారణ్యక ప్రథమాధ్యాయ లింగములుః-

1)ఉపక్రమోపసంహారములుః- లోకము యీవిధముగ ఆత్మ నెఱుంగవలయునని ఉపక్రమించి లోకము ఆత్మ స్వరూపమునే యెఱుంగ వలయునను నిటువంటి వాక్యములతో నుపసంహరింపబడెను.

2) అభ్యాసముః- ఆ యాత్మ పుత్రుని కంటె ప్రియమైనది. విత్తము కంటె ప్రియమైనది. నేను బ్రహ్మమనైతిని - అను మహావాక్య పర్యంతముగల శ్రుతలచేత అభ్యాసము చెప్పబడెను.

3) అపూర్వతః- బ్రహ్మ విద్యచేత మానవులు, సర్వాత్మభావము నెఱుంగుచున్నారు ఇటువంటి వాక్యములచే నితర లౌకిక ప్రమాణముల వలన పరమాత్మ నెఱుంగబడదు.

4)ఫలముః- నేను బ్రహ్మమనని తెలిసికొనినవాడు సర్వ స్వరూపుడగుచున్నాడను వాక్యముచే జ్ఞానమువలన సర్వాత్మభావరూపమగు ఫలము కలుగునని చెప్పబడెను.

5) అర్థవాదముః- బ్రహ్మజ్ఞానికి బ్రహ్మత్వము సిద్ధింపకుండా జేయుటకు దేవతలే సమర్థులు కారు. యితరుల కెట్లు సాధ్యమగును? అను నిటువంటి వాక్యములచే అభేద జ్ఞానముయొక్క స్తుతియు, భేద జ్ఞానముయొక్క నిందయునను నర్థవాదము స్పష్ట పరచబడెను.

6) ఉపపత్తిః-ఆ పరమాత్మ నఖ శిఖ పర్యంతము దేహమునందు ప్రవిష్టుడై యుండెను. ఇటువంటి వాక్యములచే నుపపత్తి చెప్పబడెను. ఈ యారులింగముల చేత బృహదారణ్యక ప్రథమాధ్యాయమునకు అద్వైత బ్రహ్మమునందు తాత్పర్యము గలవని ధృవీకరింపబడెను.

## 13. బృహదరణ్యక ద్వితీయధ్యాయ లింగములుః-

1) ఉపక్రమోప సంహారములుః- బ్రహ్మము నీ కొఱకు చెప్పుచున్నది - అను వాక్యముతో సామాన్యముగ నుపక్రమించి బ్రహ్మము నీ కొఱకే తెలియబడును - అను వాక్యముతో విశేషముగ నుపక్రమించి యీ పురుషుడు విజ్ఞానమయుడు అని సామాన్యముగను, ఆబ్రహ్మము కారణ రహితమును, కార్య రహితమును అగును- అను వాక్యముతో విశేషముగను ఉపసంహరింపబడెను

2) అభ్యాసముః- ఆ బ్రహ్మము సత్యమునకు సత్యమనియు యిదికాదు- యిదికాదని జడపదార్థములను నిషేధించగా శేషించునది బ్రహ్మమనియు, ఈ యాత్మయే అమృతమును, బ్రహ్మమును, సర్వమునునగును. ఇటువంటి వాక్యములచే అభ్యాసలింగము ప్రతిపాదింపబడెను.

3) అపూర్వతాలింగముః- మైత్రేయీ! స్వయం ప్రకాశమగు బ్రహ్మమును ఎట్లు ఎఱుగ గలవు? అనువాక్యముచే యితర లౌకిక ప్రమాణములకు బ్రహ్మము అవిషయము అను నపూర్వత చెప్పబడెను.

4) ఫలముః- బ్రహ్మవేత్త సర్వాత్మ స్వరూపుడగుచున్నాడు. ఇకనెవడు దేనిచేత దేనిని గ్రహించును? అను వాక్యముతో అద్వైత బ్రహ్మజ్ఞానము యొక్క ఫలము చెప్పబడెను.

5) అర్థవాదముః- ఆత్మయే బ్రహ్మమని తెలియజాలక, జాతియే బ్రాహ్మణుడని తెలియువాడు లోకమునందుగల సర్వప్రాణులచేత పరిత్యజింపబడుచున్నాడు. ఇటువంటి వాక్యముల చేత భేదజ్ఞాని నిందారూపమగు నర్థవాదము చెప్పబడెను.

6) ఉపపత్తిః- ఊర్ధ్వ నాభి తనయందున్న దారముతో నూర్ధ్వగమనము చేయుచున్నది. అగ్నినుండి వెలువడిన విస్ఫులింగములు కూడ ఊర్ధ్వగమనము చేయుచున్నవి. ఇటువంటి వాక్యములతో దృష్టాంతరూపమగు ఉపపత్తి చెప్పబడినది.

బృహదారణ్యక ద్వితీయా ధ్యాయమునకు అద్వైత బ్రహ్మమునందే తాత్పర్యము గలదని యీలింగము వలన తెలియవలయును.

## 14. బృహదారణ్యక తృతీయధ్యాయ లింగములుః-

1) ఉపక్రమోప సంహారములుః- ఆ బ్రహ్మము సాక్షాదపరోక్షమగునను నిటువంటి వాక్యములచే నుపక్రమించి ఆ బ్రహ్మము విజ్ఞానానంద స్వరూపమను నిటువంటి వాక్యములచే నుపసంహరించెను.

2) అభ్యాసముః- ఈ నీయాత్మ అంతర్యామియు, అమృతమునగును. ఇటువంటి వాక్యములచే అభ్యాసలింగము ప్రతిపాదింపబడెను.

3) అపూర్వతః- శాకల్యుడు యాజ్ఞ వల్క్యునితో నోయాజ్ఞవల్క్యుడా! ఉపనిషత్తులచే ప్రతి పాదింపబడెడి పురుషుని గూర్చి యడుగుచున్నాను. అనువాక్యముచే నితర లౌకిక ప్రమాణములకు ఆ బ్రహ్మము విషయముకాదు - అను నపూర్వత చెప్పబడెను.

4) ఫలముః- ఈ బ్రహ్మము అద్వైత తత్త్వనిష్ఠుడగు తత్త్వవేత్తకు పరమగతి యగును- ఇటువంటి వాక్యము చేత ఫలము చెప్పబడెను.

5)అర్థవాదముః- ఓ కావ్యుడా! సూత్రాత్మను, అంతర్యామిని తెలియువాడు బ్రహ్మవేత్త యగుననియు, ఓగార్గీ! ఈ యక్షర బ్రహ్మమును తెలియక యీలోకమునందు యజ్ఞయాగాది క్రతువులు చేయువాడు కృపణుడు అను నిటువంటి వాక్యములచే అభేదజ్ఞానము యొక్క స్తుతియు భేద జ్ఞానము యొక్క నిందయునగు నర్థవాదము చేప్పబడెను,

6) ఉపపత్తిః- ఓ గార్గీ! ఈ యక్షర బ్రహ్మము చేతనే ధరింపబడి సూర్య చంద్రాదులు

నిలిచియున్నారనియు-నిటువంటి వాక్యముల చేత నుపపత్తి చెప్పబడెను. ఈ యాఱులింగముల చేత బృహదారణ్యక తృతీయధ్యాయమునకు అద్వితీయ బ్రహ్మమునందే తాత్పర్యము గలదని తెలియవలయును.

## 15. బృహదారణ్యక చతుర్ధాధ్యాయ లింగములుః-

1) ఉపక్రమోప సంహారములుః- ఆత్మకు ఇంధుడు" అను నామము ప్రసిద్ధమగును. ఈ వాక్యముచేత సామాన్యముగ నుపక్రమించి, ఈ పురుషుడే జ్యోతి యగును, అనునిట్టి వాక్యములచే విశేషముగ నుపక్రమించి, ఓ జనకుడా! నీవు అభయమును బొందితివి అనియు " ఈ యాత్మ పుట్టుకలేనిదనియు, గొప్పదియునగును. అనిసామాన్యముగ నుపక్రమించి '. ' ఈ సమస్తము ఆత్మయే యగుచున్నది. ఇటువంటి వాక్యములతో విశేషముగ నుపసంహరించెను.

2) అభ్యాసలింగముః- బ్రహ్మమును జ్యోతిస్సులకు జ్యోతిస్సనియు, సర్వమునకు ఆయువు అనియు, అమృత స్వరూపమనియు నుపాసించుచున్నారు. ఇటువంటి అనేక వాక్యములచే అభ్యాసలింగము తెలియబడుచున్నది.

3) అపూర్వతాలింగముః- ఓ మైత్రేయీ! విజ్ఞాన స్వరూపమగు ఆత్మ" ఏవిధముగ తెలియనగుననియు,ఈయాత్మ గ్రహింపబడనిదగుటచే దేని చేతను గ్రహింపరాదనియు, ఆయాత్మ గురు శాస్త్రోపదేశమువలన తప్ప యితర ప్రమాణముల వలన తెలియబడదు- ఇటువంటి శృతులవలన ఆ బ్రహ్మము యితర లౌకిక ప్రమాణములకు విషయము గాదని స్పష్టముగ నపూర్వత చెప్పబడెను.

4) ఫలముః- కోర్కెలతో కర్మము లాచరించువాడు ఆ ఫలమును పొందుచున్నాడు. బ్రహ్మవేత్త బ్రహ్మమునే పొందుచున్నాడు. ఇటువంటి యనేక శృతి వాక్యములచేత ఫలము చెప్పబడెను.

5) అర్థవాదముః- నానా విధములగు భేదజ్ఞానములు గలవాడు-ఒక మృత్యువు నుండి మఱియొక మృత్యువును బొందుచున్నాడు -అనియు ఇట్టి భేదజ్ఞాని పుణ్య పాపరూపమగు సంసార సముద్రమును దాటజాలడు - ఇటువంటి వాక్యములచే అర్థవాదము చెప్పబడెను.

6) ఉపపత్తిః- యద్వైతన్న పశ్యతి" సుషుప్తి యందారూపమును చూచుట లేదనియు ప్రాణమునకు కూడ ప్రాణమైన వాని నెఱుంగు చున్నావనియు, ఓ మైత్రేయీ! భార్య భర్త యొక్క సుఖముకొఱకు అతనిని ప్రేమించుటలేదు. తననుఖము కొఱకేయామె భర్తనుప్రేమించుచున్నది. అను నిటువంటి అనేక వాక్యముల చేత బ్రహ్మస్వరూపమగు" ఆత్మ బోధకయుక్తులు చెప్పబడెను. ఈ యుక్తులే ఉపపత్తియనబడును. బృహదారణ్యక చతుర్థ అధ్యాయమునకు అద్వైత బ్రహ్మ తత్త్వమునందు తాత్పర్యము గలదని యీ యాఱు లింగముల చేత తెలియబడుచున్నది. ఇట్లు షడ్లింగ యుక్తముగ సమస్త శృతులను సద్గురువు వలన శ్రవణము చేయవలయును. శ్రవణము చేసినచో ప్రమాణగత సంశయము నివృత్తి యగును.

# 6. శ్రీరామతీర్థ అనుభవ వేదాంతము

శ్రీరామ తీర్థః- నీవు నీకోసం జీవిస్తున్నావా? ఇతరుల కొఱకు జీవిస్తున్నావా? నీకొఱకే నీవు జీవించు నీ జీవింతంలో జోక్యం కలిగించుకోడానికి వారికి పనిలేదు. నీవు అన్నం తింటున్నప్పుడు నీవే తింటున్నావు! వారు తింటున్నారా?! నీ ఆహారం నీవు జీర్ణం చేసికొంటున్నావా? నీ కొఱకు ఎవరైనా చేసిపెడుతాన్నారా? నీవు చూస్తున్నప్పుడు నీ కండ్లతో నీవు చూస్తున్నావు. నీ కేంద్రంలో నీ వుండు. ఆత్మ విశ్వాసం కలిగి యుండు. కొంచెం వెన్నముక కలిగియుండు , నీ బంధుమిత్రుల, నీ ప్రక్క ప్రజల అభిప్రాయాలను పట్టించుకోబోకుము, నీ ఆతిథ్యసేవా

రహస్యం పరమాన్నంలో, పట్టె మంచంలో లేదు. మంచి శయ్య, మంచి విందు అమర్చకపోతే ఆతిథ్యం కాదని జనుల తలంపు . ఇట్టి దుర్భ్రాంతి గృహమేధిని అస్తి పాస్తులకు దాసుని చేస్తుంది. కాని అస్తిపాస్తులు మీకు దాస్యం చెయ్యనియ్యకండి. వాటికి మీరు దాసులు గాకండి. నీ ఆత్మశక్తి గుర్తించు కర్మ అంటే సత్యాత్మతో సామరస్య సంఘటన, విశ్వసంగీతంతో మేళవింపు. ఏకసత్యంతో నిస్సారమైన ఐక్యతయే నిజమైన కర్మ. జ్ఞానమంటే సత్యమును ప్రేమించడం. సత్యమంటే ఏమిటి? "తత్త్వమసి" లేక ప్రేమ. నీలోనున్న దైవత్వాన్ని ఎప్పుడైతే నీవు చంపటానికై ప్రయత్నిస్తావో, నీవు వినాశం పొందుతావు. ఈ బ్రహ్మహత్యే, భగవంతుని చంపడమే అజ్ఞానమై యున్నది. ఈ అజ్ఞానమే ప్రపంచ శోకానికి మూలకారణమన్నది నిజం. దీన్ని తెలిసికొనండి.

ఆనందం భగంతుని నామాంతరం. మంచిని మంచి, తప్పక అనుసరిస్తుంది. ఆ సూర్యాతి సూర్యుని, నీలోని పరంజ్యోతిని నీవు దర్శించి తీరాలనే, బాధల ఆశయం. విశ్వైక్య స్థితిలో సర్వ సుఖాలు మనవే. ఇది దైవధర్మం. ఎవనిచేత సమస్తము తెలియబడుచున్నదో అతని నితడెట్లు తెలిసికొనగలడు సర్వమును తెలిసికొనే ఆత్మను మనస్సెట్లు తెలిసికొనగలదు? చూడక పోవుటకు మూడు కారణములు కలవు. ఒకటి గ్రుడ్డితనం. రెండవ కారణం నీవు చూడడానికి నీకు వేరుగా యింకొకటి లేకపోవడం. ఇట్లె తక్కిన యింద్రియములకు ప్రత్యుత్తరం సత్యమైన ఆత్మతప్ప ద్వితీయమైనది యేదియులేదు. కనుక అటుల చూచుట, వినుట జరుగుట లేదు. మనస్సు తనను పరిపాలిస్తున్న ఆత్మను ఏవిధముగా గ్రహించగలదు?

మనస్సుకు మూడు మొనలు. 1. దేశ 2. కాల 3. నిమిత్తము. అనంతశక్తి, అనంత బుద్ధి, అనంత ప్రతిభ నేనే అని సంభావించు, ఆత్మ మనస్సుకు అతీతమై ప్రకాశించుచున్నది. సర్వస్థల వ్యాపకుడను, సమస్త కాలగతుడను, సమస్త స్థితి జగదాధారమైన పరమాత్మను "నేనే".

భక్తి అంటే ఒక వర్ణనాతీతమైన సమత్వబుద్ధి. ఉజ్జ్వల మాధుర్యము. సమస్తము వాసుదేవుని (సర్వేశ్వరుని) దర్శించడం. సమస్తము దివ్య పారవశ్య సంజనితమైన ఉదాసీనత, ప్రతి పదార్థములో స్వాత్మను సందర్శించడం.

నీవు ప్రశాంతంగా, హాయిగా చుట్టూ పరిస్థితుల నుండి స్వతంత్రంగా లాభములకు అతీతంగా ఉంచుకో. ఇదే నీవృత్తి, నీ జీవిత పరమార్థం. నవ్వుము. నీతో జగమును నవ్వును. ఏడువుము, నీవొక్కడవే ఏడ్వవలయును. నీ స్వస్వరూపమైన నీ లోపలి పరమేశ్వరుని సంతోషపెట్ట ప్రయత్నించు. అధిక సంఖ్యాకులైన వేయితలల ప్రజతో గుంపును తృప్తిపరచవలసిన పని నీకు లేదు. (అగత్యం నీకులేదు) నీ శిల్పివి నీవే. చిత్తాన్ని నిరోధించు. ప్రాణం నిరోధింపబడుతుంది. ప్రపంచము నా ఆత్మయొక్క నిజమైన దేవుని యొక్క 2నిజమైన ఆత్మయొక్క సృష్టి ధనంతో తృప్తిపెట్ట చూడడం. నిష్ప్రయోజనం. ఏదో ధనంతో మనిషిని తృప్తి పరచాలనుకోవడం ఒక నేరం చేయడమే దీనితో అతనిని మభ్యపెట్టి తప్పించుకొంటున్నారన్నమాట. ఒక అతిథి నీ యింటికి వచ్చినపుడు నీ వతనికి గంజి యిచ్చినా, అతనిని జ్ఞానోత్తేజితునిగా, వికాస హృదయునిగా, వచ్చినప్పటికంటె ఎక్కువ వివేక దీపితునిగా ప్రేమప్రధాన సపర్యతో పంపినచో, నీ తోటి ప్రజలకు నీవు చేయవలసిన సప్రధాన కర్మమది.

మోహమనగా సంపదాదులచే కృత్యాకృత్యము లెరుంగ నేరక మెలంగు మనోవైఖరి. ఆత్మానాత్మ విచారముచే జన్మ రాహిత్యము కలుగును. సర్వధర్మ రహితమగు మనస్థితి సరూపమనో నాశస్థితి, ధర్మ సహితస్థితి, అరూప మనోనాశస్థితి.

సమస్తము సౌందర్యమయమే ఆసౌందర్యం "నేనే". నా స్వరూపమే- అను అనుభూతిని పొందడం, సర్వత్రా బ్రహ్మావలోకనం, నిర్భయత్వమే వేదాంతం, వేదాంతమే నిర్భయత్వం.

## 7. ఈశావాశ్యోపనిషత్తు

ఈ జగత్తు విరించి రూపమును దాల్చిన మనస్సను మనుజుని మనోరాజ్యమే. బ్రహ్మమేయైనను మూఢులకిది సత్యమువలెనే కన్పట్టుచున్నది. బ్రహ్మయొక్క శరీరము మనస్సే. అది సంకల్పాత్మకము. అది సంకల్పములను విస్తరించి యీ జగత్తును సృష్టించుచున్నది. మనస్సు వలననే పృథివ్యాది భూతములు కల్పింపబడుచున్నవి. మనస్సుండుట వలననే దృశ్యమగపడుచున్నది. మనస్సు లయమైన దృశ్యము కూడ లయమై పోవును. దృశ్యము వాస్తవమైన భావాంతర జ్యోతి స్వరూపమైనదియే బ్రహ్మము బ్రహ్మమే ఆత్మ. ఇందు సంశయమేమియు లేదు.

దృశ్యవస్తువు మిథ్య అను జ్ఞానము లేకున్న, జ్ఞానాతీతమగు చిత్స్వరూప మోక్షము లభింపదు. యోగము వలన దృశ్య దర్శనమును నిరోధించిన లాభము లేదు. దీనివలన జగత్స్వరూపము అవగతముకాదు. విజ్ఞాన స్వరూపము నిముషములో ఒక చోటనుండిమరొక చోటకు అరుగుచున్నదో, అజ్ఞానమే పరమాత్మ యొక్క స్వరూపము. ఎవడిద్దానిని గోరునో, వానికి తగినట్లు యత్నించిననే ఫలము దక్కును, అట్లొనర్పక శ్రమ యని విసిగి యత్నింపనిచో ఫలము సిద్ధింపదు.

ఈ క్షణము=సంకల్పము,సంవేదనము= వృత్తి, సంవిత్తు= జ్ఞానము, అలీకము= లేనిది.

బ్రహ్మముయొక్క శరీరము మనస్సే. అదిసంకల్పాత్మకము. సంకల్పములను విస్తరించి యీ జగత్తును సృష్టించుచున్నది. మనస్సు లయమైన దృశ్యము కూడలయమైపోవును . దృశ్యము వాస్త వమైనయెడల దుఃఖ శాంతి యెన్నటికి చేకూర జాలదు (జ్ఞానకి మాత్రమేతెలియును). భావాంతరజ్యోతిస్వరూపమయినవియే బ్రహ్మము. బ్రహ్మమే ఆత్మ ఇందు సంశయమేమియు లేదు. యద్దృశ్యంతన్నశ్యం. దృశ్యపదార్థమంతయు నశించునదే యనుజ్ఞానము లేకున్న జ్ఞానాతీతమగు చిత్యస్వరూప మోక్షములభింపదు. యోగమువలన దృశ్య దర్శనమును నిరోధించిన లాభము లేదు. దీనివలన (యోగము) జగత్వరూపము అవగతముకాదు.

ఏజ్ఞానస్వరూపము నిమిషములో ఒకచోటు నుండి మరొకచోటికి అరుగుచున్నదో, అజ్ఞానమే పరమాత్మ స్వరూపము. ఎవడిద్దానిని గోరునో , దానికి తగినట్లు యత్నించిననే ఫలితము దక్కును.

ఈ క్షణము=సంకల్పము: సంవేదనము =వృత్తి : సంవిత్తు= జ్ఞానము: అలీకము= లేనిది.

శమము, విచారణ, సంతోషము,సాధుసంగమమువీనిలో ఏ ఒక్కదానినైనను అలవరచుకొని ప్రాణములు తెగించియైన యత్నించునది. ఏలయన, ఒక్కటి వశమైన. తక్కిన వన్నియు లోబడును.

## 8. తేజో బిందూపనిషత్తు

యమము, నయమము, త్యాగము, మౌనము, కాలము, ఆసనము, మూలబంధము, దేహసామ్యము, దృక్ స్థితి, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ఆత్మ ధ్యానము, సమాధి, దేశము- బ్రహ్మవగతికి సాధనములయిన (భూత) యోగాంగములు,

యమము= సర్వము బ్రహ్మమే;, దేశము= విజన ప్రదేశము; కాలము=కాలరూపుడగు బ్రహ్మము; మూలబంధము= సర్వలోకములకు మూలభూతమగు మనస్సు యొక్క బంధనము యెయ్యది కలదో అదియే మూలబంధనము, దేహ సామ్యము= సముడయిన బ్రహ్మమునందు, స్థూల, సూక్ష్మ, కారణ శరీరములను విలయము పొందించుట - అనగా మరచుట. దృక్ స్థితి= స్వాజ్ఞ దృష్టి యగువాడు తనకంటె భిన్నముగ జగత్తును చూచును.

ప్రాణాయామము= చిత్తము మున్నగు సర్వ భావములందు బ్రహ్మమునే భావన చేయుచు సర్వత్ర భావించుట; ప్రత్యా ము= సకల విషయములు బ్రహ్మ రూపమేయని సర్వదా గ్రహించుట; ధారణ= మన చ్చట ప్రసరించునో అచ్చటచ్చట బ్రహ్మమును గా ంచుట;

ఆత్మ ధ్యానము బ్రహ్మమే నేను. అని సద్వృత్తితో ధ్యానించుట; సమాధి= అంఖడాకార వృత్తి కలిగి డుట, సవికల్పక సమాధి; అట్టి అఖండాకార వృత్తి అను స్మరణము లేకయుండునట్టి బ్రహ్మాత్మత్వస్థితి నిర్వికల్పక సమాధి యనబడును.

45శ్లో: శ్రవణం నాస్తిమే సిద్ధేర్మననంచ చిదాత్మని: తాను స్వయముగనే సిద్ధించి యుండుట చేత, శ్రవణ మనన నిధి ధ్యాసలనునవి వాస్తవముగ అనావశ్యకములు. కావున, చిదాత్మ స్వరూపుడనగు నావిషయమయి

శ్రవణ మననములు లేవని భావము.

48,49,శ్లో॥ శ్రుతం సర్వమసద్విద్ధి వేదం సర్వమసత్సదా!
శాస్త్రం సర్వమసం ద్విద్ధిహ్యాహం సత్యం చిదాత్మకః॥
మూర్తి త్రయ మసద్విద్ధి, సర్వ భూతమ సత్సదా!
సర్వ తత్త్వ మసద్విద్ధి వ్యాహం , భూమా సదా శివః!!
50శ్లో॥ గురుశిష్య మసద్విగురోర్మంత్ర మసతత్త్వ !
యద్దృశ్యం తద సద్విద్ధి యన్యాయ్యం తద స్యదా
యద్ధతంతర సద్విద్ధి
సమాం విద్ధి తథావిధమ్॥

వేద శాస్త్రములు, తదధ్యయనము యిది అంతయు అసత్తు చిదాత్మకుడ నగు నేనొక్కడనే సత్యము. మూర్త త్రయము, సర్వ భూతములు, సర్వతత్త్వములు, అసత్తు సదాశివుడనగు నేనొక్కడను భూమ స్వరూపుడను. గరుశిష్యులు గరుప్రోక్తము ఏదిదృశ్యమో, అదియు, ఇది అంతయు అసత్తు నేను మాత్రము సత్యము. చింతించునదియు న్యాయమైనదియు, హితమైనది , అంతయు అసత్తు, నేను మాత్రము సత్యము.

తేజోబిందూపనిషత్తు:-

ఆవరణ విక్షేపాత్మకా జ్ఞానము నశించి, బ్రహ్మాభిన్నమైన ఆత్మయందు ఉనికి గలిగిన బ్రహ్మవేత్త జీవన్ముక్తుడనబడును. తత్త్వసాక్షాత్కార జ్ఞానము, సర్వవాసనాక్షయము, జీవన్ముక్తియనబడును. మనోనాశము, తత్త్వ సాక్షాత్కార జ్ఞానము, సర్వవాసనా క్షయము విదేహముక్తి యనబడును.

అఖండ బ్రహ్మ పరోక్షకా జ్ఞానముచే, ఆవరణాత్మకా జ్ఞానమును, వాసనా క్షయముచే విక్షేపాత్మకా జ్ఞానమును, నివృత్తియైన జీవన్ముక్తుని యొక్కయు, ఆవరణ విక్షేపాత్మకమగు సర్వజ్ఞానముతో బాటుమనో మనోనాశస్థితిని బొందిన విదేహముక్తుని యొక్కయు సూక్ష్మశరీరము బ్రహ్మము నందువిలీన మగుచున్నది. కానిబయటికి పోదు. మనస్సు మూలము లేనిదగుటచే నేదియు పుట్టలేదు. కావున సర్వము మిథ్య. వ్యష్టి స్థూల శరీరములకు కారణము అవిద్యయనియు, సమిష్టి స్థూల, సూక్ష్మ శరీరములకు కారణము మాయయనియు అనుభవ పూర్వకముగ తెలియబడుచున్నది. వ్యష్టి శరీర త్రయమునకు భిన్నమై, దానిని ప్రకాశింప జేసెడి సాభాసాంతః కరణ వృత్తి వ్యష్టి మహాకారణ శరీరము, సమిష్టి శరీర త్రయమునకు భిన్నమై, దానిని ప్రకాశింపజేసెడి సాభాసమాయావృత్తి సమిష్టి మహాకారణ శరీరము. ఈ రెండును చిజ్జడ మిశ్రమములు. ఇవి యధిష్ఠాన చైతన్య ప్రకాశ్యములు.

సచ్చిదానంద రూపమగు ప్రత్యగాత్మ వ్యష్టికైవల్య శరీరము; సచ్చిదానంద రూపమగు పరమాత్మ, సమిష్టి కైవల్య శరీరము -యివి స్వయం ప్రకాశములు.

ఈ శ్వరుని విశేష్య భాగమైన, సాభాసమాయ," జీవుడు". విశేషణ భాగమైన సాభాసాంతఃకరణము, అధిష్ఠానాఖండ చైతన్యజ్ఞానము కలుగగనే, బాధింపబడి, యఖండ బ్రహ్మ చైతన్యమే యగుచున్నది. కావున, నిది బాధాసామానాధి కరణ్య మనబడును, ఈ ప్రత్యక్పరమాత్మలు రెండును సచ్చిదానంద రూపములగుటచే ఒక్కటియే యగును. అచల పరిపూర్ణ కేవలాత్మకు సచ్చిదానందములు స్వరూపలక్షణములు. వ్యష్టి సమిష్టి స్థూల సూక్ష్మకారణ మహాకారణ శరీరములు తటస్థ లక్షణములు.

నేతి, నేతి వాక్యానుసారము తటస్థ స్వరూప లక్షణములను విడిచినచో జ్ఞాతదేహము నిరాశ్రయమై, తనంతట తానే నాశమొందుచున్నది. జ్ఞాత దేహమగు మనస్సు యొక్క సర్వధర్మములు నశించి, సుప్త మనో మాత్రుడై యుండుట, సరూప మనోనాశస్థితి. ధర్మ సహితముగ మనస్సు యొక్క స్వరూప నాశమరూప మనోనాశస్థితి. ఈ రెండును సంప్ర జ్ఞాతములనబడును, ఈరెంటిలో ఏస్థితిని పొందిన వాడైనను అసంప్రజ్ఞాతుడనబడును.

సమస్తము అచల పరిపూర్ణ బ్రహ్మమేయను దృఢనిశ్చయముతో దేనియందును భేదము లేక వర్తించు పూర్ణస్థితుడు పరమ శాంతుడు. అశాంతుడే విదేహముక్తుడు.

సుషుప్తికిని, సమాధికినిగల విలక్షణతయెట్టిది?

ఒకేసారి ఆవిర్భూతమగు శుద్ధ చైతన్య బ్రహ్మముతో సమాధ్యవస్థయందు మనస్సు ఏకాకారతను బొందుచున్నది. సుషుప్తిలో మనస్సు అవిద్యా విశిష్ట చైతన్యముతో లయభావమును పొందుచున్నది. ఈలాగున సమాధికిని సుషుప్తికిని మహా విలక్షణతగలదు. అందరికంటె గొప్పగరువు నీ ఆత్మయే. శాస్త్రము ద్వారా జ్ఞానలాభమునుబొంది, మానవుడు భవబంధములనుండి విముక్తుడగుచున్నాడు. గురువునీలోపలనే ఉన్నాడు. ఆత్మయే గరువులకు గురువు.

నీవు ప్రపంచమును చూడనేచూడకుము. సన్యాసివగుము, అన్నిటికంటె గొప్ప శాస్త్రము ప్రపంచము. ఈ ప్రపంచమునుచదువుకొని ప్రపంచమును గూర్చి నిరంతర మాలోచించుచుండినచొ (ప్రతి సంఘటననుగాంచి) సాధారణముగ వారే గురువును ఆశ్రయింపవలసినపని యుండదు.

ఆత్మ యందన్నిటిని చూచుటకు జ్ఞానమందురు.ఆత్మను పరమాత్మయందు జూచుటకు విజ్ఞానమందురు. అజ్ఞాన నాశమొనరించి సర్వవ్యాపకమైన, సర్వశక్తివంత మైన ఆత్మను ప్రకాశింపజేయుదానిని జ్ఞానమందురు. తనకంటె భిన్నమగు ఏసాధనాపేక్షలేక తనప్రకాశము చేతనే సమస్త పదార్థములను ప్రకాశింపజేయు చుండు దానిని చిత్తు అందురు, తనను తనకంటె భిన్నమైన సర్వపదార్థములను తెలిసికొనునదే చైతన్యము.

## 9. కేనోపనిషత్తు:-

మనయందుండు ఆత్మను మనము అనుభవించ గలిగిన సమయమున సర్వ ప్రాణులయందుండు ఆత్మ శాశ్వత, అపరిచ్ఛిన్న మూలాధార పరబ్రహ్మము అతడేనని తెలిసికొనగలము. నిరంతర ఆలోచనా ప్రవాహము మనస్సు అనబడుచున్నది. ఈ ప్రవాహమును ఆపగలిగినచో మనస్సు ఉండదు.

మనస్సు ఆత్మసాన్నిధ్యమున నుండుటచేత, ఆత్మయొక్క ప్రభావము ప్రకాశము, తేజస్సు దానియందు కొంత ప్రతిబింబించుట చేత తానుకూడ సత్యము, నిత్యమునని భ్రమించుచున్నది.

మన మనస్సునందు చింత, వ్యాకులత సంతోషము కలుగునప్పుడు జ్ఞాన జ్యోతి ప్రకాశము వాటిని ప్రకాశింపజేయుట వలన మనము తెలిసికొనుచున్నాము. సత్య కేంద్రమునకు అంతటి సమీపమున మనము నివసించుచున్నామనుట మనకు గోచరమగుట లేదు. మన

హృదయమునందే పరమాత్మ నివసించుచున్నాడు. అంత ప్రత్యక్షముగ ఉండుట వల్లనే మనము దానిని గ్రహించలేకున్నాము. మనస్సు జ్ఞానేంద్రియముల సహాయమున ఆత్మకు అతి సమీపమున యుండ గలుగుచున్నది. స్థూల శరీరము అంతటి సమీపమునకు వెళ్ల జాలదు.

అన్ని వ్యాఖ్యానములు,ిబంధనలు, వివరణలు, శృతులు, తెలుపున దంతయు వ్యక్త ఆత్మను గురించి మాత్రమే. శుద్ధ ఆత్మను, శిష్యుడు తనకు తానే అపరోక్షముగ తెలిసికొనవలెను. సాధకుడు తన సన్నిహిత అనుభవముగ బాహ్యమున కనబడు శాశ్వత సచ్చిదానందమే తన నిజ స్వరూపమని అనుభవించవలెను, చిరకాలము నిరంతర వేదాంత సాధనల వల్ల బు[illegible] గల బాహ్యదృష్టి తొలగుచున్నది. ఆత్మకిరణములు బుద్ధియందు ప్రతిబింబించి, బాహ్యమున చిదాభాసుడు లేక అహంకారమనబడుచున్నది. సాధనవల్ల ఆత్మ సంస్కార ఫలితముగ సాధకుడు పొందుకొలది యీ కిరణములు వెలుపలకు పోక ఆత్మవైపు సమీపించును. తుదకు ఆత్మలో ఏకమై పోవును. అప్పుడు అహంకారము పూర్తిగా లయమగుచున్నది. అట్టి అనుభవము మన స్వస్వరూపము లేక ఆత్మ పదవి. అదియే జీవిత పరమ పదవి. జీవిత ఫలము.

ఆత్మవల్ల వీర్యమును, జ్ఞానమువల్ల అమృతత్వము పొందుచున్నాడు మనయందు అధిష్ఠానముగ నుండు పరమాత్మ మనకు కలుగు మూడు అవస్థలకు సాక్షియని తెలియుట వల్ల అతనిని మనము బాగుగ తెలిసికొన గలుగుచున్నాము. విచక్షణతో ప్రతినామ రూపమున, అందుగల ఏక ఆత్మను కనుగొనవలెను ఇదియే ఉత్కృష్ట ఉపాసన. ఆత్మను చూచిన వ్యక్తి ఆత్మయగుచున్నాడు.(బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి).

నామరూపములలో అంతర్భూతమై యుండు అత్మరూపమును కనుగొని మానవుడు ఆత్మ జ్ఞానమున పరిపూర్ణానందము ననుభవించును. అతడు జీవరూపమును వదలి ఆత్మ స్వరూపుడగుచున్నాడు. ఈలోకమును వదలి ఆత్మపదవి పొందుచున్నాడు-అను శృతి వాక్యములో అభిప్రాయమేమిగా నుండును? ఇచ్చట వదలుట అనగా, మరణము వలన దేహమును వదలుట కాదు. మర్త్యబంధములను తొలగించుకొని , మృగ చేష్టలు , విలువలు, వదలి దివ్య ఎఱుక వల్ల తాను బ్రహ్మమని తెలియుటగా నున్నదని శంకరుల అభిప్రాయము.

మరణమనగా నూతన వస్త్రములు ధరించునట్లుండును, అంతియేగాదు. దుర్గంధ పంజరమును తొలగించుకొను ఉపాయముగా నుండును. ఇంతకాలము ఆత్మ నియామకము వల్ల యిచ్చట బంధింపబడి యుండెను. ఇక బంధములు లేవు.

ఆత్మ దర్శన సమయమున, ఆత్మ తప్ప వేరు తెలియునది, తెలియనిది ఏమియు మిగిలి యుండుట లేదు. అద్వితీయ ఏకైక ఆత్మ, "అహం బ్రహ్మాస్మి" అనుభవము మాత్రమే యుండును. బ్రహ్మమును మనసుతో తలచునట్లు, మనసు కోరునట్లు, మనోవేదనతో ఆత్మదర్శనము పొందవచ్చును. పరమాత్మ సర్వభూతాంతర్యామి అని ఉపాసించు సాధకుడు తానుధ్యానించు ధ్యేయవస్తువగుచున్నాడు.

తరతరమునను జీవిత దృశ్య భావములు మారును. కాలానుగుణముగ పరివర్తనము చెందుచున్నవి. మనస్సు లేకపోయినచో యోగికి ఆత్మానుభవము కలుగుచున్నదని శృతి తీర్మానము వేదాంతునికి తన శుద్ధ విజ్ఞానమే గురువు, సద్గురువు. నిజముగ, ఆత్మోద్ధారణ మనవలననే కలుగవలెను. నిర్మలత గాంచిన మానసిక అభిలాషయే శిష్యుడు.

ఒకడు గురువుయొక్క అవశ్యకతకు అర్హుడుగ నుండినచో గురువు తానుగా

అతనికి మంచి మార్గము చూపించి, జ్ఞానోత్పత్తి కలిగించును.

ఆత్మ చైతన్యము మనస్సును అధిష్ఠించి యున్నది. ఆశక్తి జ్ఞానేంద్రియముల ద్వారా ప్రవహించి , విషయములగు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను చేరుచున్నది. అట్టి మనస్సు ఆ విషయాకారములను పొందుచున్నది.

బుద్ధి యందుండు ఆలోచనలను అతిక్రమించుట వల్ల పరిపక్వ దశ పొందగలము. సత్య సామ్రాజ్యమే ఆత్మ సామ్రాజ్యము వేదాంతమును శ్రవణ, మననము వలననే గ్రహించవచ్చును. కాలము జరుగు కొలది వేదాంత శ్రవణమున ఎంతటి ఆనందముండునది మీకు తెలియగలదు. జీవితభ్రమలకు ఆత్మాభి ముఖము పొందు భాగ్యము సమకూడదు.

ద్రష్టకు, వ్యక్తము (నిత్య పరిపూర్ణ వస్తువు) తెలిసికొను అవ్యక్తమును తెలిసికొనుచున్నాడు. అట్టి శాశ్వత ఎఱుకయే ఆత్మ. జ్ఞానబోధయందు ఆగమశాస్త్ర ప్రమాణము ముఖ్యమని వేదాంతమున తెలుపబడుచున్నది. వాక్కు చేత ఏది వ్యక్తము కాదో, దేని వలన వాక్కు వ్యక్తమగుచున్నదో అదియే బ్రహ్మము, ఇచ్చట జనులు దేనిని ఉపాసించుచున్నారో, అదికాదు. ఆత్మ జీవ కేంద్రము. పారమార్థికమున మనము చేరగల క్రొత్త ప్రపంచము ఏదియు లేదు. ఆత్మ సాక్షాత్కార పదవి కేవలము భావన వలన మాత్రమే పొందవచ్చును.

శృతి వ్యాకములను మననము చేయుకొలది మనకు అవి భావనగ ఏర్పడుచున్నవి. ఉన్నత ఆలోచనల వలన ఉన్నత పదవిని పొందగలము . హృదయ గుహ యందుండు ఆత్మను గుఱించి పరిపరి విమర్శింప వలెను. అంతర, శుద్ధ చైతన్యము వద్ద నివసించవలెను.

దేహము మరణించునప్పుడు ఆత్మ చైతన్యము వెళ్లుట, అస్థిత్వము ఉంచుట ఎట్లు జరుగుచున్నవి?

సత్యము, శుద్ధ అస్థిత్వము సర్వత్ర సమవ్యాపకముగ నున్నది. కాని, అంతఃకరణమనబడు జీవుని ద్వారా మనోబుద్ధుల ద్వారా ఆత్మప్రతిబింబము ప్రకాశించుచుండును. అంతఃకరణము వెళ్లిపోగా, ప్రత్యగాత్మ ప్రకాశము తొలగిపోవును. ఈ దేహమో శవమగుచున్నది. కాని శవము నందలి భాగములు, సర్వ వ్యాపక ఆత్మ, అస్థిత్వముననే ఉన్నవి. అవి మురిగి అందులోనే ఉంటున్నవి.

ఆత్మ - మానవులు, జంతువులు మొదలగు అన్నిటి యందును ఏకముగ నుండినను, బింబము కలుగ అంతఃకరణ దోహదము వలన భేదము లేర్పడుచున్నవి.

పాత్ర లేక నీటిని ఎవ్వరునుఎట్లు తేజాలరో, అట్లే ఆత్మ జ్ఞానమును తెలుపుట వ్యక్త పరిణామము వల్లనే తెలుపుట సాధ్యముగాని శుద్ధ సత్య స్వరూపుని మాటలతో తెలుపలేము. మానవుడు(సాధకుడు) తనకుగల బంధనములు పరిచ్ఛిన్నముల నెల్లతొలగించి, తన సన్నిహిత అనుభవముగ, బాహ్యమున కనబడు శాశ్వత సచ్చిదానందమే తన స్వరూపమని అనుభవించవలెను.

పూర్వ వాసనా ఫలితముగ మనస్సు బాహ్య ప్రపంచమును చూచుచున్నది. సత్య స్వరూపము ఎంతటి సూక్ష్మమయినను, దాని వర్ణన తెలిసినంతటితో ఋషులు తృప్తి పొందలేక,ఒక దివ్య భావము వారిబుద్ధికి తెలిసిన వెంటనే, దానిని జీవితమున అనుభవించి, జీనాంశముగ ఉపయోగపెట్టు చుండిరి.

తపస్సు, దమము, నిష్కామకర్మ -యిని తరింపజేయు ఉపనిషత్ జ్ఞానమునకు పునాది. వేదములు దాని అంగములు, సత్యము దాని నిలయము, తపస్సు అనగా యిహలోక సుఖానందములగోరు ఇంద్రియములు విషయ సంపర్కములను పొందనీయక చేయగలుగుట తపస్సు అనబడును. (శారీరక నిగ్రహము). దమము అనగా మనస్సునందు

కోరికలు, ఉత్పత్తి పొందనీయక అణచివేయుట (మానసిక నిగ్రహము).

బ్రహ్మ విద్యయందు కర్మ అనగా-పూజ, ప్రార్థన, సత్సంగము, జపము , ధ్యానము ఆలోచనలు లేకపోయినచో మనసు లేదు. మనసు లేక పోయినచో యోగికి బ్రహ్మాను భవము కలుగుచున్నదని శృతి తీర్మానము, అంతర్ముఖ నిశ్శబ్దమనగా అనంత పరిపూర్ణ ఆనందము.

బ్రహ్మమును మనసుతో తలచునట్లు, మనసు కోరునట్లు, మనోవేగముతో ఆత్మ దర్శనము పొందవచ్చును, మనయందలి అంతరాత్మయే, సర్వ వ్యాపక పరమాత్మయని తెలిసికొనినచో మనభ్రమలు, దుఃఖములు తొలగుచున్నవి.

మన ...దుండు అసత్య తాదాత్మ్యములను తొలగించుకొని, మన నిజ స్వరూపమును ...పించుకొన జేయు ప్రయత్నమును ఆత్మసాక్షాత్కారము అందురు.జ్ఞాన పురుషులు ఏకగ్రీవముగ-"మానవుడు, కించిత్తు త్యజించుట వల్ల దైవపదవిని చేరుచున్నాడు' ', అని తెలుపుచున్నారు, అహంకారమును త్యజించి, భగవంతుడు కావలెను, ఇది యిప్పుడు, యిచ్చటే సాధ్యము. విచక్షణతో ప్రతివారు రూపమునందు గల ఏక ఆత్మను కనుగొనవలెను. ఇదియే ఉత్కృష్ట ఉపాసన.

మరణములు దుఃఖములు, నిరాశలు జయము, అపజయము, బాధ, వ్యసనము, ప్రేమ, ద్వేషములు,-అహంకార సంపద. (ప్రకాశము, శక్తి, జ్ఞానము ఆనందము ఆత్మకు సంసారము.

వేదాంత సూత్రముల ననుభవించు జీవితముకన్న ఉత్కృష్ట జీవితము లేదు. బాహ్య ప్రపంచమంతయు దేహాభిమానమువల్ల కనబడుచున్నది. ఈ అభిమానము తొలగించినచో ప్రపంచ విషయములుకనబడవు. వాటి బాధలు మనలను హింసింపజాలవు.

ధ్యానాభ్యాసము సాధన చేయుటవల్ల ప్రతి ఫలింపజేయుబుద్ధి యందలి ప్రతిబింబము ఆత్మకు అభిముఖము పొంది సమీపించును. పిమ్మట యీ ప్రతిబింబము కలిగించు బుద్ధి నిజమగు ఆత్మతో లయమగుచున్నది.

శమము, విచారణ, సంతోషము, సాధుసంగమము. వీనిలోనే ఒక్కదానినైనను అలవరచుకొని ప్రాణములు తెగించియైన, యత్నించునది. ఏలయనగా ఒక్కటి వశమైన తక్కినవన్నియు లోబడును.

ఆత్మ జ్ఞానము వలన జీవ భావ దుఃఖ రాసులన్నియు తొలగును. అహంకారమును తొలగించి , మన నిజ స్వరూపమైన శాంతిని అనుభవించవలెను. ఈ అహంకారము భూతకాల అనుభవ తలంపుల వల్లను, భవిష్యత్తులను అనుభవించవలెనను కోరిక రాసుల వల్లను తెలుపడమైనది. మరణించిన భూత కాలమును, జన్మించని భవిష్యత్తును వదలి, మనము మన శక్తి పూర్వకముగా వర్తమానము మాత్రము అనుభవించుచు జీవింపగలిగిన యెడల మనము అహంకారమును చంపినవారమగుదుము. అహంకార రాహిత్యమే దైవత్వము. మనస్సు యొక్క విచిత్ర మాయా గుణము చేత అద్వైత సత్య స్వరూపమునందు, అసత్య బహుత్వ రూపములు చూచుచున్నాము.

ఏది విచారించగా లేకపోవుచున్నదో అది మాయ. ఇది మన మనస్సులోనుండు ఒక శక్తి చేత, ఆ మనస్సే భ్రమకు లోనై పోవుచున్నది (రజ్జు సర్ప భ్రాంతి).ఉదాహరణ

శుద్ధ సత్త్వగుణ ప్రధాన మాయయందు ప్రవేశించునపుడు, ఆ సత్య స్వరూప పరమాత్మ నిత్య జ్ఞాన తేజ స్వరూపుని పూర్ణ శుద్ధ ప్రతి బింబము గోచరించును. ఇది దైవ గుణమని చెప్పుదురు. మలిన సత్త్వ ప్రధాన రూపమందు ప్రకాశించు నపుడు అశుద్ధమలావృత ప్రతిబింబము గోచరమయి, జీవుడను నామమున వ్యవహరింపబడుచు ఉన్నాడు,

వేదములలో మంత్రములు, బ్రాహ్మణములు, అరణ్యకములు అను మూడు భాగములు కలవు. ఆత్మ విషయజ్ఞానము పొంద వలయునని, సంసారము యొక్క చంచలత నుండి తొలగవలెను. నిర్మల, నిశ్చల, ప్రశాంత ఆవరణము ఆవశ్యకము. మనచుట్టునుండు ప్రపంచమంతయు జడము.

మన ఆత్మ పరిశుద్ధత వలన దానిక తేజస్సు కలిగింపవలెను. అజ్ఞానమే ఆవరణము. భ్రమయే విక్షేపము.

మనస్సు ఆత్మవైపు మరలిన తోడనే దూష్యలేక పోవును. అనగా జడముగానున్నది. దీపమునకు ముందున్న కుండవలె నుండును.

ఈ జగత్స్వప్నము, సత్యమను భావము ఘనయందు బాధయుండుటవల్ల తురీయావస్థ అనుభవము. దాని దివ్య ప్రభావము తెలియలేకున్నాము. సాధన వల్ల మనస్సు ఆనంద రూపమున నిలువగలుగుచున్నది. అంతర విచారము జరుగు కొలది మన నిజ స్వరూపము పూర్ణానందము- అని తెలియగలదు. అంతర శుద్ధ చైతన్యము వద్ద నివసించవలెను.

## 10. మహోపనిషత్తు:-

అధికార నిష్పాదన రూపమగు లోక పరాయుష్య యోగిక యెంతవరకు నిరూఢము కాదో అంతవరకును వినిర్మలమయిన రూఢ సమాధిత్వము కలుగనే కలుగదు. ఆత్మ రూపమయిన యీ చిత్తమెంతవఱకు తెలియబడదో అంతవఱకును జగల్లక్ష్మి దుఃఖ ప్రదమయినది. సంతుష్టి యనునది ముక్త లక్షణము, ద్రష్ట పరిణామమే గాని వస్తు పరిణామము లేదు. మనస్సు లేక జగత్తు లేదు. ఆత్మ, ఋతము, సత్యము, పరబ్రహ్మము, మొదలగునవి పరమాత్మకు సంజ్ఞలు. చిత్తాకాశము, భూతాకాశము, చిదాకాశము అని మూడు గలవు. సంకల్ప సముదాయ మెందుగలదో అది చిత్తాకాశము. దృశ్య సముదాయమెందుగలదో అది భూతాకాశము. చిత్తాకాశము, భూతాకాశము, అను యీ రెండును లేశమైనను లేనిదే చిదాకాశమే.

తన స్వరూపమగు చిదాకాశమునందు స్థితి నొందినచో స్వరూపానందము విజృంభించును. అదియే సమాధి. దృశ్యము లేని జ్ఞానమే జ్ఞానము. అదికేవల స్థితి . ఆనందమయము, ద్వంద్వాతీతము, నిర్గుణము, సత్స్వరూపము, చిద్ఘనము నైన ఆ బ్రహ్మమును తన స్వరూపముగా నెఱిగినచో యిక నెన్నడును మానవుడు భయగ్రస్తుడు కాడు. పరబ్రహ్మము నేనయి యున్నాను యీ విధమగు నిశ్చయము మహాత్ములకు మోక్షహేతువై యున్నది.

సర్వ వ్యాపకమగు జ్ఞానమును కనుగొనిన, ఇచ్ఛతనకు తానే నశించిపోవును. అట్టి అఖండాకార వృత్తి కలిగియుండుట సవికల్ప సమాధి. అట్టి అఖండాకార వృత్తి అను స్మరణము కూడ లేకయుండు నట్టి బ్రహ్మాత్మత్వ స్థితి నిర్వికల్ప సమాధి యనబడును.

సదసత్తు (జగత్తు, మాయ) లకు నడుమ ప్రకటన మగు తత్త్వమే సంధ్య, అన్నిటికి నిజరూపమదియే. దానినను సంధించువాడే బ్రాహ్మణుడని వేదాంతశాస్త్ర పరిభాష. విషయ సముదాయ రూపమగు సంపద, నీ హృదయమున స్పందింపకున్నచో (నీ హృదయము విషయ రహిత మగుచో) అపుడు నీవు తెలియదగిన దానిని తెలిసిన వాడవును సంసార సముద్రము నుండి ముక్తునవాడవు నయ్యెదవు. సర్వము బ్రహ్మమే అను అంతరంగిక భావనయే ముక్తి నొసంగును!. అవివేకికి శాస్త్రము భారము. 2. అశాంతుడగు మనుజునకు మనస్సు భారము 3. ఆత్మజ్ఞాన హీనునకు శరీరము భారము.

ద్రష్టయైన దానికి (ఇష్టమైన, ప్రియమైన) దృశ్యపదార్థముయొక్క సంబంధము చేత ఏ ఆనందము బుద్ధియందు తోచుచున్నదో, అది స్వరూపమేయైన ఆత్మనుండియే కలుగుచున్నది. నిశ్చలము, ఆత్మయునైన ఆ యానందమునే (బింబానందము) మేము ఉపాసించుచున్నాము.

స్వరూప నిష్ఠయనెడి బ్రహ్మ జ్ఞానముచే, క్రమేణ సంకల్పశక్తి నాశమొందును.భావనలు భావింపకుండిన, సంకల్పము తానుగా నశించును.

నీవు ఎల్లప్పుడు స్వరూప స్థితి నుండుము. అనగా ఆత్మస్వరూపమునందే నిలిచియుండుము. హృదయము విషయముల చేత కలచివేయబడక ఉండుటయే తరించెననుటకు చిహ్నము, స్వరూప నిష్ఠయనెడి బ్రహ్మాభ్యాస బలముచే క్రమేణ సంకల్ప శక్తి నాశమొందును.జగత్తు మనోమాత్రమని, మిథ్యయని యెఱిగి స్వరూప స్థితి నుండుటలో మనోవాక్కాయముల పరిశ్రమ ఏమియు లేదని తెలిసికొనుము.

తృష్ణ యనెడి కిరాత స్త్రీ, చింతలనెడి దారములతో అల్లిన, వాసన యనెడి వలను చేబట్టి, సంసారమను మడుగులో విసరివేసి జీవులనెడి చేపల బట్టు చున్నది. ఉపాధి యందున్నను నంబంధము లేక యుండువాడను కావున సర్వదా అనంగ స్వరూపుడనగుచున్నాను.

అంతరాంతర రూపుడనగా, దేహేంద్రియము లన్నిటికంటె అంతరుడు అనగా లోపలనుండువాడు; ప్రత్యగాత్మ- ప్రత్యగాత్మ కంటె అంతరుడు పరుడు. పరమాత్మ. ప్రపంచమందుగల సర్వపదార్థములకు "నేను" అధిష్ఠాన రూపుడనగుచున్నాడను. నేనే గొప్పవాడయిన ఆత్మను. నేనే పరాత్పరుడను. సర్వ స్వరూపమైన బ్రహ్మము "నేనే". చైతన్యము నేనే. నేనే "అహం శబ్ద వాచ్యమగుచున్నాను. చిత్తమునందు సాక్షీభూతుడనై యున్నవాడను "నేనే" సకల ప్రాణుల యొక్క హృదయాకాశమునందున్న కామాది వృత్తి సహస్రములను ప్రకాశింప జేయునట్టి చైతన్యమే స్వరూపముగా గలవాడనగుటచేత నేనే "చిత్" స్వరూపుడనగు చున్నాడను. నేను నిత్య ఆత్మ తృప్తుడను. లెక్కింప వీలుకాని వాడనగుట వలన "ఒక్కడను" అని చెప్పుటకు వీలుగాని వాడనగుచున్నాను. ఆత్మ స్వరూపము తనకంటె వేఱుగ ఒక్కటి గలదను భ్రమ తొలగిపోవుట చేతనే ప్రకాశించును కావున శుద్ధ మోక్ష స్వరూపుడను అగుచున్నాడను.

## చతుర్విధాహంకారములు:-

1. పాదము మొదలు శిరస్సు వరకు గలదియు నగు యీదేహము నేను.
2. నేను సమస్త దృశ్య విషయములకంటె వేరైనవాడను. తల వెంట్రుకల కొనలకంటె సూక్ష్మ మైన వాడను.
3. ఈ సమస్తము నేనే. నేను నాశరహితుడను.
4. ఈ సమస్త జగత్తు ఆకాశము వలె సదా శూన్యమే,నేను ఒక్కడనే ఉన్నాను, ఇతడు నా బంధువు, అతడు బంధువు కాదు- అని అల్ప బుద్ధులు యెంచెదరు. విశాల దృష్టిగల మహాత్ములకు విశ్వ ప్రపంచ మంతయు తమ కుటుంబము. దృగ్ దృశ్య సంబంధమే

బంధము లేక మనస్సు.

ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్!
ఆనందా ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే!!
ఆనందేవ జాతాని జీవంతి!
ఆనందం ప్రయన్త్యభి శంవి శన్తీతి!!

పై విషయమును తండ్రి వరుణుడు కుమారుడగు భృగువునకుపదేశించెను. చతుర్ముఖ బ్రహ్మ మహేంద్రునితో " బ్రహ్మ చర్య రహితముగా శాంతి సంతోషములుగాని, గంభీర విషయగ్రహణ శక్తి గాని కలుగదు" అనెను.

సర్వ ద్రష్టయగు పరమాత్మ పునః యోచించెను. "మనుష్య రూపుడగు యీ పురుషుడు నేను లేకుండ ఎట్లుండగలుగును? ఈ జీవాత్మలో నా సహయోగమే లేనిచో యితడు ఒంటరిగ ఎట్లుండగలడు? నా సహకార రహితముగ యీ పురుషుడు వాక్కు ద్వారా భాషింప యత్నించుచో, ఘ్రాణేంద్రియము ద్వారా వాసన చూడ సాగుచో- యిట్లు సర్వేంద్రియములు వానివాని పనుల నిర్వర్తింపగల్గుచో నా ప్రయోజన మేముండును? అనగా నేను లేకుండా యీ పనులు జరుగుట అసంభవము" అని యోచించి పరమాత్మ యీ మనుష్య శరీర సీమ (మూర్ధము)ను అనగా బ్రహ్మరంధ్రమును భేదించుకొని సజీవ మనుష్యదేహమున ప్రవేసించెను. ఈ బ్రహ్మరంధ్రమే (విధృతి= విదార్ణమొనర్పబడినది) ఆనందమును ప్రసాదించునట్టియు, ఆనంద స్వరూపమైనట్టియు, పరమాత్మను ప్రాపింప్తి జేయునదై యున్నది.

మనుష్య రూపమున ఉత్పన్నమైన ఆపురుషుడు భౌతిక జగత్తులోని విచిత్ర సృష్టిని మహాశ్చర్యముగ నాలుగు దిక్కులనుండి చూచి మనసా,"ఈ విచిత్ర జగత్తును సృజించిన వారెవరు? ఇది నారచన కాదే? ఇది కార్యమగుట వలన దీనికి కర్త అవశ్యమొకడుండవలెను' 'అనుకొని యోచించుచుండగా, ఆసాధకునకు తన హృదయములో అంతర్యామి రూపమున విరాజిల్లుచున్న పరమపురుషుడే యీ జగత్సర్వములో వ్యాప్త మాన పరబ్రహ్మ రూపములో సాక్షాత్కరించెను. అంతనతడు పరమానందభరితుడై "ఆహా! ఎంత అదృష్టము. పరబ్రహ్మ పరమాత్మను నేను సాక్షాత్కరించుకొన్నాను" అనుకొనసాగెను.

దీని భావము:- ఈ జగత్తు యొక్క విచిత్ర సృష్టిని తిలకించి దీనికి కర్త, భర్త అయిన పరమాత్మ యొక్క సత్తాలో విశ్వాసముంచి మానవుడతనిని గ్రహించి, పొంది ఉత్సుకుడు కాగలుగుచో, అతని మీదనే ఆధారపడి ప్రయత్నించుచో అవశ్యము అతనిని గ్రహించగలుగును. పరమాత్మను గ్రహించి పొందగలుగుట యన్నది మనుష్య శరీరమునకే సాధ్యముగాని అన్యజీవులకు కాదు. కనుక మానవుడు తన జీవితములోని అమూల్య సమయమును సదుపయోగము చేసికొనవలయును. దానిని వ్యర్థము చేసికొనరాదు.

# 11. ఉపనిషద్వాణి

శ్రీశ్రీశ్రీ మాతా నిరంజనానందగిరివారు. ఆత్మారామాశ్రయం. కొవ్వూరు. విజ్ఞానమే బ్రహ్మ, అంతకు మించి జగత్ స్థితికి ఆధారము కానరావడము లేదు, తన, మన,ప్రాణములను స్వాధీనము నందుంచుకొననిదే , శాంతి లభింపదు.

విజ్ఞాన ప్రకాశములో అంతరాకాశాంతర్గతాంధకారము లీనమై పోయెను. అక్కడ సర్వత్ర ఆనంద తరంగములు వెల్లువికెను. శారీరకముగ మానసికముగా ప్రకాశోత్సాహానందములు వెల్లివిరిసినవి. భావ మహాప్రవాహము నిలిచిపోవుటతో అంతర్జగత్తునందు నిర్మల నిశ్చల శాంతిధార ప్రవహింపసాగినది. ఈ ఆనందముకన్న బ్రహ్మపదార్థము వేఱుగా లేదు. ఆనందము నుండియే సమస్త ప్రాణులు ప్రాదుర్భవించుచున్నవి. ఆనందము వలననే సమస్త ప్రాణులు జీవించుచున్నవి. అంతమందు ప్రాణులు అన్నియు ఆనందమునందే లయమై పోవుచు.... వాస్తవమున కీ యానందమే బ్రహ్మ, వాస్తవముగా దీనికాద్యంతములు అనునవేవియు లేవు,. సర్వత్ర సర్వదా యిది ఏకరూపమై యున్నది. ఆనంద రహితముగా యీ చరాచర జగత్ స్థితి క్షణకాలము కూడ నిలువదు.

| ఇంద్రియము | స్థానము | అధిష్ఠానదేవత |
|---|---|---|
| వాక్కు | ముఖము | అగ్ని |
| ముక్కు (నాశింకారంధ్రములు) | | |
| ఘ్రాణేంద్రియము | ముక్కు | అశ్వినీ కుమారులు. |
| రసనేంద్రియము | నాలుక | |
| నేత్రఛిద్రములు, | నేత్రము | సూర్యుడు |
| కర్ణఛిద్రములు,శ్రోత్రేంద్రియము | కర్ణఛిద్రములు | దిశలు |
| త్వగింద్రియము | చర్మము | |
| మనస్సు | హృదయము | చంద్రుడు |
| గుదేంద్రియము | అపానవాయువు | మృత్యుదేవత |
| ఉపస్థేంద్రియము | స్థానము (నాభి) | ప్రజాపతి. |

## 12. శ్రీమద్భగవద్గీత

భూతోత్పత్తికి కారణమైన ద్రవ్యత్యాగమే కర్మము. ప్రకృతికంటె పరమై నాశరహితమగు ఆత్మ స్వరూపమే బ్రహ్మము. ప్రకృతి సంబంధాది స్వభావమే ఆ ధ్యాత్మికము. నాశమును పొందదగిన వస్తువు అధి భూతము నాయంశమైన పురుషుడే అధిదైవతము, శరీరములందు అంతర్యామియైన నేనే అధి యజ్ఞుడను.

8 యుగములు బ్రహ్మకు ఒకరోజు, బ్రహ్మ యొక్క పగటి ప్రారంభమున ప్రకృతి స్వరూపమునుండి ప్రపంచము లన్నియు నుత్పన్నములగుచున్నవి. రాత్రి ప్రారంభమున ప్రకృతి రూపమందే అన్నియు లయమును బొందుచున్నవి, అందులకు పూర్వ కల్పమున బుట్టిన ప్రాణి సముహమే కర్మ పరాధీనమై పగలు ప్రారంభమందు బుట్టును. రాత్రి ప్రారంభములో లీనమగును.

మూడులు సర్వభూత నియామకంబైన నాపరమేశ్వర స్వరూపము నెఱుంగ జాలకయే మనుష్య శరీరము నాశ్రయించిన నన్ను జూచి అలక్ష్యము చేయుదురు, జయాపజయములందు సమత్వ బుద్ధి కలిగి యుండుటయే యోగమనబడును.

ఎవడు ఆత్మయందే ప్రీతికలవాడును, ఆత్మచేతనే తృప్తి పొందుచున్న వాడును, ఆత్మయందే సంతోషమునొందువాడునునై యుండునో ఆయాత్మ విదునకు చేయదగినది ఏమియులేదు. అనగా వానికి కర్మముతో పనిలేదు.

శ్రీభగవానువాచ: ఓ మహాబాహో!నాయొక్క జగత్సృష్టి యోనియైన ప్రకృతి వలన బుట్టిన సత్వరజస్తమోగుణములు మూడును ప్రకృతి సంబంధమైన దేహమందుండెడి (అవ్యయుడైన) ఆత్మను అరికట్టుచున్న వానివలె నుండును.

ఓ అనఘా! ఆమూడు గుణములలో సత్త్వగుణము నిర్మల మైనందున అది వస్తువు యొక్క యదార్ధస్థితిని ప్రకాశపరచునదియును, ఆరోగ్య జనకమునునై యుండును, అది సుఖమునందును, జ్ఞానమునందును ఆసక్తి కలుగజేసి పురుషుని బద్ధునిగా జేయును.

రజోగుణము కేవల కర్మములందును, తమోగుణము కేవల విపరీత వ్యాపారములందును ప్రవర్తింప జేయుచున్నది. మనము చేయు కార్యములన్నియు త్రిగుణముల యొక్క వ్యాపారములే కాని దేహముచేత చేయబడునవి కాదని యెంచి , త్రిగుణాతీతుడైన జ్ఞాని, తానుచలింపక ప్రకృత్యాత్మ వివేకములో ధీరుడై,దూషణ భూషణములందును, సుఖ దుఃఖములందును మనోవికారములు లేక సంతుష్టుడై యుండును. అయినను అనాదియైన వాసనచే నావిషయమైన తలంపు బాధించుచుండును,

దానికి లోబడక, తన స్వరూపమైన బ్రహ్మ స్వరూప స్థితిలో మెలగవలెను. మనము భుజించుపదార్థములు 1. ఖాద్య2.చోష్య 3. లేహ్య 4.పేయములు.

ఎప్పుడు నీబుద్ధి, ఆత్మ వస్తువు సకల పదార్థములయందు వేరై, నిత్య నిరతిశయమై సూక్ష్మమైయున్నదని యెరిగి, స్థిరముగా నిలుచునో అప్పుడే నీకు యీ యోగ ఫలము సిద్ధించును. జయాపజయములందు సమత్వ బుద్ధి కలిగియుండుటయే యోగమనబడును.

ఎప్పుడు తన ప్రత్యగాత్మ స్వరూపమందే నిలిచి యుండి సంతోషించుచు, మనస్సునందలి సకలమైన కోరికలను బొత్తిగా విడుచునో, అప్పుడు స్థిత ప్రజ్ఞుడనబడును. ఇది పరిపూర్ణావస్థను (కడపటి దశను) బోధించును.

కామము విషయానుభవమందు తృప్తి లేనిది. ఇచ్ఛారూపమైనది. జ్ఞానికి మహా శత్రువైనది. కనుక యీ కామము చేత ఆత్మ జ్ఞానము కప్పబడి యున్నది.

ఊర్ధ్వ, అధో, మధ్యలోకములందు బహువిధ జన్మములను గలిగించునది గావున యీ మనస్సునకు సంసారము (త్రిప్పునది) అనిపేరు, స్వస్వరూపమును ఎఱుగనీక అసత్య పదార్థములను ఆత్మగ జేయునది. కావున దీనికి మోహమని పేరు. "ఉన్నది" అనికాని "లేదు" అనికాని నిరూపించుటకు వీలులేనిదగుటచే దేనికిని బద్ధుడు గాకయుండు ఆత్మునకు రాగ ద్వేషాది బంధములు కల్పించునది యగుటచే దీనికి బంధమనియు పేరు. మరియు సర్వకర్మలకు గారణమగుటచేత "మల" మనియు, అంధకారము వలె తత్త్వమును ఆవరించుట చేత తమస్సనియు దీనికి పేరు.

ఏ పురుషుడు మృతి చెందవలయునో, వాని కర్మములే వానిని సంహరించును, ఇంతకంటె యితరమేదియును లేదు.ఒక్కొక్క జీవుడు వ్యష్టి జీవుడు. సర్వజీవులును ఏకముగ వ్యవహరింప బడినప్పుడు నాతడు, సమిష్టి జీవుడని ఆ సమిష్టి జీవునకే హిరణ్యగర్భుడని పేరు. వ్యష్టి జీవునకు జనన మరణములున్నవి గాని; సమిష్టి జీవునకు జనన మరణములును, సర్వావయవములును ఉన్నట్లు తోచినను ఏవియు లేవు. ఈ విధముగా హిరణ్యగర్భుడు పరాకాశరూపుడై, నిర్వికారుడై, బ్రహ్మమై, మనోమయ రూపుడగు సూక్ష్మ శరీరము మాత్రమే గలవాడు, కావున, అజ్ఞానబలముచే భ్రాంతినొంది, మనస్సు పూర్వ కల్పాను సారముగ ప్రస్తుత ప్రపంచమును సంకల్పించుచున్నది.

**విషయము:-**

వీని సంబంధమే బంధము, వీని ముక్తియే ముక్తి నిర్విషయమైన
చిత్తు (చైతన్యము) బ్రహ్మమే.

## శ్రీ కృష్ణుడు అర్జునునకు చెప్పుచున్నాడు

అర్జునా ! నాకు పర, అపర అనగా శ్రేష్ఠమైనదియు తక్కువైనదియు అని రెండు ప్రకృతులు గలవు. అందు పంచమహా భూతములగు పృథివి, అపస్తేజో వాయురాకాశములును, మనో బుధ్యహంకారములును అను ఎనిమిది భాగములుగా నొప్పుచున్నది. అపరా ప్రకృతిదీనినే ప్రకృతి, మూలప్రకృతి, మాయ, అవ్యక్తము, ప్రధానము అని పెక్కువిధముల పేర్కొందురు. ఇవియే రూపములను లేక ఉపాధులను కల్పించును కనుకనే దీనిని జగన్మాత, జగదంబ యందురు, దీని కంటెశ్రేష్ఠమగు నారవ ప్రకృతి జీవుల నిచ్చునది. దాని వలననే యీ జగత్తు ధరింపబడుచున్నది. ఈ రెండు ప్రకృతులను సముద్రము యొక్క పై లోపలి భాగములతో పోల్చవచ్చును, పై భాగము ఎల్లప్పుడు చంచలమై, కల్లోలముగ బహువిధరూపములను ప్రదర్శించును. లోపలి భాగము దీని కాశ్రయమై స్థిమితముగాను గంభీరముగాను ఉండును.

ఈ రెంటికిని విభాగము వాస్తవముగ లేదు.

సర్వభూతములును, యీరెండు ప్రకృతులనుండి ఉత్పన్నమైనవి . ఎనుబది నాలుగు లక్షల యోనులందుబుట్టు జీవరాసులన్నింటికిని మహత్తత్త్వమే తల్లి రూపము నిచ్చునదినేనే, తండ్రిని, బీజము నిచ్చువాడను, ఈ జగత్తున కంతటికిని ఉత్పత్తి స్థితి లయములకు నేనే కారణము. అనగా సముద్రమందలి కెరటమువలె జగము నాయందు బుట్టి నాయందె లయమగును,

భగవంతుడు అంతటను నిండి , అన్ని జీవరాసులయందును అంతర్యామియై, అతి సన్నిహితుడై యున్నను, జనులాతని ఏలగాంచకున్నారన, జీవరాసులు పుట్టీ పుట్టగనే మాయా , మోహగ్రస్తులగుచున్నారు. ప్రకృతిగుణములు మూడును సామ్యస్థితిలో నున్నపుడు దానిని మూల ప్రకృతి యనియు, అవ్యక్తమనియు, ప్రధానమనియు వ్యవహరింతురు. ఆ గుణములందు కొంచెము న్యూనాధిక్యములు కలిగినపుడు దానిని మహతత్త్వమనియు, మహద్బుద్ధి యనియు పేర్కొందురు. ఇంతదనుక పరమాత్మనుండి అభిన్నముగానున్న మాయాశక్తి పరమాత్మనుండి వెలువడి, సృష్టికి ఉన్ముఖమైనదన్నమాట. ఇటనుండియే ఆది మిథునమగు ప్రకృతి పురుషుల అవిర్భావము. వీరే జగత్తునకు మాతా పితరులు. ఎనుబది నాలుగు లక్షల యోనులందు బుట్టు జీవరాసుల కన్నింటికిని మహత్తత్త్వమే తల్లి, రూపము నిచ్చునది. శ్రీకృష్ణ పరమాత్మయే (పురుషుడు) బీజము నిచ్చువాడు. నాశరహితుడగు దేహిని ప్రకృతి గుణములగు సత్త్వరజస్తమములు మూడును దేహమందు బాధించుచున్నవి. సత్త్వగుణము- స్వచ్ఛమైన దగుటచే కాంతిమంతమును, దోషరహితమును, అయి దేహిని జ్ఞానాసక్తి చేతను సుఖాశక్తి చేతను బంధించుచున్నది. రజోగుణము:- రాగము లేక అనురాగ లక్షణము గలది. దీనినుండి, ఆశ, ఆసక్తి, మమకారము పుట్టుచున్నవి. ఇది దేహిని కర్మ ప్రవృత్తి యందు అసక్తి చేత బంధించుచున్నది. తమోగుణము:- అజ్ఞాన జనకము. అది సర్వదేహులను భ్రమింపజేయును, అదినిద్ర. సోమరి తనము,పరాకు- వీనిచే దేహిని బంధించును,

ధర్మ జిజ్ఞాసకు గాని, బ్రహ్మజిజ్ఞాసకుగాని విషాదమే మూలము. నరులకు తమ దుఃఖములే గురువులన్నారు. మానవ స్వభావము నతిక్రమించిటయే విజ్ఞుల లక్షణము.

విముక్తి పథం, బ్రహ్మ జ్ఞాన పథం, మరణములో- అహంకార మరణంలో, పరిత్యాగమనే దేహ వాసనా మరణమనే, మరణములోనే ఉన్నది. అదివ్య తన్మయతకు యిదే ఏకైక మార్గము. శరీరానికి అతీతులమై దివ్య స్థితికి, (అంతర్ముఖ స్థితికి) అధిగమించడమే మోక్ష మార్గము. శరీరాభిమానం చచ్చి, అహంకృతి నశించి, పరిపూర్ణంగా విషయవాసనా రూపదేహ భావ మరణమే, నిజమైన జీవితానికి మార్గము. అహంకృతి ఉన్నంత కాలం ఆనందం అనుభవించలేరు. పారవశ్యత అంటే అహంకృతి కాక భగవంతుడే పనిచేయడమన్న మాట. క్షుద్రాహంకారం శరీరం మీద అధికారాన్ని వదలినప్పుడు ఆ మానవుడు తన్మయుడు అగును, భగవత్ప్రేరితుడగుచున్నాడు.

భగవద్గీత: అనుభవ జ్ఞానమునకు దారిచూపుటయనెడి ప్రయోజనము. ఆ అనుభూతి కలిగిన మీదట వేదముల అవసరమే లేదు. అవ్విణుడగువానికి కర్తవ్యమే లేదు. జ్ఞానము అనుభవ విషయముగాన, బోధకు విషయముగాదు. జ్ఞ+న=జ్ఞానము (రెండు పదములు) జ్ఞ-అనగా తెలియుట, 'న' యన లేకుండుట. జ్ఞానమన ప్రపంచము యొక్క ఎఱుక లేకుండుట. ఆత్మఅనగా తన (బ్రహ్మ) స్వరూపము,

గట్టున నిలిచి, నీటియందు తన శరీరము యొక్క ప్రతిబింబమును జూదువాడెట్లు జలమందధోముఖముగా కనబడెడి శరీరము తనది కాదని తెలిసికొని, గట్టున నున్న దేహమే

తనదిగా భావించుచున్నాడో, అట్లే నామరూపముల నుపేక్షించి పరబ్రహ్మ చింతనము చేయవలెను.

మనోరథ కల్పిత గృహ, క్షేత్ర, పుత్ర, కళత్రాది, సామ్రాజ్యము, క్షణభంగురమని మనముపేక్ష చేయుచున్నాము కదా! ఇంతకంటె యీ ప్రపంచము నందేమి విశేషమున్నది? ఇదియు నశించునదే కదా! ఇందును మనకు ప్రియమైన వారు నశించుట చూచుచు ఉన్నారము కదా! అట్టియెడ దీనియందేల మనకాదరణ! మనము యీ ప్రపంచము సత్యమని యేల నమ్మవలెను? ఈ ప్రపంచము సత్యము కాదు. ఇది సృష్టికి పూర్వముగాని, ప్రళయానంతరము గాని లేదు. అందుచే దీనియందు సత్యత్వబుద్ధి విడువుము. ఎక్కడ సందులేని యద్దమునందు అనేక వస్తువులతో నిండియున్న గొప్ప ఆకారము ప్రకాశించినట్లు , సచ్చిదానంద స్వరూపమైన బ్రహ్మము నందు యీ ప్రపంచము తోచును.

అద్దమును చూడక అద్దములో ప్రతిఫలించిన వస్తువుల గాంచుట సిద్ధింపదు. అటులనే సచ్చిదానంద స్వరూపమైన బ్రహ్మ ప్రతీతిగానిది, నామరూప జ్ఞానమును కలుగదు.

సచ్చిదానంద స్వరూప బ్రహ్మమునందు గల్పింపబడిన, నామ రూపాత్మక ప్రపంచ విషయమైన బుద్ధివలన, సచ్చిదానంద మాత్రమునే గ్రహించి, నామరూపములను బుద్ధియందు ధరింపకున్న యెడల, నిర్విషయమగు సచ్చిదానంద స్వరూప బ్రహ్మము మాత్రమే బుద్ధికి స్ఫురించును. ఇదియే నిర్విషయ బ్రహ్మ సాక్షాత్కారోపాయము అని భావము.

ఆత్మ వస్తువు, జీవాత్మయనియు, పరమాత్మయనియు ద్వివిధములుగా చెప్పబడెను, ఆ ఆత్మ చైతన్యమునకు స్థూల, సూక్ష్మ కారణములే తాననెడి భ్రాంతి కలుగుట చేత, భోక్తృత్వమును పొంది జీవుడనబడుచున్నాడు.

పరమాత్మ తాను సచ్చిదానంద స్వరూపుడైనను, నామరూపముల తోడను, భోగ్యము తోడను తాదాత్మ్యమును బొంది జీవుడనబడును. జీవాత్మ భేదమును విచారించి తెలిసికొని నప్పుడు భోక్తృ భోగ్యములు, నామరూపములు, తానుగాక, వానికి విలక్షణుడై యుండును. పురుషుడు తాను భోక్తయను నభిమానముచే, భోగ్యమును గోరుచు, శరీరత్రయము ననుసరించి, దుఃఖము నొందుచున్నాడు శరీర త్రయ విలక్షణుడగు ఆత్మయే, "నేనని" తెలిసికొనిన యెడల ఆత్మకెట్టి దుఃఖములును లేవుగాన, ఆ పురుషునకు దుఃఖమే యుండదు.

ప్రజ్వలించుచున్న అగ్ని సమిధలను భస్మీభూతము చేసినట్లు, జ్ఞానాగ్ని సర్వకర్మములను నశింపజేయును.

తత్త్వ జ్ఞానమనగా బ్రహ్మమును గనబఱచెడి (ప్రకాశింపజేసెడి) చిత్తవృత్తి.

ఏ పురుషునకు తాను చేయు కర్మయందభిమానము లేదో, ఎవనియొక్క బుద్ధి కర్మ ఫలాసక్తి లేనిదో, అట్టి అపరోక్ష జ్ఞాని, శరీరము ననుసరించి యీ జనుల నందరిని చంపినను, స్వస్వరూప భూతా విక్రియ బ్రహ్మవిజ్ఞానము గలవాడగుట వలన, పరమార్థదృష్టి చేత చంపినవాడు కాదనియు, అట్టికర్మకు బద్ధుడును కాడనియ తెలియుము.

సార్వభౌముడు మొదలుకొని హిరణ్యగర్భుని వరకు ఉన్నవారు అందఱకు తమకన్నను గొప్పవారైన దేవతలుగా కావలెననెడి వాంఛగలదు. జ్ఞాని నిత్య తృప్తుడు. ఏ వాంఛయు లేనివాడు. కావున నతడు పై జెప్పిన వారందరికన్నను నిజముగా గొప్పవాడు.

జ్ఞాని సర్వ బుద్ధి సాక్షియగు బ్రహ్మమే యగుచున్నాడు. కాన, తన దేహమందలి ఆనందమును తెలిసికొనినట్లు, తాను సాక్షియై యితరుల బుద్ధుల యందలి ఆనందమును తెలిసికొనుచున్నాడు. అందుచే జ్ఞానికి సర్వజీవులయొక్క ఆనందమును, అతడు సాక్షి

స్వరూపుడగువలన కలుగుచున్నది.

జ్ఞాని యెల్లప్పుడును "నేనే" భోగ్యమును, "నేనే" భోక్తను-అని సామగానము చేయుచున్నాడు.

పరలోకములను యిచ్ఛగించెడువారు జ్యోతిష్టోమాది కర్మముల నాచరింతురు గాక, సర్వలోకాత్మకుడనైన నేనెందులకు కర్మముల నాచరించెదను! అతడే పరలోక స్వరూపుడగుట వలన, అతనికి పరలోక వాంఛయులేదు. అందువలన కర్మముల జేయవలసిన పనిలేదు.

బ్రహ్మతత్త్వము తెలియనివారు శ్రవణమును జేయుదురుగాక, సంశయము గలవారు మననము జేయుదురు గాక, సందేహము లేక వస్తుతత్త్వమును ఎఱిగిన జ్ఞానికి శ్రవణ మననాదులతో పనిలేదు. నిత్యము బ్రహ్మ స్వరూపము నేనే యనెడి యనుభవము గల నాకు (జ్ఞాప్రాప్తినికి) క్రొత్తగా సంపాందింపదగిన యనుభవమేమున్నది? నేను కృత కృత్యుడను 1. ప్రాప్తివ్యుడను అనియే నానిశ్చయము,

మనోవృత్తులు:- 1. సాత్విక 2. రాజస 3. తామసములని మూడు విధములు, వైరాగ్యము, ఔదార్యము, ఓర్పు-యివి సాత్త్విక వృత్తులు. అత్యాశయు, ప్రేమయు,కోరికయు,కోపమును -యీ మొదలగునవి రాజసవృత్తులు. మఱపు, భయము మున్నగునవి తామస వృత్తులు. సాత్త్వికములైన అంతఃకరణ వృత్తులయందు, పరబ్రహ్మము యొక్క జ్ఞానానంద స్వరూపములు ప్రతిఫలించును.

బ్రహ్మతత్త్వ పరుడు ప్రతిబంధము వలన ఆజన్మమున బ్రహ్మ సాక్షాత్కారము కలుగదేని దేహత్యాగానంతరము స్వర్గలోకములో మహా సుఖమనుభవించి శ్రీమంతుల గృహంబులలో జనక మహారాజువలెను. అశ్వపతి, కేకయ మహారాజులవలెను జన్మించును.

బ్రహ్మవిచార పరుడు నిస్పృహుడైన యెడల బుద్ధి శాలురగు యోగుల వంశమున శ్రీ శుకుని బోలె జన్మించును. అటుల జన్మించుటకడు దుర్లభము.

నిర్గుణోపాసన చేయు విధము పంచీకరణ వాల్మీకములో చెప్పబడినది. ఇట్టి ఉపాసన జ్ఞాన సాధన యని అందరు చెప్పుదురు. వశీకరణాది మంత్ర జపముచే శీఘ్ర ఫలము కలుగును. వస్తు తత్త్వవిచారము వలన బోధ కలుగును (జ్ఞానము) ఆబోధ అక్కరలేదను యిచ్ఛ కలిగినను, కలిగిన జ్ఞానమును, ఆయిచ్ఛ నివారింపజేయ జాలదు.ఇట్టి బోధ కలిగిన తోడనే ప్రపంచము అసత్యమని తోచును తత్త్వజ్ఞానము కలుగగానే కృతకృత్యుడగును. జీవన్ముక్తిని జెంది విదేహకైవల్యము కొఱకు ప్రారబ్ధమెప్పుడు తీరునాయని చూచుచుండును. ఉపాసన చేయు వానికి శాస్త్ర విచారముతో పనిలేదు. గురువుల యుపదేశమును నమ్మి ఉపాసించును ఉపాసనయనగా భావించెడి వస్తువు దక్క అన్యము మధ్యకాలమున జ్ఞాపకము రాకుండునట్లు ఎడతెగక ప్రవర్తించెడి వృత్తుల ప్రవాహమగునని తెలియనగును, ఉపాసింపబడెడి దైవము తానే యని గట్టి నిశ్చయముకలుగు వరకు ఉపాసననొనర్చి, ఆ నిశ్చయమును జీవితకాలమంతయు నిలుపుకొన వలయును.

ఒకమాటు చూచిన ఘటము అవసరమగునెడ వ్యవహరింపవచ్చును. అటులనే ఒకమారు సాక్షాత్కరించిన బ్రహ్మమును అవసరమగు నపుడు శిష్యులకు బోధింపవచ్చును. తానును ధ్యానింపవచ్చును.

ఒకమాటు చూచిన ఘటము అవసరమైనపుడెల్ల జ్ఞాపకము వచ్చును. అటులనే

స్వప్రకాశమైన ఆత్మ ఘటము కంటెను ప్రసిద్ధము. స్వస్వరూపము గనుక ఎల్లప్పుడు ప్రకాశించును.

జ్ఞాని యొక్క వ్యవహారమునకు ప్రపంచ సత్యత్వముతో పనిలేదు. ఆత్మ జడమని గ్రహింప పనిలేదు, మఱియేమన, మనోవాక్కాయాదులును, శబ్ద స్పర్శాదులును నగు వ్యవహార సాధనములుండిన ఆ వ్యవహారములు నెరవేరును. తత్త్వవిదుడు వాని నసత్యములుగా భావించును, కాని వాని రూపుమాపలేడు. బ్రహ్మవిదునకు వ్యవహారము గల్గుటకేమి యభ్యంతరము ఉన్నది? బ్రహ్మ విదుడు వ్యవహరింపవచ్చును.

నాడులయందు జాగ్రద్వాసనలచే అంతఃకరణమున తోచెడి అంతర ప్రపంచము స్వప్నమనబడును.

ప్రశ్న॥ సాధకుడు ఎల్లప్పుడు ఏల ఆనంద రూపుడై యుండవలెను?

సంతోషము దేవతలకు ప్రీతి గొల్పును. దేవతలు ప్రసన్నులై వరములు ఒసంగెదరు. దుఃఖములను వారించెదరు.

స్థూల శరీరము అన్నమయకోశము. సూక్ష్మ శరీరము కోశత్రయాత్మకము (ప్రాణ, మనో, విజ్ఞాన),కారణ శరీరము ఆనందమయ కోశము. ప్రియ, మోద, ప్రమోద-యీ మూడింటి రూపమే ఆనందమయ కోశము.

బ్రహ్మ సాక్షాత్కారమునకు (మోక్షప్రాప్తికి) ఏయే సాధనములను జేయవలెను. ఎట్లు ప్రవర్తింపవలెను?

1.బుద్ధిని మిగుల నిర్మలముగా నొనర్చుకొనవలెను.
2.ధైర్యముచే యింద్రియ మనంబులను స్వాధీనము చేసికొనవలెను,
3.శబ్ద స్పర్శాది విషయములను త్యజించ వలయును.
4.రాగ ద్వేషములను విడిచిపెట్టవలయును.
5.ఏకాంత స్థలము నాశ్రయించవలెను.
6.మితా హారమును సేవించవలెను.
7.వాక్కును ,శరీరమును, మనస్సును స్వాధీనమునందుంచుకొనవలెను
8.నిరంతరము ధ్యాన యోగ తత్పరుడై యుండవలెను.
9.వైరాగ్యమును లెస్సగ నాశ్రయించవలెను, తీవ్ర వైరాగ్యము కలిగియుండవలెను.
10.అహంకారమును, దుష్ట కార్యమునకు ఉపయోగించు బలమును (లేక బలాభిమానమును) దర్పమును, కామమును, క్రోధమును, పరిగ్రహమును, బాగుగ వదలి వేయవలెను.
11.మమకారమును పోగొట్టుకొనవలెను.
12. శాంతచిత్తుడై యుండవలెను.

నిర్మలమైన బుద్ధితో గూడిన వాడును, ధైర్యముతో మనస్సును నిగ్రహించు వాడును, శబ్ద స్పర్శాది విషయములను విడిచిపెట్టువాడును, రాగద్వేషములను పరిత్యజించువాడును, ఏకాంత స్థలమునందు నివసించువాడును, మితాహారమును సేవించువాడును;వాక్కును,శరీరమును, మనస్సును స్వాధీనము చేసికొనినవాడును,, ఎల్లప్పుడును ధ్యానయోగ తత్పరుడై యుండువాడును, వైరాగ్యమును లెస్సగా అవలంబించినవాడును, అహంకారమును, బలమును (కామ క్రోధాది సంయుక్తమగు

బలమును లేక మొండిపట్టును) డంబమును, కామమును (విషయాసక్తిని), క్రోధమును, వస్తుసంగ్రహణమును, బాగుగ వదలివైచువాడును,, మమకారము లేనివాడును, శాంతుడును అయియుండువాడు బ్రహ్మస్వరూపము నొందుటకు(బ్రహ్మైక్యమునకు -మోక్షమునకు) సమర్థుడగుచున్నాడు.

ఈశ్వరుడు జీవులను అతి సమీపమున (హృదయమునందు గూడ) (ఆత్మ రూపమున) అధివసించుచున్నాడు. కావున భగవత్సాన్నిధ్యమును ఎల్లప్పుడు అనుభవించుచు పాపాచరణము లేక భక్తియుక్తులై మెలగవలెను.జీవుడు చేయు ప్రతి కార్యమును సంకల్పించు సమస్త సంకల్పములను ఈశ్వరుడు సాక్షి మాత్రుడై సదా వీక్షించుచునే యుండునని ఎవరును మరువరాదు. కావున హృదయమున బాహ్యమున సర్వత్ర ఈశ్వరు సన్నిధిని సదా భావించుచు, ధర్మమును, సత్యమును మరువరాదు.

సకల జీవులయొక్క హృదయస్థానమున ఏ పరాత్పరుడు(ఏ పరమాత్మ, ఏ సర్వేశ్వరుడు) నివసించుచున్నాడో అతనిని సర్వవిధముల శరణు బొందుటయే బంధవిముక్తికి ఏకైక ఉపాయము. మాయయొక్క శక్తి ఒక్క భగద్భక్తికి తప్పమఱి దేనికిని లోబడదు. ప్రాపంచక శక్తులన్నియు మాయాశక్తి కిన్ని, మాయాశక్తి దైవశక్తికిన్ని (ఈశ్వర శక్తికిని) లోబడియున్నవి. కావున, మాయాధీనులగు జీవులందరును మాయామోహమగు సంసార చక్ర పరిభ్రమణమును దాటివేయవలయుననిన మాయాధనుడగు పరమాత్మను శరణు పొందవలయును. అనగా శరీర, వాఙ్మనంబులతో పరిపూర్ణముగ దృశ్య విషయములపై మనస్సు పంపకము జేయక భగవంతుని ధ్యానింపవలెను.

భగవంతుని అనుగ్రహము సంపాదింపక తక్కిన ఎన్ని ఉపాయములను గావించినను, మాయాబంధము తొలగదు. ఇదియే శాశ్వత కైవల్య పదవికి మార్గము,

మోక్షమునకు ఎవరు దారి చూపుదురాయని చింతింపపని లేదు. వారి వారి హృదయమును, మనస్సును భక్తి సంయుతముగ, పవిత్రముగ ఉంచుకొనిన చాలును. సద్గురువులను భగవానుడే వారి చెంతకు పంపును, లేక వారినే సద్గురువుల యొద్దకు జేర్చును, లేక తానే వారి హృదయమున సద్బోధనలను గావింపజేయును

నాయందు మనస్సు నుంచుము. నాయెడల భక్తి కలిగియుండుము. నన్నారాధింపుము. నాకు నమస్కరింపుము, అటుల గావించితివేని నీవు నన్ను పొందగలవని భగవానుడు ప్రతిజ్ఞ చేసి చెప్పుచున్నాడు. ఈ వాక్యమునందు కర్మ, భక్తి, ధ్యాన, జ్ఞానములను నాలుగు సాధనములున్నవి. జీవులు కర్మయను ప్రమిదయందు భక్తియను నూనెను పోసి, ధ్యానమను వత్తిని వేసి, జ్ఞానమను జ్యోతిని వెలిగింపవలెను.

భగవంతునారాధించుటకు పెక్కు మార్గములు, కర్మములు, ధర్మములున్నప్పటికి, అవి గజిబిజిగానుండి మనస్సునకు విక్షేపమును కూడ కలుగజేయవచ్చును. కాబట్టి ఒక్కదానినే ఆశ్రయించుట శ్రేయస్కరము. ఆ ఒక్కటి యేది? దేనిని తెలిసికొనినచో సమస్తము తెలియబడిన దగునో, దేనిని పొందినచో సమస్తము పొందినది యగునో అట్టి ఆత్మవస్తువును (బ్రహ్మ వస్తువును) (భగవంతుని) ఒక్కనిని ఆశ్రయించిన చాలును. ఇతర గొడవలతో, యితర సాధనములతో, యితర ధర్మములతో, యితర కర్మలతో పనిలేదు. కావుననే వాని నన్నిటిని వదలి, తనొక్కనినే శరణు పొందుమని భగవంతుడు ఉపదేశించెను.



## శ్రీకృష్ణుని అంతిమోపదేశము:-

ప్రతివారును తాము పారాయణము చేయునపుడుగాని తత్త్వవిచారణ సలుపునపుడుగాని, ధ్యానమొనర్చునపుడుగాని, మనస్సును బహిర్ముఖముగ పోనీయక ఏకాగ్రముగ నుంచుకొనవలెను.

"మనస్సును ఏకాగ్రముగ నుంచుకొని శ్రవణాదులనొనర్చి, అజ్ఞానమును సమూలముగ నశింపజేసికొనుము".

వినిన బోధ లెస్సగ స్మరించుటయే సంస్మరణము. వినిన యర్థమును మాటిమాటికి మననము చేయుటయే నిధిధ్యాసము.

## కృష్ణం వందే జగద్గురుం: పరాప్రకృతుల స్వరూపము:

ఏది జీవ రూపమైనదో, దేని చేత యీ జగత్తంతయు ధరింపబడుచున్నదో అది పరా ప్రకృతి యనబడును. ఇదియు అపరాప్రకృతి వలె భగవంతుని (పురుషుని) అధీనమై యున్నది. కనుకనే నాయొక్క ప్రకృతి అని చెప్పబడినది. ఇక పరాప్రకృతి యనగా నెట్టిదో, అపరాప్రకృతియనగా నెట్టిదో దృష్టాంతము ద్వారా తెలిసికొందము. ఒక కుండ గలదు. దానిలో నీరున్నది ఆనీటిలో సూర్యుడు ప్రతిబింబించెను అనుకొనుడు. ఇచ్చోట ఘటము దేహము. జలము మనస్సు సూర్యప్రతిబింబము (చిదాభాస రూపుడగు) జీవుడు. సూర్యుడు పరమాత్మ. ఘటము కాలము అపరప్రకృతి: సూర్యప్రతిబింబము పరాప్రకృత, ఈ రెండంటికంటె విలక్షణుడగు సూర్యుడు పరాప్రకృతులకు అతీతుడగు పురుషుడు (భగవంతుడు) శ్రీ శంకరాచార్యులవారును వివేక చూడామణి యందీవిషయమును స్పష్టముగ నిరూపించెను. యుండిరి. వికారములన్నియు.ఘట, జల, ప్రతిబింబములకే కలుగునుగాని సూర్యునకెట్లు కాదో, అట్లే సమస్త జగద్వికారములన్నియు పరాప్రకృతులకే కలుగునుగాని, తద్విలక్షణమైన ఆత్మకుకాదు. అపరాప్రకృతియగు పంచభూతాదులు జడములు. పరా ప్రకృతియగు చిదాభాసుడు ఆభాస చైతన్యరూపుడు, జీవరూపుడు. కాబట్టియే, జీవభూతమైనట్టి యీ పరాప్రకృతిచే జడమగు యీ జగత్తు ధరింపబడుచున్నది. (ధార్యతే), అద్వైత విచారణయందీ రెండు ప్రకృతులున్ను మిధ్యయేయగుచు, ఆభాస రూపములుగనే నిశ్చితములై తద్విలక్షణుడైన పురుషుడు (ఆత్మ) ఒకడే సత్యముగ తేలును. కాబట్టి ముముక్షువు అగువాడు పరాప్రకృతుల రెండిటిని దాటి సాక్షియగు ఆత్మను చేరవలెను. జీవత్వమనునది జడత్వము కంటె ఒకింతమేలైనను, అదియు ప్రకృతియందు అంతర్గతమే కావున మిధ్యయె అయి యున్నది. స్వప్నమందు రాతికి, జీవునికి గల భేదమే అపరా, పరప్రకృతులకును కలదు.

స్వప్నమందలి జీవుడు, స్వప్నమందలి రాతికంటే కొంత మెఱుగే యైనను, రెండును స్వప్నరూపములే కనుక వాస్తవముగ లేనివే అయియున్నవి. మేలుకొనిన వాడొకడే సత్యము అట్లే ఎవనియందీ పరాప్రకృతులు రెండును ఆభాస రూపములై వర్తించుచున్నవో, అట్టి సర్వాధారుడగు (ఆత్మ) అధిష్ఠాన పరమాత్మయే సత్యము. ఈ విషయమును ముముక్షువు చక్కగ గుర్తెరిగి జీవ జగత్తులకు విలక్షణుడైన సాక్షియగు ఆత్మను సాక్షాత్కరించుకొని బంధవిముక్తుడు కావలెను.

## శ్రవణ మనన నిధి ధ్యాసల ఫలితము:-

జీవుడు బంధ రహితుడై, అతి హర్షమును, ఆత్మానందమును. పొందును. మాటిమాటికిని సంతోషార్ణవమున నోలలాడుచుండును.

**భాగవత ధర్మములు:-**

1. సర్వసంగ పరిత్యాగము
2. సాధుసంగము 3. లోకులతో యధోచిత వ్యవహారము
4. పవిత్రముగ నుండవలయును, కామ క్రోధాదులను విడచుటచే అంతర పవిత్రత కలుగును.
5. తపము. ప్రాణాయామము (పరమతపము)
6 తితీక్ష: ప్రారబ్ధ వశమున లభించిన దానిని స్వేచ్ఛగా ననుభవించుట. ఏదైన దుఃఖము సంభవించిన, దానిని నివారించుకొనుటకు ప్రయత్నమొనర్ప రాదు. ఎంతటి దుఃఖము సంభవించినను సహింపవలెను.
7. మౌనముగనుండుట. అనగా వాక్సంయమము. ఈ ప్రపంచమున భగంవంతుడు తప్ప అన్నియు అసత్యములే, మాటలాడుటయే అవసరమైనచో భగవానుని గూర్చియే పలుకవలెను.
8. స్వాధ్యాయమొనర్పవలెను, అనగా నిష్టమంత్ర జపమును ధార్మిక గ్రంధ పఠనము
9. ఋజుత్వమును గలిగి యుండవలెను. (త్రికరణశుద్ధి)
10. బ్రహ్మ చర్య వ్రతమును పాటింపవలయును (వీర్యరక్షణయే)
11. అహింసాచరణమొనర్పవలయును. బ్రతుకదలచిన ప్రాణిని సాధ్యమైనంత వఱకు హింస చేయకుండవలయును. (అహింస)
12. సర్వత్ర ఆత్మ దర్శనము:- తత్త్వమొక్కటియే యని తెలియవలెను.ఆత్మ ఒక్కటియే, రెండవ దేదియుసు, లేదు.
13. కైవల్యము నభ్యసింపవలయును. అనగా ఏకాంతసేవన మొనర్పవలయును. తనలో సర్వమును జూడగలగు స్థితి నేకాంతమున అభ్యసించుటచేతనే సంభవించును, నిర్జన స్థానమున గూర్చుండి వాసనలను క్షయింప జేసికొనుము.
14. అనికేతనుడవు కమ్ము (మమకార రహితుడవు కమ్ము),
15. శుచిగ నుండుము,
16. యధాలాభ సంతుష్టి; దైవవశమున నేది లభించినచో, దానితోడనే సంతుష్టిని జెంది యుండవలయును.
17. భగవత్సంబంధములైన శాస్త్రములను శ్రద్ధతో జదివి భక్తి భావము హృదయంగమము గావించుకొనవలయును.
18. ఇతర శాస్త్రములను నిందింపరాదు.
19 మనస్సు, వాక్కు, శరీరములతో చేయు కర్మలపైనను, సంయమము (కట్టుబాటు) కలిగియుండవలయును.
20. సత్యమును పలుక వలయును.
21. శమ, దమాదులనభ్యసింప వలయును (బాహ్య, అంతరింద్రియ నిగ్రహము).
22. శ్రీహరి యొక్క జన్మ, కర్మ, గుణములను, శ్రవణమొనర్చుట ముఖ్యము.
23. శ్రవణముతో బాటు, కీర్తనము జేయవలయును.
24. భగవానుని ధ్యానింపవలెను.
25 .సమస్త కార్యములను భగవానుని కొఱకే జేయవలయును.
26. సమస్తమును భగవదార్పణముగా భావింపవలెను.
27. జప తపములందు చిత్తమునందు, భగవంతునినే లగ్నము చేయవలెను.
28. దేశాచార, కులాచార, సదాచారములనుపాటించుము.

29. భగవానునకు సర్వార్పణ మొనర్పుము.దేనిని నీదనుకొనుచున్నావో, దేనియందు నీకు మమకారమున్నదో దానిని పరమాత్మ కర్పింపవలయును.
30. భాగవతులను ప్రేమింపుముజ
31. అందఱకును శ్రద్ధతో సేవలొనర్పుము. జంగమ ప్రాణికి సేవలొనర్చుట కర్తవ్యము. 32. భగవద్గుణ కథోప కథన మొనర్పవలయును, ఎల్లప్పుడును భగవంతుని గూర్చియే మాట్లాడ వలెను.

## 13. ఆత్మయొక్క స్వరూపలక్షణము:-

### "ఆత్మ" అంటె ఏమిటి?

మనసంస్కృతి, మన నాగరికత, "ఆత్మ" అనేశబ్దాన్ని సృష్టించింది. అనేక మంది భారతీయుల, సామూహిక కోరిక, సంకల్పం, "నాగరికత" అంటారు. నశించనిది. ఒకటుండాలని భావించారు. కనుక, "ఆత్మ" భావం. నెలకొల్పారు.

అపుడపుడు, ఒకరిద్దరు, చావులేని, అసాధారణస్థితిని కనుగొని ఉండవచ్చు దానిని "శాశ్వతము" అన్నారు. ఇకమంద బుద్ధులందరు "అవును' ఇది నిజం, అయిఉండాలి, అతడు సరియైయుండాలి వాళ్లకు శాశ్వతమైనది కావాలి. కనుక, "ఆత్మ" అనే పదాన్ని వట్టుకున్నారు. "అనుభవం" అని పిలుస్తున్నదంతా, ఇంద్రియ జనితమైనదే. విషయసముచ్చయం, సంపూర్ణమైనది కాదు.నిత్యనవ్యానందమే సంపూర్ణమైనది. అదే "బ్రహ్మము".

### జీవేశ్వరానుబంధ తరంగము:

బ్రహ్మము పంచక్లేశ రహితుడు, జీవుడు పంచక్లేశ సహితుడు అగుటచే వారిద్దఱకేకత్వము సంభవింపక పోయినను జీవసాక్షికి బ్రహ్మముతో నేకత్వము సంభవించును. కర్తయు భోక్తయునైన సంసారియొక్క విశేష్యభాగము సాక్షియనబడును. ఆ సాక్షికి సంసారియందుగల సంసారి ధర్మము లేవియు అనగా క్లేశాది ధర్మములు ఏవియు సంభవింపవు. సాక్షిని , నిషేధించినచో సంసారియే లేక పోవును. ఒకే చైతన్యము నందు సాక్షి భావమున కంతఃకరణము పాధిగ నున్నది. కర్తృ భోక్తృ భావమునకు విశేషణముగ నున్నది. ఉపాధిగల వానిని ఉపహితుడందురు. విశేషణ హితుని విశిష్టుడందురు.

అంతఃకరణము ఎంతప్రదేశమున నుండునో అంతప్రదేశమున ఉన్న చైతన్యమును సాక్షి సంజ్ఞచే చూపించి ఆ అంతఃకరణము వేరుగానుండును. అందువలన అంతఃకరణము సాక్షికి ఉపాధి యనబడెను. ఆ అంతఃకరణ ప్రదేశమందు మాత్రముండుచు అంతఃకరణముతో గూడక వేరుగ నుండు చైతన్యము" సాక్షి" యనబడును.

కుండలముల గల పురుషుడు వచ్చెను' అనునపుడు ఆ పురుషునికి కుండలములు విశేషణములగును, అట్లే అంతఃకరణ విశిష్ట చేతనమని చెప్పినపుడు కర్తృత్వ భోక్తృత్వాది ధర్మములుగల అంతఃకరణము చైతన్యమునకు విశేషణ మగుచున్నది. కావున సంసారిక అంతఃకరణము విశేషణమని చెప్పబడెను. విశేషణమగు సాభాసాంతః కరణముతో కూడియున్న చైతన్యమే సంసారియనబడును. ఈ సంసారియందే రాగద్వేషాది క్లేశములును కర్తృత్వ భోక్తృత్వాది ధర్మములును గలవు. కాని సాక్షియందివి యేవియులేవు. సంసారియందు కూడా విశేషణ భాగమైన శుద్ధచైతన్యమునందేవియులేవు. సంసారియొక్క విశేష్య భాగమైన సాభాసాంతఃకరణమునందు మాత్రమే యివి కలవుగాని విశేష్య భాగమైన

శుద్ధచైతన్యమునందేవియులేవు, సంసారియొక్క విశేష్యభాగమైనశుద్ధ చైతన్యమునకును, సాక్షి చైతన్యమునకును ఏ భేదము లేదు. ఒకే చైతన్యము సాభాస అంతఃకరణము

గూడినచో సంసారియనబడును. ఆ సాభాసాంతఃకరణమును విడిచినచో శుద్ధ చైతన్యము సాక్షియనబడును సాక్షి సంసారులు యిరువురకు విశేష్యభాగము నందే భేదము లేదు. సాక్షి సర్వ క్లేశ రహితుడని వేదాంత సిద్ధాంతము. సంసారియొక్క విశేషణ భాగమైన సాభాసాంతః కరణమునందే క్లేశములు గలవు. కావున ఆ సాభాసాంతఃకరణ విశిష్టుడగు జీవునకు బ్రహ్మముతో నేకత్వము సంభవింపదు. కాని ఆ అంతఃకరణోప హితమైన సాక్షికి బ్రహ్మముతో నిత్యమగు నేకత్వము సంభవించుచున్నది.

సాభాసాంతఃక పరిణామములైన సుఖ దుఃఖములును, వాని జ్ఞానములును, సాక్షి చేత ప్రకాశింపబడుచున్నవి.

చైతన్య స్వరూపమగు ఆత్మ తాను స్వయముగ ప్రకాశించుచు, సమస్త పదార్థములను అంతఃకరణ పరిణామ రూపమగు మనస్సును ఉపాధిగా చేసికొని ప్రకాశింపజేయుచున్నాడు. ఇట్లు నిరుపాధికుడగు స్వయం ప్రకాశాత్మయు, మనస్సును, దేహేంద్రియాదులును, అంతరమైయున్న యంతః కరణమును, దాని వృత్తులను, బాహ్యములగు సమస్త పదార్థములను స్వయముగనే ప్రకాశింపజేయుచున్నది. ఈ స్వయం ప్రకాశాత్మయే "నేను". నేనే సర్వకాల సర్వావస్థలయందును సమస్త పదార్థములను జాగ్రదాది త్రివిధావస్థల యందు నెఱుంగుచున్నాను. కావున. నేను "చిద్రూపుడను". సర్వోత్కృష్టమై , స్వతస్సిద్ధమై, నిత్యమై,నిరతిశయమై, సర్వదుఃఖ నివర్తకమై, నిరుపాధికమై, సుషుప్తియందు అందఱిచేతను అనుభవింపబడుచున్న ఆనందమే "బ్రహ్మానందము" ఈ బ్రహ్మానందమునే ప్రతి ఒక్క జీవియు అనుభవించిన తదుపరియే మోక్షరూప సామ్రాజ్యమునకు అధి పత్యము లభింపగలదు. అంతదనుక ఏ జీవికైన కైవల్యప్రాప్తికి తరుణోపాయము నిరర్థకమని దృఢ నిశ్చయ జ్ఞానులగుదురు.గాక!

ఆత్మకు ఆనందత్వము సర్వదా స్వతస్సిద్ధమై యున్నప్పటికిని, ఆత్మయందు తోచెడి దేహేంద్రియాదుల కల్పిత సంబంధము వలన, జాగ్రత్స్వప్నముల యందు ఆత్మ సుఖము మరుగున పడుచున్నది. బహిర్ముఖ చిత్తుడైన యజ్ఞాని జాగ్రత్ స్వప్నముల యందు విషయముల వలన గలిగెడి సుఖ మాత్మ సుఖమని యెఱుంగ జాలకుండినను , అంతర్ముఖుడైన జ్ఞాని సర్వావస్థలయందును, సర్వ విషయముల మూలముననుు, అనుభవించెడి సుఖము, ఆత్మ సుఖమేయని తలంచుచున్నాడు కావున సుషుప్తియందు సర్వజీవులనుభవించుచుండెడి ఆత్మ సుఖమే అవస్థాత్రయమునందును నున్నది. కాని దానిని అజ్ఞాని యెఱుగజాలడు. జ్ఞాని మాత్రమే యెఱుంగుచున్నాడు. అందువలన ఆత్మ సుఖము నిత్యమనియు, నిరుపాధిక మనియు, నిరతిశయమనియు చెప్పబడుచున్నది.

ఆత్మ సర్వకాల సర్వావస్థల యందును, పరమ ప్రియుడగును. కావున ఆత్మకంటె భిన్నములుగ సమస్త పదార్థములును దుఃఖ స్వరూపులు అగును. సర్వ రూపధనాదులు ఇంద్రియాది ప్రాణము, శరీరము కంటెను గూడ ఆత్మయే ప్రియతమమైనదని తెలియబడుచున్నది.

ఈ సచ్చిదానంద రూపమగు ఆత్మ , సర్వదేశ, సర్వకాల సర్వ వస్తువులందు నధిష్ఠాన రూపమై వ్యాపించి యుండుటచే అది "బ్రహ్మము" అనబడును. ఈ బ్రహ్మము ఆత్మకంటె భిన్నము కాదు. ఇద్దఱు ఒక్కటే.

"ఆత్మ" అనగా తన (బ్రహ్మ) స్వరూపము (భగవద్గీత), నాశరహితుడగు దేహిని , ప్రకృతి గుణములగు సత్వ రజస్తమములు మూడును దేహమును బంధించుచున్నవి.

ధర్మ జిజ్ఞాసుకు గాని, బ్రహ్మ జిజ్ఞాసుకుగాని విషాదమే మూలము. నరులకు తమ దుఃఖములే గురువులు -అన్నారు. విజ్ఞులు,

మానవ స్వభావమును అతిక్రమించుటయే విజ్ఞుల (విజ్ఞాన) లక్షణము .మోక్షకామి యగు మానవుడు నిరసించవలసిన పంచవిధ భ్రమలు:-1. జీవేశ్వరులు భిన్నరూపులు అనునది మొదటి భ్రమ.2. తనయందు (ఆత్మయందు) కర్తృత్వ గుణము రెండవది. 3. శరీర త్రయముతో గూడి జీవుడు సంగియై యున్నాడనుట మూడవ భ్రమ 4. జగత్కారణ రూపము (బ్రహ్మము)నకు వికారత్వము గలదనుట నాల్గవ భ్రమ.5.కారణముకంటె భిన్నమైనట్టి జగత్తు యొక్క సత్యత్వము ఐదవ భ్రమ.

భ్రమల విపులార్థముః- 1. తాను మానవుడనని, ఈశ్వరుడు వేరని భావించుట.2. జీవుడు వేరు, జగత్తు వేరు నను భావన. 3. జీవులు పరస్పరము భిన్నులను భ్రమ 4. ఈశ్వరుడు వేరు, జగత్తువేరు అను భ్రాంతి 5. జగత్పదార్థములు పరస్పరము వేరుగా నున్నవను తలంపు.

పంచభూతముల సత్త్వగుణము వలన జ్ఞానేంద్రియాంతఃకరణములును, రజో గుణమువలన కర్మేంద్రియ ప్రాణములును, తమోగుణమువలన స్థూల శరీర విషయములును కలిగెను, కావున నివి గుణములనబడెను.

ఇందు రాజస, సాత్త్విక గుణములగు, ఇంద్రియాంతఃకరణములు తామస గుణములగు విషయములయందు ప్రవర్తించుటచే కర్మలరూపము దాల్చు చున్నవి. తత్త్వ వేత్త యీ గుణ కర్మల ప్రకాశింపజేసెడి సాక్షియేతానని తలంచును. అజ్ఞాని వీనికి భిన్నముగ తలంచును,

యోగము=ఏకత్వము చెందుట; క్షేమము= బ్రాహ్మీస్థితిని రక్షించుట

సంచిత కర్మములు, ఒక్క బ్రహ్మ జ్ఞానము ద్వారా మాత్రమే నశించునుగనుక ప్రతియొక్క మానవుడు యీ జన్మలోనే బ్రహ్మజ్ఞాన సముపార్జనకై తీవ్రతర కృషి చేయుదురు గాక, మఱియు నీజన్మలోనే కర్మ రాహిత్యమైన వానికి "ఆగామి" అనునదే ఉండదు. ఈ లోకములో తన ప్రయత్నరూపమగు కర్తృత్వమున్నంతవరకు ఎవరికిని రక్షణ జరుగదు.

వేదాంతునికి తన శుద్ధ విజ్ఞానమే గురువు. ఎవరికైనను నిజముగ ఆత్మోద్ధారణ వారి వలననే జరుగ వలయును. అనగా తనను తానే తన బుద్ధిచే, తనేఎఱుగనగును. కేవల అనుభవశాలికే తత్త్వజ్ఞానముకలుగును. ఇది యదార్థతత్త్వబోధము.

అవిద్యా కామ కర్మాది వాసనలుగల అంతఃకరణము, ఆ అంతఃకరణము నందు గల కూటస్థ చైతన్య (చిదాభాసుడు) ప్రతి బింబము, అధిష్ఠానమగు కూటస్థ చైతన్యము కూడి (వ్యష్టి) జీవుడనబడును. మాయ, మాయయందలి చిదాభాసుడు, మాయాధిష్ఠానము కూడి (సమిష్టి) ఈశ్వరుడు అనబడును.

జీవేశ్వర సంబంధ (విడి విడి, త్రిత్రయ సంబంధ) ముతో, మహా వాక్యార్థమును గ్రహించినచో ప్రత్యక్ (జీవ) బ్రహ్మైక్య రూపమగు అఖండార్థ జ్ఞానము కలుగుచున్నది. (అంతర్యామి సర్వజ్ఞుడు) ఈశ్వరునకు విశేషణమగు మాయ, శుద్ధ సత్త్వ ప్రధాన మగుటచే, అది తనయందున్న చిదాభాసునకు ఆవరణము కలిగించుటలేదు. కావున ఈశ్వరుడు ముక్తుడు. ఇందు మాయా స్వరూపుడగు చిదాభాసుడు సృష్టి, స్థితి, లయ కార్యములను చేయుచున్నాడు. కాని, మాయాధిష్ఠానమగు శుద్ధ చైతన్యము ఏకార్యమును చేయుటలేదు.

అధిష్ఠానమగు విశేష్య శుద్ధ చైతన్యము జీవునియందును, ఈశ్వరుని యందును ఒక్కటియే యగును.

ఈశ్వరునియందు ఆవరణము లేదు కావున ఈశ్వరుని సంబంధియైన చిదాభాసుడు నిత్య ముక్తుడు. జీవునియందు ఆవరణముండుటచే, జీవ సంబంధియైన చిదాభాసుడు

బద్ధుడు.

జీవుని విశేష్యభాగమైన కూటస్థుడును, ఈశ్వరుని విశేష్యభాగమైన బ్రహ్మమును ఎప్పుడును అభేద్యమే. కావున వీరి ఏకత్వము ముఖ్యసామానాధికరణ్యమనబడును.

ఆత్మ, మానవులు, పశు పక్ష్యాది జీవరాసులన్నింటియందును ఏకముగ నుండినను, బింబము కలుగ, అంతఃకరణ దోషమువలనే భేదము లేర్పడుచున్నవి, సాధకుడు తనకు గల బంధనములు, పరిచ్ఛిన్నముల నెల్ల తొలగించి తన సన్నిహిత అనుభవముగ బాహ్యమున కనబడు శాశ్వత సచ్చిదానందమే తన నిజ స్వరూపమని అనుభవించవలెను.

పూర్వ వాసనా ఫలితముగ, మనస్సు బాహ్య ప్రపంచమును చూచుచున్నది. ఆత్మ సాక్షాత్కారమునకు బ్రహ్మవిద్యయే ఏల ముఖ్యమగు సాధనము ఎట్లు అగుచున్నది?

బ్రహ్మ విద్యయందు కర్మ అనగా పూజ, ప్రార్థన, జపము, సత్సంగము, ధ్యానము, ఆలోచనలు లేక పోవుటచే "మనస్సు లేదు". మనస్సు లేకపోయినచో యోగికి బ్రహ్మను భవము కలుగుచున్నదని శృతి తీర్మానము.

అంతర్ముఖుడవు కా. సర్వము తనంత తానే సంభవించును. అంతర్ముఖ నిశ్శబ్దమే అనంత పూర్ణానందము. మనయందలి అంతరాత్మయే, సర్వ వ్యాపక పరమాత్మయని తెలిసికొనినచో, మనభ్రమలు, సర్వ దుఃఖములు తొలగుచున్నవి.

కర్మ సూత్రం ప్రకారం మానవుని ప్రతి కోరిక చివరకు తీరి తీరవలసిందే. కోరిక యీ విధంగా మానవుని పునర్జన్మ చక్రానికి కట్టేసిన గొలుసన్నమాట.

# బ్రహ్మస్వరూపము

**జ్ఞానరూపమగుబ్రహ్మమే స్వప్రకాశము**, ఇదియే దేవ శబ్దము చేత చెప్పబడుచున్నది. అట్టి ఆ చైతన్యమే సంకల్ప శక్తి వలన, క్రమక్రమముగ జడరూపమును, భావించుచువచ్చి దృశ్య రూపముగా మారుచున్నది. కావున దృశ్య ప్రపంచమునకును, ఆచైతన్యమునకును భేదమే లేదు. పిమ్మట దేశ కాలాదిశక్తులు క్రమక్రమముగా విజృంభించును. వానిచేత జుట్టబడి అప్పుడు క్రమక్రమముగ జీవరూపమును, అక్కడనుండి బుద్ధిరూపమును జెందును, పిమ్మట మనస్సగును,ఇట్లు మనస్సుగా నేర్పడిన పిమ్మట నేను సంసారిని, నాకు దుఃఖము గలదు, సంసారమునుండి తరించవలెను-అని భావించును. పరమాత్మ యొక్కడే స్వయముగనే సంసార రూపము జెంది స్వయముగనే తన్నాశము గూడ గావించునను విషయమున యించుకయైనను ఆశ్చర్యము వలదు. ఆయనకు గల శక్తులు అనంతములు. ఆశక్తుల యొక్క విజృంభణము చేత ఆయన యొక్కడయ్యు పెక్కు విధముల తోచుచున్నాడు.

1.కాలసత్త (దిక్కులు మొదలగువాని ఉనికి) 2. నియతిసత్త, పుణ్యము చేసినవాడు సుఖము పొందవలయును. పాపములు చేసినవాడు దుఃఖమును పొందవలయును అను మొదలగునవి ప్రాపంచిక నియమములు 3. మహాసత్త:- భావ పదార్థముల యందెల్ల వ్యాపించి ఏకరూపముతో ఉన్న ఉనికి. 4. జ్ఞాన శక్తి:- దృశ్యములను ప్రకాశింపజేయు సామర్థ్యము 5. క్రియా శక్తి:- సర్వపదార్థములను, కార్యములను జేయగలశక్తి కర్తృత్వమును, అకర్తృత్వముయొక్క అభావత్వమును అను మొదలగు శక్తులన్నియు ఆ పరబ్రహ్మకు గలవు, ఆశక్తులకు మితియే లేదు. ప్రపంచమునందు ఏయేశక్తి గానవచ్చునో, అదియంతయు పరమాత్మ శక్తియే ఇట్లగుటచేత వికాసశక్తి చేత సంసారము వికసించును. నిరోధశక్తి చేత(చిత్తమును నిగ్రహించుట యను శక్తిచేత) అది అణగును ప్రతి పురుషుడును, దేవపూజ చేయునప్పుడు ఈ దేహమును ముఖ్యముగ పరిత్యజింప వలయును ఆత్మయే దేవదేవుడు. ఈ యననే పూజింపవలయును. ధ్యానమే యీయనకు పూజ ఆమహాత్ముని ఆకారమును సర్వ ప్రపంచ మయముగా భావించి ధ్యానింపవలయును.

ఆధారమని చెప్పబడు వాని కన్నిటికిని ఆధారభూతుడు, ఉనికి మాత్రమే స్వరూపావస్థితిగా కలవాడు, సర్వ ప్రపంచమును తన వివర్తము చేత పుట్టించినవాడు, -ఆత్మ వివర్తమనగా తన స్వరూపమునకు హాని కొంచెమైనను లేకుండ ప్రపంచమును కనబఱుచువాడు, ఆత్మ జ్ఞానామృతమును మాత్రమే ఆ దేవుని ఆరాధించుటకై సంపాదించవలయును, దానిచేతనే ఆయనకు పరిపూర్ణ తృప్తి కలుగును. అట్టి జ్ఞానామృతమును సంపాదించి తనలో ప్రత్యగాత్మ స్వరూపముతో నున్న పరమాత్మను తెలిసికొనవలయును. ఇదియే ధ్యానము, ఇదియే దైవపూజ ఇదియే పరమేశ్వరునకు తృప్తిని కలిగించుట. సర్వకాల సర్వావస్థలయందును ఆ పరమేశ్వరునే చూచుచుండవలయును. పై జెప్పిన ఆకారమును కనీసము 13 నిమిషములైనను ధ్యానించిన గోదాన ఫలము కలుగును. 1/2 ఘడియ అశ్వమేధ, ఘడియ రాజసూయ, 12 గంటలు లక్ష రాజసూయ, ఒకదినము మితియేలేదు (ఫలము) అనగా శాశ్వతమగు మోక్షమునే చెందును. ఇది బాహ్యపూజ. పరమాత్మ హృదయము, కంఠము, దవడల మధ్య, భ్రూమధ్య, నాసాగ్రమునందు, పరబ్రహ్మము అభివ్యక్తమై యున్నాడు (పరబ్రహ్మము హృదయాది స్థానములందున్నాడని శృతులు చెప్పుచున్నవి). ముప్పది యాఱవ తత్త్వమై యున్నాడు ఉన్మన్యావస్థను (ఇదియే తుర్యాతీతము) మించి యున్నాడు, ఇట్టి స్థితులలో గూడ దేనినైన ఒక్కదానిని ఆత్మశక్తి అనుసారమున అవలంబించి, ఆలంబనము చేసికొని ఆ పరమాత్మను పూజింపవలయును. ప్రపంచమునందు గల సర్వపదార్థములను ఏక రూపముగా ప్రకాశింపజేయు జ్ఞానమే తనకు స్వరూపము. ఈ విషయము నెఱిగిన దృశ్య పదార్థములకు సంబంధించిన మాలిన్యములు తనకంటవు. తానే పరమేశ్వరుడు కావున తన యనుభవమే పరమేశ్వరుని పూజగా భావింప వలయును. తాననుభవించు భోగములను పరమేశ్వరుడే అనుభవించు చున్నాడని భావించవలెను.

భోగముల నంగీకరించుటయును విడుచుటయును గూడ పరమేశ్వరుని ఆరాధనమునకు సాధనములే. గడిచి పోయిన వానికి దుఃఖింపక వచ్చిన దానిని నిర్వికారుడై యనుభవించుచుండుట ఏది కలదో అదియే మహాత్ముని అర్చన , వచ్చిన తోడనే ఏది మనోహరమై కానవచ్చునో, ఏది అటులగాక వచ్చిన తక్షణమే దుఃఖకరమై యుండునో వాని రెంటికిని సమచిత్తముతో చూచుటయే ఆత్మార్చనము. చేయువాని పని (మొదటిది ఇంద్రియవ్యాపారము, రెండవది మనోనిగ్రహము వలన గలుగు మోక్ష సుఖము) మనస్సు సంస్కార వశగతమై వికసించుట సంసారము, సంస్కారములను పరిత్యజించి నిస్సంకల్పమై ముడుచుకొనుట మోక్షము.

In Bombay (Juhu) Sacred Place for Maditation, మరియు హృషీకేశము, హరిద్వారము (బ్రహ్మిగుండా) ఉత్తరకాశి, హరిద్వారం వద్ద కంఖాల్, బదరీనాథ్, దేవప్రయాగ (హిమాచల్ ప్రదేశ్), గంగోత్రి (హిమాచల ప్రదేశ్), అయోధ్య, ఆబూపర్వతము, నాశిక్, వారణాశి, మధురలో బృందావనము, కాశ్మీర్‌లో శ్రీనగరము, అల్మోరా (హిమాలయ), నైనిటాల్, బెంగుళూరు, పూరీ, ద్వారక, పండరీపురము మద్రాసు వద్ద తిరువత్తూరు, పూనా దగ్గర అలంది-ధ్యానమునకు ఉత్తమ ప్రదేశములు.

## 14. జ్ఞానావతార్ శ్రీ యుక్తేశ్వరుని సందేశము:

శారీరక , మానసిక, ఆధ్యాత్మి క్లేశములు:- ఈ మూడూ వరుసగా జబ్బు, మానసిక లోపాలు లేక వైకల్యాలు; ఆత్మ విషయకమైన అవిద్య -అన్న రూపాల్లో వ్యక్త మౌతుంటాయి.

శరీరానికి ఆత్మకూ మధ్య సూక్ష్మమైన లంకెగా దేవుడు ఊపిరి రూపంలో ఉన్నాడు. శరీరంలో పంచప్రాణాలుగా అంటే సూక్ష్మప్రాణ శక్తులుగా పనిచేసే ప్రాణశక్తి ప్రవాహాలు.

సర్వవ్యాపకమయిన ఆత్మ తాలూకు ఓంకార స్పందనకు అభివ్యక్తులు.

ఆత్మ అనే మూల స్రోతస్సు నుంచి వెలువడి మాంసకణాల్లో ప్రకాశించే ప్రాణం ప్రతిబింబం లేదా సత్యాభాసం ఒక్కటే మానవునికి తన శరీరంతో అనుబంధం ఉండడానికి కారణం.

దేవుడు ఊపిరిలేకుండానే జీవిస్తాడు. అతని రూపంలోనే తయారైన ఆత్మ ఊపిరి లేని స్థితిలోనే మొట్టమొదటి సారిగా తన ఉనికిని తాను తెలుసుకుంటుంది.

పరిణాత్మక కర్మ వల్ల, ఆత్మకూ శరీరానికి ఉన్న ఊపిరి లంకెను తెంపినప్పుడు చావు అనే హఠాత్పరిణామం సంభవిస్తుంది.

ప్రశ్న: దేవుడసలు శరీరాన్ని, ఆత్మనూ ఎందుకు కలపాలి? సమాధానం - మానవుడి పరిమిత తత్కాలిక శక్తులు, ఎవరివల్లా సృష్టికాని (స్వయంభువు) కేవల పరబ్రహ్మకుగల అనూహ్యమైన ఉద్దేశాల్ని ఎలా అవగాహన చేసికొనగలుగుతాయి? మానవుడి వివేకం సృష్టిరహస్యాల్ని తెలిసికొనలేక పోయినప్పటికీ భగవంతుడే భక్తుడి కోసం ప్రతి రహస్యాన్ని చివరకు వెల్లడి చేస్తాడు.

జ్ఞానంకోసం చిత్త శుద్ధితో తపన చెందేవాడు, దైవ పథకంలోని ఓనమాలు కొన్ని సవినయంగా సాధనచేస్తూ,అన్వేషణ ప్రారంభించి పట్టుదల , ధైర్యం, సాధనాలతో అంతిమ జన్మలో గమ్యం చేరగలుగుతాడు, విముక్త మానవుడు స్పందనశీల లోకాన్ని అధిగమించి స్పందన రహిత మూల తత్వంలోకి ప్రవేశిస్తాడు.

భగవంతుడి విశ్వ సృష్టి,స్థితి, లయ కారక స్వరూపం, ఆయన పరమావస్థకాని, కనీసం ఆయన మూల ప్రకృతిగాని కాదు. ఎందుచేతనంటే, సృష్టి అన్నది ఆయన లీల. సృజనశీల క్రీడ నియమబద్ధమైన అణుప్రవాహంలో వ్యక్తమయిన ఆయన ప్రకృతి ఆయన్ని బయల్పఱచకుండా కేవలం వ్యక్తీకరించడం మాత్రమే చేస్తుంది. కనుక త్రిమూర్తుల రహస్యాల నన్నిటిని గ్రహించినప్పటికి కూడా ఆయన అంతర్నిగూఢ మూల స్వరూపాన్ని అవగాహన చేసుకోవడం సాధ్యం కాదు. "సత్యం" అంటే ఏమిటి? సత్యం అన్నది ఒక సిద్ధాంతం కాదు, చింతనా కాదు. బుద్ధి పరమైన అంతర జ్ఞానమూకాదు. సత్యమనేది వాస్తవానికి కచ్చితమైన అనురూపం మానవుడి దృష్టిలో 'సత్యం" ఆత్మరూపమైన తన వాస్తవ ప్రకృతిని గుఱించిన అచంచల జ్ఞానం. జీవితంలో తనను సర్వవ్యాప్తమైన కూటస్థ చైతన్యంగా, ప్రతిచర్య ద్వారాను, ప్రతి మాట ద్వారాను,తన అస్తిత్వ సత్యాన్ని బ్రహ్మవిదుడు నిరూపించాడు.

## జ్ఞానావతార్ శ్రీ యుక్తేశ్వర్ గారి పునరుత్థానం

చావుబ్రతుకుల చదరంగంబల్ల మీదుండే నిగూఢమయిన అంతరాల సుస్పష్ట, సునిసిత తత్వము, 1936 జూన్ 19 తేదీ మధ్యాహ్నం 3 గంటలకు, సూర్యకాంతిని మించిన ఒక దివ్య తేజస్సుగా శ్రీ యుక్తేశ్వర్ గిరిగారు, శిష్యుడగు పరమహంస యోగానంద గారికి దర్శనమిచ్చి, పలికిన వాక్యములు "నేను పునరుత్థానంచెందాను -భూమిమీద కాదుకాని, ఒక సూక్ష్మ లోకంలో అక్కడుండే వాళ్లు , భూమిమీది మానవులకన్న ఎక్కువగా, నా ఉన్నత ప్రమాణాలకు నిలబడగల వాళ్లు. ఎప్పటికో ఒకనాటికి,నువ్వూ, నీ ప్రియతములూ అక్కడికి వచ్చినాతో బాటు ఉంటారు.

పూర్వం ఆయన శరీరానికి విలక్షణంగా ఉంటూండే కొద్దిపాటి, సహజసుగంధం, ఇప్పుడు కూడా ఆయనకు ఉంది. భౌతిక కర్మను అనుభవిస్తుండే మానవులకు సహాయం చెయ్యడానికి, భగవంతుడు, భూమిమీదికి ప్రవక్తలను పంపినట్టే, సూక్ష్మలోకంలో రక్షకుడిగా, సేవచెయ్యమని ,భగవంతుడు నన్ను ఆదేశించాడు, దాన్ని "హిరణ్యలోకం" అంటారు.

ఆలోకంలో ప్రగతిసాధించిన సాధకులు, తమ సూక్ష్మలోక కర్మనుంచి, విముక్తి పొందటానికి, సూక్ష్మలోక పునర్జన్మలు లేకుండా చేసుకోడానికి అక్కడనేను సాయపడుతున్నాను, హిరణ్యలోకవాసులు ఆధ్యాత్మికంగా ఉన్నతమైన అభివృద్ధి సాధించినవాళ్లు, వాళ్లంతా భూమిమీద తమ పూర్వజన్మలో, మరణసమయంలో ఒంటిమీద స్పృహతో, భౌతికకాయాన్ని విడిచివెళ్లిపోవటానికి వీలుకలిగించే ధ్యానోపార్జితమైన శక్తిని సాధించినవాళ్లు వెనుకటి మానవజీవితంలో సవికల్ప - నిర్వికల్ప సమాధిస్థితుల అనుభవం గడిస్తేనే కాని, ఎవ్వరూ హిరణ్యలోకంలోకి ప్రవేసించలేరు.

హిరణ్యలోకవాసులు అంతకుపూర్వమే సాధారణ సూక్ష్మమండలాలగుండా సాగివచ్చి అక్కడికి చేరి ఉంటారు భూలోకప్రాణులు దాదాపు అందరూ, మరణించిన తరువాత, ఆసూక్ష్మమండలాలకుచేరవలసిందే అక్కడ, సూక్ష్మలోకాల్లోని తమపూర్వకర్మలకు సంబంధించిన అనేక బీజాల్ని నశింపుచేసుకొని ఉంటారు. సమాధులవివరణ :- సవికల్ప సమాధిలో భక్తుడు, బ్రహ్మమూతానూ ఒకరేనన్న అనుభూతి పొందుతాడు. కాని విశ్వచైతన్యాన్ని నిలుపుకోలేడు. అఖండమైన ధ్యానం ద్వారా అతను, నిర్వికల్ప సమాధి" అనే ఉన్నత స్థితిని చేరుకుంటాడు. అప్పుడతను దైవానుభూతిని కోల్పోకుండానే ప్రపంచంలో స్వేచ్ఛగా తిరుగుతూంటాడు. నిర్వికల్ప సమాధిలో యోగి, తన భౌతికకర్మలోని -అంటే, భూలోక సంబంధమైన కర్మలోని - చివరిలేశాల్ని క్షయం చేసుకుంటాడు. అయినప్పటికి అతనికికొంత , సూక్ష్మ, కారణకర్మలు, అనుభవింపవలసి ఉంటుంది. అందుచేత ఉన్నతస్పంద మండలాల్లోని సూక్ష్మలోకంలోను దేహధారణ చేయవలసి ఉంటుంది.

ఉన్నతస్థితిలో ఉన్నభక్తులు మాత్రమే తప్ప, తక్కిన వాళ్లలో ఎవరూ, సూక్ష్మ మండలాల్లో అటువంటి ముక్తిదాయకకృషి ఫలప్రదంచెయ్యలేరు. (భగవంతుడు మానవుడి ఆత్మను వరసగా మూడు శరీరకోశాల్లో పొందుపరచి ఉంటాడన్న సంగతి నువ్వు పవిత్రగ్రంథాల్లో చదివావు.) అప్పుడు సూక్ష్మకర్మలేశాలన్నిటి నుంచి , తమ ఆత్మల్ని పూర్తిగా విముక్తం చేసుకోడానికి సాధకులు, హిరణ్యలోకంలో (స్వర్గలోకంలో) కొత్త సూక్ష్మ శరీరాలతో, తిరిగి పుట్టడానికి "విశ్వనియమం" చేత ఆ కృష్ణులవుతారు (ఆకారంధరిస్తారు) నేనున్నది సూక్ష్మలోకి సూర్యుడని, స్వర్గమని చెప్పే ఈ హిరణ్యలోకంలోనే. అక్కడివాళ్లకు సహాయంచెయ్యడానికి, అంతకన్న ఉన్నతమైన కారణలోకంలోంచి వచ్చి, దాదాపు పూర్ణసిద్ధి పొందిన వాళ్లకూడా హిరణ్యలోకంలోనున్నారు.

పైన చెప్పబడిన మూడు శరీరాలు:

1. భావనద్వారా శరీర నిర్మాణము - కారణశరీరము.
2. మానవుడి మానసిక, భావోద్రేక, ప్రకృతికి స్థానమైన సూక్ష్మశరీరం.
3. స్థూలమైన భౌతిక శరీరం. భూమి మీద మనిషికి భౌతికజ్ఞానేంద్రియాలు ఏర్పడి ఉంటాయి.

సూక్ష్మలోవ్యక్తి తన "చేతన" తాను అనుభుతులతోను,

"ప్రాణకణిక" (లైఫ్‌ట్రాన్) లతోమ తయారైన శరీరంతోను పనిచేస్తాడు. కారణ శరీరం ధరించినవాడు, భావాల ఆనందమయలోకాల్లో ఉండిపోతాడు, కారణలోకంలోకి ప్రవేశించడానికో, పునఃప్రవేశానికో, తయారవుతున్న సూక్ష్మలోక భక్తులతోనే నాపని. చాలామంది, సూక్ష్మలోకాల్లో ఉన్న అందాన్ని చూసి ఆనందిస్తూ, కష్టపడి ఆధ్యాత్మిక కృషిచెయ్యాల్సిన అవసరం ఉందన్నసంగతే గమనించరు.

సూక్ష్మ శరీరులతో నిండిన, సూక్ష్మలోకాలు చాలా ఉన్నాయి "అక్కడ ఉండేవాళ్లు, ఒకగ్రహం నుండి మరోగ్రహానికి ప్రయాణం చెయ్యడానికి, విద్యుత్తుకన్న , లేదా , రేడియోధార్మికశక్తులకన్న వేగంగాసాగే సూక్ష్మవాహాల్ని లేదా, కాంతి పుంజాల్ని వాడతారు.

వెలుగు, వన్నెల సూక్ష్మస్పందనలతో రూపొందించిన సూక్ష్మ విశ్వం, భౌతికవిశ్వానికి కొన్ని వందల రెట్లు పెద్దది. భౌతిక సృష్టి యావత్తు, సూక్ష్మ మండలమనే ప్రకాశవంతమైన పెద్దగాలి బుడగక్రింద ఘనరూపమయిన ఒకచిన్న బుట్టలా వ్రేలాడుతూఉంటుంది.

అణువులూ ఋణవిద్యుత్కణాలూ, అచేతన శక్తులు . ప్రాణం స్వభావతః చేతనశక్తి, ఉదాహరణకు, శుక్లశోణితాలలో ఉండే ప్రాణకణికలు,కర్మానురూపంగా, పిండం పెరుగుదలను నియంత్రిస్తాయి. రోదసిలో భౌతికమైన అనేక సూర్యగ్రహాలు, నక్షత్రాలు సంచరించేటట్టుగానే లెక్కలేనన్ని సూక్ష్మ సౌర నక్షత్ర మండలాలు కూడా ఉంటాయి. సూక్ష్మలోక సూర్యచంద్రులు ఈ సూర్య చంద్రులకన్న అందంగా ఉంటారు. సూక్ష్మలోకతేజో మండలాలు తేజస్వంతమైన మేరుప్రభామండలాన్ని ఆరోరాబొరియాలిస్) పోలి ఉంటాయి. ఈ సూక్ష్మలోకసౌరమేరు ప్రభమందకిరణ చంద్రమేరుప్రభ కన్న మిరుమిట్లు గోలుపుతూ ఉంటుంది. సూక్ష్మలోకంలో, రాత్రి పగలూ, భూమిమీది వాటికంటె, దీర్ఘమైనవి.

" సూక్ష్మవిశ్వం అత్యంత ఆకర్షణీయమైనది, పరిశుభ్రమైనది.పరిశుద్ధమైనదీ; సువ్యవస్థితమైనది. నిర్జీవగ్రహాలూ, చవిటి పర్రలూ అక్కడలేనే లేవు, భూలోకానికి కళంకప్రాయమైన సూక్ష్మ జీవులు (బాక్టీరియా), పురుగులు, పాములువంటివి అక్కడ ఉండవు, శీతోష్ణ స్థితులూ, ఋతువులూ, భూలోకంలో మాదిరిగా ఉండవు, సూక్ష్మ మండలంలో నిత్యవసంతఋతువులో సమశీతోష్ణస్థితి నిలిచి ఉంటుంది. అప్పుడప్పుడు వెలుగులీనే తెలిమంచూ, వన్నెవన్నెల వెలుగుల వానలూ కురుస్తూఉంటాయి. సూక్ష్మలోకాలంతటామాణిక్య సరోవరాలూ మిలమిల మెరిసే సముద్రాలూ, ఇంద్రచాపనదులూ సమృద్ధిగా ఉంటాయి.

భూమి నుంచి దాదాపు ఇటీవల వచ్చిన, కొన్ని కోట్ల సూక్ష్మ జీవాత్మలు మామూలు సూక్ష్మ విశ్వంలో (అంటే హిరణ్యలోకమనే సూక్ష్మతర (సూక్ష్మస్వర్గం లోకం అనికాదు) ఉంటాయి. అంతేకాకుండా, దేవతాశక్తులూ, మత్స్యకన్యలూ, చేపలూ, జంతువులూ, పిశాచాలూ, భూతాలూ, దైవాంశసంభూతులూ, అదృశ్య శక్తులు కూడా అసంఖ్యాకంగా ఉంటాయి. ఇవన్ని కర్మలగుణాగుణాల్ని బట్టి వేరువేరు సూక్ష్మగ్రహాల్లో నివసిస్తాయి. మంచిశక్తులకూ, చెడ్డశక్తులకు గోళాకార భవనాల్ని,లేదా స్పందనశీల ప్రాంతాల్ని సమకూర్చడం జరిగింది. మంచివి స్వేచ్ఛగా ప్రయాణం చేస్తాయి, కాని దుష్టశక్తులు పరిమితమండలాలకు లోబడి ఉంటాయి మనుష్యులు భూమిమీద, పురుగులుమట్టిలోను, చేపలు నీళ్లలోను, పక్షులుగాలిలోను ఉండునట్లే, వివిధ శ్రేణుల సూక్ష్మలోక జీవులకు సముచితమైన స్పందనశీల నివాసాలు సమకూరి ఉంటాయి.

"వివిధ సూక్ష్మలోకాల నుంచి వెలివేసిన, పతితదేవదూతల మధ్య ప్రాణకణి కాస్త్రాలు (లైఫ్‌ట్రానిక్ బాంబులు) లేదా మానసికమంత్ర శక్తుల స్పందనశీల కిరణాలతో ఘర్షణ, యుద్ధంజరుగుతూంటాయి. ఈ బహిష్కృతులు తమ దుష్కర్మను అనుభవిస్తూ నిమ్నతరసూక్ష్మ విశ్వంలోని అంధకారాచ్ఛన్న ప్రాంతాల్లో నివసిస్తూంటారు.

"అంధకారమయమైన సూక్ష్మకారాగారానికి పై నుండే విశాల మండలాలన్నీ ప్రకాశమానంగా అందంగా ఉంటాయి. సూక్ష్మవిశ్వం భూమికన్న ఎక్కువ సహజంగా, దైవసంకల్పముతోను, పరిపూర్ణితా పరికల్పనతోనూ అను సంధానం చెందిఉంటుంది. సూక్ష్మలోక వస్తువు ప్రతిది ప్రధానంగా దైవసంకల్పంవల్లా, పాక్షికంగా సూక్ష్మలోక జీవుల ఆహ్వానసంకల్పం వల్లా ఆవిర్భవిస్తుంది. దేవుడు సృష్టించినదాన్ని దేన్నయినా మార్చేయడానికి కాని, దాని అందాన్ని రూపాన్ని అతిశయింపజేయడానికికాని వాళ్లకు శక్తిఉంటుంది. సూక్ష్మవిశ్వాన్ని

తమయిచ్చాను సారంగా మార్చేసేస్వాతంత్ర్యమూ లేదా మెరుగుపరిచే స్వాతంత్ర్యమూ హక్కూ భగవంతుడు తన సూక్ష్మలోక సంతానానికియిచ్చాడు. భూమిమీద ఒక ఘన పదార్థాన్ని ద్రవరూపంలోకి కాని, ఇతరరూపంలోకి కాని మార్చాలంటే సహజప్రక్రియద్వారా, లేదారసాయనప్రక్రియలద్వారా మార్చాలి. కాని సూక్ష్మలోకపుఘన పదార్థాల్ని కేవలం, అక్కడ నివసించే వాళ్ల సంకల్ప మాత్రముచేత, తక్షణమే సూక్ష్మద్రవాలుగానూ వాయువులుగానూ లేదా అణుశక్తిగానూ మార్చడం జరుగుతున్నది.

"సముద్రంలోనూ, నేలమీదా, గాలిలోనూ జరిగే యుద్ధాలతో , హత్యలతో ఈభూమి, కళంకితమైపోయింది." అంటూచెప్పసాగారు, గురుదేవులు."కాని, సూక్ష్మలోకరాజ్యాలకు, సుఖప్రదమైన సామరస్యము సమానత్వమూ తెలుసు, సూక్ష్మలోక జీవులు, తమ రూపాల్ని సంకల్పాను సారంగా సాక్షాత్కరింపజేయడం, అదృశ్యంచేయడం చేస్తుంటారు. పువ్వులుకాని, చేపలుకాని, జంతువులుకాని తాత్కాలికంగా సూక్ష్మలోక మానవులుగా రూపాంతరణం చేందగలవు, సూక్ష్మలోక జీవులన్నీ స్వేచ్ఛగా ఏరూపమైనా తాల్చి ఒకదాంతో ఒకటి సులువుగా, భావసంపర్కంపెట్టుకోగలవు, స్థిరంగా, కచ్చితంగా ఉండేప్రకృతి నియమం ఏదీ వాటిని నిర్బంధించదు. మాటవరసకు ఏ సూక్ష్మలోక వృక్షాన్నయినా, సూక్ష్మలోకపు మామిడిపండుకాని పువ్వుకాని నిజంచెప్పాలంటే మరేవస్తువునయినాకాని - సృష్టించి ఇమ్మని అడిగితీసుకోవచ్చు, కొన్ని కొన్ని కర్మ సంబంధమైన ప్రతిబంధకాలు ఉన్నప్పటికి వివిధరూపాల్ని కోరడం విషయంలో, సూక్ష్మలోకంలో విభేదాలు లేవు.

సూక్ష్మలోకంలో ప్రతిదీ దేవుడి సృజనాత్మక కాంతితో స్పందిస్తూ ఉంటుంది."అక్కడి వాళ్లెవరూ తల్లికడుపున పుట్టినవాళ్లుకారు. సూక్ష్మలోక వ్యక్తులు, విశ్వానుసంధానం చెందివున్న తమసంకల్పం ఇచ్చే ఆదేశాలతో విశిష్టకల్పనాయుక్తమైన సూక్ష్మరూపాలుగల సంతానాన్ని సృష్టించవచ్చు . అంతకుముందే భౌతికకాయాన్ని విడిచిన వ్యక్తి, అనురూపమైన మానసిక, ఆధ్యాత్మిక ప్రవృత్తులచేత ఆకృష్టుడై ఒకసూక్ష్మలోక కుటుంబం ఆహ్వానాన్ని అందుకొని ఆకుటుంబంలోకి వస్తాడు.

సూక్ష్మశరీరం చలికిగాని, వేడికిగాని, ఇతరప్రకృతి పరిస్థితులకు కానిలోబడదు. సూక్ష్మశరీరంలో సూక్ష్మమస్తిష్కం ఒకటి ఉంటుంది. దాంట్లో సర్వజ్ఞత్వంగల " వెయ్యిరేకుల వెలుగులతామరపువ్వు" కొంతమట్టుకు పనిచేస్తూ ఉంటుంది. అలాగే," సుషుమ్నలో, అంటే సూక్ష్మమస్తిష్క - మేరుదండాక్షంలో, జాగృత కేంద్రాలు ఆరు ఉంటాయి. గుండె, వెలుగునూ - విశ్వశక్తినీ మెదడునుంచి తీసుకొని, సూక్ష్మనాడులకూ శరీరకణాలకూ పంపిణీ చేస్తుంది. సూక్ష్మలోక జీవులు ప్రాణకణికా శక్తివల్లా, పవిత్రమంత్రశక్తివల్లా తమరూపాల్లోమార్పులు చేసుకుంటూ ఉంటారు.

## మంత్రశబ్దానికి అర్థము

ఏకాగ్రత అనే మానసికమైన ఫిరంగిలోంచి విడుదల అయిన బీజాక్షరమని అర్థం. "మాంత్రిక" శబ్దం, దీనికి విశేషణ రూపం దేవాసురులకు జరిగిన మాంత్రిక యుద్ధాన్ని పురాణాల్లో వివరించారు. ఒక అసురుడు (వృత్రాసురుడు) ఒకసారి, శక్తివంతమైన ఒకమంత్రంతో ఒకదేవతను (ఇంద్రుణ్ణి) చంపదలుచుకున్నాడు. కాని ఉచ్చారణలో అపస్వరం రావడం వల్ల అతని మానసికాస్త్రం బెడిసికొట్టి, ఆరాక్షసుణ్ణే చంపేసింది.

"చాలా సందార్భాల్లో, సూక్ష్మ శరీరం, ముందటి భౌతికరూపానికి అచ్చంగా ప్రతిరూపంలా ఉంటుంది. సూక్ష్మలోక వ్యక్తిముఖమూ ఆకారమూ అంతకుముందుభూమి మీద చేసిన మజిలీలో అతని పడుచుప్రాయంలో ఎలా ఉండేదో (వో) అలా ఉంటాయి. కాని

అప్పుడప్పుడు, నాబోటివాడు, ముసిలి రూపేనిలుపుకోవాలని తలుస్తాడు.”

“సూక్ష్మమండలాలు, పంచేంద్రియజ్ఞానంతో గ్రహించదగ్గ అంతరాళక త్రిమితీయ ప్రపంచంమాదిరిగా కాకుండా, అన్నీ కలిసియున్న సహజావబోధమనే ఆరో జ్ఞానేంద్రియానికి గోచరమవుతాయి.

సూక్ష్మలోక వ్యక్తులు కేవలం “సహజావబోధానుభూతి” వల్ల చూస్తారు రుచిచూస్తారు, తాకుతారు. వాళ్లకు “మూడుకళ్లు” ఉంటాయి. వాటిలో రెండుకొంతమట్టుకు మూసుకుని ఉంటాయి. మూడోది ముఖ్యమైన సూక్ష్మనేత్రం. ఇది నుదుటి మీద నిలువుగా తెరుచుకొని ఉంటుంది. సూక్ష్మలోక మానవులకు కళ్లు, చెవులు, ముక్కు నాలుక, చర్మం, అన్న బాహ్యజ్ఞానేంద్రియాలు అన్ని ఉంటాయి. కాని వాళ్లు శరీరంలో ఏభాగంతోనయినా సంవేదనలు పొందటానికి సహజావబోధ” మనే జ్ఞానేంద్రియాన్ని ఉపయోగించుకుంటారు. మాటవరసకి, వాళ్లుచెవితో కాని, ముక్కుతోకాని, చర్మంతోకాని చూడగలరు. కళ్లతోటిగాని, నాలికతోటి కాని వినగలరు. చెవులతోకాని, చర్మం మొదలైన వాటితోకాని రుచిచూడగలరు.

మానవుడి భౌతిక శరీరం, లెక్కలేనన్ని అపాయాలకుగురయ్యేవిధంగా ఉంటుంది. అది ఇట్టేగాయ పడుతుంది. లేదా అంగవైకల్యంపొందుతుంది. కాని ఆకాశతత్త్వసంబంధమైన సూక్ష్మశరీరం అప్పుడప్పుడు కోసుకుపోవచ్చు, లేదా గాయపడవచ్చు, కాని అది “ఇచ్ఛాశక్తి” వల్ల వెంటనేనయమయి పోతుంది.

సూక్ష్మలోకంలో అందమనేది ఆత్మపరమయిన గుణమేకాని బాహ్యరూపంకాదు. అంచేతసూక్ష్మలోకవాసులు ముఖలక్షణాలకు ప్రాముఖ్యమియ్యరు. అయితే సంకల్పమాత్రం చేత నవీనసుందర శరీరాల్ని సృష్టించుకుని ధరించే హక్కు వాళ్లకి ఉంది. భూమిమీద మనుషులు పండుగపబ్బాల్లో క్రొత్తదుస్తులు ధరించినట్లే సూక్ష్మలోకవాసులు కొన్నిసందర్భాల్లో ప్రత్యేకంగా కల్పించిన రూపాలుధరిస్తారు.

హిరణ్యలోకంవంటి సూక్ష్మగ్రహాల్లో, అక్కడివాడు ఎవరయినా ఆధ్యాత్మిక ప్రగతి ద్వారా విముక్తుడయి తత్ఫలితంగా కారణలోకానికి వెళ్లడానికి సిద్ధంగా ఉన్నప్పుడు, ఆనందోత్సవాలు జరుగుతాయి.

సృష్టికర్త తాను సృష్టించిన ప్రాణుల్లో ప్రతి ఒక్కదానికి ఇచ్చిన “వ్యకిత్వం” ఆయన సర్వతోముఖమైన “ప్రజ్ఞ” వెల్లడికావాలని, ఊహించడానికి వీలుగానూ ఊహించడానికి వీలులేని విధంగాను కోరికలు కోరుతుంది.

“ఇతరజన్మల్లోని స్నేహితులు సూక్ష్మలోకంలో ఒకరినొకరు సులువుగా గుర్తుపడతారు.“స్నేహానికి అమరత్వం ఉన్నందుకు ఆనందిస్తూ వాళ్లుపార్థివ జన్మలో భ్రాంతిమయమయిన వియోగాలు జరిగే విషాదసమయంలో తనను శంకిస్తూ వచ్చిన, ప్రేమ, అవినశ్వరతను నశించని దాన్ని, ఇప్పుడు, అనుభూతం కావించుకుంటారు.

సూక్ష్మలోకవ్యక్తులు “జ్ఞాననేత్రం సహజావబోధం” వల్ల తెరచిల్చుకొని మానవ కార్యకలాపాల్ని గమనిస్తూ ఉంటారు, కాని మానవుడు మాత్రం అతని ఆరో జ్ఞానేంద్రియం కొంతమట్టుకు వికాసం చెంది ఉండక పోతే, సూక్ష్మ మండలాల్ని దర్శించలేడు. భూమిమీద ఉండేవాళ్లు అనేక వేలమంది క్షణికంగా, ఒక సూక్ష్మలోకజీవినో, ఒకసూక్ష్మలోకాన్నో దర్శించినవాళ్లే.

హిరణ్యలోకంలో ఉండే,ప్రగతి సాధించిన జీవులు సాధారణంగా సూక్ష్మలోకపు దీర్ఘమైన రాత్రింబవళ్లలో నిర్వికల్ప ఆనంద సమాధిలోజాగృతులై ఉంటారు. విశ్వపరిచాలనానికి సంబంధించిన క్లిష్ట సమస్యలను పరిష్కరించటానికి భూలోకయానానికి ఉద్యుక్తులైనవారి ఆత్మలవిమోచనకూ సహాయపడుతూ ఉంటారు. హిరణ్యలోకజీవులు, నిద్రపొయ్యేటప్పుడు అప్పుడప్పుడు కలలవంటి సూక్ష్మ అంతర్దర్శనానుభవాలు పొందుతూ ఉంటారు.

అయినప్పటికి సూక్ష్మ విశ్వంలోని అన్నిప్రాంతాల్లో ఉండేవాళ్లు మనోవేదనలకు గురి అవుతూ ఉండేవాళ్లే. హిరణ్యలోకంవంటి గ్రహాల మీద ఉండే మహాభక్తుల సునిసితమనస్సులు, సత్ప్రవర్తనలో కాని, సత్యదర్శనంలో దర్శనంలోకాన్ని ఏదైనా పొరబాటు జరిగినట్లయితే తీవ్రమైనమనోవేదన చెందుతాయి. ఈ ప్రగతి జీవులు ప్రతి చర్యనూ, ఆలోచననూ అధ్యాత్మిక నియమపరిపూర్ణత్వంతో అనుసంధానంకావించుకోటానికి ప్రయత్నిస్తారు.

"సూక్ష్మలోక వాసులందరిమధ్య భావసంపర్కం పూర్తిగా మానసిక ప్రసార (టెలిపతి) సూక్ష్మదర్శనాల (అస్ట్రల్‌టెలివిజన్) ద్వారా జరుగుతుంది. మమూలుగా భూమిమీద ఉన్నట్టు పలికినమాటకూ, రాసినమాటకూమధ్య ఉండే గందరగోళం, అపార్థద్యోతకత సూక్ష్మలోకవాసుల్లో లేవు. వెలుతురుకల్పించిన బొమ్మలవరస ద్వారా, సినిమాతెరమీద మనుషులు నిజంగా ఊపిరితీసుకోకుండానే కదలడం, కార్యకలాపాలు సాగించడం చేస్తున్నట్టుగానే కాంతే తమకుమూలమై చైతన్యవంతుల్ని చెయ్యడానికి ఆక్సిజన్ ఏది అవసరంలేని సూక్ష్మలోక సమన్విత జీవులునడుస్తారు, పనిచేస్తారు. మానవుడు ప్రధానంగా, ఘన, ద్రవ,వాయుపదార్థాల మీద గాలిలో ఉన్నప్రాణశక్తిమీద ఆధారపడి ఉన్నవాడు, కానిసూక్ష్మలోకవాసులు ప్రధానంగా విశ్వకాంతిమీదే అధారపడి బ్రతుకుతారు.

ప్రశ్న :- సూక్ష్మలోక వ్యక్తులు ఏమయినా తింటారా ?

జవాబు:- వారు, మనస్సు, హృదయం, ఆత్మ అనే శక్తులన్నిటి గ్రాహక గుణముతోను, అధిచేతనానుభూతుల ద్వారాను ఆస్వాదిస్తారు. అధిచేతనానుభూతులు శాశ్వతత్వంగలవి; ఇవివాస్తవమైనవి. మార్పులేనివి; కానిక్షణికమైన ఇంద్రియాను భూతులు తాత్కాలికంగానూ సాపేక్షికంగానూ మాత్రమే నిజమైనవి. వాటివిషయంలో మానవుడి కుండె జ్ఞాపకాలు త్వరగానే కరిగిపోతాయి.

"సూక్ష్మలోక భూముల్లో వెలుగురేకల్లాటి కూరగాయలు సమృద్ధిగా ఉంటాయి." సూక్ష్మలోకవాసులు పళ్లూ, కూరగాయలూ తింటారు. సూక్ష్మలోకంలోని శోభాయమానమైన వెలుతురు నీటిబుగ్గల నుంచి ఎగిసిపడిప్రవహించే అమృతాన్ని పానం చేస్తారు. భూమిమీద సాధారణంగా, మానవుల అదృశ్యబింబాల్ని ఆకాశతత్వం (ఈథర్) లోనుంచి రప్పించి టెలివిజన్ సాధనం ద్వారా కళ్లకుకట్టించినట్లే దేవుడు సృష్టించిన ఆకాశతత్త్వంలో తేలేకూరగాయలు, మొక్కలు, పండ్ల అగోచరసూక్ష్మ ప్రతి రూపాల్ని సూక్ష్మలోకంలో, అక్కడుండేవాళ్ల ఆదేశాలవల్ల రూపొందించవచ్చు. అదేవిధంగా సూక్ష్మలోకజీవుల ఉద్దామ కల్పనల్ని అనుసరించి విశాలవనాల్ని సాక్షాత్కరింపజేయనూవచ్చు. తిరిగివాటిని ఆకాశతత్త్వ సహజంగా అదృశ్యం కావించనూవచ్చు.

హిరణ్యలోకంవంటి స్వర్గలోకమండలాల్లో ఉండేవాళ్లు తిండితిన వలసిన అవసరం లేకుండా దాదాపు స్వేచ్ఛ పొందినప్పటికి కూడా కారణలోకంలో దాదాపు పరిపూర్ణతాసిద్ధి పొందిన జీవుల అనియత అస్తిత్వం, అంతకన్న ఉన్నతస్థితిలో ఉంటుంది. వాళ్ల ఏకైక అహారం "ఆనందామృతమే".

"సూక్ష్మలోకవ్యక్తి, భూలోకంలో వివిధ జన్మల్లో పొందిన తండ్రుల్ని, తల్లుల్ని, భార్యల్ని, పిల్లల్ని , స్నేహితుల్ని అనేకమందిని చూస్తాడు, వాళ్లు సూక్ష్మవిశ్వంలోని వివిధ భాగాల్లో అప్పుడప్పుడు అవుపిస్తూఉంటారు. అంచేత ఎవరిమీద ప్రత్యేకాభిమానం చూపించాలో తెలుసుకోలేకపోతున్నాడు. మానవుడు అందర్ని సమానంగా ఎందుకు ప్రేమించాలని ఒకసారి బుద్ధుణ్ణి ఒకడు అడిగాడు. "ఎందుకంటే, ప్రతిమనిషికి అసంఖ్యాకమైన వివిధ జన్మల్లో ఇతరుడు ప్రతిఒక్కడూ (ఎప్పుడో ఒకప్పుడు, ఏదోఒకరూపంలో, జంతురూపంలోకాని,

మానవరూపంలో కాని) ప్రియమైనవాడు.అయిఉంటాడు కనుక" అని ఆదేశికోత్తముడు జవాబిచ్చాడు. తనకు ప్రియమైన వాళ్లబాహ్యరూపాలు మారిపోయినప్పటికి (దాదాపు వెనుకటి జన్మలో వాళ్ల కొత్తగుణాల వికాసానికి అనుగుణంగా) సూక్ష్మలోకవాసి, ఇతర జీవనస్తరాల్లో (జన్మల్లో) ఒకప్పుడు తనకు ప్రియంగా ఉన్నవాళ్లనందర్ని గుర్తుపట్టటానికి తన అమోఘ సహజావబోధాన్ని ఉపయోగించి, వాళ్లను తమకొత్త సూక్ష్మలోక నివాసాలకు ఆహ్వానిస్తాడు. సృష్టిలో ప్రతి అణువూనశింపజేయరాని అస్తిత్వం ఏర్పడి ఉన్నదికనక, సూక్ష్మలోకమిత్రుడు ఏదుస్తులుధరించి ఉన్నప్పటికి ఇతరులు అతన్ని గుర్తుపట్టేస్తారు. భూమిమీద నటుడు ఏమారువేషంలో ఉన్నప్పటికి నిశితపరిశీలనవల్ల అతన్ని గుర్తుపట్టగలిగినట్లే.

సూక్ష్మమండలాల్లో మామూలు ఆయుః ప్రమాణం, భూమిమీద ఉన్నదాని కన్న చాలా ఎక్కువ. ఏవ్యక్తి అయినా ఒకసూక్ష్మగ్రహంలో కొంతకాలం ఉంటాడు. అకాలపరిమితి అతన్ని, నియమానుసారంగా నిశ్చితమైన ఒకకాలంలో తిరిగి భూమండలానికి ఆకర్షించే భౌతికకర్మ భారాన్ని బట్టి నిర్ణయమవుతుంది. కొందరు జీవులు, భౌతికంగా మరణించిన తరువాత వెంటనే భూమిమీదికి తిరిగి వచ్చేస్తారు. మామూలుగా దానికి కారణం అలాతిరిగి రావాలని వాళ్లకిబలమైన కోరిక ఉండడమే. చాలా మట్టుకు అభివృద్ధి సాధించినవ్యక్తుల సూక్ష్మశరీర జీవితం సగటు ఆయుః ప్రమాణం ఏడువందల ఏళ్లనుంచి వెయ్యేళ్లవరకూ ఉంటుంది. (భూలోక ఆయుఃప్రమాణంతో పోల్చిచూస్తే) అణువుమొదలు మానవుడివరకు, జీవరాసుల సృష్టికంతకుకావలసిన ఎనిమిది మూలతత్త్వాలు. 1. మన్ను 2. నీళ్లు 3.నిప్పు 4.గాలి 5. ఆకాశం 6. చలనం 7. మనస్సు 8. వ్యక్తిత్వం.(భగవద్గీత 7:4)

సెక్వోయియావృక్షాలు ఇతరవృక్షాలకన్న కొన్నివేలఏళ్లు బతికేటట్టుగానే, చాలామంది అరవై ఏళ్లు నిండకముందే చనిపోతున్నప్పటికికొందరు యోగులు ఆరువందల ఏళ్లు బతుకుతున్నట్టుగాను, అసాధారణవ్యక్తులు సూక్ష్మ మండలంలో సుమారు రెండువేల ఏళ్లు బతుకుతుంటారు."

సూక్ష్మలోకజీవి జ్యోతిర్మయదేహాన్ని విడిచేసే సమయంలోయముడితో కష్టపడి పెనుగులాడక్కరలేదు.

"అయినా ఈ జీవులు సూక్ష్మతరమైన కారణ శరీరంకోసం సూక్ష్మరూపాన్ని విడవాలన్న ఆలోచన వచ్చేసరికి కొద్దిగా గాభరాపడతారు. సూక్ష్మలోకంలో కోరుకోనిచావూ, జబ్బు, ముసలితనమూ ఉండవు. ఈ భయాలుమూడుభూలోకానికి పట్టినశాపాలే ఇక్కడ మనిషి బతకటానికి, గాలి, అన్నమూ, నిద్రా అవసరమైనదుర్బల భౌతికకాయమే తానని (దాంతోపూర్తిగా మమైకమేపోవడానికి) విశ్వసించడానికి తనచేతనను అనుమతిస్తాడు.

భౌతికమరణంలో ఊపిరిపోతుంది. మాంససంబంధమైనకణాలు విఘటనం చెందుతాయి, కాని,సూక్ష్మశరీర మరణంలోప్రాణకణికలు చెల్లాచెదరయిపోతాయి, అవినాక్ష్మలోకజీవుల శరీరాలకి ప్రాణసంఘటనకావించిన విశ్వశక్తితాలూకు ప్రత్యక్షీకృతఘటకాంశాలు. భౌతికమరణసమయంలో మనిషికి ఒంటిమీద స్పృహపోతుంది. సూక్ష్మలోకంలో ఉన్న తన సూక్ష్మశరీరం స్పృహకు వస్తుంది. నిర్ణీత సమయంలో సూక్ష్మలోకామరణాన్ని అనుభవించి తద్వారామనిషి, సూక్ష్మలోక జననమరణాల స్పృహనుంచి భౌతిక జననమరణాల స్పృహకుసాగుతాడు. "సూక్ష్మ, స్థూల శరీరకోశాల ఆవర్తన (మరలుట-మననము) చక్రాలు జ్ఞానం జీర్ణించని జీవులందరికి అనివార్యమైన భవితవ్యాలు. పవిత్రగ్రంథాల్లో ఆనసరకాలకిచ్చిన నిర్వచనాలు ఒక్కొక్కప్పుడు ఆనందమయ సూక్ష్మలోకాల్లోను, నిరాశాజనకమైన భౌతికలోకాల్లోనూకలిగిన అనేక అనుభవాలతాలూకు అవచేతనకన్నగాఢమైన జ్ఞాపకాల్నిమనిషిలో రేకెత్తిస్తాయి.

"మానవుడు ప్రధానంగా వైయక్తికీకృత ఆత్మగా కారణశరీరుడు (వ్యర్థమైన) ఆ శరీరంముప్పై ఐదు తత్త్వాలతో (భావాలతో) కూడినది); దాన్ని రూపొందించడానికి మౌళికి ఆలోచనాశక్తులుగా లేదా ఆలోచనాశక్తులుగా దేవుడికి అవి అవసరమయ్యాయి, ఆ తరువాత ఆయన వాటిలోంచి పందొమ్మిది తత్త్వాలు తీసుకొని, సూక్ష్మశరీరాన్ని, పదాహారు తత్త్వాలుతీసుకొని కారణశరీరాన్ని నిర్మించాడు.

సూక్ష్మ శరీరంలో ఉండే పందొమ్మిది తత్త్వాలు మానసికమైనవీ, భావోద్రేకమైనవి.ప్రాణకాపరమైనవి. అవే. 1. బుద్ధి(తెలివి); అహంకారము; చిత్తం (అనుభూతి;) మనస్సు (ఇంద్రియస్పృహ) ; ఐదుజ్ఞానేంద్రియాలు : చూపు; వినికిడి, వాసన, రుచి, స్పర్శ ; (శబ్ద స్పర్శ, రూపరసగంధాలు) గ్రహించడానికి ఉపకరించే సూక్ష్మ ప్రతిరూపాలు, ఐదు కర్మేంద్రియాలు (ప్రజననానికి) విసర్జనకూ మాటకూ, నడకకూ కాయికకర్మలకూ ఉపకరించే సామర్ధ్యాల మానసిక ప్రతిరూపాలు ప్రాణశక్తితాలూకు ఇంద్రియాలు ఐదు:- శరీరంలో స్ఫటికీకరణ (crystalising),స్వాంగీకరణ(assimilating),విసర్జన (eliminating), జీవాణుపాక(metabolizing),ప్రసరణ (circulating) కార్యాలుజరిపేవి (ప్రాణాపానవ్యానోదానసమానవాయువులు)

పందొమ్మిదితత్త్వాల సూక్ష్మశరీరకోశం, పదహారు స్థూలరసాయన మూలకాలతో రూపొందిన భౌతిక శరీరంనశించిన తరువాత కూడా ఉంటుంది.

దేవుడు వివిధ తత్త్వాల్ని భావనచేసుకొని వాటిని స్వప్నాల్లోకిప్రక్షేపించాడు (చక్కగావిసరివేశాడు). ఆవిధంగా, అనంతసాపేక్షతాభరణాలతో బృహత్పరి మాణంలో అలంకరించుకొన్న విశ్వస్వప్నమాయాసుందరి (Lady Cosmic Dream) ఆవిర్భవించింది.

"కారణశరీరంలోని ముప్పైయైదుతత్త్వాల్లోనూ భగవంతుడు, మనిషి సూక్ష్మశరీరంబాపతు పందొమ్మిదితత్త్వాలను, భౌతికశరీరం తాలూకు పదాహారుతత్త్వాల్ని సర్వసంకీర్ణతాయుతంగా సమకూర్చాడు. స్పందనశక్తుల్ని ఘనీభూతంచేసి, మొదట మనిషిసూక్ష్మ శరీరాన్ని, చివరికి భౌతిక శరీరాన్ని సృష్టించాడాయన. మౌళికసారళ్య (సరళమైన) రూపుడయిన పరమేశ్వరుడు దిగ్భ్రమకారకమైన నానాత్వంగా పరిణమించడానికి కారణమయిన సాపేక్షతా నియమం ప్రకారం కారణవిశ్వమూ కారణశరీరమూ, సూక్ష్మవిశ్వానికి సూక్ష్మదేహానికి భిన్నంగా ఉంటాయి. అలాగే భౌతికవిశ్వమూ భౌతికదేహము కూడా స్వభావతః సృష్టిలోని ఇతరరూపాలకు భిన్నంగా ఉంటాయి.

రక్తమాంసాలతోకూడిన శరీరం, సృష్టికర్తనిశ్చిత ప్రత్యక్షీకృత స్వప్నాలతో ఏర్పడినది. ఆరోగ్య అనారోగ్యాలూ, కష్టసుఖాలు, లాభనష్టాలు అన్నద్వంద్వాలు భూమిమీద ఎప్పుడు ఉంటాయి. మానవులకు త్రిమితీయ (Three dimensional) పదార్థంలో పరిమితి ప్రతిరోధమూతప్పవు. మనిషికి బ్రతికుండాలన్నకోరిక, జబ్బువల్లనో, మరే కారణాలవల్లనో తీవ్రంగా సడలిపోయినట్టయితే, మరణం సంభవిస్తుంది. మాంసరూపమైన బరువైన బాహ్యకళేబరాన్ని తాత్కాలికంగా వదలెయ్యవలసివస్తుంది. అయితే, "ఆత్మ" సూక్ష్మ, కారణశరీరాల్లో ఆబద్ధమై (నిలిచి) ఉంటుంది. ఈ మూడుశరీరాల్ని కలిపి ఉంచే సంయోజకశక్తి (మఱియొకదానితోకూర్చబడేశక్తి) కోరిక. తీరనికోరికల చాలనశక్తి మానవుడి బానిసతనానికి కారణం.

భౌతికవాంఛలకు మూలము అహంకారమూ, ఇంద్రియసుఖాలూ. ఇంద్రియానుభవ నిర్భంధము లేదాప్రలోభం, సూక్ష్మలోక అనుబంధాలకుకాని కారణలోక అనుభూతులకుకాని, సంబంధించిన వాంఛాశక్తికన్న ఎక్కువశక్తివంతమైనది. ప్రలోభం= మిక్కిలి ఆకాంక్ష - ఎక్కువపిసినితనము సూక్ష్మలోకవాంఛలు,స్పందనరూప సుఖానుభవానికి సంబంధించినది.

సూక్ష్మలోకజీవులు వివిధగోళాల అకాశ సంగీతాన్ని ఆలకించి సృష్టిఅంతా పరివర్తనశీలకాంతి తాలూకు అనంతాభివ్యక్తులుగాకనబడ్డం వల్ల, పరవశులై ఆనందిస్తారు. సూక్ష్మలోక జీవి వెలుగును వాసనచూస్తాడు రూచిచూస్తాడు. తాకుతాడు.

ఈవిధంగా సూక్ష్మలోక వాంఛలు అన్నివస్తువుల్నీ అనుభవాల్ని కాంతిరూపాలుగా, లేదా ఘనీభూత ఆలోచనలుగా, లేదా కలలుగా రూపొందించడానికి సూక్ష్మలోక జీవికి ఉండేశక్తిని బట్టిఉంటాయి.

కారణలోకవాంఛలు అనుభూతివల్ల మాత్రమే నెరవేరుతాయి కారణ శరీరంలో మాత్రమే ఆబద్ధులైయుండి ,విముక్తిప్రాయులైన జీవులు విశ్వాన్నంతనీ దేవుడి స్వప్నభావాలకు సిద్ధించిన ప్రత్యక్షరూపాలుగా ధరిస్తాడు, ఆలోచనమాత్రం చేతనే, దేన్నయినా సాక్షాత్కరింపజెయ్యగలరు. కాబట్టి, కారణశరీరులు ,భౌతిక ఇంద్రియసుఖాల్నిగాని, సూక్ష్మలోకఆనందాన్నిగాని, స్థూలమైనదిగానూ. ఆత్మకుగలిగే సూక్ష్మ తరసంవేదనలకు, అవరోధంగానుపరిగణిస్తారు. కారణశరీరు లు తమకు కావలసినవి తక్షణమే సాక్ష్కాత్కరింపజేసుకుని కోరికలు నశింపజేసుకొంటారు.

కారణశరీరమన్నది స్థూలమయినా, సూక్ష్మమయినా, ఆత్మను ఆవరించిఉన్న ఏకోణాన్నయినా సూచిస్తుంది. భౌతిక శరీరంలోనో, సూక్ష్మశరీరంలోనో కారణశరీరంలోనో ఆత్మ ఎక్కడ ఉంటే అక్కడ మానవుని ఇంద్రియపరమైన బలహీనతల్ని కాని, సూక్ష్మ కారణశరీరానుబంధాల్నికాని అవకాశంతీసికొని కోరికలనే దేగలు ముసిరి, ఆత్మనుబందీని చేస్తాయి. కారణశరీరమనే నాజూకుముసుగు మాత్రమే కప్పిఉన్నవాళ్ళు సృష్టికర్తలాగే విశ్వాన్ని సృష్టించగలరు. సృష్టి అంతా విశ్వస్వప్నజాలంతో రూపొందినందువల్ల కారణశరీరమనేపలచని వస్త్రం ధరించి ఉన్న ఆత్మ వివిధ విస్తృత రూపాల్లో శక్తిని సాక్షాత్కరింప జేసుకుంటూ ఉంటుంది.

సహజంగాకంటికి కనిపించనిఆత్మని దానిశరీరంచేతా, వివిధశరీరాలచేతా మాత్రమే గుర్తుపట్టటానికి వీలవుతుంది. శరీరం ఒకటి ఉందంటే అదితీరనికోరికలవల్ల ఏర్పడినట్లే లెక్క, 2. శరీరమన్నది (సంబంధము) చదువుకోలేదు. మానవుడి ఆత్మ ఒకటో,రెండో,మూడో, శరీరమనేసీసాల్లో బంధించిఉండి అజ్ఞానమూ, కోరికలూ, అనేబిరడాలతో బిగించి ఉన్నంతకాలం అతడు పరమాత్మ సాగరంలోలీనం కాలేడు, "చావు" అనేసుత్తిదెబ్బతో స్థూలభౌతిక కాయంబద్దలుయిపోయినప్పుడు, సూక్ష్మకారణశరీరాలనేతక్కినతొడుగులురెండూ వీలులేకుండా ఆత్మనునిరోధించడానికి, ఇంకామిగిలి ఉంటాయి. "జ్ఞానంద్వారా" నిష్కామం అలవడినప్పుడు, దానిశక్తి, తక్కినకొశాల్ని రెంటినిచిన్నాభిన్నం చేసేస్తుంది.అదే "మోక్షం"

## శ్రీయుక్తేశ్వరగిరిగారిపునరుత్థానము

చివరికి స్వల్పమయిన మానవాత్మ విముక్తమయి, అమేయసమృద్ధ మయిన పరమాత్మతో ఐక్యమవుతుంది. ఉత్కృష్టమూ, అద్భుతమూ అయిన "కారణశరీరము చెప్పలేనంత సూక్ష్మమయినది. దాన్ని అర్థంచేసుకోవాలి అంటే ఎవరికయినా తాముకళ్ళుమూసుకొని, సూక్ష్మ విశ్వాన్ని,భౌతిక విశ్వాన్ని, సమస్తాన్ని - గట్టిబుట్టఒకటి, క్రిందవేలాడుతున్న ప్రకాశమానమైన గాలిబుడుగనంతటిని -భావాలరూపంలోనే దర్శించడానికి కావలసిన, మహత్తర ఏకాగ్రతాశక్తులు ఉండి ఉండాలి.అదిమానవసాధ్యమైన ఏకాగ్రతతో, ఆరెండువిశ్వాల్ని, వాటిసంకీర్ణతలన్నటితోసహా, కేవలభావాల్లోకి, పరివర్తన చేయడంలో, లేదాపరిష్కారం చెయ్యడంలో, కృతకృత్యుడు కాగలిగితే, అప్పుడతడు, కారణలోకాన్నిచేరి, మనస్సుకూపదార్థనికి మధ్య, సరిహద్దులోనిలబడగలుగుతాడు. అక్కడతడు, ఘనద్రవ, వాయుపదార్థలు, విద్యుత్తు, శక్తి, సర్వజీవులు, దేవతలు, మనష్యులు జంతువులు,

మొక్కలు, సూక్ష్మజీవులు మొదలైన సృష్టిలోని వస్తువులన్నిటిని, చైతన్యరూపాలుగా దర్శిస్తాడు. అంటే, మనిషి కళ్లు మూసుకొనితనదేహం, భౌతిక నేత్రాలకుకనపడకుండా కేవలం భావంగా మాత్రమే ఉన్నాకూడా తానన్నవాడు ఒకడున్నాడని గ్రహించినట్టుగానే అన్నమాట.

మనలా ఊహల్లోచెయ్యగలిగిందల్లా కారణశరీరుడువాస్తవంగా చేస్తాడు, కేవలం మనస్సులో ఆలోచనలో మొదటికొననుండి తుదికొనదాకా సాగడానికిగాని, ఒకలోకంనుండి మరోకలోకానికి మానసికంగా లంఘించడానికిగాని, నిత్యత్వమనే కూపంలోకి అంతులేకుండా పడుతూఉండడానకిగాని నక్షత్రమండలాల ముత్యాలపందిరిలోకి రాకెట్టు మాదిరిగా దుసుకుపోవటానికిగాని, పాలపుంతలమీదా, నక్షత్రాంతరాళాలలోనూ సెర్చిలైటులా మిలమిల్లాడటానికిగాని, అక్కడవిస్తారమైన మానవ కల్పనాశక్తికి సామర్థ్యం. ఉంది. కాని కారణలోక జీవులకు అంతకన్న గొప్ప స్వేచ్ఛఉంది. భౌతిక అవరోధంగాని సూక్ష్మ అవరోధంగాని కర్మబద్ధతకాని లేకుండా వాళ్లు, తమభావాన్ని తక్షణమే మూర్తరూపంలో (ఆకారంలో అనాయాసంగా ప్రతిక్షీకరించు కుంటారు.

"భౌతిక విశ్వం మౌలికంగా ఋణకణాలతో (ఎలక్ట్రాన్‌లతో) ఏర్పడ్డది కాదని, అలాగే సూక్ష్మవిశ్వం మౌలికంగాప్రాణకణిక (లైఫ్‌ట్రాన్) లతో ఎర్పడ్డది కాదని, నిజానికి ఆరెండూ, సృష్టికర్త నుంచి విడదియ్యడానికి మధ్యలో, కలగజేసుకుంటున్నట్టు అనిపించే సాపేక్షితా నియమమనే మాయచేత ఖండితమై, విభాజితమైన భగవద్భావనతాలూకు సూక్ష్మతమ కణాలతో ఏర్పడ్డదని గ్రహిస్తాడు.

కారణలోకంలో ఆత్మలు, ఒకదాన్నొకటి ఆనందమయ పరమాత్మతాలూకు వైయుక్తికీకృత బంధువులుగా గుర్తుపడతాయి. వాటి చుట్టూఉండే వస్తువులన్నీ భావవస్తువులే, కారణశరీరులు కేవలం, భావాలయిన తమదేహాలకు ఆలోచనకలకూ ఉండే తేడాగమనిస్తారు. మానవుడొకడు కళ్లుమూసుకొని మిరుమిట్లుగొలిపే తెల్లటి వెలుగునుకాని, మందమైన నీలివన్నె మసకవెలుతురును కాని చూడగలిగినట్టే కారణ శరీరులు, కేవలం ఆలోచనల్తో చూడగలరు. వినగలరు. వాసనచూడగలరు. తాకగలరు. వాళ్లువిశ్వమానవశక్తితో ఏదైనాసరే సృష్టిచేస్తారు. లయంచేస్తారు.

కారణలోకంలో, చావు పుట్టుకలు రెండూభావనలోనే ఉంటాయి. కారణశరీరులు నిత్యనూతన జ్ఞానం అనే అమృతంతోనే విందు చేసుకుంటారు. శాంతి అనే నీటి బుగ్గలోనుంచి వెల్లుబికి వచ్చింది. తాగుతారు. అనుభూతి అనే దారిలేని నేలమీద తిరుగుతారు.ఆనందమనే అనంతసాగరంలో ఈదులాడుతారు. అవిగొ వాళ్ల ఉజ్వల భావదేహాలు అనంతత్వపు ఆకాశరూప ఉరరిస్థలిమీద కోటానుకోట్లుగా పరమాత్మసృష్టించిన లోకాల్నీ, విశ్వాలనే తాజాబుడగల్నీ, జ్ఞానతారకల్నీ, సువర్ణనీహారికల చిత్రవర్ణ స్వప్నాల్నీ దాటి మునుముందుకు దూసుకుపోతున్నాయి.అనేక జీవులు కారణలోకంలో వేలకొద్ది సంవత్సరాలు ఉండిపోతారు గాఢతరమైన ఆనందాతిరేకంవల్ల విముక్తాత్మ అప్పుడు స్వల్పమయినకారణశరీరంలో నుంచి బయటికివచ్చి కారణవిశ్వాని కున్నవిస్తారత అనేరూపాల్ని ధరిస్తుంది. భావాల వేరువేరు సుడిగుండాలు ప్రత్యేకీకృత శక్తితరంగాలూ, ప్రేమ, ఆనందమూ శాంతి, సహజావబోధమూ, ప్రశాంతత న్వయంనంయమమూ,ఏకాగ్రతా, ఇవన్నీ కరిగి పరిమానందసాగరంలోలీనమయిపోతాయి. అటుమీదట ఆత్మ, వైయక్తికీకృత తరంగా ఆనందానుభవం పొందదు, చిరంతనహాసం, ఆహ్లాదాలూ, స్పందాలు అనేకెరటాలుగల విశ్వైకమహాసాగరంలో విలీనమయిపోతుంది.

"అధిగమించి వచ్చినవాడు నాదేవుడి గుడిలో ఒక స్తంభమవుతాడు ఇకమళ్లీ బయటికివెళ్లడం ఉండదు, (అంటేమళ్లీ జన్మఎత్తడం ఉండదు.) అధిగమించి వచ్చినవాడికి,

నాతోబాటు నాసంహాసనం మీద కూర్చునే అవకాశం ఇస్తాను; నేనూ అలా అధిగమించి వచ్చి, నా తండ్రితోబాటూనాసింహాసనంమీద కూర్చు నెనూ అలా అధిగమించివచ్చి నా తండ్రితొబాటు ఆయన సింహసనంమీద కూర్చునట్టుగానే"

ఆత్మ, ఈ మూడుశరీరాల గూళ్లనూ విడిచేసినప్పుడు, సాపేక్షత్వానియమం నుంచి తప్పించుకొని, అనిర్వచనీయనిత్యస్థితం అవుతుంది. సర్వవ్యాపకత్త్వమనే సీతాకోకచిలకనుచూడు, దానిరెక్కలమీదనక్షత్రాలు, చంద్రబింబాలు సూర్యబింబాలు చిత్రించి ఉన్నాయి, పరమాత్మగా విస్తరించినాత్మ" వెలుగులేని వెలుగు, చీకటిలేని చీకటి, ఆలోచనలేని ఆలోచన, ఉండేప్రాంతంలోనే, విశ్వసృష్టి అనేదైవస్వప్నంలోకలిగిన ఆనందాతిశయంతో మత్తెక్కి ఉంటుంది.

"విముక్తాత్మ" అంటూ విస్మయంతోపలికాను.

చివరికి శారీరకభ్రాంతులనే మూడు ఘటాల్లోనుంచి బయటపడ్డ "ఆత్మ" తనవ్యక్తిత్వాన్ని కోల్పోకుండానే, "అనంతం"లో ఏకమవుతుంది.

కీస్తు ఏసుగాపుట్టటానికి పూర్వమే ఈచరమస్వేచ్ఛసాధించాడు, ఆయన భూలోక జీవితంలో ,మరణము, పునరుత్థానమూ, అనే మూన్నాళ్ల అనుభవంతో సూచితమైన పూర్వదశలు మూడింటిలోనూ ఆయన, పరమాత్మను చేరుకోటానికి కావలసిన సంపూర్ణశక్తిని సాధించాడు" అన్నారు గురుదేవులు.

అభివృద్ధి చెందని మనషి ఈమూడుశరీరాల్లోనుంచి బయటపడటానికి భూలొకంలోను, సూక్ష్మలోకంలోను లెక్కలేనన్ని జన్మలు ఎత్తవలసి ఉంటుంది. ఈచరమస్వేచ్ఛ సాధించిన గురువు ఇతరమానవుల్నిదేవుడిదగ్గరికి తిరిగి తీసుకురావటానికి, భూలోకానికి ప్రవక్తగా తిరిగి వెళ్లాలిని, నిశ్చయించుకోవచ్చు, లేకపోతేనాలాగ సూక్ష్మవిశ్వంలో ఉందామని అనుకోవచ్చు అక్కడరక్షకుడు, అక్కడివాళ్లకర్మ భారాన్ని కొంతతానుమోస్తూవాళ్లు సూక్ష్మవిశ్వంలో మళ్ళీపుట్టవలసిన అవసరంలేకుండా చేసి, వాళ్లు కారణలోక మండలాలకు శాశ్వతంగా వెళ్లేటందుకు సహాయపడతాడు లేదా విముక్తాత్ముడు, కారణలోకంలోకి ప్రవేశించి, అక్కడి వాళ్లు కారణశరీరలో తమజీవితకాలాన్ని తగించుకొని కైవల్యప్రాప్తి పొందటానికి తోడ్పడతాడు.

ఇక్కడ శ్రీయుక్తేశ్వర్‌గారు సూచించింది ఏమిటంటే, భూమిమీద జన్మించినప్పడు తాను శిష్యులకర్మ, తేలిక అయ్యేటట్టు చేయటానికి, అప్పుడప్పుడు, రోగభారం వహించి నట్టే, కారణలోకంలో కూడా రక్షకులుగా తాముచేపట్టిన పవిత్రకార్యం, హిరణ్యలోకవాసుల, సూక్ష్మకర్మలను కొంత, తమమీద వేసుకుని, వాళ్లు అంతకన్న ఉన్నతమైనకారణలోకంలోకి వెళ్లడానికి వీలుగా వాళ్ల పరిణామాన్న త్వరింతం చెయ్యడానికి తోడ్పడిందన్నమాట.

(చావుబతుకుల చదరంగం బల్లమీదుండే నిగూఢమయిన అంతరాల సుస్పష్ట, సునిసిత జ్ఞానామృతము)

"మానవుడు సూక్ష్మలోకాల్లో, శాశ్వతంగా ఉండటంసంభవించేలోగా అతడు తన భౌతికకర్మను లేదా కోరికల్ని పూర్తిగా అనుభవించాలి" సూక్ష్మలోకంలో రెండురకాల జీవులుంటారు. భూలోకకర్మను ఇంకా క్షయం చేసుకోవలసివవాళ్లను అకాణంగా తమకర్మ సంబంధమైన ఋణాల్ని తీర్చుకోడానికి, స్థూలమైన ఒకభౌతిక దేహంలో ఉండవలసినవాళ్లనూ భౌతికమరణానంతరం, సూక్ష్మలోకానికి వచ్చేశాశ్వత వాసులుగాకాకుండా, (చుట్టపుచూపుగా) తాత్కాలికంగా వచ్చే సందర్శకులుగా మాత్రమే పరిగణించాలి.

"భూలోకంలో కర్మఫలానుభోగం పూర్తిగాని జీవులకు, సూక్ష్మలోక మరణం సంభవించిన తరువాత, విశ్వభావాల ఉన్నతకారణమండలంలోకివెళ్లడానికి అనుమతిలభించదు. పదహారు స్థూలతత్త్వాలున్న తమభౌతిక దేహాన్ని , పందొమ్మిది సూక్ష్మ

తత్త్వాలున్న సూక్ష్మదేహాన్ని పరసగా స్పృహలో ఉంచుకొని , భౌతికలోకానికి సూక్ష్మలోకానికి, అటూఇటూరాకపోకలు సాగిస్తూఉండాలి. అయితే భౌతికశరీరం నశించినతరవాత ప్రతిసారి భూమినుంచి వచ్చిన, అభివృద్ధి చెందనిజీవి, చాలామట్టుకు మరణస్వప్నమనే గాఢసుషుప్తిలో ఉండిపోతాడు, అందమైన సూక్ష్మలోకం అతని స్పృహలో ఉండదు. అటువంటి వాడు సూక్ష్మలోకవిశ్రాంతి తీసుకున్న తరవాత అనుక్రమశిక్షణకోసం భౌతికలోకానికి తిరిగి వెళ్తాడు. పదేపదే సాగే రాకపోకలవల్ల అతడు క్రమంగా సులువుగా అర్థంకాని సూక్ష్మనిర్మాణంగలలోకాలకు అలవాటు పడిపోతాడు.

"అది అలా ఉండగా, సూక్ష్మవిశ్వంలో మామూలుగా ఉంటున్నవాళ్లు లేదా చిరకాలంగా స్థిరనివాసులుగా ఉంటూ వచ్చిన వాళ్లు భౌతికవాంఛలన్నింటి నుంచి విముక్తులయి, భూలోకపు స్థూలస్పందనలకు మళ్లీలోను కావలసిన అవసరం లేనివాళ్లు, అటువంటి జీవులకు సూక్ష్మ, కారణ కర్మలుమట్టుకే అనుభవించవలసిన అవసరం ఉంటుంది. సూక్ష్మలోకంలో మరణించినతరవాత ఈజీవులు అత్యంత సూక్ష్మతరమూ, సుందరమూ అయిన కారణలోకానికి వెళ్తారు. విశ్వనియమం నిర్ణయించిన ప్రకారం కొంతజీవితకాలం గడిచిన తరువాత, ఈ ప్రగతి (అభివృద్ధి) జీవులు, హిరణ్యలోకానికో, అలాంటి ఉన్నత సూక్ష్మలోకానికో వెళ్లి, సూక్ష్మలోక కర్మఫలావశేషాన్ని అనుభవించడానికి ఒక కొత్త సూక్ష్మశరీరంలోకి ప్రవేశిస్తారు.

"అబ్బాయి, నేను దైవాజ్ఞచేత పునరుత్థానం చెందానని , ఇప్పుడు, నువ్వు పూర్తిగా, గ్రహించవచ్చు.

అయితే నేను రక్షకుడిగా పనిచేసేది, భూమినుంచి పైకి వచ్చిన సూక్ష్మలోక జీవుల్ని ఉద్ధరించడంకోసం కన్న, ముఖ్యంగా కారణలోకంనుంచి తిరిగివచ్చి సూక్ష్మలోకంలో పునర్జన్మ ఎత్తిన ఆత్మల్ని ఉద్ధరించడంకోసమనేచెప్పాలి. భూమి నుంచి వచ్చినవాళ్లు తమభౌతికకర్మావశేషాల్ని , ఇంకానిలుపుకొని ఉన్నట్టయితే హిరణ్యలోకంవంటి అత్యున్నత సూక్ష్మలోకానికి చేరలేరు.

"భూమిమీదుండే వాళ్లలో చాలామంది, సూక్ష్మలోక జీవితంవల్ల కలిగే ఉత్కృష్ట ఆనందాల్ని లాభాల్ని హర్షించడానికి ఉపకరించే ధ్యానార్జిత అంతర్దర్శనాన్ని అలవరచుకోని కారణంగా, మరణానంతరం మళ్లీ భూమిమీద ఉండే పరిమిత, అసంపూర్ణ సుఖాలకోసమే తిరిగిరావాలని కోరుకునేటట్టుగానే చాలమంది సూక్ష్మలోకజీవులు కారణలోకంలోని ఆధ్యాత్మికానంద మనే ఉన్నతావస్థను ఊహించుకోలేక, తమ సూక్ష్మశరీరాలు మామూలుగా విఘటనం చెందే సమయంలో, స్థూలతర అసహజ సూక్ష్మలోకసౌఖ్యాన్ని గురించిన ఆలోచనలమీదే మనస్సు పెట్టుకొని సూక్ష్మ స్వర్గానికి తిరిగిరావాలని కోరుకుంటారు. సూక్ష్మలోకంలో మరణించిన తరువాత బహుసన్నని సరిహద్దులో సృష్టికర్తనుంచి వేర్పాటుగా ఉన్న కారణభావజగత్తులో శ్వాశతనివాసం పొందగలిగేముందు అటువంటివాళ్లు భారీ సూక్ష్మలోకకర్మక్షయంకావాలి.

"ఒక జీవికంటికి ఇంపు చేసే సూక్ష్మవిశ్వంలోలభించే అనుభవాలకోసం మరేమికోరికలు పెట్టుకోకుండా తిరిగి అక్కడికి వెళ్లాలన్న వ్యామోహానికిలోబడకుండా ఉండగలవాడయితేనే, అతడు కారణలోకంలో ఉండిపోతాడు, అక్కడ కారణకర్మను లేదా వెనకాటి కోరికలబీజాల్ని క్షయం చేసేపని పూర్తిచేసి, బద్ధమైన ఆత్మ అవిద్య అనేన మూడుబిరడాలలోనూ, చివరిదాన్ని బయటికి నెట్టేసి, కారణశరీరమనే కడపటిసీసాలోంచి బయటపడి శాశ్వతపరబ్రహ్మంలో కలిసిపోతుంది. ఈకారణలోకం అనేటటువంటిదేశం "యాత్రికుడెవడూ తిరిగిరాని అనన్వేషితదేశం" ఒక్కటీలేదు.

"మానవుడిమూడు శరీరాలు, ఒకదాంట్లోకిఒకటి దూర్చుకుపోయి ఉంటాయన్న

విషయం అతనిత్రిగుణాత్మిక ప్రకృతిద్వారా, అనేక మార్గాలో వ్యక్తమవుతుంది." భూమిమీద మాపవుడికి జాగ్రదవస్థలో, దాదాపు ఈ మూడువాహకాలు (దేహాలు) స్వహలో ఉంటాయి. రుచిచూడ్డం, వాసనచూడ్డం, తాకడం, లేదా చూడ్డంవంటి ఇంద్రియానుభవాలు పొందాలని, అతడు ఇంద్రియభోగలాలసుడై తలపెట్టినప్పుడు అతడు ప్రధానంగా అతడుతన భౌతికశరీరంతో పనిచేస్తున్నాడన్నమాట అంతర్దర్శనం పొందడం లేదా, సంకల్పించడం అన్నవి. ముఖ్యంగా సూక్ష్మశరీరంలో చేస్తున్నాడు.

మనిషి ఆలోచిస్తున్నప్పుడు కాని, అంతః పరిశీలనలోనో, ధ్యానంలోనో గాఢంగా మునుగుతున్నప్పుడుకాని అతనికారణశరీరాని కున్న వ్యక్తీకరణ శక్తివెల్లడి అవుతుంది. అలవాటు ప్రకా ం కారణశరీరంతో సంబంధంపెట్టుకొనేవాడికి, ప్రతిభాసంబంధమైన విశ్వభావాలు ఏర్పడతాయి. అంటే ఒకవ్యక్తిని "భౌతికమానవుడుగా కాని శక్తిమంతుడైన మానవుడుగాకాని, స్థూలంగా వర్గీకరింపవచ్చు.

"మనిషి ప్రతిరోజు సుమారు పదహారు గంటలసేపు భౌతికవాహనంగా తననుభావించుకుంటూ ఉంటాడు తరవాత నిద్రపోతాడు, కలలుకనెట్టయితే, సూక్ష్మలోక జీవుల మోస్తరుగానీ ఏవస్తువునయినా, అనాయాసంగా సృష్టిస్తూ సూక్ష్మ శరీరంలో ఉంటాడు. మానవుడి నిద్ర, కలలులేకుండా చాలాగంటల సేపు గాఢంగా సాగినట్టయితే, అతడు, తనచేతనను లేదా అహంకార తత్త్వాన్ని కారణశరీరానికి బదిలీచేయగలుగుతాడు, అటువంటినిద్ర పునర్నవీకరంగా ఉంటుంది. కలలుకనేవాడు తన సూక్ష్మశరీరంతో సంబంధం పెట్టుకుంటున్నాడు తప్ప, కారణశరీరంతో కాదు, అతని నిద్ర పూర్తిగా పునర్నవీకరంకాదు.

"నాకొత్త శరీరం, పాతదానికి పరిపూర్ణమైననకలు ఈరూపాన్ని నేను సంకల్పానుసారంగా ఎప్పుడైనా సరే ప్రత్యక్షంచేయ్యడం, అదృశ్యంచెయ్యడం చేస్తూంటాను, భూమిమీద చేసినదానికంటే కూడా, తరుచుగాచేస్తూ ఉంటాను.శీఘ్రంగా అదృశ్యంచెయ్యడం వల్ల నేనిప్పుడు కాంతిరథం (లైట్ఎక్స్‌ప్రెస్) మీద ఒకగ్రహంనుంచి మరోగ్రహానికి, క్షణంలో ప్రయాణంచేస్తూంటాను.

"గురుదేవా మీరుపోయినందుకు నేనెంతవిలపించానో, " అన్నాడుయోగానంద.

"బాగుందోయ్! నేనుపోవడమేమిటి ? ఏరకంగా? ఇందులో కాస్తతిరకాసులేదూ?."నువ్వు భూమిమీద కలగన్నావంతే, ఆభూమిమీదనువ్వు నా స్వప్నశరీరాన్ని చూశావు" తరవాత, నువ్వాస్వప్నబింబా సమాధిచేశావు. ఇప్పుడునువ్వు చూస్తున్న శరీరం ఉందేం -ఇప్పటికి నువ్వింకాగట్టిగానే పట్టేసుకుని ఉన్నది. - మాంసమయమైననా సూక్ష్మతర శరీరం భగంతుడి మరోసూక్ష్మ తరస్వప్నలోకంలో పునరుత్థానం చెందింది. ఎప్పటికో ఒకనాటికి , ఈ సూక్ష్మతరశరీరమూ, సూక్ష్మతరస్వప్నలోకమూ కూడా గతిస్తాయి. అవికూడా ఎప్పటికి ఉండిపోయేవికావు, కలలబుడగలన్నీ చివరికి చరమజాగరణ స్పర్శతో పగిలిపోకతప్పదు, అబ్బాయి యోగానందా, కలల్ని , వాస్తవాన్ని విడమర్చిచూడు.

"యోగానందా, నాజీవితాన్ని మరణాన్ని, పునరుత్థానాన్ని గురించిన సత్యాలు ఇప్పుడు నీకుచెప్పాను, నాకోసంబెంగపెట్టుకోకు, అంతకన్న దేవుడి కల అయిన ఈ భూలోకం నుంచి సూక్ష్మశరీరా,చ్ఛాదితమైన ఆత్మలు ఉండే మరోభగవత్స్వప్నగ్రహానికి వెళ్లిన నాపునరుత్థాన వృత్తాంతం ప్రతిచోట1 చాటు. ప్రపంచంలో ఉన్నదుఃఖపీడిత, మరణభీత స్వప్నదర్శుల హృదయాల్లో కొత్త ఆశను చిగురంపజేస్తుందది."

"భూమిమీద నాప్రమాణాలు, అసౌకర్యంకలిగించేటంత ఉన్నతమైనవీ, చాలమంది (చాలమంది) స్వభావానికి సరిపడనివీను నిన్నునేనుతిట్టవలసినదానికంటె ఎక్కువసార్లే తిట్టాను, నీప్రేమ నామందలింపుల మబ్బులోంచి దూసుకువచ్చి ప్రకాశిస్తోంది. "మన

రూపాలు రెండూ భగవంతుడి మాయాస్వప్నంలో వేరువేరుగా కనిపించినంతకాలం, నువ్వూ నేనూ కలిసి చిరునవ్వు నవ్వుకుంటాం, చివరికి మనము ఒకరమైన విశ్వప్రియతముడిలో లీనమవుతాం, మనచిరునవ్వులు ఆయన చిరునవ్వులవుతాయి, మనసమైక్య ఆనందగీతం అనంతమంతటా స్పందిస్తూ, దైవాను సంధానంపొందిన ఆత్మలకు ప్రసారమవుతూ ఉంటుంది.'

" బాబూ, ఇప్పుడింక నిన్నువిడిచి వెళ్ళిపోవాలిమరి" ఈమాటలువినడంతోటే నేనుచుట్టి ఉంచిన చేతుల్లో గురుదేవులు కరిగిపోతున్నట్టు అనిపించింది అన్నాడుయోగానంద.

"నాయనా" అంటూపిలిచినప్పుడు ఆయనకంఠస్వరం, నాఆత్మాకాశంలోకిస్పందిస్తూ ప్రవేసించింది (యోగానంద వాక్యములు)

"నువ్వు నిర్వికల్ప సమాధి ద్వారంలోకి ప్రవేశించినన్ను ఎప్పుడు పిలిస్తే అప్పుడు ఇవ్వాళ్టిలాగే, రక్తమాంసాలున్న శరీరంతో నీదగ్గరికి వస్తాను" అన్నారాయన, ఈ దివ్యవాగ్దానం చేసి శ్రీయుక్తేశ్వర్ గారు నాకుకనుమరుగయిపోయారు. సంగీతంతో కూడిన ఉరుములా మారుమ్రోగినమేఘగర్జన స్వరం ఒకటి ఇలాపలికంది. "అందరికి చెప్పు! మీ భూలోకం దేవుడికలఅని నిర్వికల్ప సమాధిలో తెలుసుకున్నవాడల్లా హిరణ్యలోకమనే సూక్ష్మతర స్వప్నజనితగ్రహానికిరాగలడు, అక్కడనేను అచ్చంభూమిమీదున్నప్పటి శరీరంలాటి శరీరంతోనే పునరుత్థానంచెంది ఉండడంగమనిస్తాడు. యోగానందా, ఈమాట అందరికిచెప్పు" అన్నారుగురుదేవులు. జ్ఞానావతార్ శ్రీయుక్తేశ్వర్ గారి పునరుత్థానం తత్త్వబోధామృతముసమాప్తము.

# 15. శ్రీబ్రహ్మానందగిరి స్వామివారి బ్రహ్మావిద్యామహోదధి సారము

## 1. ప్రవేశతరంగము

కామ క్రోధాదులుపరమ శత్రువులని ఇంద్రియమనోబుద్ధుల నాశ్రయించుకొని విషయముల వైపునకు తరుముచున్నవి. విషయభోగములు నానావిధములగు దుఃఖములను గలిగించును, విషయవాసనలు జనన మరణాది సమస్త సంసారములకు కారణములు, స్త్రీలయందును, పుత్రులయందును, ధనమునందును భ్రాంతి, ఇహపర దుఃఖములకు హేతువగును, కావున ముముక్షువు వానిని సదా విడువ వలయును స్త్రీ, పుత్ర, ధనాది పదార్థముల యందుగల భ్రాంతిని పరిత్యజించ వలయును, మనస్సునందున్న మలిన వాసన లాత్మ జ్ఞానమునకు ప్రతిబంధకము లగుటచే, వానిని సర్వదావిడువ వలయును, దేహము పరిణామ వంతమును నస్థిరమును నగును, ఆయువు చంచలమైనది, ఇహపర లోకములు, ఆలోకములయందుగల భోగ పదార్థములు, భోగ సాధనలు, శాశ్వతములుకావు, కావున ముముక్షువు (మోక్షార్థి) దేహభ్రాంతిని , యిహ పరలోక భోగ వాంఛను వీడి, దేహమున ప్రాణముండగనే సద్గురువుని వలన, వేదాంత శాస్త్రమును శ్రవణము చేసి, జ్ఞానము పొందవలయును, ఆ జ్ఞానము వలన నిఖిల దుఃఖనివృత్తి, నిరతిశయానంద ప్రాప్తిరూపమగు మోక్షము కలగును.

## 2. ఆవరణ తరంగము :

దుఃఖము, శరీర పరిగ్రహము, కర్మములు, రాగద్వేషాదులు, అనుకూల ప్రతికూల జ్ఞానములు, ద్వైత ప్రపంచ భ్రాంతి, అజ్ఞానము అని యావరణము ఏడు విధములు, ఈ యేడును ఆత్మను గ్రమ్మి మఱుగు పఱచుచున్నవి. ఇందు దుఃఖము-అధ్యాత్మికములనియు,

అధి భౌతికములనియు అధి దైవికములనియు మూడు విధములు. ఈ మూడు విధములగు ధఃఖములును, శరీర పరిగ్రహమున్నచోట నుండును బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాది దేవతలు మొదలు -సర్వప్రాణులకు , శరీర పరిగ్రహముండుటచే, అందరకు త్రివిధ దుఃఖములు కలుగుచున్నవి.

"ఈ శరీరములు పూర్వ జన్మమున చేయబడిన పుణ్య, పాప, మిశ్రమ కర్మము వలన కలుగుచున్నవి. ఆ కర్మములు, రాగము, ద్వేషము, కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము, ఈర్ష్య, అసూయ, దంభము,దర్పము, దురహంకారము ఇచ్ఛ, భక్తి, శ్రద్ధలను పదునాలింటిచే ప్రేరేపింపబడి చేయబడుచున్నవి. ఇందు,మొదట చెప్పబడిన రాగాదులు పదమూడింటి చేత పాపకర్మములును, ఇచ్ఛభక్తి, శ్రద్ధ అను మూడింటి చేత పుణ్య కర్మములును చేయబడుచున్నవి. ఈ రాగద్వేషాదులు ప్రపంచ పదార్థముల యందనుకూల, ప్రతికూల జ్ఞానములు ఉండుటచే కలుగుచున్నవి ద్వైత ప్రపంచభ్రాంతి ఆత్మజ్ఞానము వలన కలగుచున్నవి, సద్గురునిచే ఆత్మ జ్ఞానము, పొందినచో ఆత్మాజ్ఞానము నశించును, ఆ యజ్ఞానము నశించినైన, ద్వైత ప్రపంచ భ్రాంతిపోవును ద్వైత ప్రపంచ భ్రాంతి పోయిన అనుకూల, ప్రతికూల జ్ఞానములు దయించవు. అనుకూల ప్రతికూల జ్ఞానములు దయింపని యెడల రాగద్వేషాదులు కలగవు, రాగద్వేషాదులు కలుగనిచో కర్మములు చేయబడవు. కర్మములు చేయబడనిచో శరీరపరిగ్రహములుండవు. శరీరపరిగ్రహముండనిచోత్రివిధ దుఃఖములు కలుగవు.

" ఈ సర్వానర్థములకు మూలకారణము అజ్ఞానమగుటచే దాని నివృత్తి కొఱకు సద్గురువు వలన ఆత్మజ్ఞానము పొందవలయును, ఈ యాత్మజ్ఞానము అజ్ఞానమును కార్యసహితముగ నాశనము చేసి శాశ్వతమగు ఆత్మానందమును కలిగించును.

## 3. కర్మోపాసనా తరంగము

కర్మములు - నిషిద్ధ కర్మములనియు, కామ్య కర్మములనియు, నిత్యకర్మములనియు,నైమిత్తిక కర్మములనియు ప్రాయశ్చిత్త కర్మములనియు నైదు విధములు, ఇందు జారత్వ, చోరత్వాది నింద్య కర్మములు నిషిద్ధకర్మములనబడును. వీని నాచరించినచో నిహలోకమున రాజదండనము, లోకనిందయు కలుగును. మరణించిన పిదప, యమలోకమున ఆ పాపమునకు ఫలముగ నానాబాధలు సంభవించును, ఆకర్మ శేషమునకు మఱల భూమియందు, క్రిమికీటకాది నీచయోచులయందు బుట్టి నానాదుఃఖముల ననుభవింపవలసి యుండును,

ఫలాపేక్షతో యజ్ఞ యాగాది కామ్య కర్మమును చేసినచో ఫలముల ననుభవించుట కొఱకు స్వర్గాది పరలోకములను బొంది, యా లోకములలో తమ కర్మములకు తగిన ఫలముల ననుభివించి యా కర్మ శేషమునకు మఱల భూమిమీద నుత్తమ యోనులందు బుట్టుట జరుగును.ఈ నిషిద్ధ కామ్య కర్మ లాచరించు వారీలో కమునందు, పరలోకము లందును తాము చేసిన కర్మములకు తగిన ఫలముల ననుభవించి సంసారమున మరల మరల జనన మరణములను పొందుచున్నారు. వీరికి జనన మరణ రూపమగు సంసార దుఃఖములే సంభవించును, కాని జనన మరణ రహితమగు మోక్షమెన్నడును లభింపనేరదు.

" మానవులాశ్రమోచితములగు నిత్య కర్మములను ఫలాపేక్షారహితముగా ఈశ్వరార్పణ బుద్ధితో కర్తృత్వాభిమాన రహితులై చేయవలయును, ప్రతి దినమున మానవుడు స్నాన సంధ్యోపాసనాదులను, బ్రహ్మయజ్ఞము, దేవయజ్యము, పితృ యజ్ఞము, అతిథి యజ్ఞము, భూత యజ్ఞము, అనెడి పంచ యజ్ఞములను, ఆశ్రమోచితములగు నితరలౌకిక వైదికములైన విహిత కర్మములను, ఫలాపేక్షరహితముగ చేయవలయును. వీనిని చేయుటచే

నంతఃకరణము పరిశుద్ధమగును, చేయని యెడల ప్రత్యవాయ దోషము (పునర్జన్మప్రాప్తి) సంభవించును.

పితృ తర్పణము, గ్రహణ స్నానము, షోడశ సంస్కారములు మొదలగునవియు, వాపీకూప తటాక దేవాలయ నిర్మాణము, కఱువు, కాటకాదుల యందన్న దానము, వస్త్ర దానాదులు, యి మొదలగు నిమిత్తములను అనుసరించి చేయబడు విహిత కర్మములు నైమిత్తిక కర్మములనబడును. వీనివలన కూడ నంతఃకరణ పరిశుద్ధి కలుగును.

ప్రాయశ్చిత్తకర్మములుః- ఇవి సాధారణ ప్రాయశ్చిత్త కర్మములనియు, అసాధారణ ప్రాయశ్చిత్త కర్మములనియు రెండు విధములు, తనకు తెలియబడకయే జన్మ జన్మాంతరములయందు చేయబడిన పాపకర్మముల నివృత్తి కొఱకు శాస్త్రవిధిననుసరించి చేయబడెడి గంగా స్నానము, ఈశ్వరోపాసనము మొదలగునవి సాధారణ ప్రాయశ్చిత్త కర్మములనబడును. తాను చేసిన పాపకర్మమును స్వయముగగాని యితరుల వలనగాని తెలిసికొని దాని నివృత్తి కొఱకు శాస్త్రములయందు విధంపబడిన విధముగా ప్రాయశ్చిత్తము చేసికొని మరల ఆ పాపకర్మమును చేయకుండుట అసాధారణ ప్రాయశ్చిత్త కర్మము అనబడును.

పై రెండు విధములగు ప్రాయశ్చిత్త కర్మములు, పాపనివృత్తి మూలముగ నంతఃకరణ శుద్ధికి మాత్రమే హేతువగుచున్నవి. కాని మోక్షహేతువులుకావు.

అట్లే ఉపాసనలు కూడా కామ్యోపాసనలనియు, నిష్కామ్యోపాసనలనియు రెండు విధనములు. ఇహలోక భోగముల కొఱకుగాని, నిత్య వైకుంఠ కైలాసాది పరలోక భోగముల కొఱకుగాని బ్రహ్మ విష్ణు మహేశ్వరాది దేవతల నారాధించుట కామ్యోపాసనలబడును.ఈ కామ్యోపాసన వలన, నిహపరలోక భోగములు కలుగును. కాని, యా యుపాసనా ఫలమనుభవించి తీరిన పిదప మరల భూమియందు పుట్టవలసి వచ్చును. కావున కామ్యోపాసనలు కూడ జనన మరణ రూపమగు సంసారమునకే హేతువగుచున్నవి. కాని మోక్షమునకు హేతువులగుట లేదు. నిష్కామముగ నీశ్వరునుపాసించినచో చిత్తైకాగ్రత కలగును.

ఇందు ఉపాసనలను విడిచి కేవలము కర్మములనుగాని, కర్మములను విడిచి కేవలము ఉపాసనలనుగాని చేయరాదు. అటుల చేసినచో వారు అజ్ఞానావృతములగు నీచయోనులయందు బుట్టెదరని శాస్త్రములు చెప్పుచున్నవి. కావున కర్మోపాసనల సముచ్చయ విధానమెఱింగి ఆచరించినచో నిష్కామ కర్మముల వలన చిత్తశుద్ధియును ఉపాసనల వలన చిత్తైకాగ్రతయును కలుగును. అటుపిమ్మట సాధన చతుష్టయ సంపత్తిని సంపాందించి సద్గురుని వలన వేదాంతశాస్త్రము శ్రవణముచేసి ఆత్మజ్ఞానమును పొందినచో మోక్షరూప సామ్రాజ్యము లభించును.

ముముక్షువునకు కర్మోపాసనలు భేద జ్ఞానమును కలిగించునవగుటచేతనవి సాక్షాత్తుగా నభేద బ్రహ్మ స్వరూపమగు మోక్షమును కలిగింపనేరవు. మరియు యీ కర్మోపాసనలు చిత్తశుద్ధి, చిత్తైకాగ్రతుల మూలమున శ్రవణార్హతను మాత్రము కలిగించును, ఇంతమాత్రమేగాని, జ్ఞానమునకు అంగముగ నుండిగాని, జ్ఞానముతో కలిగిన అద్వితీయ బ్రహ్మ జ్ఞాన మొక్కటి మాత్రమే సాక్షాత్తుగా కార్యసహితమగు మోక్షమును కలిగించుచున్నది. కావున మోక్షమునకు కర్మోపాసనలు పరంపరా సాధనములగును, జ్ఞానము సాక్షాత్సాధనమగును.

## 4. అనుబంధ తరంగము

అధికారి, సంబంధములు విషయము, ప్రయోజనము అని యనుబంధము నాలుగువిధములు ఈ నాల్గింటిని తెలియుటచే, వివేకియైన వానికి వేదాంతగ్రంధమున బ్రవృత్తి కలుగుచున్నది. ఇందువల్ల, విక్షేపములు లేని సాధన చతుష్టయ సంపన్నుడు

బ్రహ్మమును విచారించుట కధికారి యగును, "నిత్యానిత్యవస్తు వివేకము, ఇహాముత్రార్థ ఫలభోగ విరాగము, శమదమాది షట్క సంపత్తి, ముముక్షుత్వము" అను యీ నాల్గును సాధన చతుష్టయ మనబడును. ఇందు బ్రహ్మము సత్యము బ్రహ్మ భిన్నమగు ప్రపంచము అసత్యమని విచారించుటయే నిత్యానిత్య వస్తు వివేకము. ఈ లోక భోగములు మొదలు బ్రహ్మలోక భోగముల వఱకుగల సమస్త విషయ భోగమును కాకిమలమువలె త్యజించుట ఇహాముత్రార్థ ఫలభోగ విరాగమనబడును, శమము, దమము, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సామాధానము అను నీయారును గూడి శమాది షట్క సంపత్తి యనబడును, ఇందు అంతరింద్రియ నిగ్రహము శనమనబడును. బాహ్యేంద్రియ నిగ్రహము దమమనబడును, విషయ సాధనములగు కర్మముల యందును, వాని ఫలముల యందునుగల తిరస్కారబుద్ధి యుపరతి యనబడును. ప్రారబ్ధాను సారముగ సంభవించెడి ద్వంద్వములను సహించియుండుట తితిక్షయనబడును. గురు వేదాంత శాస్త్రములయందుగల విశ్వాసము శ్రద్ధయనబడును. విషయములను చింతించెడి మనస్సును నిగ్రహించి తీవ్ర జ్ఞానేచ్ఛను కలిగి యుండుట సమాధాన మనబడును, ఈ యాఱును పరస్పరాపేక్షితములై యుండుటచేనొక సాధన మన్నియే చెప్పబడెను. దుఃఖ నివృత్తి, సుఖప్రాప్తి, కోరుటయే ముముక్షత్యమనబడును. ఈ నాలుగు సాధనములు గలవాడే సద్గురుని వలన వేదాంత శాస్త్ర శ్రవణముచేసి మోక్షమును పొందుట కధికారియగును.

పరస్పర ముపయోగ యోగ్యతగల పదార్థ ద్వయమునకు సంబంధము కలుగుచున్నది. కావున యీ గ్రంధమునకు -బ్రహ్మమునకును, అధికారికి - ఫలమునకును, అధికారిక - విచారమునకును, గ్రంధమునకు - జ్ఞానమునకును, పరస్పరోపయోగ్యములు ఉండుటచే వీనికి సంబంధములు కలుగుచున్నవి. ఈ వేదాంత గ్రంధమునకు జీవ బ్రహ్మముల యేకత్వమే విషయము, జీవుని యొక్క విశేషణ భాగమైన సాభాసాంతః కరణమునకు బ్రహ్మముతో నేకత్వము కలుగక పోయినను విశేష్యభాగముచే నభ్యస్థమగు విశేషణ భాగము కూడా బాధింపబడి బ్రహ్మముతో నేకత్వము పొందుచున్నది.

సర్వానర్థ నివృత్తి శాశ్వతానంద ప్రాప్తి రూపమగు మోక్షమే యీ గ్రంధమునకు ముఖ్య ప్రయోజనము. సర్వానర్థములను నివృత్తి చేసి బ్రహ్మ సాక్షాత్కారమును కలిగించెడి జ్ఞానము అవాంతర ప్రయోజన మగును. సర్వానర్థనివృత్తి, పరమానంద ప్రాప్తి రూపముగు మోక్షము, కేవల కర్మముల వలనగాని, ఉపాసనల వలనగాని కలుగనేరదు. ఈ కర్మోపాసనలు కలిసిగాని, జ్ఞానమునకు అంగములగ నుండిగాని మోక్షమును కలిగింప జాలవు. కర్మోపాసనల వలన భేదప్రపంచజ్ఞానము కలుగునే గాని, యెట్టి బ్రహ్మజ్ఞానము కలుగనేరదు.

## 5. గురుసమాశ్రయ తరంగము:

మల విక్షపములు లేని సాధన చతుష్టయ సంపన్నుడు శ్రోత్రియబ్రహ్మ నిష్ఠుడైన సద్గురువునకు తనువు, ధనము, మనస్సు లర్పించి, సాష్టాంగభావాత్మలను చతుర్విధ శుశ్రూషలోనరించి వేదాంత శాస్త్రమును శ్రవణము చేయవలయును సంస్కృత వాఙ్మయములో నుండిన శృతి స్మృతి సూత్రములు, వాని భాష్యములు, నితరములగు వేదాంత ప్రకరణ గ్రంధములు శ్రవణము చేయలేనివారు దేశభాషలయందున్న వేదాంత గ్రంధములుండినను నవి కొన్ని యసమగ్రముగన, కొన్ని ప్రస్థాన త్రయ విరుద్ధముగను నుండుటచే వానిని శ్రవణము చేసిన జిజ్ఞానువులకు పూర్ణ ఫలము కలుగనేరదు. ఈ "బ్రహ్మవిద్యామహోదధి' 'యను వేదాంతగ్రంధము శృత్యర్థ ప్రతి పాదకమును, నిర్దుష్టమున, సమగ్రమును నగుటచే దీనిని సద్గురుని వలన శ్రవణము చేసినచో మోక్షము కలుగును. ఎవరును నేవేదాంత గ్రంధమును స్వయముగ చదివి అర్థనిర్ణయము చేయరాదు. భేదవాదులగు పండితుల

వలన కూడా వినరాదు. శృతుల యొక్కయదార్థ తాత్పర్యము తెలిసిన శ్రోత్రియుడున, బ్రహ్మస్థితిని బొందిన బ్రహ్మనిష్ఠుడును, నుత్తము గుణములు గలిగిన సద్గురువువలన శ్రవణము చేయవలయును.

తలకునిప్పంటుకొనినవాడు చలిరాశియొద్దకు పరుగెత్తునట్లు, సంసార దావాగ్నిచే పరితపించుచున్నయుత్తమాధికారి సమిధాది కానుకలను చేతబట్టుకొని శాంతి శమదమాది సద్గుణ సంపన్నుడైన సద్గురుని చేరవలయును. తరువాత ఆ సద్గురుని యాజ్ఞప్రకారము వర్తించుచు నమన్తధర్మముల నెఱుగుచు మంత్రములను మంత్రార్థములను మంత్రభాష్యములను మంత్రానుష్ఠాన విధానమును సమగ్రముగ నెఱుంగవలయును. భయ భక్తి శ్రద్ధలతో మెలంగవలయును అటుపిమ్మట యోగ యోగాంగములు సహజ అంతర, అంతరాంతరతారక ములపద్ధతుల నెఱింగి, వానిని యధాశక్తి ననుష్టించి, చిత్తశుద్ధిని, చిత్తైకాగ్రతను పొంది సద్గురుని వనల వేదాంత శాస్త్రమును శ్రవణముల చేసితరించవలయును.

## 6. శ్రవణ తరంగము:-

జన్మజన్మాంతరములగు, కామకర్మాదివాసనలచేతను భేదవాదులగు పండితుల వాక్యములచేతను, సాంసారికజనులసాంగత్యముచేతను, జిజ్ఞానువుల హృదయములందు సంసయభావన, అసంభావన విపరీతభావన, అనుమూడు దోషములు కలుగుచున్నవి. వీనినే ప్రమాణగత సంశయము, ప్రమేయగత సంశయము విపర్యయము అనియునందురు. ఇందువేదాంత వాక్యములు అద్వితీయ బ్రహ్మమును బోధించుచున్నవా? లేక అన్యార్థమును బోధించుచున్నవా? అనునటువంటివి ప్రమాణగత సంశయములు. జీవబ్రహ్మముకు భేదము సత్యమా? అభేదము సత్యమా? సంచక్లేశములు గల జీవుడు బ్రహ్మమెట్లగును? అనునిటువంటివి విప్రమేయ గత సంశయములు జీవుడుబ్రహ్మముకాడు. అతడు బ్రహ్మముకంటె భిన్నుడే యగును. అనునిటువంటివి విపర్యమములనబడును.

వేదాంతశాస్త్రమును, షడ్లింగసహితముగ సద్గురనివలన శ్రవణముచేసినచో ప్రమాణగత సంశయము నివృత్తియగును. శ్రవణము చేసినయర్థము నుజీవబ్రహ్మముల భేదమును బాధించేడి యుక్తులచేతను,అభేదమును సాధించేడి యుక్తులతోడను మననముచేయుటచే ప్రమేయగతి సంశయము నివృత్తియగును. అంతఃకరణమున జడములగు విజాతీయవృత్తులను కలుగనీయక యఖండచైతన్య రూపమగు సజాతీయవృత్తి ప్రవాహరూపమగు నిధిధ్యాసన, వలన విపర్యయము, నశించును.

వేదాంతశాస్త్ర శ్రవణము చేయుటకు, మలవిక్షేపములేనివాడును, సాధన చతుష్టయ సంపన్నుడును, సర్వకర్మసన్యాసి యునగు జిజ్ఞానువే యధికారి. అపరావైరాగ్యముగల, కుటీచక, బహూదక, హంససన్యాసులకు శ్రవణార్హతలేదు. పరమహంస సన్యాసులలో, విద్వత్సన్యాసికి శ్రవణము వలన ప్రయోజనములేదు. జనక ప్రవాహోణాదులవలె నాంతర, బాహ్య వివిధషాసన్యాసమును గాని పొందిన యుత్తమజిజ్ఞానువులకే, వేదాంతశాస్త్రమును శ్రవణము చేయటకర్హతగలదు. వివిదిషాసన్యాసి, మనోమయద్వైతము, నవశ్యము విడువవలయును. ఆమనోమయద్వైతము కూడ, శాస్త్రీయమనియు, నశాస్త్రీయమనియు రెండువిధములు గురునమాశ్రయతరంగము

## ఆత్మయొక్క స్వరూప లక్షణము:-

చైతన్య రూపమగు నాత్మ తాను స్వయముగ ప్రకాశించుచు సమస్త పదార్థములను, అంతఃకరణ పరిణామ రూపమగు మరస్సును ఉపాధిగా చేసికొని ప్రకాశింపజేయుచున్నాడు. ఇట్లు నిరుపాధికుడగు స్వయం ప్రకాశత్మమే, మనసును దేహేంద్రియాదులను, అంతరమై

సమస్త పదార్థములను స్వయముగనే ప్రకాశింపజేయుచున్నవి. ఆ స్వయం ప్రకాశార్థియే "నేను" సర్వకాల సర్వావస్థల యందును, సమస్త పదార్థములను జాగ్రదాది త్రివిధ అవస్థలయందు నెఱుంగచున్నాను. కావున "నేను" చిద్రూపుడను సర్వోత్కృష్టమై, స్వతస్సిద్ధమై, నిత్యమై, నిరతిశయమై సర్వదుఃఖ నివర్తకమై నిరుపాధికమై సుషుప్తి యందంటి చేతను ననుభవింపబడుచున్న ఆనందమే 'బ్రహ్మానందము' ఈ బ్రహ్మానందమునే ప్రతి ఒక్కజీవియు అనుభవించిన తదుపరియే మోక్షరూప సామ్రాజ్యమున కాధిపత్యము లభించగలదు. అంతదనుక ఏ జీవికైనను కైవల్య ప్రాప్తికి తరణోపాయము నిరర్థకమని దృఢనిశ్చయ జ్ఞానులగుదురుగాక.

ఆత్మకానందత్యము సర్వదా స్వతస్సిద్ధమై యున్నప్పటికిని నాత్మయందు తోచెడి దేహేంద్రియాదుల కల్పిత సంబంధము వలన, జాగ్రత్స్వప్న ములయందు, ఆత్మసుఖము మరుగుపడుచున్నది. బహిర్ముఖ చిత్తుడైన యజ్ఞాని జాగ్రత్ స్వప్నములయందు విషయముల వలన గలిగెడి సుఖమాత్మ సుఖమని యోఱుంగజాల కుండినను అంతర్ముఖుడైన జ్ఞాని సర్వావస్థలయందును, సర్వ విషయముల మూలముననను, అనుభవించెడి సుఖము,ఆత్మసుఖమేయని తలంచుచున్నాడు. కావున సుషుప్తియందు సర్వజీవులనుభవించుచు ఉండెడి యాత్మ సుఖమే అవస్థాత్రయము నందునునున్నది, కాని దానిని అజ్ఞాని యెఱుగ జాలడు. జ్ఞానిమాత్రమ యెఱుంగుచున్నాడు. అందువలన ఆత్మసుఖము నిత్యమనియు, నిరుపాధికమనియు, నిరతిశయమనియు చెప్పబడుచున్నవి.

ఆత్మ సర్వకాల సర్వావస్థల యందును , పరమప్రియుడగును కావున ఆత్మకంటె భిన్నములుగ సమస్త పదార్థములును దుఃఖ స్వరూపులగును, సర్వరూప ధనాదులు, ఇంద్రియాది ప్రాణము, శరీరము కంటెను గూడా ఆత్మయే ప్రియతమమైనదిని తెలియబడుచుఉన్నది.

ఈ సచ్చిదానంద రూపమగు ఆత్మ సర్వదేశ, సర్వకాల, సర్వ వస్తువలందునధిష్ఠాన రూపమై వ్యాపించియుండుటచే, అది "బ్రహ్మము" అనుబడును, ఈ బ్రహ్మము ఆత్మకంటె భిన్నము కాదు. ఇద్దఱు ఒక్కటే.

ఇందునశ్రాస్త్రీయ మనోమయద్వైతము, తీవ్రము, మందముననిరెండు విధములు ఈ రెండువిధములగు, నశాస్త్రీయ, మనోమయద్వైతమును, జిజ్ఞానువు వెంటనే విడువవలయును గరు వేదాంత,శాస్త్ర శ్రవణాదులు, శాస్త్రీయ మనోమయద్వైతము, దృఢబోధకలుగుపర్యంతము దీనిని విడువరాదు. ఈ గురుశాస్త్ర విచారాదులు కూడ మిథ్యలైనప్పటికిని , మిథ్యాసంసారబంధమును నివృత్తి చేయును, ఎటువంటిదైవమునకు అటువంటి "పూజరమే" అనునట్లు మిథ్యాసంసారబంధనివృత్తికి,మిథ్యాసాధనలే కావలయును.కావున సద్గురునివలన వేదాంతశాస్త్రములు శ్రవణముచేయవలయునని శృతివిధించుచున్నది. ఈ శ్రరణ రూపమగునంగికి వివేకాది సాధన చతుష్టయ సహితమగు, వివిదిషాసన్యాసము, స్వరూపోపకార్యంగమనబడును. మనన నధిధ్యాసలు, ఫలోపకార్యాంగ మనబడును. ఈ ద్వివిధాంగములతో కూడిన శ్రవణమువలన, సంశయ, విపర్యయములు నశించి బ్రహ్మసాక్షాత్కారజ్ఞానముకలుగును.

వాచస్పతి, మిశ్రులు, శ్రవణము విధిపరముకాదనియు, యోగ్యతా పరమనియుచెప్పుచున్నారు. అవిధిపరమని చెప్పువారిలో ప్రకాటార్థకారుల పూర్వవిధిని, నంగీకరించుచున్నారు. వారిలోకొందరుగు, వివరణాచార్యులు మొదలగువారు, ఆశృతివాక్యములు విధివరములనుచున్నారు. వివరణానుయాయులు నియమవిధినంగీకరించుచున్నారు. సురేశ్వరాచార్యులు, పరిసంఖ్యా విధినంగీకరించుచున్నారు.

ఎవ్వరేవిధముగ జెప్పినను శ్రవణము ద్వివిధములగు వివిదిషాసన్యాసులకు నిత్యకర్మరూపమగును. గృహస్థులు నిత్యకర్మములాచరింపనిచో ప్రత్యవాయదోషము కలగుననట్లు, వివిదిషాసన్యాసి వేదాంతశాస్త్ర శ్రవణముచేయనిచో ప్రత్యవాయదోషముకలుగునని శాస్త్రము నందుజెప్పడెను.

## 7. లయచింతనాతరంగము:-

మొట్టమొదట లక్ష్య, లక్షణ భావములులేని, నిష్ప్రతి యోగికబ్రహ్మమొక్కటి మాత్రమే స్వతస్సిద్ధముగానుండెను. దానియందు, అనృత,జడ, దుఃఖములైన ప్రపంచ లక్షణములకు ప్రతియోగులగు, సత్యజ్ఞాన ఆనందలక్షణములను కల్పించుటచే, నది, సచ్చిదానంద బ్రహ్మమనబడెను. అసచ్చిదానందబ్రహ్మము యొక్కత్రిగుణాత్మకమగు శక్తియే మూలప్రకృతి యనబడును. అదిబ్రహ్మము నాశ్రయించి మరుగువఱచుటచే మూలాజ్ఞానమనబడెను. ఈ మూలాజ్ఞానముయొక్క సత్యగుణమువలన జ్ఞానమును, సుఖమును కలుగుచున్నవి. రజోగుణము వలన కర్మములును దుఃఖము కలగుచున్నది. తమోగుణమువలన పదార్థములును, మోహమును కలుగుచున్నవి కావున నీమూలాజ్ఞాన కార్యమగు ప్రపంచమునందు జ్ఞానకర్మ పదార్థములును, వానివల్లనే సుఖదుఃఖ మోహములును జనించుచున్నవి.

ఈ మూలాజ్ఞానము సదసద్విలక్షణమగుటచే, ననిర్వచనీయమనబడెను. ఈ యనిర్వచనీయమగు మూలాజ్ఞానము, మాయ అవిద్యయని రెండు విభాగములగుచున్నది. ఇందుశుద్ధ సత్య ప్రధానమైన యజ్ఞానము మాయ మలిన సత్య ప్రధానమైన యజ్ఞానము "అవిద్య" ఈ మాయ, అవిద్యలయందు అధిష్ఠానమగు బ్రహ్మచైతన్యము ప్రతిబింబించుచున్నది. ఇందుమాయ, మాయాధిశిష్ఠానము, చైతన్యము, మాయయందలి ప్రతిబింబము కూడి ఈశ్వరుడనబడును. ఈ యీశ్వరునకు మాయాకారణమగును. ఈ మాయావిషుడగు నీశ్వరునకు అవిద్యాకృతుడని పేరు. ఇతడు సర్వజ్ఞుడు ఇట్లు సర్వజ్ఞత్వము,సర్వాంతర్యామిత్వము. సర్వజగత్కారణత్వముగలవాడగును. ఇతడు వశీకృత మాయకుడై, జ్ఞానేచ్ఛాకృతులచే, జగత్తునకభిన్ననిమిత్తోపాదాన కారుణుడగుచున్నాడు. అవిద్య అవిద్యాధిష్ఠాన చైతన్యము, అవిద్యా (బుద్ధి) యందలి ప్రతిబింబము కూడి జీవుడనబడుచున్నాడు జీవునకు అవిద్యకారణశరీరమగుచున్నది ఈకారణశరీరము నభిమానించిన జీవుడు ప్రాజ్ఞుడనబడును. జీవోపాధులగు అవిద్యలనే కములగుటచేతను మలినములగుటచేతను, జీవులు కించిజ్ఞులు, ననేకులగుచున్నారు వీరు అవిద్యావశులై నానావిదకర్మలనాచరిచుచున్నారు.

ఈశ్వరుడు జీవులభోగార్థమై సృష్టిచేయదలచినప్పుడు తమఃప్రధానప్రకృతితో గూడి జగత్తును సృజించుచున్నాడు. కావుననతడు జగత్తునకు శుద్ధ సత్వప్రధాన మాయోపాధికుడై, నిమిత్త కారణమును తమఃప్రధాన ప్రకృతిని గూడి యుపాదాన కారణమునగుచున్నాడు . ఆయభిన్ననిమిత్తోపాదాన కారణుడగు పరమేశ్వరుని నుండి ఆకాశాదిక్రమమున సూక్షపంచభూతములుత్పన్నములైనవి. ఆ సూక్ష్మపంచభూతముల సాత్వికాంశ సమిష్టివలనన దేవతల సహితమగు నంతఃకరణ చతుష్టయమును. వ్యష్టి స్వాతికాంశముల వలన అధిదేవతాసహితములగు పంచజ్ఞానేంద్రియములును.

ఆసూక్ష్మ భూతముల రాజసాంశ సమిష్టివలన అధిదేవతా సహితములగుపంచప్రాణములును, వ్యష్టిరాజసాంశముల వలన నధిదేవతా సహితములగు కర్మేంద్రియములును కలిగెను. వ్యష్టి తామసాంశముల వలన , శబ్ద, స్పర్శరూప, రస, గంధములను విషయములు కలిగెను. ఇందు ఇంద్రియ సముదాయము జీవునకు సూక్ష్మ

శరీరమగును. అధిదేవతాసముదాయము ఈశ్వరునకు సూక్ష్మశరీరమగును. ఈసూక్ష్మశరీరమును బొందిన ఈశ్వరుడు హిరణ్యగర్భుడనబడును. వ్యష్టి సూక్ష్మశరీరమునుబొందిన జీవుడు తైజసుడనబడును. సూక్ష్మ పంచభూతముల తామసాంశములు పంచీకృతములై, ఒకదాని యందు మరియొకటిజేరి స్థూలాకారములయ్యెను. ఈ స్థూలపంచ మహాభూతముల వలన పదునాలుగు లోకములుగల స్థూలప్రపంచముత్పత్తియయ్యెను. (ఉత్పన్నమయ్యెను).

ఆస్థూలప్రపంచ విశిష్టుడగు పరమేశ్వరుడు విరాట్పురుషుడనబడును. ఆస్థూలభూతముల నుండి జీవుల పూర్వకర్మానుసారము, సప్తధాతుమయములైన అనేక స్థూలశరీరములు పుట్టుచున్నవి. ఆస్థూలశరీరము నభిమానించినజీవుడు విశ్వుడనబడుచున్నాడు.ఈ జీవుడు తన యదార్థ స్వరూపమునుగాని, ఈశ్వరుని యదార్థరూపమును గాని తెలియకపోవుటచే, జీవేశ్వరులకు భేదముగలదనియు జగత్తుసత్యమనియు తలంచినానావిధ (ప్రంచవిధభ్రమలు) భ్రాంతులను పొందుచున్నాడు, ప్రతిబంధవశముచే, జీవేశ్వర, జగత్తులయదార్థ జ్ఞానముకలుగనివారి కొఱకు శాస్త్రమునందు లయచింతనారూపమగు ధ్యానముచెప్పబడినది. ఈస్థూలప్రపంచము, సూక్ష్మప్రపంచము, యొక్కకార్యమగుటచే, నదిసూక్ష్మప్రపంచము కంటేభిన్నముకాదనియు, సూక్ష్మప్రపంచము దానికికారణమగు, మూలాజ్ఞానము కంటె భిన్నముకాదనియు, మూలాజ్ఞానము, బ్రహ్మము యొక్కశక్తి యగుటచే,నది, బ్రహ్మముగలేదనియు భావించి, యా బ్రహ్మమును, అవిచ్ఛిన్నతైలధారవలె ధ్యానించినచో బ్రహ్మజ్ఞానము కలుగుననియు నాజ్ఞానము వలన మోక్షము కలుగుననియు శృతియందుచెప్పబడెను.

అట్లు, ఇహపరభోగవాంచలను వీడి, బ్రహ్మజ్ఞానమును బొందినచో వానిప్రాణము బయటికి పోదనియు, అదియాత్మయందేలయము గాంచుచున్నదని యు, నతడు, ఆత్మయందే లయముగాంచుచున్నాడనియు, నతడు జీవన్ముక్తుడగుననియు చెప్పబడెను.

బ్రహ్మలోకభోగా పేక్షగలవాడై యాబ్రహ్మమునుధ్యానించినచో నతడవసాన కాలమున, సుషుమ్నామార్గమున నిర్గమించి, బ్రహ్మరంధ్రమును భేదించుకొని హిరణ్యగర్భలోకమునుబొంది. అచ్చట సమస్తభోగములననుభవించి, హిరణ్యగర్భప్రళయమున, నతనితోముక్తుడగుచున్నాడు.

కావున నతడు క్రమముక్తిని బొందినవాడగును. విషయబోగేచ్ఛను విడువకయే బ్రహ్మతత్త్వ విచారణచేసి, బ్రహ్మజ్ఞానముకలుగకపూర్వమే మృతినొందినవాడు భూలోకమున శ్రీమంతులగృహమునందు పుట్టుచున్నాడు. విషయభోగముల యందువాంఛలేనివాడై, బ్రహ్మ విచారణ చేయుచు, బ్రహ్మజ్ఞానము కలుగక పూర్వమే మృతినొందినవాడు, బ్రహ్మవేత్తలకుటుంబమునందు పుట్టుచున్నాడు.

పరలోకభోగముల కొఱకు ఇష్టదైవముల నారాధించువాడా దేవతాలోకములను బొంది యచ్చట భోగములననుభవించిన పిమ్మట, శేషమునకు, మరల మరల భూమియందు బుట్టుచున్నాడు. స్వర్గాది పరలోక భోగములనాశించివిహితకర్మముల నొనర్చువారు మరణించినపిదప యాలోకములనుబొంది. అచ్చట భోగఫలానంతరము శేషమునకు భూమియందు బుట్టుచున్నారు. విషయభోగముల కొఱకు నిషిద్ధకర్మములొనరించువారు మరణించిన పిదప నజ్ఞానావృతములగు క్రిమికీటకాది నీచయోనులందు బుట్టుచున్నారు.

బ్రహ్మవిద్యామహోదధి-ప్రథమభాగ
మందు సప్తతరంగములమరియుండె
వేదసిద్ధాంత సుధయందు -వెల్లివిరిసె

కాన జిజ్ఞాసువులుగ్రోలి కనుడుపరము.
విద్యని గూఢ గుప్తమగు విత్తము పూరుషాళికిన్
విద్యయశస్సు భోగకరి
విద్యనృపాలపూజితము
విద్యనెఱుంగనివాడు మర్త్యుడే?
ఇచ్చట, విద్యయొక్క లక్ష్యార్థము
"బ్రహ్మవిద్య" గానెఱుంగుదురుగాక.

## బ్రహ్మవిద్యా మహోదధి, ఉత్తరార్ధము

"అహం బ్రహ్మాస్మి" అనెడి అనుభవ మహావాక్యమునందు గల "అహం" పదము యొక్క అర్థము:- సర్వవ్యాపకమై, నిరాకారమైయున్న శుద్ధ చేతన్యము "నేను" అనజాలదు. జడమగు అంతఃకరణము కూడా "నేను" అనజాలదు. ఈజడములయొక్క ఆ అహంకారవృత్తి యందే "నేను" అను ప్రతీతి తెలియబడుచున్నది. కావున "అహంబ్రహ్మాస్మి" అనుమహావాక్యమునందుగల "అహం" పదము యొక్క వాచ్యార్థము. అంతఃకరణ వృత్తి విశిష్టమగు చైతన్యమగును, ఈ వృత్తి విశిష్టచైతన్యము "అహంకారము"అనబడును. ఈ అహంకారమునకు బ్రహ్మముతో ఏకత్వము సంభవింపదు. కావున అహంకారణమునందుగల జడభాగమైన అంతఃకరణ వృత్తిని పరిత్యజించి చైతన్య భాగమును గ్రహించవలయును. ఆ చైతన్యమై" "సాక్షి చైతన్యము " అనబడును. సాక్షి చైతన్యమునకు అహంచైతన్యముతో ఏకత్వము సంభవించుచున్నది. కావున "అహం" పదమునకు సాక్షి చైతన్యము లక్ష్యార్థమగును. బ్రహ్మమును ఉపాధులు కప్పి మరుగు పరచుచున్నవి. కావున ఆ పరమాత్మను ఎవరును ఎరుగ జాలకున్నారు. ఆత్మయే యింద్రియ క్రియలకు కారణమైనప్పుడు ఆ ఇంద్రియ నామముతో అది వ్యవహరింపబడుచున్నది. మననక్రియకు కారణమైప్పుడు "మనస్సు" అగుచున్నది. "ప్రాణ" క్రియకు కారణమైనప్పుడు ప్రాణము అగుచున్నది. దర్శన క్రియకు కారణమైనప్పుడు "చక్షువు" అగుచున్నది, శ్రవణ క్రియకు కారణమైనప్పుడు "శ్రోత్రము" అగుచున్నది. ఈ విధముగ, యీ విశేషములను, కర్మములను అనుసరించి. "విశేష్యమైన ఆత్మ"కు భిన్న భిన్న నామములు కలుగుచున్నవి. ఈ విధముగ యీ విశేషణములను, కర్మములను అనుసరించి, వేరువేరుగ చూడక వీనితోకలిసియుండిన చైతన్య రూపమగు "ఆత్మ" ఒక్కటియే యని, యీ ఆత్మ యొక్క యదార్థ స్వరూపమును ఎఱిగినవాడు సమస్త జగత్తును ఎఱిగినవాడే యగు చున్నాడు.

పరమ ప్రేమాస్పదమగు నాత్మ కంటె భిన్నములైన సమస్త పదార్థములు అనాత్మలగును. అనాత్మ పదార్థములన్నియు జడములు, మరణ ధర్మములు గలవియును నగును. ఆత్మయొక్కటియే చైతన్యమును, అమృతమునగును. ఈ విధముగా కేవల శుద్ధచైతన్యము అహం పదమునకు లక్ష్యార్థమగును.

"అహం బ్రహ్మాస్మి" అను మహావాక్యము నందుగల "అహం" పదము చేత విశిష్టాత్మను గ్రహించినచో, ఆ విశిష్టాత్మకు బ్రహ్మముతో ఏకత్వము సంభవింపదు. కావున విశేషణములను విడిచి విశేష్యమైన శుద్ధ చైతన్యమును గ్రహించినచో ఆశుద్ధ చైతన్యమునకు బ్రహ్మముతో ముఖ్యా. భేదము సంభవించుచున్నది. "అహం బ్రహ్మాస్మి" అను మహా వాక్యమునందుగల అహం శబ్దమున కర్థము చెప్పబడినది. ఇక బ్రహ్మ శబ్దమున కర్థము చెప్పబడుచున్నది.

ఈ సృష్టికి పూర్వము బ్రహ్మ మొక్కటి మాత్రమే యుండెను. ఆ బ్రహ్మము నందే సృష్టి "వివర్త" మయ్యెను. ఆ వివర్తమైన నామరూపములతో కూడిన బ్రహ్మము తనను తాను

'నేను బ్రహ్మమునగుదున'ని తలచెను. ఈ విధముగ దేవతలయందును, ఋషులయందును, మనుష్యులయందును. ఉండిన బ్రహ్మము -నేను బ్రహ్మమని తలంచెను, ఆత్మరూపము నెఱిగినవాడు దేవమహర్షి, నేను మనువును, నేను సూర్యుడను, సర్వము నేనేయని తలంచెను. ఇప్పుడు గూడా యీ బ్రహ్మము నెఱింగి "నేను బ్రహ్మమును" అను నిశ్చయమును పొందినవాడు సర్వ స్వరూపుడగుచున్నాడు. ఇట్లునిశ్చయమును పొందిన దానినిదేవతలు కూడా పరాభవింపజాలరు. ఆ దేవతలు కూడా తన ఆత్మస్వరూపమేకదా! ఈ విధముగ సర్వము ఒక్క ఆత్మ స్వరూపమేయని తెలియజాలక దేవతలు వేరు నేను వేరని తలంచి యా దేవతల నుసాసించువారు యదార్థముగ నెఱింగినవారు కారు. దేవతలకంటె నేను భిన్నుడనని తలంచి ఆ దేవతల నుసాసించువాడా దేవతలకు పశువగు చున్నాడు. లోకములో పశువులను మనుష్యులు పాలించుచున్నట్లు అజ్ఞానులగు యీ మనుష్యరూపమగు పశువులను గూడా దేవతలు పాలించుచున్నారు. తన పశువు నితరులపహరించినచో మానవులు బాధపొందునట్లు మానవ రూపులగు పశువులు తమలను ఆరాధింపక బ్రహ్మాత్మతత్త్వము నెఱింగినచో ఆ దేవతలు కూడా బాధనొందెదరని బృహదారణ్యక ఉపనిషత్తులో చెప్పబడును. కావున సర్వోపాధులతో కూడిన బ్రహ్మ చైతన్యము, బ్రహ్మశబ్దమునకు వాచ్యార్థమగును. సర్వోపాధులను విడిచినచో వానికధిష్ఠానమగు శుద్ధ చైతన్యము బ్రహ్మశబ్దమునకు లక్ష్యార్థమగును. ఈ విధముగ నహంకార సాక్షియైన ప్రత్యక్చైతన్యము బ్రహ్మ చైతన్యమే యగునని " అస్మి"యను పదము చేత ఏకత్వరూపమగు అనుభవమీ మహావాక్యమునందు చెప్పబడెను.

మోక్షప్రయోజనము:-

జీవన్ముక్త విలక్షణ సుఖ సాధనా భ్యాసమువలన జ్ఞానరక్షతపము,

దుఃఖనివృత్తి, సుఖావిర్భావము నను నీయైదు విధముల ప్రయోజనములు కలుగుచున్నవి.

జ్ఞానరక్ష:- బ్రహ్మ సాక్షాత్కారము పొందిన తత్త్వవేత్తకు సంశయు,విపర్యయములు కలుగక పోవుట జ్ఞానరక్షయనబడును."బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి" అనెడి శృతులును,"జ్ఞానీత్వాత్మైవమే మతమ్" అనెడి స్మృతులను బ్రహ్మజ్ఞానము వలన బ్రహ్మభావము ప్రాప్తించునని చెప్పుచున్నవి. అజ్ఞాన నివృత్తి పూర్వకముగు బ్రహ్మభావ ప్రాప్తియే మోక్షమనబడును.

కావునర నభ్యుదయ రూపమగు విభూతిని గోరువారు శ్రద్ధ,భక్తులతో బ్రహ్మవేత్తలను పూజింపవలయునని చెప్పబడెను. ఒక్క బ్రహ్మవేత్తకైనను తృప్తిగా భోజన మిడిన గృహస్థుడు సర్వ, జగత్తును తృప్తిని పొందించిన వాడగుచున్నాడు.

'అహం బ్రహ్మాస్మి యనెడి యపరోక్షానుభవ జ్ఞానమునందు ప్రవర్తించెడి బ్రహ్మవేత్త దృష్టికి గోచరించెడి సర్వమానవుల పాపములు నశించి పోవుచున్నవని చెప్పబడెను, కావున నీవిధముగా జీవన్ముక్తుడగు బ్రహ్మవేత్తయొక్క తపము లోక సంగ్రహము కఱకగును.

ఆత్మజ్ఞానముచే నజ్ఞానము నివృత్తికాగానే దానితోపాటు సంచిత కర్మము లన్నియు నాశమొందుచున్నవి. ఆత్మజ్ఞానముయొక్క ప్రభావము వలన జ్ఞానికి ఆగామి కర్మములు (అతనికి) అంటుటయే లేదు. అభ్యాసముతో కూడియుండిన సంచిత కర్మములే యతని పరలోక దుఃఖమునకు కారణము లగుచున్నవి. ఆయజ్ఞాన సహితమగు సంచిత కర్మములు బ్రహ్మజ్ఞానముచే నశించుట వలన జీవన్ముక్తునకు, పరలోక దుఃఖములు కూడ నివృత్తిము లగుచున్నవి.

పంచ విధములగు ప్రయోజనములను పొందిన బ్రహ్మవేత్త యొక్క ప్రారబ్ధకర్మ మనుభవించుటయే, వర్తమాన శరీరము నశించి పోవుచున్నది. ఈ శరీరము నశించిన పిదప

నతడఖండమైన రసాయదమగు పరబ్రహ్మ స్వరూపుడై ప్రకాశించుచున్నాడు. ప్రారబ్ధ భరోగానంతర మతని సూక్ష్మ శరీరము అధిష్ఠానాత్మయుడు విలీనమగుచున్నది. అతడు శరీరమును విడుచుట యందు దేశకాలాదుల యపేక్షలేదు. దీనినే విదేహ కైవల్యయందురు.

సమాధిని సాధింపదలచిన విద్వత్సన్న్యాసి వైరాగ్యబోధోపరతులు కలిగియుండవలయును. వైరాగ్య బోధోపరతులు గల విద్వత్సన్న్యాసి అజిత్వము, షండత్వము, ముగ్ధత్వము, పంగుత్వము, అంధత్వము, బధిరత్వముఅను నీ షద్ధర్మముల నభ్యసింపవలయును. అటుపిమ్మట త్రిపుటి స్మరణ రహితమగు కేవల చిన్మాత్మ వాసన గులవాడై యుండవలెను.

ఈ విధముగ సంప్రజ్ఞాత, అసంప్రజ్ఞాత సమాధుల నభ్యసించిన బ్రహ్మవేత్తల జీవన్ముక్తులనియు, విదేహముక్తులనియు రెండు విధములుగ నుందురు. సర్వ ప్రపంచము నాకంటె భిన్నముగ లేదు. నేను కేవలము బ్రహ్మస్వరూపుడను అను దృఢ భావనగల విద్వత్సన్న్యాసి వాసనలుగాని లేక, నిరావరణ స్వరూపుడై సంచరించెడి బ్రహ్మవేత్త విదేహముక్తుడనబడుచున్నాడు. లేక ప్రారబ్ధ క్షయానంతరము సర్వ శరీరమును విడిచి బ్రహ్మమాత్రుడై ప్రకాశించువాడు విదేహముక్తుడనబడుచున్నాడు. ఇట్టి జీవన్ముక్తి విలక్షణముగు దృష్టి సుఖము ననుభవించుచుండెడి బ్రహ్మవేత్త "సాక్షాద్బ్రహ్మ స్వరూపుడే" యగుచున్నాడు.

సచ్చిదానందములు అచల పరిపూర్ణ బ్రహ్మమునకు లక్షణములగును. ఈ లక్షణములగు సచ్చిదానందములు, అసృత, జడ,దుఃఖములకు ప్రతియోగులు ప్రతియోగి సహితములై యొక లక్ష్యమునకు లక్షణములైయున్న సచ్చిదానందములు లక్షణాతీతమై నిష్ప్రతి యోగికమైయునన యచల పరిపూర్ణ బ్రహ్మము కానేరవు. ప్రతియోగి సహితములగు సచ్చిదానంద లక్షణము లెప్పుడును లేనివియే యగును. సచ్చిదానంద లక్షణములకు సర్వకాలములయందును, సర్వ దేశముల యందును, సమస్త వస్తువుల యందును సంపూర్ణముగ నిండి, స్వతస్సిద్ధమై యున్నది. ఈ సమస్తానందములు అఖండ, నింతిశయ, బ్రహ్మనందముయొక్క లేశమాత్రయే యని శృతి తీర్మానము. ఈ సర్వానందరహితమైనదే అచల పరిపూర్ణ బ్రహ్మము కర్తృ, కరణ, కార్యములు కానిదగును, దానియందు కర్తృ, కరణ, కార్యము లేవియును, నేకాలయందునులేవు. సర్వ ద్వంద్వ రహితమైన బట్టబయలే పరిపూర్ణ బ్రహ్మమని నిశ్చయింపబడినది.

అజ్ఞాన నివృత్తి పూర్వకమగు బ్రహ్మభావప్రాప్తియే మోక్షమనబడెను.

## 16. బ్రహ్మజ్ఞానిని పూజించువారలకు లభించుసంపద వివరణః-

1) శ్రద్ధాభక్తి పూర్వకముగ పరిశుద్ధాంతః కరణముతో బ్రహ్మజ్ఞానిని పూజించుట ద్వారా శిష్యులు, వారు కోరెడి లోకములను, ఆయాలోకములో వారు కోరెడి పదార్థములను పొందుచున్నారు. కావున , నభ్యుదయరూపమగు విభూతిని కోరువారు శ్రద్ధాభక్తులతో బ్రహ్మవేత్తను పూజింపవలయును.

2) ఒక్క బ్రహ్మవేత్తకైనను తృప్తిగా భోజనమిడిన గృహస్థుడు సర్వజగత్తును తృప్తిని బొందించినవాడగుచున్నాడు.

3) కోటిమంది బ్రాహ్మణులకు భోజనమిడుటచేత కలిగెడి ఫలము ఒక్క బ్రహ్మజ్ఞానిని భుజింపజేయుటచేత కలుగుచున్నది. బ్రహ్మజ్ఞానికొ సంగ బడిన వస్తువునకు కోటిరెట్లధికమగు ఫలము కలగుచున్నదని చెప్పబడెను. కావున బ్రహ్మవేత్తను సేవించుటచే మనోవాంచితములగు సమస్త పదార్థములను బొందుచున్నారు.

4) సన్మార్గులగోలోకులు, ఉత్తములైన బ్రహ్మవేత్తల యొక్క యాచరణము ననుసరించి,

ఆచరించుచున్నారు, అట్లే బ్రహ్మవేత్తలే యేప్రమాణములననుసరించుచున్నారో, సన్మార్గులగులోకులును వానినేయనుసరించుచున్నారు. ఆ సన్మార్గవర్తియగు తటస్థుడు జీవన్ముక్తుడగు బ్రహ్మవేత్తను జూచుటచేత సమస్తపాపములనుండి విడివడుచున్నాడు ఈవిషయమునుగూర్చి స్మృతియందు ఇట్లు చెప్పబడెను.

స్మృతిః- "అహంబ్రహ్మాస్మి" యనెడి యపరోక్షానుభవజ్ఞానమునందు బ్రవర్తించెడి బ్రహ్మవేత్తదృష్టికి గోచరించెడి సర్వమానవుల పాపములు నశించిపోవుచున్నవని చెప్పబడెను. ఆజీవన్ముక్తులగు బ్రహ్మవేత్తలను ద్వేషించి నిందించుచుండెడి, దుష్టులా బ్రహ్మవేత్త పాపములనన్నింటిని పరిగ్రహించుచున్నారు. ఈవిషయవమును గూర్చిశృతి యందిట్లుచెప్పబడెను.

జీవన్ముక్తుడగు బ్రహ్మవేత్తయొక్క ధనాది పదార్థములనతని పుత్రులు పొందుచున్నారు. అతడుచేసిన పుణ్యకర్మముల ఫలములనతనిని సేవించేడి సుహృజ్జనులు పొందుచున్నారు. అతడు చేసిన పాపకర్మముల యొక్క ఫలమునునతనినిద్వేషించి, నిందించు, దుష్టులు పొందుచున్నారని చెప్పబడెను. కావున నీవిధముగా జీవన్ముక్తుడుగు బ్రహవేత్త యొక్క జ్ఞానము లోకసంగ్రహముకొఅకగును. అనగా జీవన్ముక్తుడు, తాను స్వయముగ సదాచారమునందు వర్తించుచు, లోకులను కూడ నట్లువర్తింపజేయుటయే లోక సంగ్రహమనబడును.

## 17. బ్రహ్మ విద్యా దర్పణము

విధియనునది జీవుడు స్వతంత్రముగ జేసిన కర్మఫలమే గాని అకారణమగు భగవంతుని యిచ్ఛగాదు. కావున విధివశతః యనునది మనము చేయబోవుచున్న కర్మలయందన్వయించుట యంత సరికాదు.

పూర్వ కల్పమున కడతేరిన యమ్మహా పురుషులు వర్ధమాన కల్పాదియందు అధికారులై పామరజనోద్ధరణార్థమై జననమందుదురు. అట్టివారే ఋషులను నామమున బరగువారు. వారలు పరిపూర్ణ బ్రహ్మానంద అనుభవము కలవారయ్యును, సంసార సాగరమున మునిగియుండు అజ్ఞుల యందపార కరుణచే లోకమున మాటిమాటికి సమాన నామరూపములతో జన్మించి శరీరధారులై వర్తింతురు.

గురువనగా అజ్ఞానమును బోగొట్టి జ్ఞానోపదేశము చేయువారు, ఏ జీవుని హృదయమందైనను భక్తి శ్రద్ధలును, భూతదయయు వెలయుచుండునో అట్టివారిని జీవన్ముక్తులగు కారణ గురువులు - దివ్యదృష్టిచే గాంచి సూక్ష్మశరీరధారులై శిష్యునిచే పిలువబడకయే ఆకలిగానున్న బిడ్డ వద్దకు తల్లి పరుగిడి వచ్చులాగున పరుగిడి వచ్చి, జ్ఞానోపదేశము చేసి పోవుచుందురు. ధ్రువున కరణ్యమున, ప్రహ్లాదునకు గర్భమునందు- నారదుడు పిలువబడకయే జ్ఞానోపదేశము చేసెను. పరీక్షన్మహారాజునకు శుకమహర్షి జ్ఞానోపదేశము చేసెను.

శిష్యుడు ఏకాగ్రమగు మనస్సుచే ధ్యానముచేయుచు ఈశ్వరుని యందు అనంత కల్యాణ గుణములను సదామననము చేయుచు, ఆ గుణముల నభ్యసించుచుండవలయును. ఈ రీతిగ సాధించుచు క్రమక్రమముముగా సాధన చతుష్టయము అనగా నిత్యానిత్య వస్తు వివేకము, వైరాగ్యము,శమధమాది షట్కసంపత్తియు, ముముక్షుత్వముననను నీ నాలగు సాధనములను సంపాదింప వలయును. ఈ సంపత్తి కలగుటకు సాత్త్వికాహారము, బ్రహ్మచర్యము, అవసరములు.

అనాగతాతీతము, వర్తమానము అనయెడి ద్విరూపముగలదియై నప్పటికిని, మనన విషయమున యిది సత్తు, అనిగాని, యిది అసత్తనిగాని దృఢ నిశ్చయముగల

యేయదికారి, జగత్తును స్వప్న ప్రపంచము వలెను, భ్రాంతి మాత్రమునుగా జూచునో, దానియందు సక్త చిత్తుడుగాకుండునో, అట్టి పురుషుడు దుఃఖముల యందు మునుగడు.

ఎల్లవేళల, ఎల్లయెడల, ఎల్ల కార్యములను ఈశ్వరార్పణబుద్ధితో ఈశ్వర సాన్నిధ్యమును కల్పించుకొని, ఈశ్వర తాదాత్మ్యమును బొంది, ఈశ్వర సముడై వర్తించిన పరమయోగికి ఉత్తమమగు భక్తియే, ఉత్తమజ్ఞానమును తమంతట తాము వానియందు ప్రకాశించును. మనస్సు తన స్థితి నిమత్తము తన భావన చేతనే తనవలన బుట్టిన శరీరమును కల్పించుకొనినది. కావున దాని కల్పనను, సర్వశక్తి యుక్తమైన దానినిగా తెలిసికొందురు. ఈ జగత్తు దీర్ఘ స్వప్నము వంటిది. ఇందు పుట్టినదిగాని, చచ్చునదిగాని లేనేలేదు. పరమార్ధమున యిది యంతయు లేనిదియే ఉన్నట్లు భ్రాంతివలన భాసించుచున్నది.

ఈశ్వరుని నుండి వేరుపడిన కళయే కావున ఆ బఈశ్వరుని జేరుటను జీవుడు ముఖ్యముగా కోరుచుండును.

దేహము నీటిచేతను, మనస్సు సత్యముచేతను మఱియు అహింసలచేతను, బుద్ధి జ్ఞానము చేతను, జీవుడు విద్యా తపస్సులచేతను పరిశుద్ధలగుదురు.

జీవుడీశ్వరుని యందు జేరుటకు సాధనముగ నుండు మార్గమున సోపానములుగ నెంచబడదగు, నెనిమిది. యోగాంగములున్నవి. 1. యమము 2. నియమము 3. ఆసనము 4.ప్రాణాయామము 5.ప్రత్యాహారము 6. ధారణము 7. ధ్యానము 8. సమాధి.

1) నియమమనగాః- అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము,

2) అస్తేయమనగా ః- ఇతరుల ద్రవ్యము నపహరించు బుద్ధి మనస్సునందైనను గలుగదు.

3) అపరిగ్రహమనగా ః- ఇహ సుఖ సాధనములగు పదార్ధములను గ్రహించు కోరిక మనస్సు నందైనను లేక యుండవలయును. 1. శౌచము. 2. సంతోషము 3.తపస్సు 4. స్వాధ్యాయము 5. ఈశ్వర ప్రణిధానము.

4) ప్రాణాయామము ః- పరిశుభ్రమైన శరీరములు, యింద్రియముల సత్ప్రవర్తనచే నిగ్రహించి స్వాధీన పరుచుకొనుట, సద్గ్రంధములను చదువుటయు, ప్రణవనుపాధులను జేయుట, ఈశ్వరుని చెందవలయునను. తీవ్రమగు నాశయే.

యమ నియమముల నభ్యసించుట యన్న విషయవాంఛలను వదలి విరాగముతో నివృత్తి మార్గమునందు వర్తించుట. ప్రాణాయామమనగా ప్రాణాపానములగు ఉచ్ఛ్వాస నిశ్వాసములను సమముగ నియమించుట. 5) ప్రత్యాహారముః- ఇంద్రియముల ద్వారా బహిర్ముఖమగు మనస్సును విషయముల నుండి మరలించి లోనికి త్రిప్పుట.

6) ధారణముః- బాహ్యవిషయములనుండి త్రిప్పబడిన మనస్సును ఏకాగ్రముగధ్యేయమూర్తి యందు నిలిపి, వేరువిషయముల యందు బ్రవేశింపకుండు నట్లు చేయుట.

7) ధ్యానముః- ఇట్లు నిలిపిన మనస్సాత్మ గుణముల చింతించుట. ఈ చింతయే ధ్యానము. తిన్నతిన్నగా ధైర్యముతో మనస్సును యితర విషయములనుండి మరలించి ఆత్మయందుంచి యేమియు చింతింపక యూరక యుండవలయును. ఇట్లుండ మనస్సాత్మయందు మునిగి క్రమక్రమముగా భిన్నభావమే మఱచి ఆత్మ తాదాత్మ్యమును బొందును, వాసనలు లేకున్న నీ స్వరూపము కూడ బ్రహ్మా భిన్నమైనది కాదు. నీవు శూన్య రూపుడవే. ఈ విషయమును బాగుగ నెఱుంగుము. ఆత్మయనగా నిరుపాధికమగు నిర్గుణ బ్రహ్మముగాని, సోపాధికమగు సగుణ బ్రహ్మముగాని యగును. నిర్గుణ బ్రహ్మము నుపాసించుట దుర్లభము. శివకేశవాది దైవములలో భక్తునకు ప్రేమాస్పదమగు నుపాస్యుని, దివ్యమంగళ మూర్తిని మనస్సున కల్పించుకొని , దాని నాలంబముగా గైకొని. అందు పరమాత్మయు, అనంతకాల్యాణ నిధియునగు చైతన్యమును ధ్యానము చేయవలెను. మొదట ఉపాసికుడు ఉపాస్యుని

రూపమును ఏకాగ్రమగు దృష్టితోనొక కొంతసేపు లక్షించి చూచి, కన్నులు మూసికొని, యారూపమును మనుంబున సంపూర్ణముగ స్పష్టముగ నిర్మించుకొననగును. ధ్యానమున మొట్టమొదటగా ఆమూర్తిని మనస్సున కల్పించుకొనవలయును. క్రమక్రమమున ఆరూపమును పాదములనుండి శిరస్సుదాక చిత్తమునందు కల్పన చేసికొని తుదకు రూపమంతయు మనస్సున నిలుచునట్లు చేసికొనవలయును. అంతట ఆమూర్తి స్మరణ మాత్రమున నేర్పడుచుండును.

8) సమాధిః- విగ్రహమును మనస్సున దృఢముగ నిలుపుచు వచ్చిన మనస్సు ఆ దైవము నందు క్రమక్రమమున లయించి శరీరము పరవశమగును. అపుడు దేహేంద్రియములు నిర్వ్యాపారములు కాగా, మనస్సేకాగ్రముగ ఉపాస్యుని యందు మునిగియుండ, బ్రహ్మప్రజ్ఞయే లేకపోవును. అపుడు ఉపాసకుని మనస్సు ఆత్మయందే యానందించుచు నాత్మస్వరూపమైయుండును. అపుడు జీవుడు స్థూలమగు యీ శరీరమును విడిచి, సూక్ష్మశరీరముననోదానిని గూడ విడిచి, యంతకంటె సూక్ష్మమగు కారణ శరీరముననో జాగరూకుడై వర్తించుచు ఆ ఊర్ధ్వలోకముల జ్ఞానము కలిగియుండను. ఇట్లు క్రమమున నొక్కొక్క యుపాధిని వదలి. దానికంటె సూక్ష్మమగు ఉపాధియందు వర్తించుచు. విడువబడిన ఉపాధిని, అనాత్మగ నెఱుంగుచు, కాలక్రమమున నుపాధులన్నియు ననాత్మలుగ నెఱింగి, యన్నింటి కంటె సూక్ష్మము, నన్నింటియందంతర్యామియునగు నాత్మను యెఱుంగుము.

ఇట్లాత్మ సాక్షాత్కారముచే జీవునకు పరమాత్మతో నైక్యాను భవము కలుగు మార్గమే యోగమార్గము. ఆ ఐక్యమే నిజమగు యోగము. అన్ని పనులునుకాలనియమముగ జేయుచుండిన, ఆయా కాలమున అయా పనులు చేయుటకు శరీరము, మనస్సు నలవడి ప్రయత్న బాహుళ్యము లేకయే స్వాధీనమలగును. ఆకాలనియమము లేక పోయినచో నిట్టి యనుకూలత యుండదు.

జ్ఞానవంతమై, చురుకుగలదియై,పరిశుద్ధమైయున్నబుద్ధి, వైరాగ్యాదులను యితర సామగ్రులు లేకపోయినను ముక్తి చెందగలదు. దీనికి నమ్మకము, నిరంతరము,, దీర్ఘకాలము, అవసరములు.

నాబుద్ధి వృత్తి మిక్కిలి శాంతమై యుండుట చేత ఎందును ప్రసరింపక ఎప్పుడు చూచినను బ్రహ్మావలోకనము చేయుచు నిదురించుచు ఉన్నట్లే యుండును. ఆత్మాభిమానము కొంచెమైనను లేదు. ఇట్లగుటచేత నేను ఏమి కార్యము చేసినను చేయనివాడనే అగుదును. అసంకల్పన, సంకల్పము చేతనే సర్వ సంకల్పమును, ఆత్మతత్త్వరూపమున నేరూపమైన మనస్సు చేతనే నీ మనస్సును ఛేదించి నీయందే నీవుండుము.

## 18. ఎఱుక పిడికెడు రూకలమూట, (ముఖ్యాతిముఖ్యము)

### బ్రహ్మవిద్యా దర్పణము గ్రంథముః-

ముఖమందు సంచరించుచున్న ప్రాణము చేత నెవడు, దేహాంతర్లీనమై యున్న ఆనందమయ కోశమందలి బ్రహ్మానందమును, సత్త్వగుణ ప్రధానమై బ్రహ్మముతో గూడిన మనోవృత్తి ద్వారాసదాఅనుభవించుచు జీవించునో ఆతడు అన్నింటికి లోపలనుండిన వాడై చూచుచున్నాడు. ఆతడే 'ఆత్మ యగును.

మనస్సు అననేమి? చాంచల్యముతో గానవచ్చు మనస్సు దృశ్యాభిముఖమగు వృత్తియే '(మనస్సు" అంతఃకరణము యొక్క అవస్థా విశేషము "మనస్సు" 1. పారమార్థక ప్రమాణము, 2.మిథాజ్ఞానము 3. కల్పన 4. నిద్ర 5. స్మృతి (పతంజలియోగశాస్త్రము). ఈ ఐదులక్షణములు కలది "మనస్సు". మనస్సు తన స్థితినిమిత్తము తన భావన చేతనే

తనవలన బుట్టిన శరీరమును కల్పించుకొనినది. కావున దాని కల్పనను, సర్వ శక్తి యుక్తమైనదానినిగా తెలిసికొనుటకు జ్ఞానమార్గము (ప్రవృత్తి మార్గము) వినా గత్యంతరము లేమిని గ్రహించిన ధీరుడే "బ్రహ్మజ్ఞాని"యనియు, అట్టి పరిపూర్ణ "ఎఱక" నార్జించిన మానవుడే భూమిమీద దేవుడనియు, అతడే "జీవన్ముక్తుడు" అనియు నెఱుంగుదురుగాక!

జన్మ మరణాది రూపానర్థ హేతువగు సంసారము యొక్క నివృత్తియే "అధిష్ఠాన బ్రహ్మ " రూపమై యున్నది. నిష్కామమే "చిత్తశుద్ధి". అదియే 'ఓంకారము", బ్రహ్మము', నేను సర్వసాక్షినని నిశ్చయించిన మహాత్ముడు "జ్ఞానవంతుడు."

"విధి" అనునది జీవుడు స్వతంత్రముగ జేసిన కర్మఫలమేగాని, అకారణమగు భగవంతుని "యిచ్ఛ"కాదు. కావున "విధి "వశత" యనునది మనము చేయబోవుచున్న కర్మల యందన్వయించుట అంతగా సరికాదు.

(ఆత్మగుణములుః గ్రంథముః వృత్తి ప్రభాకరము: స్వయంప్రకాశ బ్రహ్మానందస్వామి : గ్రంథకర్త)

జాగ్రత్స్వప్న సుషుప్తులు క్రమముగా వచ్చుచు బోంవుచునుండగా వానిని కనుగొనెడి "చైతన్యమే" ప్రత్యగాత్మ" యని భానము. 'ప్రత్యగాత్మ"ను ప్రేమించువాని కెన్నటికిని ఏవిధమైన దుఃఖము సంభవింపదు. ఆత్మజ్ఞానము పొందిన ధీమంతులే ఆనందము ననుభవించుచున్నారు.

జ్ఞానము, ఇచ్ఛ, ప్రయత్నము, సుఖము, దుఃఖము, ద్వేషము,-ఇవి ఆత్మగుణములు.

సత్యమన అర్థ (మనోనిశ్చయము) యే లేనప్పుడు, యింక వాసన ఎక్కడ ఉండును? కనుక నీకు భావనను ఉచ్ఛేదింప (నశింప) కోరికయున్నచో ముందుగా జగత్తు మిధ్యయే యన్న దృష్టి ఉంచుకొనుము. భావనాక్షయము వలననే సిద్ధి (ముక్తి) కల్గును అంతకు మించి పొందవలసినది లేనే లేదు.

మనస్సు విషయములతోడి సంబంధమువలన , నాయా వాసనలతో గూడియు, అధిష్ఠాన చిత్సంబంధము వలన స్ఫురణశక్తి గలదియునై యుండును. కనుక మలినము, చలనము నగుచు తన యిచ్ఛ చేతనే జగద్రచనాది వ్యవస్థను చేయుచుండును, సంకల్ప క్షయము విషయమున ఏమాత్రము ప్రయత్నము కూడ నక్కరలేదు. సంకల్పమును చంపుదమనుకొనువాడు దానిని అరక్షణములో అతి విలాసముగానే చంపగలడు, ఎట్లు ? స్మరింపకుండ ఉండుటవలననే.

## 19. మనస్సు అననేమి?

సర్వ వ్యాపకమగు ఆత్మ ఏకాలముందు తనను, పరుని తెలియజేసెడి శక్తినిధరించునో, అప్పుడు ఆ ఆత్మయే మనస్సు అనబడును. సర్వసామర్థ్యములు కలిగి, సర్వ పరిపూర్ణమై, పాపరహితమైయున్న పరబ్రహ్మమేది కలదో - అదియే మనస్సు. దానికంటె భిన్నమై మనస్సన్నది మరొక పదార్థము లేదు. ఆ పరబ్రహ్మము నందులేని శక్తులు ఎచ్చటను లేవు.

జ్ఞానశక్తిచే ప్రకాశించు దేహమునకు పరబ్రహ్మము అని పేరు, స్వప్నము అనగానేమి? నాడులయందు జాగ్రద్వాసనలచే, అంతఃకరణమున దోచెడి అంతర ప్రపంచము. సాధకుడెల్లప్పుడు ఏల ఆనందరూపుడై యుండవలెను? సంతోషము దేవతలకుప్రీతిగొల్పును. దేవతలు ప్రసన్నులై వరముల నొసంగెదరు. కోరిన కోరికల నొసంగెదరు. దుఃఖములను వారించెదరు. (అద్వైత బోధమృతము).

అసత్యమైనప్పటికిని, యీ ప్రపంచము "సత్యము "అని ప్రజలు ఎందుకు విశ్వాసము కలిగియున్నారు? ప్రజలకు యీ ప్రపంచముదుగల "అభినవేశము " కారణము.

అనగా దృఢమైన విశ్వాసమేగాక, పరిహరించదగిన అజ్ఞానముచే స్వభావీకృతమై, పోషింపబడుచున్న అసత్య జ్ఞానమందు దృఢతర విశ్వాసముగల అంతఃప్రేరక మనోభావమే అని చెప్పవచ్చును. అభినివేశము- అట్టివిశ్వాసముగల వ్యక్తి నశింపను గూడ చేయుచున్నది. ద్వైతాభావమును జూచువానికి జన్మించుటకు కారణము లేదు. కావున. అతనికి, మరల జన్మలేదు. అనగా మోక్షప్రాప్తి రూపుడగుచున్నాడు.

మాయయననేమి? మనస్సు, ఇంద్రియములు పోవునంతవరకు మనోమయమైనదే మాయ అంతఃకరణ మెంత ప్రదేశమున నుండునో, అంత ప్రదేశముననున్న చేతన్యమును, సాక్షిసంజ్ఞచే చూపించి, ఆ అంతఃకరణము వేరుగానుండును. అందువలన అంతఃకరణము సాక్షికి ఉపాధి అనబడెను. ఆ అంతఃకారక ప్రదేశమునందు మాత్ర ముందుచు, అంతఃకరణముతో కూడక వేరుగా నుండు చైతన్యము 'సాక్షి' అనబడును, ఉపాధికల వాని నుపహితుండదురు. విశేషణ "హితుని" విశిష్టుడందురు.

నాలో యింకా ఎక్కువ విశ్వాసాన్ని మేలుకొలుపుటకు వస్తురూపమైన చిహ్నంగా దగ్గరలో ఉన్న చమురును ఎన్నుకున్నారు (యుక్తేశ్వర్). దేశం బ్రతికేది తనభౌతిక ఉపలబ్ధుల వల్లగాక అక్కడి మహాపురుషుల వల్లనేనన్న సంగతి ప్రభువిచ్చిన సమాధానంలో స్పష్టము అవుతుంది. అవతార పురుషుడు విశ్వజనీన వ్యవస్థకు బద్ధుడు కాడు, తేజోబింబంగా గోచరించే అతడి పరిశుద్ధి దేహం ప్రకృతికి ఏ విధాంగాను ఋణపడి యుండడు. అవాతారమూర్తి రూపానికి నీడా పడదు. నేలమీద అడుగు జాడా పడదు. గోవిందయతి శిష్యులు శంకరులు.

మహాపురుషులు జనసామాన్య స్థూలదృష్టికి అతీతంగా తెరమరుగున ఉంటారు. ఇచ్ఛాను సారంగా కనుమరుగయ్యేడి శక్తి వారికి ఉంటుంది.

## 20. మనస్సు అననేమి? (మాయా వివరణ)

ఏది విచారించగా లేకపోవుచున్నచో అదే మాయ, ఇది మనస్సులో నుండు ఒక శక్తి చేత, ఆ మనస్సే భ్రమకు లోనైపోవుచున్నది.

మనస్సు యొక్క విచిత్రమాయా గుణము చేత అద్వైత, సత్య స్వరూపమందు, అసత్య, బహుత్వ స్వరూపములను చూచుచున్నాము. ఉదాః- రజ్జు సర్పభ్రాంతి.

మనస్సు శుద్ధ సత్త్వగుణ ప్రధానమై బ్రహ్మముతో గూడినప్పుడు సర్వ శ్రేయాదాయకమగు జ్ఞానసాధనమగుచున్నది. మనస్సు రజోగుణ, తమోగుణ ప్రధానమై జీవునితో గూడినప్పుడు, సర్వానర్థదాయకమగు సంసార కారణమగుచున్నది.

ఆత్మ మరుపే అవరణము, భ్రమయే విక్షేపము ఈ రెండింటి కలయికయే 'మాయ'.

మనస్సు ఆత్మవైపు మరలినతోడనే రూపు లేకపోవుచున్నది. అనగా జడమగుచున్నది ఉదాః- దీపమునకు ముందందు మృణ్మయ పాత్ర (మట్టికుండ ) వలెనుండును.

## 21. నిర్విషయిక జ్ఞానాన్వేషనకు అతిదగ్గర దారి

జడమగు తనువు, చేతనమగు ఆత్మ యీ యుభయమునకు గల సంబంధమును తెలియజేయు 'మనోవృత్తి' విజ్ఞానము' అనుబడును.

జ్ఞానం జ్ఞేయం, విజ్ఞానం, అను నీత్రయమే 'పరమాత్మ' ఆ పరమాత్మ తత్త్వమే జాగ్రత్స్వప్న, సుషుప్త్యవస్థల యందలి అనుభవములను ప్రకాశింపజేయుచున్నదని తెలిసికొనుటయే వేదాంత సాధనముగు చున్నది. ఈ ముదు అవస్థలను అధిగమించుటయే రాజ్యములో ప్రవేశించుట యగుచున్నది.

ఏవస్తువులు హేయములు? ఏవి జ్ఞేయములు? ఏవి ప్రాప్యములు? (పొందదగినవి). ఏవి వాచ్యములు? (వ్యర్థ ప్రయోజనము గలవి) అను యీ నాలుగు విషయములను

ప్రతిమానవుడు ప్రారంభదశలోనే తెలిసికొన వలసియున్నది. ఈ నాల్గింటిలోని 'జ్ఞేయము తప్ప మిగిలిన మూడును కేవలము భావనా మాత్రములే.

జీవితలక్ష్యము 'తురీయావస్థ' లేదా 'చైతన్యము' అయియున్నది. మన బుద్ధులనెడి సాధనలద్వారా ఈ పరమాత్మ ప్రసరించి నపుడే యీ జీవుడుద్భవించుచున్నాడు. ఈ మనోబుద్ధులనెడి సాధనల నధిగమించినపుడు జీవుడు పరిశుద్ధుడగుట ద్వారా అంతరించి, ఈశ్వరుడే అగుచున్నాడు. ఎవడు యిట్టి జ్ఞానము కలిగిన పిమ్మట శాంతిని పొందినాడో, వాడే ఆత్మతత్త్వజ్ఞుడు, లేక బ్రహ్మజ్ఞాని.

## 22. బ్రహ్మజ్ఞానమును సంపాదించవలసిన అగత్యమేమి?

బ్రహ్మజ్ఞానమనగా వేద ప్రమాణ జ్ఞానము. అట్టి వేద ప్రమాణ జ్ఞానము అనాదిగా చిదాత్మనావరించియున్న యజ్ఞానమును. మాత్రమే నివృత్తి చేయుచున్నది. ఇట్టి యాత్మజ్ఞానముచే అజ్ఞానము నివృత్తి కాగా. మేఘ పటంనుండి వెల్వడిన భాస్కరుని చందమున 'ఆత్మ' స్వయముగ ప్రకాశించుచున్నది.

నానా విధంములగు దృశ్య పదార్థములను చిదాత్మ ప్రకాశింప జేయుచున్నది ఇట్టి దృశ్య పదార్థములు, తమ స్వరూపములను స్వయముగా నెఱుగ జాలవు. మఱియు నది ఒకదాని స్వరూపమును మఱియొక్కటి కూడ నెఱుంగ జాలవు. అందుచేతనవి యున్నియు ప్రత్యేకముగ "ఇది , ఇది" యని ప్రత్యేకముగ వ్యవహరింపబడుచున్నవి కావున నివి యున్నియు 'ద్రష్ట'కు (చూచువానికి ) దృశ్యములగుచున్నవి. ద్రుష్టయొక్క నిశ్చయమును స్మరణము, సంశయము మొదలగు అంతఃకరణ వృత్తుల 'దర్శనములు.' అనబడును.

ఈ వృత్తులన్నిటి యందుఏకముగా ననువర్తించుచు 'నేను,నేను' అని వ్యవరించునది 'ద్రష్ట' యనబడును.

జాగ్రత్స్వప్నముల యందీ ద్రష్టృ, దర్శన, దృశ్యముల యొక్క యునికిని, సుషుప్తి, కైవల్య దశలయందీ మూటియొక్క "లేమిని" తెలియజేయుచు, అన్ని దశలయందు ననువర్తించు, నిత్యమై, నిర్వికారమైయున్న 'చైతన్యము' సాక్షి యనబడును.

సాధనములు, క్రియలు, ఫలములు అని సంసారము త్రివిధభేదములు కలిగియున్నది ఆత్మానాత్మకు కలిగిన అన్యోన్యా ధ్యాసలచే, జడములును, అనాత్మలును నగు ద్రష్ట, దర్శన, దృశ్యములంద జ్ఞానముచే 'ఆత్మ యనెడి బుద్ధి కలుగుచున్నది.

ఆత్మవైన నీవు ఏనికంటె వేఱుగా నున్నావు ఆత్మ స్వరూపము నిర్గుణమై, నిష్క్రియమై, నిరాకారమై, యసంగమై యున్నందున అది సాక్షాత్తుగా తెలియబడదు. (కండ్లకు కనబడదు) కావున, దానియందు కల్పింపబడి మిథ్యా భూతమైయున్న యేదేని యొక వస్తువు నవలంబించి దానిమూలమున శుద్ధమైన యాత్మ స్వరూపము తెలియబడుచున్నది అనగా నహంకారాదుల మూలమున తెలియబడుచున్నది ఆత్మస్వరూపము జ్ఞానమాత్రముగ నుండును.

## 23. జ్ఞాన వివరణము

ప్రజ్ఞానము అంతఃకరణమును గాని, దాని వృత్తులనుగాని అంటకవాని నన్నింటిని ప్రకాశింపజేసెడి సాక్షియగు 'చిదాత్మ' 'ప్రజ్ఞానము' అనబడును.

అంతఃకరణ రూపమగు ఉపాధియందున్న ప్రజ్ఞానమే చిదాత్మయొక్క స్వరూపము చేతన భాగమగు సంతఃకరణ వృత్తితో గూడిన చైతన్యము 'సంజ్ఞానము' అనబడును. గ్రంథ ధారణాశక్తిగల యంతఃకరణ వృత్తితో గూడిన చైతన్యము 'మేధా' యనబడును, దేహేంద్రియములను ధరించెడి వృత్తితో గూడిన చైత్యము ధృతియనబడును. మనన

వృత్తితోగూడిన చైతన్యము 'మతి' యనబడును. మననము చేయుటయందుగల స్వాతంత్ర్య రూపమగు వృత్తితో గూడిన చైతన్యము 'మనీషా' అనబడును దుఃఖరూపమగు వృత్తితో గూడిన చైతన్యము 'జూతి' యనబడును. స్మరణవృత్తితో గూడిన చైతన్యము 'స్మృతి' యనబడును. రూపాదులయందు శుక్ల, కృష్ణాది భావరూపమగు వృత్తితో గూడిన చైతన్యము 'సంకల్పము' అనబడును. అవ్యవసాయ వృత్తితో గూడిన చైతన్యము 'క్రతువు' అనబడును, శ్వాసోచ్ఛ్వాస రూపమగు వృత్తితో గూడిన చైతన్యము 'అసువు' అనబడును.

ఉపాధుల దృష్టిని విడిచి చూచినచో శుద్ధచైతన్యము ప్రతి జీవునియందున్న 'ప్రజ్ఞానము'న కంటె భిన్నము కాదు.కావున ప్రజ్ఞాన స్వభావమగు 'ప్రత్యగాత్మయే' బ్రహ్మము' అగును. క్షుదముఃగు క్రిమికీటకాదులు మొదలు మనుష్యుల వఱకుగల సర్వ ప్రాణులును 'బ్రహ్మమే' అగును. కనిపించెడి కార్యకారణము లన్నియును బ్రహ్మ స్వరూపమేయగును. ప్రజ్ఞానము జీవుల యంతఃకరణములతో సంబంధపడి సర్వము నెఱుంగుటచే, ఆ అంతఃకరణములతో కూడిన చైతన్యము 'ప్రజ్ఞానేత్రము అనబడును, అటులనే సర్వజగత్కారణమగు మాయతో గూడి సర్వము నెఱింగెడి చైతన్యము కూడ 'ప్రజ్ఞానేత్రమే' యనబడును.

అంతఃకరణమును విడిచినచో ప్రజ్ఞానము బ్రహ్మస్వరూపమే యగును. ప్రత్యగాత్మ బ్రహ్మస్వరూపము కంటె వేరుగాదు. సర్వోపాధులను విచారించి 'ఇది బ్రహ్మముకాదు, ఇది బ్రహ్మముకాదు అని త్రోసివేయగా నద్వితీయమగు బ్రహ్మమొక్కటి మాత్రమే శేషించియుండును, ఆ బ్రహ్మము శాబ్దిక జ్ఞానమునకు విషయము కాదు.

## 24. బ్రహ్మజ్ఞాన సముపార్జనా ఫలము

బ్రహ్మజ్ఞాన సముపార్జనాఫలముః-1) జ్ఞానరక్ష 2) తపము 3) విసంవాదాభావము 4) దుఃఖనివృత్తి 5) సుఖావిర్భావము - అను పంచవిధ ప్రయోజనములు కల్గుచున్నవి.

1) జ్ఞానరక్షః - బ్రహ్మ సాక్షత్కారము పొందిన తత్త్వవేత్తకు సంశయ, విపర్యయులు గలుగక పోవుట.

2) తపముః- చిత్తైకాగ్రత తపస్సనబడును.

3) విసంవాదాభావముః- జీవన్ముక్తుడు సమాధినుండి లేచిన పిదప దుష్టులతనిని గూర్చి నిందించెడి వాక్యముల చేతను, పాషండులు క్రూరులు మొదలగు వారిని ప్రత్యక్షముగ జూచుట చేతను ఆ జీవన్ముక్తుడగు బ్రహ్మవేత్తకు, రాగద్వేషాది వృత్తులుత్పన్నములుకావు. కావున ఆ జీవన్ముక్తునకు తనను నిందించెడి దుష్టపురుషుల యందు కలహరూపమగు విసంవాదము కలుగనేరదు. జీవన్ముక్తి నభ్యసింపని బ్రహ్మవేత్తలకా దుష్టులతో నిరంతరము కలహరూపమగు విసంవాదము కలగుచున్నది. జీనన్ముక్త్యభ్యాసికి విసంవాదా భావము కలుగుచున్నది.

4) దుఃఖనివృత్తి :- దుఃఖనివృత్తి - ఐహిక దుఃఖనివృత్తి, పరలోక దుఃఖనివృత్తి యని ద్వివిధములు, ఇందు ఆత్మజ్ఞానముచే భ్రాంతినివృత్తి యగుటవలన, సమాధ్యభ్యాసముచే సర్వవృత్తులు నిరుద్ధములగుట వలనను, జీవన్ముక్తుని చిత్తమాత్మాకార మగుచున్నది. కాని అన్యాకారమగుట లేదు. కావున నతడు ప్రారబ్ధ కర్మ ఫలముల ననుభవించుచుండినను, దుఃఖము పొందుట లేదు, అతనికి బ్రహ్మాకార వృత్తి కలిగియుండుట వలన, సర్వదుఃఖములు నివృత్తము లగుచున్నవి. ఇది ఐహిక దుఃఖనివృత్తి యనబడును.

"అహంబ్రహ్మాస్మి" యని తన యఖండ స్వప్రకాశమగు తన యదార్థ స్వరూపమును తెలిసికొనిన తత్త్వవేత్త యే ఫలమునుగోరి, యే భోక్త యొక్క ప్రీతికొఱకు శరీరము, ననుసరించి తపించును ? అతడే విధముగను తపింపడు. ఆత్మజ్ఞానముచే, అజ్ఞానము

నివృత్తి కాగానే దానితోపాటు "సంచిత" కర్మములన్నియు నాశమొందుచున్నవి. ఆత్మజ్ఞాన ప్రభావము వలన జ్ఞానికి "ఆగామి" కర్మములంటుటయే, లేదు. అజ్ఞానముతో కూడియుండిన సంచిత కర్మములే, యతని పరలోక దుఃఖమునకు కారణములగుచున్నవి. ఆయజ్ఞాన సహితమగు సంచిత కర్మములు, బ్రహ్మజ్ఞానముచే నశించుట వలన జీవన్ముక్తునకు పరలోక దుఃఖములు కూడ నివృత్తము లగుచున్నవి. బహ్మవిదున కట్టి దుఃఖములు లేకపోయినను ప్రారబ్ధ కర్మముల ఫలముల ననుభవించునప్పుడు, బాధితానువృత్తిచే "నేను సుఖిని, నేను దుఃఖిని" అను నిటువంటి యనుభవములు కలగుచున్నవి.జీవన్ముక్తుడగు బ్రహ్మవేత్త, సమాధ్యాభ్యాసముచే సర్వవృత్తులను నిరుద్ధమొనర్చుట వలన నతనికా దుఃఖ నివృత్తి సురక్షితమగుచున్నది. చిత్తవృత్తులను నిరోధించిన, తత్త్వవేత్తకు ఏకాలమందు దుఃఖము ప్రతీతికాదు. కావున యీ జీవన్ముక్తియొక్క దృష్టి సుఖాభ్యాసముచే నాత్యం... దుఃఖ నివృత్తి కలగుచున్నది.

5) సుఖావిర్భావముః- బ్రహ్మ సాక్షాత్కార జ్ఞానముచేతను, సమాధి యోగాభ్యాసము చేతను జీవన్ముక్తునకు అజ్ఞానమును, అజ్ఞాన కృతావరణమును, వ్యవహారకృత విక్షేపమును నివృత్తములగుచున్నవి. ఇందుజ్ఞాన కృతావరణ విక్షేపములు రెండు ను బ్రహ్మానందాను భవమునకు ప్రతిబంధకములగును. అ ప్రతి బంధకములు నివృత్తిమైన జీవన్ముక్తునకు నిరతిశయ పరిపూర్ణ బ్రహ్మానందము కలగుచున్నది. ఆనిరతిశయ బ్రహ్మానందాను భవమే "మోక్ష సుఖావిర్భావము" అని చెప్పబడుచున్నది. అ విషయమును గూర్చి శృతియందిట్లు చెప్పబడెను.

సమాధి చేత, రాగద్వేషాది మలములు నివృత్తములై, కేవలాత్మయందు నిలిచియున్న చిత్తమునందు నిరతిశయ సుఖము కలగుచున్నది. ఆసుఖమును వాక్కులు చెప్పలేవు (వర్ణింపజాలవు).

ఆ నిరతిశయ సుఖము అంతఃకరణము చేత మాత్రమే గ్రహింపబడుచున్నది. అట్టి నిరతిశయ సుఖావిర్భావము జీవన్ముక్తునకు పంచమ ప్రయోజన మగును. ఈ విధముగ జీవన్ముక్తునకు ఐదు విధములగు ప్రయోజనములు కలుగుచున్నవి.

ఈ పంచవిధ ప్రయోజనములను పొందిన బ్రహ్మవేత్త యొక్క ప్రారబ్ధకర్మ మనుభవించుటచే వర్తమాన శరీరము పోవుచున్నది. శరీరము నశించి పోగానే నతడు అఖండైక రసానందమగు "పరబ్రహ్మ స్వరూపుడై" ప్రకాశించుచు ఉన్నాడు ప్రారబ్ధ భోగానంతరము అతని సూక్ష్మశరీరము "అధిష్ఠానాత్మ" యందు విలీనమగుచున్నది. అతడు శరీరమును విడుచుట యందు దేశకాలాదుల యపేక్షలేదు. ఈ విదేహముక్తిని గూర్చి కొందఱీ విధముగ జెప్పుచున్నారు. తత్త్వజ్ఞానము కలిగిన పిదప భావి జన్మమును కలిగించెడి సంచిత కర్మములు సమూలముగ నశించుట చేత నతడు దేహము కలుగనివాడు అగుచున్నాడు, కావున నతనికి తత్త్వజ్ఞానము కలిగిన కాలమునందే విదేహముక్తియును కలగుచున్నది. ఆత్మజ్ఞానము కలిగిన తోడనే భావి శరీరమునకు పాదాన కారణమగు మూలజ్ఞానమును నిమిత్త కారణములగు సంచిత కర్మములును నశించిపోవుచున్నవి. కావున నతడు విదేహముక్తుడే యగుచున్నాడు. స్థూల శరీరమును విడిచినప్పుడే అతని లింగ (స్థూక్ష్మ) శరీరము, మరల జన్మించుట కెచ్చటికిని పోవుట లేదు. దాని కధిష్ఠాన మగు ప్రత్యగాత్మయందే లయమగుచున్నది. కావున ఆ బ్రహ్మవేత్త మరల జన్మించుట లేదు. బ్రహ్మము యొక్క స్వయం ప్రకాశము వలననే బ్రహ్మానందము ప్రకాశితమగుచున్నది.

సర్వ ప్రపంచము నాకంటె భిన్నముగ లేదు. నేను కేవలము బ్రహ్మ స్వరూపుడనను దృఢ భావనగల విద్వత్సన్యాసి జీవన్ముక్తుడనబడుచున్నాడు. నేనుబ్రహ్మ మనెడి భావనగాని,

ప్రపంచ వాసనలుగాని లేక, నిరావరణ స్వరూపుడై సంచరించెడి బ్రహ్మవేత్త విదేహముక్తుడనబడుచు ఉన్నాడు, లేక ప్రారబ్ధ కర్మ క్షయానంతరము సర్వ శరీరములను విడిచి బ్రహ్మమాత్రుడై ప్రకాశించువాడు విదేహముక్తుడు అనబడుచున్నాడు.

మొదట సచ్చిదానంద స్వరూపుడగు నాత్మయవిద్యా ప్రభావము వలన జీవభావమును బొందుచున్నాడు. ఈ సర్వానర్థములకు మూలమైన జీవకల్పనయే యదార్థ జ్ఞానమునకు ప్రతి బంధక మగుచున్నది. స్వప్న పదార్థములు దృశ్యములగుటచే మిధ్యలగునట్లు, జాగ్రత్పదార్థములు దృశ్యములగుటచే మిధ్యలే యగును. స్వప్నపదార్థముల కాదియు, నంతము కన్పించుటలేదు. అవి మధ్య మాత్రమున్నట్లు తోచుచున్నవి. కావున నవి లేనివియే యగును. అట్లే జాగ్రదవస్థ యందుగల దృశ్య పదార్థములన్నియు నాద్యంతరహితములై యున్నవి. కావున నవియు సర్వత్ర మిధ్యలేయగును.

"నేను పుట్టక పూర్వమే యీ ప్రపంచము పుట్టియున్నది". అనెడి ప్రపంచము యొక్క బహుకాల స్థిరత్వ భ్రాంతి యనిర్వచనీయముగ గలుగుచున్నది. ఈ అనిర్వచనీయ భ్రాంతి చేతనే సమస్త పదార్థములును వాని స్థిరత్వాస్థిరత్వాదులు ప్రతీతములై తోచుచున్నవి. స్వప్న జాగ్రత్పదార్థములు రెండును అవిద్యాకార్యములే యగును. అవిద్యయు, అవిద్యా కార్యములును. సాక్షిచే ప్రకాశింపజేయబడుచున్నవి. ఆత్మకంటె భిన్నముగ కానవచ్చునదంతయును భ్రాంతి మాత్రమే. మాయకు మనస్సే కారణము, నీవా మనస్సు దృఢముగ నిలుపగలిగినచో మాయ నిన్నేమియు చేయజాలదు. జ్ఞానము అంతర్ముఖమైనచో దానికి సచ్చిదానందాత్మ గోచరించును. జ్ఞానమునకు మూలము లేదు. కావున నది సర్వత్ర లేనిదియేయగును. కారణమగు జ్ఞానమే లేనప్పుడు దానిచే తెలియబడెడి కార్య ప్రపంచమెట్లుండును?! వృక్ష రూపమగు సంసారమునకు జ్ఞానమే విత్తనము వంటిది, ఈ విత్తన రూపమగు జ్ఞానమునకును కారణము తనకు తాను కారణమైనప్పుడు అజ్ఞానమను పేరుతో బరగుచుండును.

అస్థి మాంసాయుతమైన యీ దేహములో నివసించి యుండగనే తన స్వప్రయత్నము చేత ఆర్జించిన ఆ పరిపూర్ణజ్ఞానముగల మానవుడే యీ భూమిమీద దేవుడు.

## 25. మోక్ష సాధనలగు ముఖ్య త్రివిధ సాధనలు (మార్గములు)

1. వైరాగ్యము 2. బోధ 3. ఉపరతి - ఈ మూడును ఒకటొకటి కలిసి తత్త్వబోధకు తోడ్పడు చుండును. ఒక్కొకనియందు నొకటి గాని రెండుగాని లేకను పోవచ్చును. వైరాగ్యమును, ఉపరతియు పూర్తిగా నుండి, తత్త్వజ్ఞానము లేక పోయిన యెడల మోక్షము కలుగదు. కాని చిరకాలముండి పుణ్యాత్ములు నివసించు లోకముల యందు శిష్టాచార సంపత్తిగల శ్రీమంతుల యింటిలో తపోవిఘ్నము గలవాడుగ బుట్టునని భగవద్గీతయందు చెప్పిన చొప్పున వైరాగ్య ఉపరతులనెడి తపోబలము వలన పుణ్యలోకావ్యాప్తికలగుచున్నది. ఎప్పటికిని మంచిపని వ్యర్థము కాదు.

తత్త్వజ్ఞానము పూర్తిగానుండి, వైరాగ్యోపరతులు రెండును లేకున్నను మోక్షము తప్పక కలగును, కాని జీవన్ముక్తి సుఖము కలుగనేరదు. ప్రారబ్ధము వలన గలుగు దుఃఖము నశింపదు.

1) వైరాగ్యమున కవధి (ఒడ్డు) సత్యలోకాధి పత్యము లభించునను అపేక్షలేక పోవుట.

2) జ్ఞానమున కవధి - దేహము నేననియెడి దృఢజ్ఞానము అవివేక దశయందెట్లుండెనో అట్లు ఆత్మస్వరూపము నేననియెడి దృఢ నిశ్చయము కలిగియుండుట.

3) ఉపరతి కవధి - గాఢముగా నిదురించునప్పుడు ప్రపంచ సంబంధములగు సర్వవ్యవహారములను మఱచినట్లు, నిఖిల వ్యవహారముల యందు ఎట్టి జోక్యము లేకుండుట వీనిలో నేది యెంతవఱకు తనకు కలిగినదియు తన బుద్ధికే విశదమగును.

## 26. ప్రమేయ సంశయముః-

ప్రమాణ జన్యమగు జ్ఞానమునకు విషయమగునది ప్రమేయము" అనబడును. ప్రత్యేకముగ వివరముగ తెలుపబడుచున్నది. ఇది రెండు విధములు 1. ఆత్మగత 2. అనాత్మగత సంశయములు ఉదాహరణ: రజ్జుసర్ప భ్రాంతి 1. అనాత్మగత భ్రాంతి 2. నిజరూపమగురుజ్జువు నుతెలిసకోనుట ఇది అత్మగతభ్రాంతి.

సర్వవ్యాపకమగు చైతన్యము ఏకముగను, అద్వితీయమును అయినప్పటికిని ఉపాధి భేదములచే నది జీవాత్మయనియు, పరమాత్మయునియు రెండు విధములుగ జెప్పబడుచున్నది. తత్త్వమసి" అను మహావాక్యమునుందుగల తత్ వేదార్థపరమైన మాయసహిత చైతన్యము పరమాత్మ యనబడును, త్వం పదార్థమైన శరీరోపహిత చైతన్యము జీవాత్మ యనబడును. ఈ భేదము ఉపాధులయందు మాత్రమేగాని స్వరూపముహో జీవాత్మ లకు నెట్టిభేదము లేదు. ఈ యదార్థమునే సర్వజనులునెఱింగి భేద భ్రాంతిని విడిచి ఏకరూపమగు నఖండబ్రహ్మా కారవృత్తి నవలంబించి తరించుచుదురుగాక.

శృతిస్మృతులు కేవలము జ్ఞానము వలననే మోక్షము కలగుచున్నదని చెప్పుచున్నవి. కర్మోపాసనల వలనగాని, కర్మోపాసనా మిశ్రితమగు జ్ఞానమువలనగాని మోక్షముకలుగ నేరదు. అహం బ్రహ్మాస్మి"అనెడి [illegible]భేదజ్ఞానము వలన మాత్రమే మోక్షము కలుగుచున్నది. జ్ఞానుల జీ[illegible]నానుభవమే నిర్విషయమైన శుద్ధ జ్ఞాన స్వరూపమనియు, యీ నిర్విషయిక జ్ఞానమే బ్ర[illegible]నమనియు, అది ఆకాశము వలేనే అస్పృశ్యమగుటవలన నందెట్టి పదార్థము నుండ జాలదనియు గౌడపాదుడు చెప్పుచున్నాడు. జ్ఞానమును తెలిసికొనుటకు మరియొక జ్ఞాన మక్కరలేదు. జ్ఞానమే స్వయముగా జ్ఞానరూపమై యున్నది.

జీవుడు తన జ్ఞాన క[illegible]లచేత 7 అ[illegible]ములను సృష్టించెను. 1. మనస్సు 2. ఇంద్రియములు 3. ప్రాణవర్గము 4. తననిమిత్తము మూడు అన్నములు.

మర్త్యాన్నము 1; దేవాన్నములు 2; విశ్వాన్నము 1;మిగిలిన 3 తన నిమిత్తము ప్రతిదాని యందును సామాన్యాంశము, విశేషాంశము అని ద్వివిధములు.సృష్టిప్రళయములు ఈశ్వరుని లీలలు. సృష్టి స్థితియందు ఈశ్వరుడు స్థూలరూపముగ నున్న చిదచిత్తులలో అంతర్యామిగా ప్రవేశించియుండును. ప్రళయ దశయందు సూక్ష్మరూపముగ నుండు చిదచిత్తులు ఈశ్వరునియందు లీనమైయుండును.

జీవుల కర్మముల ననుసరించి సృష్టి జరుగుచుండును. జీవుల పూర్వ కర్మ వశంబున దేహమునందు అహంకారమును. దేహ సంబంధులయందు మమకారము కలుగుచున్నవి. అజ్ఞాన వశంబున జీవులు సంసార చక్రమున బడుచున్నారు.

కర్మము, జ్ఞానము, భక్తి, ఉపపత్తి అను నాలుగు యోగములును మోక్షసాధనములగును.

1.నిత్యనైమిత్తిక కర్మానుష్ఠానము, యజ్ఞ, దాన తపస్సులు కర్మయోగములు. దీని యనుష్ఠానము -వలన జ్ఞానము కలుగును. 2. అంతఃకరణమును విషయరాసులయందు

నంచరింప నీయక నిగ్రహించి, నిరంతరము పరిశుద్ధాత్మ జ్ఞానము నందు నిమగ్నమైయుండుము. 3. ధ్యానయోగము పరమేశ్వరునియందే కాంతి కమగు ప్రవృత్తితో ధ్యనార్చనాదుల యందు నిమగ్నడై యుండుట 4. భక్తి యోగము. సర్వధర్మ పరిత్యాగ పూర్వకమగు శరణాగతి ప్రపత్తి, దీనివలన మోక్షము కలుగును.

## 27. ప్రమాణ సంశయము

'తత్త్వమసి' అది వేదాంత వాక్యములు అద్యతీయ బ్రహ్మమును ప్రతి పాదించుచున్నవా? లేక అన్యార్థమును ప్రతిపాదించుచున్నవా? అనునటువంటివి ప్రమాదకరమగు ప్రమాణగత సంశయములనబడును. ఆ ప్రమాణగత వేదాంత శాస్త్రములను శ్రవణము చేయుటవలన నివృత్తి యగుచున్నవి కావున యిచట దశోపని షడ్లింగములను చెప్పెదవినుము.

### విశ్లేషణ (విపులార్థము)

షడ్లింగములుః- ఉపక్రమోపసంహారములు, అభ్యాసము, అపూర్వత, ఫలము, అర్థవాదము. ఉపపత్తి - అను నీయాఱును షడ్విధ తాత్వర్యలింగములు, ఇందు ప్రకరణములను ప్రతిపాదింపబడిన యద్వితీయబ్రహ్మము ప్రకరణాది యందును, ప్రకరణాంతమునందును ప్రతిపాదింపబడుచున్నది. ఇందు ఆది ప్రతిపాదనము ఉపక్రమము అనబడును. అంత్యప్రతిపాదనము ఉపసంహారము అనబడును. ఈ రెండును గూడి ఉపక్రమోపసంహారములను ప్రథమలింగముగా పండితులు చెప్పుచున్నారు.

ప్రకరణముచే ప్రతిపాదింపబడిన అద్వితీయ బ్రహ్మము ప్రకరణ మధ్యము నందు మరల మరల వర్ణింపబడుట యభ్యాసలింగమని పండితులు చెప్పుచున్నారు. ఈ యభ్యాసమునకు అవృత్తియను నామాంతరము గలదు.

ప్రకరణముచే ప్రతిపాదింపబడిన యద్వితీయ బ్రహ్మముశ్రుతి కంటె భిన్నమగుప్రత్యక్షాదేతర శాక్తిక ప్రమాణముల కవిషయమగుట అపూర్వత అనబడును. మరియు ప్రమాతృ ప్రమాణ ప్రమేయాది నమస్త మద్వితీయ బ్రహ్మముచే ప్రకాశింపజేయబడదనుట అపూర్వత అనబడును.

ప్రకరణముచే ప్రతిపాదించబడిన యద్వితీయ బ్రహ్మజ్ఞానముచే తెలియబడెడి యద్వితీయ బ్రహ్మత్వమే ప్రయోజనమని పండితులు చెప్పుచున్నారు. ఈ అద్వితీయ బ్రహ్మ ప్రాప్తి రూపమగు మోక్షము ముఖ్య ప్రయోజనము. వాక్య శ్రవణముచే గలిగెడి యఖండ బ్రహ్మకారవృత్తి యవాంతర ప్రయోజనము.

ప్రకరణముచే ప్రతిపాదింపబడిన యద్వితీయ బ్రహ్మము యొక్క ప్రకంపనము స్తుతి పరమగు నర్థవాదమనబడును. ఈ యిద్వితీయ బ్రహ్మముకంటె భిన్నమగు ద్వైత నిరసనము నిందార్థమగు నర్థవాదమని పండితులు చెప్పుచున్నారు.

ప్రకరణముచే ప్రతిపాదింపబడిన యద్వితీయ బ్రహ్మమనేక దృష్టాంతముల తోడను, యుక్తుల తోడను ప్రతిపాందించుట యుపపత్తి, యనబడును. శృతులయొక్క తాత్పర్యము యీ యాఱులింగముల మూలమును నిర్ణయింపబడుచున్నది. అందు మొదట "ఈ శావాస్యోపనిషత్తు యొక్క లింగమును నిర్ణయించెదవినుము.

## 28. చిత్తు-వివరణ

చిత్తు:- అనగా జీవుడు ఇతడు దేహేంద్రియ మనోప్రాణ బుద్ధులకు విలక్షణుడును , నిత్యుడును, హృదయ మధ్యస్థుడును, అణు స్వరూపుడును, సంకోచ వికాసగల జ్ఞాన గుణముచే శరీరము నందంతటను వ్యాపించియుండు వాడును నగును. సుషుప్తియందీతడు ఈశ్వరుని యందులీనమై యుండును, జీవులనేకులు, వీరు మోక్షప్రాప్తి పర్యంతము ప్రకృతి బద్ధులైయుందురు. వీరు నత్యులు,ముక్తులు, బద్ధులు,నని త్రివిధములు. వీరు 1. విష్వక్సేనాదులు, సంసారమెరుగని వారు సంసారులై, వినిర్ముక్తులై వైకుంఠమున వాసుదేవుని సదా సేవించుచుండువారు (3) కర్మబంధ బద్ధులై సుఖదుఃఖముల ననుభవించుచు ఎల్లప్పుడు సంసారమునందు పడియుండు వారు బద్ధులు.

అచిత్తు:- జ్ఞానశూన్యమై, వికారాస్పదమై నిత్యమై యుండును. ఇది సత్త్వ, రజస్తమో గుణాత్మకమై యుండును. ఈ మూడు గుణములు ప్రకృత్యవస్థలో ననుద్భూతములుగను, వికారదశలో ఉద్భుతముగ నుండును. ఇందు సత్త్వగుణము జ్ఞాన సుఖములను, వాని సంబంధమున కలిగించును. రజోగుణము రాగ, తృష్ణ, కర్మ, సంగములను గలుగజేయును, తమోగుణము, విపరీత జ్ఞానమును, అనవధానమును, అలస్యమును గలుగ జేయును. ఈ మూడు గుణములు సమానముగ నున్నచో ఏ వికారములు నుండవు. విషమములైనచో వికారములు జనించును.

ఈ గుణముల ననుసరించి అచిత్తు:- 1. శుద్ధ సత్త్వము 2. అశుద్ధ సత్త్వము 3. సత్త్వ శూన్యము నని త్రివిధములు. రజస్తమముల సంబంధము లేక కేవలము సత్త్వమై, నిత్యమై, జ్ఞానానంద జనకమై యుండునది శుద్ధ సత్త్వము ఇదియే నిత్య విభూతి, వైకుంఠము, పరమపదము.

పంచవాయువులు-ఉపవాయువులు -ధర్మములు-

ఉచ్ఛ్వాసము-ప్రాణధర్మము

నిశ్వాసము-అపానవాయు ధర్మము

విజృంభణము- (ఆవులింతలు) - దేవదత్త వాయుధర్మము

క్షుతము (తుమ్ములు)- కృకర వాయుధర్మము

ప్రస్పందనము- (వణకుట) -వ్యాన వాయుధర్మము లేక దేవదత్తవాయుధర్మము

ఉన్మీలనము - (కన్నులు తెఱచుట, మూయుట) - కూర్మవాయుధర్మము

ఉత్క్రమణము (వమనము) ప్రాణముపోవుట - ఉదానవాయు ధర్మము

అశనా, పిపాసలు (ఆకలి దప్పులు) - ప్రాణ ధర్మములు

ప్రమ:- ఎప్పుడూ ఎఱుగని, చూడని వినని దానిజ్ఞానమును ప్రమ అందురు. ముఖమందు సంచరించుచున్న ప్రాణముచేత ఎవడు జాగ్రత్తును అనుభవించుచూ జీవించునో అతడు అన్నింటికి లోపలనుండిన వాడై చూచుచున్నాడు. అతడే ఆత్మయగును.

## 29. శృతి, స్మృతులు

అస్తి, భాతి, ప్రియం,రూపం, నామం చేత్యంశపంచకం, ఆద్యం త్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతోద్వయం.

బ్రహ్మసత్యం జగన్మిథ్య బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి.

ద్రష్టవు నీవు. ద్రష్టగానే ఉండు. చూడడానికి వేరే ఏమిఉంది? నిద్రలోని స్థితి యిట్టిది. ఈ రీతిగా ఆత్మ సాక్షాత్కారము కేవలము అనాత్మ నిరసనమే.

భగవంతుడు నామ, రూప, క్రియారహితుడు.సర్వవ్యాపకుడు. జ్ఞాన గమ్యుడేగాని

ధ్యాన గమ్యుడు కాడు. స్వరూపజ్ఞానమే యతనికి మూడవ నేత్రము అభగవంతుని శక్తి సత్త్వ, రాజస, తామసమునని మూడు విధములుగ నుండును. అది ప్రళయకాలమున నతనియందు నిగూఢముగా నుండును. అప్పుడతడు నిర్గుణుడనబడును. సృష్టి కాలమున ఆశక్తి విజృంభించి జగద్రూపముగా పరిణామము చెందును. జగద్విశిష్టుడైన భగవంతుడే సగుణ బ్రహ్మ. జగద్రూపముగా పరిణమించిన త్రిగుణాత్మిక యగు శక్తియే ప్రకృతి యనబడును. ఈ ప్రకృతికిని, ప్రకృతి పరిణామ రూపమైన ప్రపంచమునకును నాధార భూతుడైన భగవంతుడే పురుషుడు. ఈ ప్రకృతి పురుషులే శివశక్తులనియు, అనాది దంపతులనియు శాస్త్రములందు జెప్పబడెను, నామరూపములు లేని నిర్గుణ బ్రహ్మమునకు ఉపాసనార్థము అనేక రూపనామములు శాస్త్రములయందు కల్పింపబడెను.

ఆకాశమొక్కటియే యైనను ఘటమఠాద్యుపాధుల భేదముచే ఘటాకాశ. మఠాకాశ నామముల బొందినట్లు నిర్గుణ బ్రహ్మమొక్కటియే యుపాసకుల యభిరుచి ననుసరించి కల్పితోపాధుల సంబంధము కలవాడై నానావిధ నామ రూపములతో వ్యవహరింపబడుచున్నాడు.

దైవబలము వల్లనే కాని, తిండి బలమువల్ల బ్రతుకుతానని ఎన్నడూ నమ్మకు, ఆ ప్రభువు (దైవము) నీ ఊపిరి కాస్తా దిగలాగేస్తే, నీ తిండి, నీచుట్టాలు, నీడబ్బు నీకేమైనా సహాయము చేస్తాయా? ఏమీ చేయవు. అని తెలిసికొనుటయే బోధ (ఎఱుక).

ప్రకృతి-న్యాయస్థానంలో, సాక్షి బోనులో నున్న బందీలాంటిది. ప్రకృతితో మనకున్న సంబంధం, పొగరుబోతు యజమానికి - అతని నౌకరుకు ఉండే సంబంధంలాంటిది. ఆత్మ జ్ఞానము ఒక్కదానివల్ల (ఆత్మసాక్షాత్కారము) మాత్రమే, ప్రకృతి సంబంధమైన బాధకాని, మానవసంకల్పముగాని లేకుండా దానంతట అదే తలవంచుతుంది.

ఆత్మసాక్షాత్కారం స్వయంకృషిద్వారా అనగా అనుభవముద్వారా మాత్రమే పొందగలుగుతాము. మొదట ప్రతి మానవుడు, జీవభ్రాంతిని విడచి పంచభ్రమలు తొలిగించుటలోనే విశ్వ ప్రయత్నము చేయవలెగాని తదుపరి ప్రయత్నములో తాను శ్రమించవలసినది బహు స్వల్పమని తెలిసికొనుట అతిశయోక్తి కాదేమో ఇట్లోనర్చుట కేవలము మోక్షార్థులకే గాని, తదితరులకు కాదని గుర్తింతురుగాక!

## 30. అవతార పురుషుల బోధలు

(జ్ఞానవతార్ శ్రీయుక్తేశ్వర్ గిరిగారి తత్త్వోపదేశము)

ఆధ్యాత్మిక నియమం తప్పించుకొనుటకు వీలులేదన్న సంగతిని "మనస్సు" అంగీకరించిన తరువాత మాత్రమే బుద్ధి" సరైన మార్గంలో నడుస్తుంది (సాగుతుంది)

నిద్రలో నీవు ఆడో, మగో నీకు తెలియదు.

మానవుడు, జాగ్రదవస్థలో ఇంద్రియ సుఖాలు అనుభవించడానికి లెక్కలేనన్ని ప్రయత్నాలు చేస్తూ ఉంటాడు. ఇంద్రియాలన్నీ అలిసిపోయినప్పుడు చేతికందిన సుఖాన్ని కూడా మరిచిపోయి, తన స్వభావ మయిన "ఆత్మ"లో విశ్రాంతి అనుభవించడానికి నిద్రపోతాడు.

మహావేదాంతి శంకరాచార్యులవారు "ఆవిధంగా, అతీంద్రియానందం చాలా సులువు. ఎప్పుడూ రోతతోనే అంతమయ్యే ఇంద్రియ సుఖాలకంటె అదిచాలా శ్రేష్ఠమైనది'"అన్నాడు.

స్త్రీ రూపం ధరించిన పురుషుడు స్త్రీకానట్లే, స్త్రీ పురుషులుభయులుగానూ రూపధారణ చేసే ఆత్మ మార్పు లేకుండానే ఉండిపోతుంది.

ఆత్మ భగవంతుడి నిర్వికార, నిర్గుణ ప్రతిరూపం.

"ఆనందము, అందమైన ముఖం - రెచ్చగొట్టే కొరడా లాంటివి. దాంతో దెబ్బలు తీనే స్థితికి తెచ్చుకోకండి" ఇంద్రియాలకు బానిసలైన వాళ్లు ప్రపంచంలో ఆనందం ఎలా పొందగలుగుతారు? పొందలేరు.

అసహ్యమైన బురదలో పొర్లాడు తున్నప్పుడు ప్రపంచపు సూక్ష్మ సుగంధాలు వాళ్లకు సోకవు. పాంచభౌతిక సుఖాలకు లోబడ్డ మనిషికి సున్నితమైన విచక్షణలన్నీ నశిస్తాయి.

"ఆత్మ నిగ్రహ సింహం"లా ప్రపంచములో తిరగండి.

ఇంద్రియ దౌర్బల్యాలనే కప్పలు మీచుట్టూచేరి మిమ్మల్ని తన్నకుండా చూచుకోండి. ఈశ్వరాన్వేషణ చేయటానికి మనుష్యులు తన సుఖాలను వికృతం చేసికోనవక్కరలేదు.

దైవ సాక్షాత్కారం పొందడమంటే, అన్ని దుఃఖాలకీ అంత్యక్రియజరిపించడమేనన్న సంగతి గుర్తుంచుకోండి.

పవిత్ర గ్రంథ సంబంధమైన సంపదను బయటికి ప్రదర్శించడంలో నిమగ్నులైన వారికి అమూల్యమైన ముత్యాలకోసం మౌనంగా లోపలికి మునగడానికి సమయమేముంటుంది?

జ్ఞానాన్ని ఒంట బట్టించుకొనేది, తనలోనున్న అణువణువు ద్వారానే గాని కళ్ళతోకాదు.

ఋషులు ప్రగాఢమైన జ్ఞానాన్ని ఒక్కొక్క వాక్యంతో యిమిడ్చి వ్రాస్తే, విద్వాంసులు వాటిని వ్యాఖానించడంలో తరతరాలుగా పూర్తిగా నిమగ్నులై యున్నారు.

దేవుడు గురించిన చింతనకన్న శీఘ్రంగా ముక్తిని ప్రసాదించేది మరొకటి ఏముంది? ఏదీలేదు. కోపం అహంభావం (పౌరుషం)అనే ఆంతరిక దుర్గాన్ని పతనము గావించడమే మానవుని ఔన్నత్యానికి నిదర్శనం.

పరమాత్మ స్వరూపం "అక్షయ ఆనందం" అను అనుభవం పొందడమే ఆత్మ సాక్షాత్కారానుభూతికి నిదర్శనం ఇది పరమసత్యము.

# 31. స్వప్నావస్థ వివరణః

యతి:- కార్యము యొక్క నాశము బాధయనియు, లయమనియు రెండు విధములు. అందు అధిష్ఠానము యొక్క యదార్థజ్ఞానముచే కలిగెడి కార్య కారణముల నాశము బాధయనబడును. రజ్జురూపమగు నధిష్ఠానము యొక్క సాక్షాత్కార జ్ఞానము చేత సర్పరూపమగు కార్యమునకు తనయుపాదాన కారణమగు అజ్ఞానముతో గూడా కలిగెడి నాశము బాధయనబడును. తన యుపాదాన కారణమునందు కార్యము యొక్క తిరోభావము (సర్పభ్రాంతి) లయమనబడును.

స్వప్న పదార్థములకు జాగ్రతయొక్క సంస్కార రూపమగు వాసనలు,స్వప్నమునందు భోగముల నిచ్చెడి కర్మముల యొక్క వాసనలు, నిద్రాదోషము అను నిమిత్తములతో కూడిన యంతఃకరణము, ఉపాదాన కారణమగును. ఆ అంతఃకరణము ఆత్మయందు అధ్యస్థమై యున్నది.

జాగ్రదవస్థయందు అధిష్ఠానమైన బ్రహ్మసాక్షాత్కార జ్ఞానము కలిగి, ప్రారబ్ధ కర్మములనుభవింపబడి, పరిసమాప్తమైన పిదప అది నివృత్తి యగుచున్నది. ఆ అంతఃకరణము నివృత్తియైన పిదప ఆ అంతఃకరణ ధర్మము లేవియు ఆత్మయందు తెలియబడుటలేదు. కాని జాగ్రదవస్థయందు అధిష్ఠానమగు ఆత్మసాక్షాత్కార జ్ఞానము కలుగక, ప్రారబ్ధకర్మముల ఫలములు అనుభవింపబడక యుండిన అపుడా అంతఃకరణ నివృత్తి యగుటలేదు, కావున ఆ అంతఃకరణ ధర్మములు దాని సంబంధియైన ఆత్మయందు తోచుచున్నవి.

అంతఃకరణ రూపమగు నుపాధియొక్క నివృత్తి వలననే ఆత్మయందు అంతఃకరణ

ధర్మములయొక్క నివృత్తియగుచున్నది. స్వప్నమునందు జాగ్రతయొక్క సంస్కార రూపములగు వాసనలు, స్వప్నమునందు భోగముల నిచ్చెడి కర్మజన్యములగు వాసనలు, నిద్రాదోషము అను యీ మూడు నిమిత్తములతో కూడిన యంతఃకరణము స్వప్న భ్రమమునందుపాధియగుచున్నది . కావున స్వప్నావస్థయందు స్వప్న పదార్థములుగను, ఆ పదార్థముల నెఱింగెడి.చిదాత్మయే బ్రహ్మమనియు, స్వప్నపదార్థములతో గూడిన యంతఃకరణము స్వప్నమునుండి జాగ్రదవస్థకు వచ్చినప్పుడు నిద్రాదోషము నివృత్తి యగుటచే అంతఃకరణమున గల స్వప్నభోగముల నిచ్చెడి కర్మ వాసనలు ద్భూతములై (దృశ్యములై) ఉపాదాన కారణమగు నంతఃకరణమున నణగియున్నవి. కావున జాగ్రదవస్థయందు స్వప్న పదార్థముల యొక్క యనువృత్తి కలుగుట లేదు.

జాగ్రదవస్థయందు అంతఃకరణముండినప్పటికిని ఆ అంతఃకరణము స్వప్న భోగముల నిచ్చెడి కర్మవాసనల తోడను నిద్రాదోషముల తోడను కూడియుండలేదు. కావున స్వప్నావస్థ యందున్న యుపాధి ధర్మములు జాగ్రదవస్థయందు తోచుటలేదు. జాగ్రదవస్థయందు అంతఃకరణము తనయొక్క కర్తృత్వ భోక్తృత్వాది ధర్మములను తన సంబంధియగు ఆత్మయందు ఆరోపిచుచున్నది. అట్టి జాగ్రద్వాసనలతోను స్వప్నభోగముల నిచ్చెడి వాసనలతోను, నిద్రాదోషములతోను కూడిన అంతఃకరణము తన ధర్మములైన స్వప్న పదార్థములను వాని నెఱిగెడి ఇంద్రియ వృత్తులును తన సంబంధియైన ఆత్మయందు తెలియజేయుచున్నవి. కావున ఆ అంతఃకరణము ఉపాధి యనబడుచున్నది. ఈ విధముగ స్వప్న జ్ఞానము సోపాధికి భ్రమ యనబడును.

బ్రహ్మము ఉన్నది అనెడి బ్రహ్మము యొక్క సద్రూపము "సామాన్యాంశము " అనబడును. ఈ ఉన్నది అనెడి స్రదూపము జగద్భ్రాంతికి పూర్వమును భ్రాంతికామందును, భ్రాంతి నివృత్తియైన పిదపను కూడా ననువర్తించి యుండును. బ్రహ్మము యొక్క జ్ఞానానందాదులు "సత్యం, జ్ఞానం, ఆనందం, అనంతం"-"విశేషాంశము" అనబడును, "ఆనందము, అద్వితీయము" బ్రహ్మముయొక్క విశేషరూపము" మిగిలిన త్రిగుణాతీతుడు అస్పర్శము. సర్వజ్ఞుడు మొదలగునవి సామాన్యరూపము.

## మనస్సు లక్షణముః

శిష్యా, అబాహ్యము నందలి విషయము లెల్లను, ఈశ్వరునిచే సృష్టింపబడెను గాని మనస్సుచే కల్పింపబడెననుట యుక్తము కాదు. ఆ విషయముల స్వరూపము మాత్రము ఈశ్వరుని వలన సృష్టింపబడినను, సకలమైన వారిచే (భోగ్యత్వా కారము (వ్యక్తి)) అనుభవింపదగిన రూపము (జీవుడు) మనస్సు వల్లనే కల్పింపబడుచున్నది. కాని బాహ్యవిషయములను మనస్సు కల్పించుచున్నదనుట దోషము లేదు. సుమా! దీనినే మనోసృష్టి యందురు. (ఈ భోగ్యత్వాకార భేదములు) నిజరూపము ఈశ్వర సృష్టి (తాను). శ్రీ శంకరాచార్య వాక్యరీతిగా స్వప్నమునందు కర్తృ, కరణ, కర్మ క్రియలను, వాని ఫలములను మనస్సు ఎట్లు కల్పించుచున్నదో- అటుల జాగ్రదావస్థయందును, కర్తృ, కరణ,కర్మ క్రియలను, వాని ఫలములను మనస్సే కల్పించుచున్నది.

శిష్యా! వ్యవహార సౌకర్యమునకు గాను- అంతఃకరణ మొక్కటే అహంకారము- మనస్సు అని రెండు విధములుగా వేరువేరుగా విభజించి చెప్పతిని ,ఇదిగాక, శిష్యా, మనస్సు సకలమును కల్పించుటవలన, సకలమునకు "మనస్సే" కర్తగా నున్నది. అటుల మనస్సు సకలమును కల్పించుట వలననే అహంకారము కంటికి, అన్నిటికి కర్తగా నుండుచు, సకలమును అనుభవించుచున్నది. లేనియెడల, అహంకారమునకు కర్తృత్వ భోక్తృత్వాదులు కలుగజాలవు.

ఐతే, ఒక విత్తనము ఒక వృక్షమును కల్పించుటవలన, దానికి దానికి ఆ విత్తనము ఒక వృక్షమును కల్పించుటవలన, దానికి అవిత్తనము కర్తగానున్నను, ఆ విత్తనము ఒక జడపదార్థము అగుట వలన ఆ వృక్షమునందలి ఫలములను అనుభవింపజాలనట్లు; మనస్సు జడపదార్థముగాన దానివలన కల్పింపబడిన పదార్థములను అది అనుభవింపజాలదు.

ఒక విత్తనమును భూమియందు నాటిన మనుష్యుడు ఆ విత్తనమునకున్ను, దాని వలన కల్పింపబడిన వృక్షమునకున్ను, కర్తగా నుండచు అ వృక్షము నందలి ఫలములను అనుభవిచునట్లు, జ్ఞాన స్వరూపమై చేతనముగా దోచు అహంకారము. జడమగు మనస్సునకున్ను ఆ మనస్సు వలన కల్పింపబడిన పదార్థములకును కర్తగానుండుచు వాటినన్నిటిని అనుభవించుచున్నది. కాన, అట్లే, అహంకారమునకే ముఖ్య కర్తృత్వ, భోక్తృత్వమున్నది. మఱియు అంతఃకరణ మ్కొటియే జ్ఞానస్వరూపమైన అహంకారముగాను, జడమైన మనస్సుగాను, రెండు విధములగానున్నను ఆ రెండింటిలో అహంకారము జ్ఞాన స్వరూపమైనది గాన అదియే ముఖ్యమైన అంతఃకరణముగా నున్నది. మనస్సు జడమైనది గాన ముఖ్యమైన అంతఃకరణము కాజాలదు. కాబట్టి కర్తృత్వ భోక్తృత్వములు గలిగి, ముఖ్యాంతఃకరణముగా నుండు అంతఃకరణమే సర్వ సంసారమును నిర్వహించుచున్నది సుమా! శిష్యా! ఇట్లు అహంకార, మనస్సులుగా పరిణమించక పూర్వముండిన అంతఃకరణముయొక్క స్వరూపము దిగువ చెప్పబడుచున్నది.

## సూక్ష్మశరీర లక్షణముః-

శ్లో॥ మనోహంకృ - త్యుపాదానం- లింగమేకం-జడాత్మకమ్।
అవస్థాత్రయ- మన్వేతి- జాయతే- మ్రియతి- తథా॥.

తాత్పర్యముః- శిష్యా! మట్టియే- కుండలు, చట్లుగా నగుట వలన, ఆ కుండలు, చట్లకు- మట్టి ఉపాదాన కారణమగును.అటుల అంతఃకరణము ఒక్కటియే ఆ యహంకార, మనస్సులుగా నగుటవలన ఆ యహంకార మనస్సులకు, అంతఃకరణము ఉపాదాన కారణమనబడును. ఇట్లు ఉపాదాన కారణముగా నుండు అంతఃకరణము సూక్ష్మశరీరమని, లింగ శరీరమనియు చెప్పబడును. ఈ సూక్ష్మశరీమే జాగ్రత్స్వప్న సుషుప్తులనునది- అవస్థా త్రయములను పొందుచు కర్మానుసారముగా జనన మరణములను పొందుచున్నది.

లింగ్యతే- నేనేతి-లింగమ్- అనునట్లు యీ సూక్ష్మశరీరమే సర్వమును అనుభవించుచుండును. అహం బ్రహ్మాస్మి -అనెడి మహా వాక్యము ద్వారా బ్రహ్మాత్మైక్య లక్షణమును యెఱుంగుచున్నది. కాన, యిది లింగశరీర మనబడును.

శ్లో॥ పరప్రాణ - మనోబుద్ధి- దేహేంద్రియ- సమన్వితమ్।
అపంచీకృత - భూతోత్థం - సూక్ష్మాంగం- భోగసాధనమ్॥

అనునట్లు, శిష్యా! మనస్సున్ను; పంచప్రాణము లైదున్ను; కర్మేంద్రియ, జ్ఞానేంద్రియము లనెడి దశేంద్రియములున్ను - యీ పదునేడు తత్త్వములు ఒక్కటిగా జేరి సూక్ష్మశరీరమని సకలవేదాంత శాస్త్రములందు చెప్పబడుచున్నది. గాన, అంతఃకరణ మొక్కటియే సూక్ష్మశరీరమని యెట్లు చెప్పవచ్చును?.

(శృతి) అన్యత్ర - మనా- అభూతం- నాదర్శనం- అన్యత్ర- మనా- అభూతమే॥ - అనెడి శృతి వాక్యముగా అంతఃకరణ మొక్కటియే (జ్ఞానం శక్తి స్వరూపమై) అహంకారముగాను, జ్ఞానేంద్రియములు ఐదుగాను, మఱియు క్రియాశక్తి, స్వరూపమైన, మనస్సుగాను, కర్మేంద్రియములైదుగాను, పంచప్రాణములైదుగాను - ఇట్లు పదునేడు తత్త్వములుగా, సూక్ష్మశరీరముగా నగుట వలన పారమార్థిక మందు, అంతఃకరణమొక్కటియే సూక్ష్మశరీరము అనబడును. ఇట్టి అంతఃకరణము జడపదార్థముగా నున్నను, దీనియందలి

ప్రతిబింబమగు జీవుని యొక్క సంబంధము వలన జ్ఞానము కలదిగా నగును. సూక్ష్మ శరీరము తోడ కూడుకొని ప్రతిదినమున్ను అవస్థా త్రయమును (జాగ్రత్స్వప్న సుషుప్తి) పొందుచు కర్మవశమున జీవనమరణములను పొందుచున్నది.

శ్లో॥ శోకహర్ష - భయక్షోభ- లోభమోహ - స్పృహోదయః
అహంకారస్య - దృశ్యంతే-జనమృత్యుశ్చ-నాత్మనః
ఏవం-దుఃఖాస్వఖీభవత్- సంసారేస్మిన్- పుమాన్ముదా
ఘటేయంత్రవ- దుర్వగ్నో -జాయతే- మీయతేచ - సః॥

ఇత్యాది పురాణ వచన రీతిగా- దుఃఖము, సంతోషము, కోపము, క్రోధము, మోహము, ఇచ్ఛ, ద్వేషము మొదలగు గుణములున్ను, జనన మరణములున్ను సూక్ష్మశరీర స్వరూపముగా నుండునట్టి అంతఃకరణ మనబడెడి అహంకారమునకే గాని సాక్షి మాత్రముగా నుండు పరబ్రహ్మమగు ఆత్మకు యెంతమాత్రమును లేవు. అద్దమునందలి ప్రతిబింబమును వేఱుపరచుటకు సాధ్యము కానట్లు అహంకారమునందు ప్రతిబింబించిన జీవుని ఆ యంకారమునుండి వేఱుపరచుటకు సాధ్యము కానందున, అహంకారమే జీవుడనియు, దేవుడే అహంకారమనియు చెప్పబడును. కావున, యిట్టి అహంకార స్వరూపుడగు జీవుడు సకల సంసార దుఃఖములను అనుభవించుచు ఒక గడియారమునందలి ముల్లు యెట్లు పైకి క్రిందకి చుట్టి చుట్టి తిరుగుచుండునో, అటుల కర్మవశమున పలుమాఱు జనన మరణంబులంబొందచు, స్వర్గలోకమునకును, భూలోకమునకును తిరుగుచు. అల్లాడుచు దుఃఖించుచుండును. శిష్యా! ఇదివరకు సకల సంసారమును పొందనట్టి సూక్ష్మశరీర లక్షణమును దెల్పితిని. మాయా లక్షణము చెప్పెదను.

## మాయా లక్షణముః-

(శృతి) జీవేశాభాసేన- కరోతి-మాయాచ-అవిద్యాచ- స్వయమేన-భవత్ అనెడి శృతివాక్యము రీతిగా మాయాశక్తి ఒకటియే విక్షేపశక్తి యనియు, ఆవరణ శక్తి యనియు రెండువిధములుగా నాయెను. ఆ రెంటిలో విక్షేపశక్తి సూక్ష్మశరీరము మొదలుకొని బ్రహ్మాండము వఱకు గల జగత్తు సర్వమున్ను పుట్టించెను. ఇది జాగ్రదావస్థయందు ఆ ఆవరణశక్తితో గూడి అహంకారాది దేహ పర్యంతమైన శరీరత్రయమున్ను, సకల జగత్తున్ను, సుఖ దుఃఖములున్ను కలిగించుచున్నవి. మొదటగా ఆవరణశక్తియే పుట్టినది. అంధకారము యెదుట నుండు వస్తువులను కనబడకుండా, ఆయావరణశక్తి, కేవల అజ్ఞాన అంధకారమైనదిగాన నిద్రావస్థయందు అదిమాత్ర ముండుట వలన ఆత్మకు సుఖదుఃఖములున్ను, జగత్తున్ను తోచుట లేదు. అది విక్షేపశక్తి తోడ సంబంధము లేకున్న యెడల దానికి సకల సంసార దుఃఖములను కలిగించుటకు సామర్థ్యము లేదు. అందుచే ఆవరణశక్తి ఆత్మకు స్వస్వరూప జ్ఞానముతో పింపజేయక, దేహేంద్రియాదులే తానను భావమును గలుగజేసి, సంసారబద్ధులుగా జేయుచున్నది.

(శ్లో॥) అనయా- నిక్షప్యత -ఇరేణ-విక్షేపశక్తిః-గిరినదీ-సముద్రా-
న్యనేక- నామరూపకారేణ- పరిణమతే- నివర్తత- ఇతి- విక్షేపశక్తిః)

అనినట్లు ఆత్మను విశ్వతైజస ప్రాజ్ఞులనెడి త్రివిధ బేధములుగా జేయునది. లేక తనను తానే కొండలు, నదులు, చెట్లు, సముద్రములు, ఆకాశాది పంచభూతములు, పంచభూతమయ దేహము మొదలగు రూపములుగా జగత్తుగా తోచునది యేదియో అది విక్షేపశక్తి యనబడును.

(శ్లో॥ ఆవృణోతి- ఆత్మానాం-ఇతి-ఆవరణశక్తిః!)

అనునట్లు సూర్యుని మేఘములు కనబడజేయక క్రమ్ముకొని యుండనట్లు ఆత్మను

గాఢాంధకారముగా క్రమ్ముకొని స్వస్వరూప జ్ఞానము తోపింపక చేయునది యేదియో అదే ఆవరణశక్తి యనబడును. పరబ్రహ్మమునందు ఆరోపితములు (కల్పితములు)గా తోచిన రూప నామములే జగత్తనబడును. అటుల నానావిధ రూపనామములుగా తోచుటయే సృష్టి యనబడును. 1) నిజరూపముతో నుండు వస్తువు అధిష్ఠానము2) ఆ వస్తువు మఱియొక మిధ్యారూపముగా (త్రాడు -పాము) తోచుట్ట ఆరోపితమనబడును.

## 32. సుషుప్తికిని సమాధికిని గల విలక్షణత

ఒకేసారి ఆవిర్భుతమగు శుద్ధ చైతన్య బ్రహ్మముతో సమాధ్యవస్థ యందు మనస్సు ఏకాకారతను బొందుచున్నది. సుషుప్తిలో మనస్సు అవిద్యా విశిష్ట చైతన్యముతో లయభావమును పొందుచున్నది. ఈలాగున సమాధికిని, సుషుప్తికిని మహా విలక్షణత గలదు. అందరి కంటె గొప్ప గురువు నీ ఆత్మయే శాస్త్రమే గురువు. శాస్త్రము ద్వారా జ్ఞాన లాభమును పొంది, మానవుడు భవ బంధముల నుండి విముక్తుడగు చున్నాడు. గురువు నీ లోపలనే ఉన్నాడు, ఆత్మయే గురువులకు గురువు.

నీవు ప్రపంచమును చూడనే చూడకుము, సన్యాసివగుము. అన్నిటికంటె గొప్ప శాస్త్రము ప్రపంచము ఈ ప్రపంచమును చదువుకొని ప్రపంచమును గూర్చి నిరంతరము ఆలోచించుచుండినచో (ప్రతి సంఘటనను గాంచి) సాధారణముగ వారే గురువును ఆశ్రయింపవలసిన పనియుండదు.

ఆత్మయందన్నిటిని చూచుటకు జ్ఞానమందురు. ఆత్మను పరమాత్మయందు జూచుటకు విజ్ఞానమందురు. అజ్ఞాన నాశమొనరించి సర్వ వ్యాపకమైన, సర్వశక్తివంతము అయిన ఆత్మను ప్రకాశింపజేయుదానిని జ్ఞానమందురు. తనకంటె భిన్నమగు ఏ సాధనాపేక్ష లేక తన ప్రకాశము చేతనే సమస్త పదార్థములను ప్రకాశింపజేయుచుండు దానిని చిత్తు" అందురు.

తనను, తనకంటె భిన్నమైన సర్వ పదార్థములను తెలిసికొనునదే చైతన్యము,

## 33. ఉపనిషత్సారము:- ఉపనిషత్తులు:1108 ముఖ్యమైనవి :108

అహంకారమను వృక్షమునకు మూలాధారము పరమాత్మ బ్రహ్మ విద్యా సంపన్నులమను కీర్తి సమస్తలోకములందును వ్రాకవలయును. గొప్ప ద్రవ్యమగు బ్రహ్మ వర్చస్సు లభింపవలెను. మేధాశక్తియంతయు ఆత్మజ్ఞానముగా పరిణమింపవలెను. సంపదకు అనుగుణముగా దానము చేయవలయును.

యోగావతారుడగు లాహిరీ మహాశయులు భార్యతో అన్నమాటలు.:

"అంతా శూన్యం కనబడ్డంలేదూ! యీ లాంటి శూన్యం, నీకోసం ప్రాపంచిక సంపదనెలా కూర్చ (సంపాదించ) గలదు? దివ్య సంపత్తిని అన్వేషించు, పనికిమాలిన ముచ్చి బంగారాన్ని కాదు. లోపలినిధిని కూర్చుకొన్నాక, బయటి సంపత్తులు ఎప్పుడూ వస్తూ ఉండడం నీవే చూస్తావు".

మనస్సు అంతర్ముఖం చేయము. అన్ని అశాంతులు, తమకు తామే నశిస్తాయి అదియే పరమగమ్యం అనగా జన్మరాహిత్యం.

మనయందుండు అనత్య తాదాత్మ్యములను తొలగించుకొని మన నిజ స్వరూపమును స్థాపించుకొనజేయు ప్రయత్నమును "ఆత్మసాక్షాత్కారము" అందురు.

<u>మానవ జీవితమును సార్థకము జేసికొను సాధనమేది?</u>

మరణము, పరిమితులు, దుఃఖములు, నిరాశలు, జయము. అపజయము, బాధ,

వ్యసనము, ప్రేమ, ద్వేషములు,- అహంకార సంపద. వీని పరిత్యాగమే మానవ జీవిత పరమార్థము "సర్వతీర్థాభిగమనంబు, సర్వ వేదసమధిగమము, నొక్క సత్యంబుతో సరియు గావు, యెల్ల ధర్మముల కెల్ల, నిదియలెస్స యని రార్యులు బుధవరేణ్య"

బ్రహ్మ సత్యం, జగన్మిథ్య" అను భావన మనయందు దృఢీభూతము గానించినప్పుడు మాత్రమే మనము ఆత్మసాక్షాత్కారము'నకు దగ్గర కాగలుగుచు ఉన్నాము. ఆత్మ రూపమే అహంభావనా, తలపులూనూ; ఇకతలపులుంటేయేం, లేకపోతేయేం?

## కేవల అనుభవ శాలికే తత్త్వజ్ఞానము కలుగును

ఆత్మ సత్తు-చిత్తు-ఆనందము-అనందో బ్రహ్మ, కర్మ, మనో వృత్తి మాత్రమే, వృత్తి వదలి పోవచ్చు, కాని దాని కాధారమైన సత్యము నిలిచే (ఉంటుంది). మనోవృత్తికి నేను అధారం. దానిలోనే వృత్తులన్నీ ఉబికిక్రుంగి పోతై. దీనిని ఒక విధముగా సూక్ష్మయోచన అనవచ్చును. ద్రష్టవు నీవు- ద్రృష్టగానే ఉండు. చూడడానికి వేరే యేముంది? నిద్రలోని స్థితి యిట్టిది ఈ రీతిగా ఆత్మ సాక్షాత్కార ఫలము అనాత్మ నిరసనమే.

శ్రీరమణ గీతః: ద్వైతభావము దుఃఖావహంబు, దీని
సౌమ్యశిఖీ గాల్చితే నీకు సౌఖ్యమబ్బు
కణగి యతియైన,గృహియైన, కామియైన,
శాంతుడైనను, నీబుద్ధి జరగవలయు

## 34. శ్రీరంగావధానులవారి ఆత్మ బోధ, కుమ్మరిపురుగుసామెతః-

వేదాంతులు మేమేమిజేసినను మాకంటదని చెప్పుదురు. అదిసరిగాదు. ఎట్లన? వృత్తి రహితమగు పనిలేనివారలై యుండవలెనుగాని, పనికలవారలైయున్నంత వరకు విషయముండును. విషయమున్నంతవరకు మాయయుండును. తన్నుతాను మరచినది "ఎఱుక'' తన్నుతానెఱిగినది ఖండవరపూర్ణత. తన్నుతానెఱిగి, మరచినది, యఖండపరిపూర్ణము.

ఎఱుకయన్నది. "మనస్సే'' అన్న "మనస్సే'' నిర్విషయస్థితి (విషయులేమి స్థితి) మనస్సునకెప్పుడు కలుగునో అప్పుడు అప్పుడు తన్నుదాను తెలుసుకొనే పనిగలదిగా నుండును. వ్యవహారము, మాయమనస్సు అనిచెప్పబడును. ప్రాపంచిక భాష పారమార్థమున, మాయయే మనస్సు మనస్సే "మాయ" యనబడును. తన్నుదామఱచియున్నప్పుడు ఎఱుక "తన్నుతాతెలుసుకొన్నతోడనే, నది ఖండపరిపూర్ణమగును.

ఎఱుక యందును ఖండపరిపూర్ణమందును, సుఖదుఃఖముల గలవుకాని యఖండపరిపూర్ణమునందు మాత్రమే, సమదృష్టి, సంతుష్టి, సంతోషము గలవు అనగా సుఖదుఃఖాదులు లేనివేయనబడును. మరియునచ్చోట అనుభవమేలేదుగాన "భాష" యేలేదు.

శ్రీ రమణగీతః- లోనరుగుబుద్ధి వెలుపలరానగుచో మరల
బుధవరా, యాభ్యాసమ్మొనాబడు
జ్యోతినెన్నడు గానని, యనుభవము
నంద్రు జ్ఞానమ్మనుచున్
సకలాజ్ఞాన నివృత్తి యెప్రజ్ఞానము.
జ్ఞాన విజ్ఞానము సంయమమెపరిపూర్ణజ్ఞానము
సంయమము=కలయిక.

# 35. ప్రత్యగాత్మ, స్వర్గము, గురువు, సంసారము, యోగము, అహం ల యొక్క వివరణ

జాగ్రత్స్వప్న సుషుప్తులు క్రమముగా వచ్చుచు పోవుచుండగా వానిని కనుగొనెడి చైతన్యమే ప్రత్యగాత్మ యనబడును.
స్వప్నము అననేమి? నాడులయందు జాగ్రద్వాసనలచే, అంతఃకరణమున దోచెడి అంతర ప్రపంచము స్వప్నము అనబడును.

స్వర్గము అనగానేమి? ముక్తి యందు జీవాత్మ నిర్మలుడగుటం బట్టి పూర్వజ్ఞాని యగును బ్రతికి యున్నప్పటి స్థితిని ఎఱిగినవాడు. అతనికి సమస్త సన్నిహిత పదార్థముల జ్ఞానము యదార్థముగ గలుగును (దృశ్యమగును) ఈ సుఖవిశేషమే "స్వర్గము"

గురువు అనగా ఎట్టివాడు? అజ్ఞానమును బోగొట్టి జ్ఞానోపదేశము చేయువాడని అర్థము.

సంసారము అననేమి? ఇది, నాకు కావలయును, అను సంకల్పమేదికలదో అదియే సంసారము.

యోగమననేమి? సంకల్ప రాహిత్యమే యోగము. జీవులకు ముఖ్యముగా మానవులకు దేహము మీద ఏల ప్రీతి కలుగుచున్నది? ఈ శరీరము,రక్తము, చీము, దుర్గంధాది దోషయుక్తమై యున్నను కామము, కర్మము అవిద్యా - ఈ మూటి యొక్క ప్రభావముచే జీవులకది అమృత సమానముగ, ప్రియాతి ప్రియముగ ప్రతీతము అగుచున్నది ఇట్టి ప్రారబ్ధ సంబంధ ఫలమునకు కర్మమనియు, అనురాగమునకు కామమనియు, అభ్యాసమునకు (భ్రాంతికి ) అవిద్య యనియు నామాంతరములుగనున్నవి. మోక్షప్రాప్తికి ఆత్మజ్ఞానమే ముఖ్యసాధనము ఏల? ఏ అధికారి పురుషులు అద్వితీయ బ్రహ్మమును, తన ఆత్మ రూపముగ నెఱుంగుదురో ఆ యధికారి పురుషులు బ్రహ్మరూపులే యగుదురు.
మిధ్యాజగత్తునకు ఆధారమేది? అజ్ఞానమే,
వాసనలు అనగానేమి? విషయరాసులే వాసనలు, వానివలన లాభ నష్టములు ఏవి? ఎట్టి లాభములు లేకపోగా, ప్రాపంచిక వ్యాపారము అభివృద్ధి జెంది, జనన మరణ రూప గొలుసును చేపట్టి కర్మ ఫలానంతరము భూమి మీద పుట్టుచు, గిట్టుచు మనశ్శాంతి లేక, నానా వ్యధలపాలు కావలసివచ్చును.

"అహం అనగానేమి? ప్రత్యగాత్మ యందు కల్పితుడైన చిదాభాసుని (జీవుని) పేరు అహం (నేను) అని చెప్పుదురు. ఈ ఒక్కదాని చేతనే మోక్షప్రాప్తి కలుగును? పూర్తిగసున్న తత్వజ్ఞానము ఒక్కదానిచేతనే మోక్షప్రాప్తి సంభవించును.బ్రహ్మము ఎట్టిది? స్వసత్తా స్ఫూర్తులచేత, జడములగు మనోవాక్కులను ప్రకాశింపజేయునది, స్వతస్సిద్ధమైనది, సర్వ కల్పనారహితమగు జ్ఞాన స్వరూపము, ఉపమాన రహితము, ఆనంద ఘనరూపము. నామ రూపోపాధులను ఉపేక్షింపగా సర్వమును సచ్చిదానంద పరబ్రహ్మమె.

స్వానుభవమునగాని తత్త్వము (బ్రహ్మము) బోధపడదు. మోక్షము అనగానేమి? అవిద్యాహృదయ గ్రంధికల్పితమల మాంసాది పూర్ణమగునీ శరీరమునందు, అభిమానత్యాగముచే, కేవలచిద్రూపమున నుండుటయే మోక్షము'

# 36. అధిష్ఠాన చైతన్య వివరణః-

రజ్జువునందు సర్పభ్రాంతి కలుగునప్పుడు మదాంధకారమున, అంతఃకరణ వృత్తి, నేత్రమున బయలు వెడలి, రజ్జువును పొందినప్పటికిని, మదాంధకార ప్రతిబంధము వలన రజ్జువు యొక్క సారూప్యాంశముగ పరిణమించు చున్నది. కాని విశేషాంశాకారముగ

పరిణమించుటలేధు. అందువలన రజ్జువుయొక్క సామాన్యాంశావరణము మాత్రము భంగమగుచున్నది. కాని విశేషాంశాకారముగ పరణమించుట లేదు. కావున నాసమయమున వృత్త్యవహితమగు (తెలియబడు)సాక్షి చైతన్యముతో రజ్జువుయొక్క సామాన్యాంశోపహితమగు(తెలియబడు) చైతన్యమునకు ఏకత్త్వము కలుగుచున్నది. కాని విశేషాంశోపహిత చైతన్యమునకు ఏకత్వము కలుగుటలేదు. అప్పుడా సామాన్యాంశోపహిత చైతన్యముతో నభిన్నమైన (ఏకమైన) సాక్షి చైతన్యము నాశ్రయించుచుండిన అవిద్యయందు జీవుల యొక్క పుర్వానుభవజ్ఞాన జన్య సంసారము వలనక్షోభగలిగి సంస్కారముల ననుసరించి రజ్జువునందొకనికి సర్పముగను మరొకనికి, దండము (కఱ్ఱ) గను, వేరొకనికి మాలగను మరొకనికి జలధార. ను తెలియబడుచున్నది. ఈ భ్రాంతులన్నిటికిని రజ్జువుగాని, రజ్జుసహిత చైతన్యముగాని ధిష్ఠానము కానేరదు. అవియే అదిష్ఠానములని చెప్పినచో నందరికిని ఒకే విధమగు భ్రాంతి కలుగవలయును. అట్లు కలుగుట లేదు. అందఱికి వేరువేరుగా సర్ప,దండ,మాలాదుల భ్రాంతుల కలగుచున్నవి. కావున నారజ్జువు యొక్క సామాన్యోపహితమగు చైతన్యముతో నభిన్నమై (ఏకమై) నపుడు, ఆ యభిన్నమగు సాక్షి చైతన్యము అధిష్ఠానమగునని చెప్పవలయును. ఆ యభిన్నమగు సాక్షి చైతన్యము సర్వభ్రాంతులకు వివర్తోపాదాన (వేరు రూప)కారణ మగును. ఆ యభిన్న (ఏక) మగు సాక్షి చైతన్యము నాశ్రయించియున్న యజ్ఞానము సర్వభ్రాంతులకు పరిణామోపాదాన కారణ మగును. ఆ యజ్ఞానమునందుగల జీవుల యొక్క పూర్వానుభవ జ్ఞాన జన్య సంసారములు నిమిత్త కారణములగుచున్నవి.

ఎట్టి నాశనము లేని కారణ రూపమునూ నేనే అయియున్నాను. అట్టి కారణ రూపుడనైన నన్ను పొందుట మోక్షము.

జీవేశ్వర సంబంధం విడవడి, త్రిత్రయ సంబంధములో మహా వాక్యార్థమును గ్రహించినచో ప్రత్యక్ (జీవ) బ్రహ్మైక రూపమగు అఖండార్ధ జ్ఞానము కలుగుచున్నది. అద్వితీయ ఏకైక అత్మ "అహంబ్రహ్మాస్మి" అను అనుభవము మాత్రమే యుండును. బ్రహ్మమును మనస్సుతో తలచునట్లు, మనస్సు కోరునట్లు, మనోవేగముతో అత్మ దర్శనము పొందవచ్చును. బ్రహ్మమును తెలియుటకుడు మఱియొక ఈశ్వరుడు అక్కరలేదు. ఈశ్వరుడే గీతరద్దు చేయడమైనది. స్వయముగా మానవరూపమున ఉన్నాడు యిది సత్యము.

## 37. వేదాంత శాస్త్ర శ్రవణము చేయుట కర్తలుః-

వేదాంత శాస్త్ర శ్రవణము, బ్రహ్మ జ్ఞాన రూప ఫలమునకు సాక్షాత్సాధనమగు ఫలమునకు సాక్షాత్సాధన రూపముగ, శృతమగు పదార్థము "అంగి" అనబడును. ఇదియే ప్రధానము (విధి) శ్రోతయొక్క స్వరూపమును బోధించెడి పదములుగల వాక్యము వలన అపరోక్ష జ్ఞానము కలుగుచున్నది.

వేదాంత శాస్త్ర శ్రవణము చేయుటకు, మలవిక్షేపములు లేనివాడును, సాధన చుతుష్టయ సంపన్నుడును, సర్వకర్మ సన్యాసియయున, జిజ్ఞాసువే యధికారి. జనక ప్రవాహణాదులునాంతర వివిదిషా సన్యాసమునుగాని పొందిన, శుక వామదేవాదుల వలెనాంతర బాహ్య వివిదిషా సన్యాసమునుగాని ఉత్తమ జిజ్ఞాసువులకే వేదాంత శాస్త్రములను శ్రవణము చేయుట కధికారము కలదు. సన్యాసి మనోమయ ద్వైతము నవశ్యము విడువ వలయును. గురు. వేదాంత, శాస్త్ర శ్రవణాదులు శాస్త్రీయ, మనోమయ ద్వైతము, దృఢముగా కలుగు పర్యంతము దీనిని విడువరాదు. ఈ గురు. శాస్త్ర విచారాదులు గూడా మిథ్యలైనప్పటికిని, మిథ్యా సంసార బంధమును నివృత్తి చేయును.

ఎటువంటి దైవమునకు అటువంటి పూజయే అనునట్లు, మిధ్యాబంధ నివృత్తికి మిధ్యాసాధనలే కావలయును. కావున సద్గురుని వలన వేదాంత శాస్త్రములు శ్రవణము చేయు వలయునని శృతి విధించుచున్నది. (విధి). ఇదియే ప్రధానము.

## 38. దృగ్దృశ్య వివేశము (గ్రంధము) -శ్రీవిద్యారణ్యస్వామి

అంతఃకరణమే బుద్ధి యనబడు చున్నది దీని చేత స్వరూపము యిట్టిదని తెలియబడునుగాననే బుద్ధి యనబడుచున్నది మిగుల స్వచ్ఛమైన అట్టి బుద్ధియే (చిచ్ఛాయ) (చిదాభాసుడు). అనగా ఆత్మయొక్క ప్రతిబింబము ఒక్కటి తోచెను, అ ప్రతిబింబమే జీవుడనబడెను. బుద్ధి జడ పదార్ధముగా నుండినను, దానియందు దోచినట్టి ప్రతిబింబమగు జీవుని నంబంధము వలన, అదియు జ్ఞానవంతమై, ప్రకాశించుచున్నది. ఉదా:- అయస్కాంతము, ఇనుము. అట్లు, కేవల దృక్కుగానుండు ఆత్మ సన్నిధియందుండుచు, బుద్ధి నానావిధ చేష్టలు చేయుచున్నది. ఆ బుద్ధియే రెండు రూపములుగా నున్నది, అహంకార రూపముగా కర్తగా నున్నది. సకల కార్యములను చేయుచున్నది. మనోరూపముననుండుచు కామక్రోధాది వృత్తులుగా పరిణమించుచున్నది. అహంకారము అన్ని కార్యములు చేయుటచే వృత్తి మత్తు. అనియు,మనోరూపముగా నున్న బుద్ధి కామక్రోధాది వికారములుగా పరిణమించుటచే అది "వృత్తి" యనయు చెప్పబడెను.

కామక్రోధాది పదమూడు (రాగద్వేష సంకల్పములు) న్ను అంతఃకరణచతుష్టయము నందెట్లు అంతర్భూతములుగా నున్నదో అట్లు బుద్ధి, చిత్తములు రెండును అహంకారము, మనస్సనియెడి యీ రెంటియందు అంతర్భూతములుగా నున్నవి, కాబట్టి బుద్ధియే అహంకార మనియు, మనస్సే చిత్తమనియు చెప్పబడుచున్నది.

ఆత్మ" ప్రతిబింబముగా జీవుడు, కర్తృత్యాహంకార రూపముగా నుండు బుద్ధి. యీ రెండున్ను ఒకటిగా సంబంధించి యున్నది. ఉదాహరణః అగ్నియందు ఎఱ్ఱగా కాగిన యినుపముద్ద, అగ్ని సంబంధము వలన అగ్ని స్వరూపమును పొందినట్లు జడపదార్ధమగు బుద్ధియు జ్ఞాన స్వరూపుడగు జీవునితో ఒకటిగా సంబంధించుటచే ఆ బుద్ధియే జ్ఞాన స్వరూపమైనదిగా తోచుచుండును. అగ్ని, ఇనుములను వేఱుచేయలేనట్లు, ఇది జీవుడు బుద్ధియని వేఱుపరచుటకుశక్యము కాదు. ఏకమే.

### బ్రహ్మ లక్షణము

శృతి ॥ "సత్యం -జ్ఞానం- అంనతమ్- ఆనందమ్।

"సర్వశరీరోపాదినుర్ముక్తం కటక మకుటా ద్యుపాధిరహిత- సువర్ణఘన -చిన్మాత్ర స్వభావ -.మాత్మచైతన్యం - బ్రహ్మ "అనెడి శృతి వాక్యము రీతిగా ఆ పరబ్రహ్మమగు దృక్కు ఏవిధమైన శరీరమును లేనిది". సచ్చిదానంద స్వరూపమైనది - అనగా సత్తు, చిత్తు, ఆనందములే స్వరూపమైనది బ్రహ్మలక్షణము. ఎట్లన సత్తనెడి వస్తువు సదానాశము లేక తనకు దాన స్వయం ప్రకాశమై తోచుచు ఉన్నదనియే చెప్పవలయును.

చిత్తు లక్షణము :- ఏవస్తువు నాశము లేనిదై సాధనాంతరము లేక తనకు తానే స్వయం ప్రకాశమై తోచుచు తనయందారోపింప బడినట్టి సకల పదార్ధములను తోపింపజేయుచున్నదో అదే చిత్తమనబడును, అయితే సదా నాశము లేక యుండునట్టి వస్తువగు చిత్తే తనకు దాను సదా స్వయం ప్రకాశముగా తోచుచుండుట వలన ఆసత్తే చిత్తనబడుచున్నది. అయితే జ్ఞాన శూన్యమైన వస్తువు తనకు తానే స్వయం ప్రకాశముగా తోచక నశించిపోవును. కాబట్టి కేవల జ్ఞాన మాత్ర స్వరూపముగా నుండు దృక్కే సదాకాలము నాశము లేకుండుట వలన సత్తనియు, తనకుదానే స్వయం ప్రకాశముగా తోచుటవలన

చిత్తనియు చెప్పబడుచున్నది.

ఆనంద లక్షణము:- ఈ ప్రపంచమునందలి పుష్పములు, చందనము, యౌవన వతులైన స్త్రీలు మొదలగువాని భోగమువలన గలిగిన సుఖము విషయానందమనబడును. ఈ విషయానందము మొదట సుఖముగా దోచినను కడకు అది దుఃఖమే అగుచున్నది. మఱియు యీ ప్రపంచమున్ను, ప్రపంచ సంబంధమైన పదార్థములున్ను దుఃఖమైనట్టివేగాని, యెన్నటికిని సుఖమైనవిగాజాలవు, మఱియు సుఖ దుఃఖములు రెండున్ను మనో వికారములుగా నున్నవి. శరీరము గల దానికే మనో వికారములగు సుఖదుఃఖములు గలవుగాని, శరీరము లేని నిరాకారవస్తువునకు అవిలేవు. అట్టి విషయ సంబంధములగు సుఖ దుఃఖములు లేని వస్తువే నిర్విషయ, నిరుపాధికమైన ఆనందము' అనబడును. అట్టి యేక రీతిగా వెలుగుచుండు వస్తువే, నిర్విషయ, నిరుపాధికమైన పరమ ఆనందమనబడును, అట్టి వస్తువు యేది యని విచారించగా కేవల జ్ఞానమాత్ర స్వరూపమైన (దృక్కు) యెట్టి విధమైన శరీరమున్ను లేక నిరాకారమై తనకు రెండవ పదార్థము సమమైనది లేక (సజాతీయ, విజాతీయ, స్వగతభేదము) సదా తనకుతానే పరిణామ వికారములులేక యేకరీతిగా వెలుగుచుండుట వలన అదృక్కే నిర్విషయ, నిరుపాధిక,పరమ ఆనంద స్వరూపమనబడుచున్నది. కాబట్టి దృక్కే సత్తనియే, చిత్తనియు, ఆనంద మనియు చెప్పబడుచున్నది.

## మాయా లక్షణము:

(శృతి॥ తస్మిన్ -మరు-శుక్తికా -స్థాణు-స్ఫటికాదౌ-జల-కాస్య పురుష - రేఖాదివ - ల్లోహిత -శుక్ల- కృష్ణ-గుణమయా- గుణసామ్యానిర్వాచ్యా- మూల ప్రకృతి -రాసీత్) అనెడి పైంగలోపనిషత్తు వాక్య రీతిగా ఎండమావులందు లేకనే ఉన్నట్లు దోచు జలము వలెను శక్తియందు లేకనే ఉన్నట్లు తోచు రజితము వలెను, స్థాణువునందు లేకనే ఉన్నట్లు దోచు పురుషుని వలెను, స్ఫటికమునందు లేకనే ఉన్నట్లు తోచు రేఖలవలెను, అఖండ పరిపూర్ణ సచ్చిదానందమై దృక్కుగానుండు పరబ్రహ్మమునందు లేకనే ఉన్నట్లు తోచునట్టి మిథ్యా భూతమగు శక్తియే "మాయ" యనబడుచున్నది. ఆమాయాశక్తి సత్త్వ, రజస్తమోగుణములు కలది. మాయ సగుణమైనది, అజ్ఞానమైనది, జడమైనది గనుక నిర్గుణమైన జ్ఞాన స్వరూపమైనట్టి బ్రహ్మమును ఎఱుగ జాలను బ్రహ్మము జ్ఞాన స్వరూపమైనదిగాన, తనకు అన్యము లేదనియు, తనయందు ఆరోపితంబగుచు జడ పదార్థమగు మాయతోచుచున్నదనియు, ఆ మాయకు ఉత్పత్తి నాశములుగలదనియు యెఱుగుచున్నది.

చలనము లేనట్టి సూది అయస్కాంత శిలను సమీపించి చలనము పొందినట్లున్ను, అగ్ని సంబంధములగు కట్టెలు అగ్నిరీతిగా దహించినట్లున్ను, జ్ఞాన స్వరూపమైనట్టి బ్రహ్మ సన్నిధానము వలన జ్ఞానము లేనట్టి జడపదార్థమగు మాయయు జ్ఞానవంతముగా తోచుచు బ్రహ్మమును అవరించుకొనుచు తనంతట తానే స్వేచ్ఛగా క్రీడార్థముగా సత్త్వ రజస్తమోగుణములు గలదియై ఆకాశాది పంచ భూతములుగాను, నానావిధ విచిత్రరూపములుగల జడపదార్థములైన దేహేంద్రియాది దృశ్యములుగాను ప్రపంచాకారముగను పరిణమించి తోచుచు మరల రూపనామములు లేక తనంతట తానే నశించిపోవును.ఇట్లు పలుమాఱు నామరూపములతో తోచుచు మఱల నామరూపములు లేక నశించుటవలన ఆమాయకు ఉత్పత్తి, నాశములు సహజముగా నున్నవి. అది బ్రహ్మమునందు అనాదిశక్తిగా దోచుట దానికి కారణరూపమనియు నానా విచిత్ర రూపనామములతో ప్రపంచరూపముగా దృశ్యముగా దోచుట దానికి కార్యరూపమనియు చెప్పబడును. రూపనామములుగా దోచు దృశ్యములన్నియు కడకు నామరూపములు లేక

బొత్తిగా నశించిపోవును. కావున అవి మాయయేగాని , నాశములేని సద్రూపమైన బ్రహ్మముగాజాలదు. కార్యకారణ రూపములుగలిగినమాయ మహాప్రళయకాలమందు తనంతట తానే నశించి పోగా అప్పుడు కేవల జ్ఞాన స్వరూపమైన బ్రహ్మము మాత్రము నశింపక, తాను నాశనము లేని వస్తువగుచును, తనయందు ఆరోపింతంబుగా దోచిన మాయ ఉత్పత్తి నాశములు గలదనుచును యెఱుగుచు స్వయం ప్రకాశమై వెలుగుచుండును. అట్టి మాయ అనాదిగా ఉన్నదిగాన తనకు తానే కలిగినదిగాని మఱియొక దాని వలన కల్పింపబడినది కాదు.

మఱియు అది బ్రహ్మము రీతిగా కాలత్రయమునందును నాశము లేకుండు వస్తువుగాదు. కావున అది సత్తు కాజాలదు. అయితే అసత్తని చెప్పుదమనిన (శశ విషాణములు) అనగా కుందేటి కొమ్ముల వలె తోచకపోవలయును. అటులగాక నానావిచిత్ర రూపములతో ప్రపంచాకారముగా తోచుచుండుట వల్లను, మఱియు ఒక్కొక్క మనుష్యునికిన్ని నేను అజ్ఞానిని అనుట అనుభవముగా నుండుట, వల్లను, ఆమాయను అసత్తనరాదు. అయితే అది సదసత్తని చెప్పుదమనిన ఒక్కవస్తువునందే ఒకటికొకటి విరుద్ధమైనట్టి లక్షణములు రెండు ఉండుటలేదు, గాన సదసత్తని చెప్పరాదు. మఱియు దృక్కగు బ్రహ్మము రీతిగా జ్ఞాన స్వరూపమైనదిగాక ప్రత్యక్షముగా అజ్ఞాన స్వరూపమై దృశ్యమైనదిగాన, (భిన్నమై) అనగా బ్రహ్మము కంటెను వేఱైనదనియే చెప్పవలయును, మాయఅనిర్వాచ్యము. అనగా నిట్టి దట్టిదని చెప్పుటకు అలవిగాని మిథ్యాస్వరూపమైన దనియే చెప్పవలయును. మిథ్యయనగా రజ్జుసర్పమువలె జ్ఞానముచే బాధింపబడునదనియు, స్వప్నములో రాజ్యమువలె చూచుచుండగానే నశించిపోవునదియు, ఎండమావుల వలె భ్రాంతి రూపమైనదియు, దగ్ధ వస్త్రమువలె సత్తా (ఉనికి ) లేనిదై తోచునదియు మిథ్యా స్వరూపమనబడును. 1)ఆ మాయయే పాంచభౌతిక ప్రపంచముగా పరిణమించి తోచుట వలన ప్రకృతియనియు.2) కార్య రూపముగా నుండు ప్రపంచమునకు కారణ రూపముగా నున్నందున ప్రధాన మనియు, 3) కాల త్రయమునందును లేనిదిగాన మాయయనియు, 4) ఇట్టి దట్టిదను చాయా లక్షణము నెఱుగుటకు సాధ్యము కానిదిగాన అవిద్య యనియు, 5) లయించి పోవునది గాన ప్రళయము, సుషుప్తియనియు, 6) మోహాంధకారమైనది లేక జడమైనదిగాన తమస్సనియు, 7) జ్ఞాన శూన్యమైనది గాన అజ్ఞాన మనియు, 8) దృశ్య పదార్థముగాన అనాత్మయనియు, 9) నశించిపోవునదిగాన , క్షరమనియు , 10)శరీర రూపముగా నుండుట వలన క్షేత్రమనియు 11) ఇట్టిదట్టిదని తెలియబడనిదిగాన అవ్యక్తమనియు చెప్పబడును

## ఆత్మానాత్మ వివేకము

దృశ్యములన్నియు జ్ఞానములేని జడపదార్థములు గాన అనాత్మ అనబడును. అనాత్మ అనగా రజ్జు సర్పము వలెను. ఎండమావుల వలెను మిథ్యాభూతమైనది. (వివేక చూడామణి గ్రంథము) శరీరము, ఇంద్రియములు, ప్రాణము మనస్సు, అహంకారము, శబ్ద స్పర్శరూపరసగంధములు అనెడి విషయంబులు, సుఖదుఃఖాదులు, ఆకాశాది పంచభూతములు, పంచభూత మయంబగు జగత్తు, అవ్యక్తము (మాయ) యివియన్నియు జడములయిన దృశ్య పదార్థములు గాన అనాత్మ యనబడును, ఇవి మాయాస్వరూపమైనవిగాన అసత్యమైనవి. నిర్జల భూమియందలి ఎండమావుల వలె మిథ్యాభూతమైనవి. అదృక్కే (పరబ్రహ్మమే) ఒక్కొక్క శరీరమందును బుద్ధి యనెడి గుహలోపల వ్యాపించి అహమహమని స్ఫురించుచుండుట వలన ఆ దృక్కే ఆత్మ యనబడుచున్నది.

ప్రపంచము సర్వత్ర వ్యాపించియుండు మహాకాశమే గృహము నందు వ్యాపించియుండుట వలన గృహాకాశమనియు , ఒక బిందెయందు వ్యాపించి యుండుట

వలన ఘటాకాశమనియు, మేఘమునందు వ్యాపించి యుండుట వలన మేఘాకాశమనియు, చెప్పబడుచున్నట్లు సర్వ పరిపూర్ణ పరబ్రహ్మమగు ఆత్మ ఒకటియే బ్రహ్మ విష్ణు మహేశ్వరులు అనియెడి త్రిమూర్తి స్వరూపమగు ఈశ్వరుని శరీరమందు వ్యాపించి యుండుట వలన పరమాత్మయనియు, దేవ మనుష్య, పశు, పక్షి క్రిమికీటకాది జీవ జంతువుల యొక్క ఒక్కొక్క శరీరమందును వ్యాపించి యుండుట వలన ప్రత్యగాత్మయనియు చెప్పబడుచున్నది. శరీరోపాధివల్లనే యిట్లు రెండుగా చెప్పబడుచున్నది గాని యదార్థముగా రెండు ఆత్మలు లేవు. ఏకాత్మయే ఉన్నది. అనగా సమస్త వస్తు రూపముల చేత అంతటను పరిపూర్ణముగా నిండి యుండునట్టి నాశములేని వస్తువని అర్థమగుచున్నది. దృక్కు (పరమాత్మ)గా నుండు ఆత్మ నిర్వికారమైనది. అనగా జనన మరణాది వికారములు లేనిది. శరీరము నశించినను ఆత్మ నశించునది కాదు. బ్రహ్మాది దేవతలవలె ఒకప్పుడు సృష్టి కాలమందు పుట్టి మఱియొకప్పుడు ప్రళయ కాలమందు నశిపదు; పరిణామము (మార్పు) లేక ఏకరూపముగా సదా ఉండునది. ఆత్మ ఒకరిని చంపదు. తానును ఒకరిచేత చంపబడరాదు. ఇట్టి ఆత్మను చంపదలచువారు మూఢులేకాని జ్ఞానులు కాజాలరు. ఆకాశము రీతిగా నిరికారముగా నుండు ఆత్మ ఒకరివలన చంపబడదు. ఎట్టి ఆయుధములచేత చంపబడదు. అగ్నిచే దహింపబడదు.. జలములో నానదు. గాలిచే చలింపబడదు. కేవల అచలరూపమైనది, నిత్యమైనది. కూటస్థుడగు యీ యాత్మయే అచలమనబడునుగాని, యీ ఆత్మకంటెను వేఱుగా అచలమనబడునది మఱియొకటి గలదనుట వేదమునందు చెప్పబడలేదు. కాన ఆత్మకంటెను వేఱుగా అచలమనునది. మఱియొకటున్నదనుట సరికాదు. దృగ్రూపముగానుండు ఆత్మ సాక్షిగానున్నది. అనగా బుద్ధి, యింద్రియాదులు నానా వికార కార్యములు చేయుచుండును. ఆత్మ ఆ యింద్రియములను, వాని వ్యాపారములను యెఱుగుచున్నది గాని అదియే కార్యమును చేయుట లేదు. అనుభవించుట లేదు - అని సాక్షి శబ్దమున కర్థము. ఆత్మ సచ్చిదానందలక్షణమైనది.

## 39. జడమదుదేహము-ఎట్లు జ్ఞానము గలదగుచున్నది?

అహంకారము, బుద్ధి సంబంధము వలన జడపదార్థమగు దేహమున్ను చైతన్యముగా (జ్ఞానము గలదిగా) నగు చున్నది. ఉదాహరణ: ఒక పాతనిండుగా పాలుపోసి, ఒక శ్రేష్ఠమైన రత్నమును పరీక్షించుటకు , ఆ పాత్రలో నొక రత్నమునుంచిన, ఆ పాలంతయు ఎఱ్ఱగా తోచినట్లే, జ్ఞాన స్వరూపమై దృక్కుగా నుండు ఆత్మ సన్నిధానమును ఆశ్రయించుకొనియుండు బుద్ధియు, దేహమునూ అత్మరీతిగా జ్ఞాన స్వరూపములై తోచుచున్నవి.

అహంకార ప్రతి బింబమే జీవుడు. పురుషుని నీడకు నిప్పుగాని, నీరుగాన మరియే వస్తువుగాని అంటించిన నవి పురుషునకంటవు. అట్లే అహంకార ప్రతిబింబమగు జీవుని యొక్క పుణ్యపాప సుఖదుఃఖములున్ను, జనన మరణ సంసారములున్ను, ఆత్మ స్వరూపుడనగు నన్ను బొందజాలవు. అహంకారము చేయబడు కర్తృత్వ, భోక్తృత్వాది వికారరూప కార్యములను, నేను జేయునట్లు, యీ అహంకారము,నన్ను భ్రమ (అభ్యాస) రూప భావనవలననే చేయునాకు , జీవ భావమున్ను జనన మరణ సంసారములును కలుగుచున్నవి. మేఘ, ఆకాశములకు సంబంధము లేనట్లు అహంకార సంబంధ కర్తృత్వ, జోక్తృత్వాది వికారములుకేవల సాక్షి మాత్రుడుగానుండు నాకు అంటవు.

ఇట్లు అహంకారమునకు గల వికారములు, నేననెడి భ్రమయు, ఆత్మ స్వరూపుడగు నేను" బ్రహ్మము, బ్రహ్మమే నేను" అనియిట్లు ఐక్యజ్ఞానము కలిగిన తోడనే నశించును. ఇట్లు సత్యముక్త, పరబ్రహ్మమగుచున్నాడుగాన భ్రాంతి జన్య తాదాత్మ్యము అనాదిగానున్నను, పై భ్రాంతులకు నివృత్తి గలుగుచున్నది. అగ్నియందలి ఇనుమునకు గల గుండ్రము,

నిడువుయిత్యాది వికారములు అగ్నికి కలిగినట్లు (తోచునట్లున్ను, కమ్మరివాడు ఇనుపముక్కను కొట్టుదెబ్బలు అగ్నికి కొంచెమైనను తగులుట్లున్ను అహంకారమునకే చంచలత్వ, కర్తృత్వ, భోక్తృత్వాది వికారములు కలవనియు, ఆకలియదప్పులు ప్రాణవాయు ధర్మములనియు, చూచుట, వినుట, యిత్యాది వికారములు, మాట్లాడుట, యిచ్చుట భూజించుట. మలమూత్ర విసర్జన దశేంద్రియ కార్యములనియు, ఆత్మస్వరూపుడగు తాను ఏ వికారములు, కార్యములు చేయక ,, దేనితోడన సంబంధించక కేవల సాక్షి మాత్రుడుగానున్నాడు అనియు తెలిసి, తనలో తాను, నిత్యా...ము పొందు జ్ఞాని ఏకార్యము తాను చేయనివానివలె తోచుచున్నను, సదా తాను ఏ వికారములు లేక , ఏకార్యము చేయక, దేనిని అనుభవించక, అక...గా, అభోక్తగా, ...క్షిమాత్రుడై బ్రహ్మ రూపుడుగానే ఉండును. పై కార్యములు యిట్లు యెల్లవేళల భావించేది.

ఒక్కడే చైతన్యము సర్వ ప్రపంచమునకును, మా...కును, అధిష్ఠాన మగుట వలన దానిని బ్రహ్మము అందురు. అదే చైతన్యము. జీవునకును, ఈశ్వరునకును ఉపాధి భేదమే గాని స్వరూపము నందు యెట్టి భేదము లేదు. ఇది సత్యము.

# 40. శ్రీ బ్రహ్మానంద దర్శనము

అవిద్యా కామ కర్మాది వాసనాంతః కరణ విశిష్ట చైతన్యము జీవుడు. మాయ తత్కార్య సంబంధ ప్రపంచ విశిష్ట చైతన్యము "ఈశ్వరుడు"-వీరిద్దరు "త్వం" "పద" "తత్ ' పద వాచ్యులు అసి పదముచే వాచ్యార్థులగు జీవేశ్వరుల ఏకత్వము పొసగుటలేదు. జీవునకు విశేషణమైన వాసనాంతఃకరణమును, ఈశ్వరునకు విశేషణమైన "మయ" తత్కార్యమగు ప్రపంచమును వి...నచో విశేష్యములైన శుద్ధ చైతన్యములు లక్ష్యార్థములు. అసిపదము...చే యీ లక్షార్థము... ఏకత్వము ప్రతి...దింపబడుచున్నవి.

...సనలతో గూడిన అంతఃకరణములే వా...ి బ్రహ్మమునుండి వేరు చేయుచున్నవి. సర్వ జీ... ...రారబ్ధ... తీరినప్పుడు "ప్రళయము" క...గుచున్నది. ఈ మరణ ప్రళయముల యందు అవిద్యా కామ కర్మాది వాసనాంతఃకరణ యుక్తులైన జీవులు సద్రూపమును పొందుచున్నారు, కాని నశించుట లేదు.

ఆ అవిద్యా కామకర్మాది వాసనలు గ... అంతఃకరణమును విడిచినచో జీవులు బ్రహ్మరూపులే యగుదురు. సు...ప్తి, మరణ ప్ర...యములందు అసద్రూప బ్రహ్మ...ను పొంది యున్న జీవులు పుణ్య పాప, కర్మ సంస్కారములు, మఱల జాగ్రజ్జన్మములకు తీసికొనివచ్చి, నానావిధ దుఃఖములను కలిగించుచున్నవి. ఆదుఃఖములను పోగొట్టుకొనుటకు శాశ్వతమైన సుఖమనుభవించుట కొఱకు అజ్ఞానులైన జీవులు కర్మోపాసనాది నానా మార్గములననుసరించుచున్నారు. ఆ మార్గములు - విధి, నిషేధ,కర్తృత్వ, భోక్తృత్వాది కంటకములతో కూడియున్నది. కావున ఆ మార్గమున పయనించు జీవులు జనన మరణాది సంసారారణ్యమునబడి క్రుగ్గుచున్నారు.

జ్ఞానికాని, అజ్ఞానికాని మరణ కాలమున అతని వాగాదింద్రి...ములు మనస్సునందు చేరుచున్నవి. మనస్సు ప్రాణమునందు చేరుచున్నది. ప్రాణము తేజస్సునందు చేరుచున్నది. తేజస్సు సద్రూప బ్రహ్మమునందు జేరుచున్నది.

పునరావృత్తి కారణ...గు సంసార వాసనలు లేని బ్రహ్మవేత్త తిరిగి పుట్టుట లేదు. అజ్ఞాని వాసనా వశమున యీ...రమున...ు మరల మరల పుట్టుచు గిట్టుచున్నాడు

సాభాసాంతః కరణమునకు అధిష్ఠానమగు చైతన్యమునకు "కూటస్థుడు". అని పేరు.

ఆత్మ జ్ఞానమును పొందినట్టి శ్రీమంతులే నిత్యానందము...ను అనుభవించువారు

.తదితరు... ... ఆత్మ రూపమే సమస్త వస్తు ప్రకాశమునకు కారణ...ు.

అవిద్యా కామకర్మాది వాసనలు గల అంతఃకరణము, ఆ అంతఃకరణమునందుగల కూటస్థ చైతన్య (చిదాభాసుడు) ప్రతిబింబము అధిష్ఠానమగు కూటస్థ చైతన్యము కూడి (వ్యష్టి) జీవుడనబడును. మాయ, మాయయందలి చిదాభాసుడు, మాయాధిష్ఠానము కూడి (సమిష్టి) ఈ శ్వరుడు అనబడును.

జీవేశ్వర సంబంధ (విడి విడి, త్రితయ సంబంధ) ముతో, మహావాక్య అర్థమును గ్రహించినచో ప్రత్యక్ (జీవ) బ్రహ్మైక్య రూపమగు అఖండార్థ జ్ఞానము కలుగుచున్నది. (అంతర్యామి సర్వజ్ఞుడు). ఈశ్వరునకు విశేషణమగు మాయ శుద్ధ సత్త్వ ప్రధానమగుటచే అది తనయందున్న చిదాభాసునకు ఆవరణము కలిగించుట లేదు. కావున ఈశ్వరుడు ముక్తుడు. ఇందుమాయా స్వరూపుడగు చిదాభాసుడే సృష్టి, స్థితిలయ కార్యమును జేయుచున్నాడు. కాని మాయాధిష్ఠానమగు శుద్ధ చైతన్యము ఏకార్యమును చేయుట లేదు.

అధిష్ఠానమగు విశేష్య శుద్ధ చైతన్యము జీవునియందును,ఈశ్వరుని యందును ఒక్కటియే యగును.

ఈశ్వరునియందు ఆవరణము లేదు. కావున ఈశ్వరుని సంబంధియైన చిదాభాసుడు నిత్యముక్తుడు. జీవునియందు ఆవరణము ఉండుటచే, జీవ సంబంధియైన చిదాభాసుడు బద్ధుడు.

జీవుని విశేష్య భాగమైన కూటస్థుడును, ఈశ్వరుని విశేష్య భాగమైన బ్రహ్మమును ఎప్పుడును అభేద్యమే. కావున వీరి ఏకత్వము ముఖ్య సామానాధి కరణ్య మనబడును.

ఆత్మ, మానవులు, పశు, పక్ష్యాది జీవరాసులన్నింటి యందును ఏకముగనుండినను, బింబము కలుగ, అంతఃకరణ దోషము వలన భేదములు ఏర్పడుచున్నవి. సాధకుడు తనకు గల బంధనములు, పరిచ్ఛిన్నముల నెల్ల తొలగించి, తన సన్నిహిత అనుభవముగ బాహ్యమున కనబడు శాశ్వత సచ్చిదానందమే తన నిజ స్వరూపమని అనుభవించవలెను.

పూర్వవాసనా ఫలితముగ మనస్సు బాహ్య ప్రపంచమును చూచుచున్నది.

ఆత్మ సాక్షాత్కారమునకు బ్రహ్మ విద్యయే, ఏల ముఖ్యమగు సాధనము ఎట్లు అగుచున్నది?

బ్రహ్మ విద్యయందు కర్మ అనగా పూజ, ప్రార్థన, జపము, సత్సంగము, ధ్యానము, ఆలోచనలు లేకపోవుటచే "మనస్సులేదు". మనస్సు లేకపోయినచో యోగికి బ్రహ్మానుభవము కలుగుచున్నదని శృతి తీర్మానము.

అంతర్ముఖుండవుకా సర్వముతనంత తానే సంభవించును. అంతర్ముఖ నిశ్శబ్దము అనంత పూర్ణానందము మనయందలి అంతర్మాతయే సర్వవ్యాపక పరమాత్మయని తెలిసికొనినచో, మనభ్రమలు, సర్వదుఃఖములు తొలగుచున్నవి. కర్మ సూత్ర ప్రకారం మానవుడి ప్రతికోరిక చివరికి తీరి తీరవలసిందే. కోరిక యీ విధంగా మానవుని పునర్జన్మ చక్రానికి కట్టేసే గొలుసన్నమాట.

జ్ఞానదేవ్,

## 41. బ్రహ్మానంద దర్శనము (పరమార్థ సారము)

మోక్షార్థియైన మానవునకు పట్టుదల, విశ్వాసము,ధైర్యము ముఖ్యావసరములు ఇందుకు గల మార్గములు రెండు గలవు. 1. ప్రవృత్తి. 2. నివృత్తి. ప్రవృత్తి మార్గములో బహుభేదములు గలవు. ప్రవృత్తి మార్గము ద్వైతము. ఈ మార్గమున జీవేశ్వర భేదముండుటచే జీవుడు బహువిధ కర్మల నాచరించి ఫలానుభవ అనంతరము మరల భూమిపై జన్మించవలసి వచ్చుచున్నాడు అందుచే యీ మార్గమున జీవుడు జనన మరణ ప్రవాహములో బహుకాలము

యాదులాడనలసి వచ్చును. రెండవది యగు "(నిర్గుణ) నివృత్తి," మార్గమును "అద్వైత మార్గము" అందురు. ఇందు జీవేశ్వర భేదము లేక, భగవంతుడొక్కడే యనియు ,ఆ ఒక్క భగవంతుడు తానేననియు "అహం బ్రహ్మాస్మి" నేతి, నేతి (బ్రహ్మలక్షణముల) నెఱింగి, ఆ లక్షణములు, తాను స్వయముగా (మానసేంద్రియముల ద్వారా) అనుభవించుటయే స్వస్వరూపాను సంధానమనియు, బ్రహ్మాభ్యాసమనియు, నివృత్తి మార్గమనియు పెక్కు భంగుల నుడువుదురు. ఎట్లు నుడివినను, ఎట్లు అభ్యసించినను, ప్రతి జీవియుతు దిజన్మద్వారా మాత్రమే బ్రహ్మరూపముగా మిగలవలసినదే. ఎప్పటికి నన్ను యిట్లు చేయవలసివచ్చుట చేతను, సర్వ సామర్థ్యములు కలిగియుండుట చేతను, నిత్యానందరూపమగుట చేతను, భవిష్యజ్జన్మ తెలియని హేతువు చేతను మఱియు సర్వ మానవులు, జాగ్రత్, స్వప్న, సుషుప్తి, తురీయ, తురీయాతీత అవస్థలు నిత్యము ననుభవించుచుండుట చేతను అయినను వానిని తెలిసికొనలేని స్థితిలో నుండుట చేతను, భవిష్యజ్జన్మ కేవలము పురాకృత కర్మఫలము మీదనేగాక. ఆ జన్మలో ఆర్జించిన ఆత్మజ్ఞానమ్మము మీదనుకూడ ఆధార పడి యుండుట చేతను, ప్రతి మానవ రూప జీవియు పై విషయములు శృతి వాక్యములని తెలిసి, పాటించి, అనగా నెల్లప్పుడు బ్రహ్మకార వృత్తి నవలంబిచుట ద్వారా, త్వరలో తరించెదరుగాక!

అస్తి, భాతి, ప్రియం, రూపం, నామం, చేత్యం శపంచకం
ఆద్యం త్రయం బ్రహ్మరూపం, జగద్రూపం, తతోద్వయం

ఎవడు ఆత్మయందే ప్రీతిగలవాడును, ఆత్మచేతనే, తృప్తిని పొందుచున్నవాడును, ఆత్మయందే సంతోషము నొందువాడును అయియుండునో, అతడు అన్నింటికి లోపలనుండినవాడై చూచుచున్నాడు. అతడే యాత్మ యగును.

"నిత్యము బ్రహ్మ స్వరూపము నేనే అనెడి అనుభవముగల నాకు క్రొత్తగా సంపాదింపగలదగిన అనుభవమేమున్నది.? నేనుకృతకృత్యుడును, ప్రాప్త ప్రాప్తవ్యుడను. అనియే నా నిశ్చయము" (మననము చేసేది)

అవిద్యా కామ కర్మాది వాసనాంతఃకరణ విశిష్టచైతన్యము జీవుడు. మాయతత్కార్య సంబంధప్రపంచ విశిష్ట చైతన్యము "ఈశ్వరుడు," వీరిద్దరు "త్వం" పద "తత్" పద వాచ్యులు "అసి" పదముచే వాచ్యార్థులగు జీవేశ్వరుల ఏకత్వము పొసగుట లేదు.

జీవునకు విశేషణమైన వాసనాంతఃకరణమును, ఈశ్వరునకు విశేషణమైన మాయ' తత్కార్యమగు ప్రపంచమును విడిచినచో విశేష్యములైన శుద్ధ చైతన్యములు లక్ష్యార్థములు "అసి" పదముచే యీ లక్ష్యార్థములకు ఏకత్వము ప్రతిపాదింపబడుచున్నది.

వాసనలతో గూడిన అంతఃకరణములే వారిని బ్రహ్మమునుండి వేరు చేయుచున్నవి సర్వ జీవుల ప్రారబ్ధములు తీరినప్పుడు ప్రళయముకలుగుచున్నది. ఈ మరణ ప్రళయముల యందు అవిద్యా, కామ, కర్మాది వాసనాంతఃకరణ యుక్తులైన జీవులు సద్రూపమును బొందుచున్నారు. కాని నశించుట లేదు.

ఆ అవిద్యా,కామ కర్మాది వాసనలు గల అంతఃకరణమును విడిచినచో జీవులు బ్రహ్మరూపులే యగుదురు. సుషుప్తి, మరణ, ప్రళయములయందు ఆ సద్రూపమును బొందియున్న జీవులు పుణ్య.పాప కర్మ సంస్కారములు మఱల జాగ్రజ్జన్మములకు తీసికొని వచ్చి నానావిధ దుఃఖములను కలిగించుచున్నవి ఆ దుఃఖములను పోగొట్టు కొనుటకు శాశ్వతమైన సుఖము ననుభవించుట కొఱకు, అజ్ఞానులైన జీవులు, కర్మోపాసనాది నానామార్గములననుభవించు చున్నారు. ఆ మార్గములు విధి, నిషేధ, కర్తృత్వ, భోక్తృత్వ అది కంటకములతో గూడి యున్నతి కావున ఆ మార్గములో పయనించిన జీవులు జనన మరణాది సంసారారణ్యమున పడి మ్రగ్గుచున్నారు.

జ్ఞానికాని, అజ్ఞానికాని మరణకాలమున అతని వాగాది యింద్రియములు మనస్సునందు చేరుచున్నవి. మనస్సు ప్రాణము నందు చేరుచున్నది. ప్రాణము తేజస్సునందు చేరుచున్నది, తేజస్సు సద్రూపబ్రహ్మము నందు చేరుచున్నది.

పునరావృత్తి కారణములగు సంసార వాసనలు లేని బ్రహ్మవేత్త తిరిగి పుట్టుట లేదు. అజ్ఞాన వాసనా వశమున యీ సంసారమునందు మఱల పుట్టుచు గిట్టుచునున్నారు.

సాభాసాంతఃకరణమునకు అధిష్ఠానమగు (విశేషాంశ జ్ఞానమగు) చైతన్యమునకు కూటస్థుడు అనిపేరు.

ఆత్మ జ్ఞానమును పొందినట్టి శ్రీమంతులే నిత్యానందమును అనుభవించువారు , తదితరులుకారు. ఆత్మరూపమే సమస్త వస్తు ప్రకాశమునకు కారణము.

జ్ఞానామృతము :- ఆత్మ సాక్షాత్కారము కాకున్నను, బ్రహ్మాభ్యాసములేకున్నను యిట్లు భావించుటయే జీవ బ్రహ్మైక్యా భ్యాసమని,శృతి తీర్మానము.

అవివేకికి శాస్త్రము భారము. అంసతుష్టుడగు వానికి మనస్సు భారము, అశాంతుడగు మనుజునకు, శరీరమేభారము. జ్ఞానము రెండు పదములు. జ్ఞ+న. "జ్ఞ" అనగా తెలియుటన అనగా లేదు. ఇట్లు జగత్తు, ఎఱుక లేకుండుట జ్ఞానమనబడుచున్నది.

## 42. బ్రహ్మాత్మా ఐక్యబోధ

తత్త్వమసి, అహం బ్రహ్మాస్మి, అయమాత్మా బ్రహ్మ ప్రజ్ఞానంబ్రహ్మ, అనెడి ఉపనిషత్తు మహావాక్యములున్ను, అవిద్యా హంకారములచే అవిచ్ఛిన్నుడైనట్టి (పారమార్థిక జీవునకు) అనగా ఆత్మకు , అవిద్యాశ్రయ భూతమై దేశకాల వస్తువుల చేత పరిచ్ఛేదింపబడినట్టి బ్రహ్మము తోడ సమరసైక్యమును (సమరసైక్యమును) అనగా ఆ పరబ్రహ్మమే ఈ సాక్షి స్వరూపమగు ఆత్మయే ఆ బ్రహ్మమని, అభేద భావమును బోధించుచున్నది. ఉపనిషత్తు మహావాక్యములు, చిదాభాసుడు స్వప్న కలితుడు, అనెడి తక్కిన రెండు జీవులకున్ను బ్రహ్మముతోడ ఐక్యము బోధించలేదు. ఎందువలననగా చిదాభాస, స్వప్న కలితులనెడి జీవులు మాయాకల్పితులగుట వలన,మిధ్యా స్వరూపులు గాన, వారికి బ్రహ్మముతోడ ఐక్యము కలుగజాలదు. అయితే ప్రమాణమును ధ్యానించువాడే ప్రమాత (జీవుడు) యనబడును. కాబట్టి అహం బ్రహ్మాస్మి, అనెడి ప్రమాణ వాక్యమును చిదాభాసుడే ధ్యానించుచున్నాడు గాన, ఆ చిదాభాసుడే ప్రమాత యనబడును, ప్రమాణము యొక్క ఫలమును ప్రమాతయే పొందవలయును గాన, అహంబ్రహ్మాస్మి అనెడి ప్రమాణ వాక్యము యొక్క ఫలమును అనగా బ్రహ్మముతోడ ఐక్యమును ప్రమాతగా నుండు చిదాభాసుడే పొందవలయును. సాక్షి స్వరూపుడగు ఆత్మ (ప్రమాణ, ప్రమేయ,ప్రమాతలు) అనెడి త్రిపుటిని మీఱినది గాన, అట్టి ఆత్మ ఏప్రమాణమున్ను ధ్యానించుట లేదు గాన, అది ప్రమాత గాజాలదు. కాబట్టి అట్టి ఆత్మ అహంబ్రహ్మాస్మి అనెడి ప్రమాణ వాక్య ఫలమును, అనగా బ్రహ్మైక్యమును పొందజాలదు. చిదాభాసుడు సాక్షి స్వరూపమగు ఆత్మయొక్క ప్రతిబింబమగుటవల్లను, మఱియు చిదాభాసుడు మాయాకల్పితుడగుట వల్లను (అవస్తువు) అనగా అసత్య స్వరూపుడగుచు మిధ్యా స్వరూపుడగుచున్నాడు. కాబట్టి అట్టి చిదాభాసునికి అహంబ్రహ్మాస్మి' అనెడి ప్రమాణ వాక్య ఫలమగు బ్రహ్మైక్యమును చెప్పగూడదు. అయితే ఆత్మ, చిదాభాసునకు అధిష్ఠానమగుచు పారమార్థక జీవుడగుట వలన అట్టి యాత్మకే బ్రహ్మము తోడ ఐక్యము చెల్లును. కాబట్టి అహం బ్రహ్మాస్మి అనెడి ప్రమాణ ఫలమును చిదాభాసుడు చెందక, పారమార్థిక జీవుడగు ఆత్మయే చెందుచున్నదనుట దోషము లేదు. ఇందుకు పైంగలోపనిషత్తు ప్రమాణము, మఱియు అంతఃకరణము, వానియందు ప్రతిబింబించిన చిదాభాసుడు - యీ రెండును (ప్రత్యయ, అప్రత్యయములు) అనబడును, ఈ రెంటికిని ఆత్మయే స్వరూపముగా నున్నది.

ఇవి రెండును జ్ఞానము లేని జడపదార్థములు గాన వీటియొక్క ఫలములను జ్ఞాన స్వరూపమగు ఆత్మయే పొందుచున్నది.

సేనల యొక్క జయాధిక్యమును రాజు ఎట్లు పొందుచున్నాడో అట్లు అంతఃకరణమును, అంతఃకరణ ప్రతిబింబమగు చిదాభాసుడును సత్తామాత్రమగు ఆత్మను సంబంధించి యుండుట వల్లను, మఱియు ఆత్మయే చిదాభాసుడుగా భావించుట వల్లను చిదాభాసుడు అహంబ్రహ్మాస్మి అనుప్రమాణ వాక్యఫలమగు బ్రహ్మైక్యము ఆత్మయే పొందుచున్నాడు. అని యిట్లు శంకరాచార్యులు చెప్పియున్నారు. మఱియు జ్ఞానాజ్ఞానములు అనగా ఎఱుక, మఱపులు రెండున్ను కల్పిత స్వరూపుడగు చిదాభాసునకే కలవు కాని, సాక్షియగు ఆత్మకు లేవు. అయితే అట్టి మిథ్యా స్వరూపుడగు చిదాభాసుడు నేను కూటస్థ బ్రహ్మమని ఎట్లు ఎఱుగగలదనిన, కూటస్థుడగు ఆత్మయే అవిద్యా భ్రాంతివలన, తానే చిదాభాసుడుగా తోచుచున్నాడు గాన, సద్గురు ముఖంబుగా తత్త్వవిచారము చేసిన యెడల, తనకు యీ జీవత్వము మిథ్యయనియు, ఆత్మ స్వరూపమే నిజ స్వరూపమనియు తెలిసి ముక్తుడగుచున్నాడు గాన, చిదాభాసుడగు నేను కూటస్థ బ్రహ్మమే అని యెఱుగుట వలన దోషము లేదని శ్రీ శంకరాచార్యులవారు తృప్తి దీపాఖ్యమనెడి గ్రంథములో చెప్పియున్నారు.

శుద్ధ నిర్గుణ పరబ్రహ్మ మందు దోచినట్టి మాయా శక్తియే విక్షేప శక్తిగాను, ఆవరణ శక్తిగాను - రెండు రూపములుగా అగుచు, అఖండముగా నుండు పరబ్రహ్మమును ఆవరించుకొని, ఆ బ్రహ్మమునందు నానావిధ రూప నామములు గల జగత్తునన్ను, జీవులనున్ను కల్పించెను. మఱియు ఆ బ్రహ్మమును, యీ జీవ, జగత్తులకు రెంటికిన్ని సాక్షి రూపునిగా చేసెను.

జీవునంతః కరణ సాధనచే స్వప్నమునుగాంచుచు సాక్షియై యున్నాడు. అంతఃకరణము తత్తత్సంసార జాలములచే స్వప్నములను కల్పించుచుండగా జీవు డు సాక్షియై చూచుచున్నాడు. ఇదియే బ్రాహ్మణము యొక్క యదార్థ తాత్పర్యము.

ఈ స్వస్వరూప జ్ఞానముచే పరబ్రహ్మ ప్రాప్తి రూప నిరవధిక ఆనంద కైవల్యము ప్రాప్తించుచున్నది.

ఆత్మస్థితిని పూర్ణానందముగా తెలియజేయడమే ఆత్మామృద్దీపము. మమత విడనాడుటయే చిత్తశుద్ధి. అహంకార రాహిత్యమే జ్ఞానము అదే పూర్ణానందము.
మనోహరమగు రూపమును జూచినను, మనోహరముగాని వస్తువును జూచినను, మనస్సునందు రాగద్వేష సంకల్పములను యించుకయైనను కలుగనీయక, రాతివలె నిశ్చలుడవై యుండుటయే యిక్కడ చేయవలసినపని, ఇంత మాత్రము పురుష ప్రయత్నము చేతనే మోక్షరూప సామ్రాజ్యము లభించును.

## 43.శ్రవణ, మనన నిధి ధ్యాస నిరూపణము

### (శ్రీరమణ గీత: గ్రంథము -కర్త శ్రీరమణమహర్షి)

మ. వినగానే గురువర్యు నొద్ద నరసిన్ వేదాంత వాక్యాలొయా
తని వాక్యములో. పూర్వజన్మ సుకృతత్వ ప్రాప్తిమౌ తెల్వి
వల్లనగానీ, "యహ" మన్న ప్రత్యయపు మూలంబీవు దేహాదిగా
వను నంత శ్రవణంబె యెందు శ్రవణం బౌజుమ్ము నిక్కమ్ముగాన్

క॥ విదితాత్ముడైన యాచా
ర్యదేవు వలనన్ స్వభాషయందలి నుడులా
త్మ దెలుపునట్టివి వినుటను జదురుగ మఱికొంద ఱండ్రు శ్రవణం బనుచున్.

కII అనెదరు కొందరు మననం
ఎన శాస్త్రార్థపు విచారమనుచును; నట్టి
నను వాస్తవమ్మరయగ మ
నినము స్వరూపపు విచారణమ్మే, తండ్రీ,
నిధిధ్యాసనము.

కII ఏసందేహమ్ము విప
ర్యాసమ్మును లేనియట్టి బ్రహ్మాత్మ జ్ఞా
నాసాధన మరయ నిధి
ధ్యాసన మని యండ్రు, మానవా, కొందఱిలన్

కII ఏసందేహమ్ము విప
ర్యాసమ్మును లేనిదయ్యు నిల కేవల శా
స్త్రాపాదితమైక్య జ్ఞత
వాసిగ సమకూడ దనుభవమ్మున కెందున్.

కII ఈ సందేహమ్మువిప
ర్యాసమ్ము భయమదంగు ననుభవముననే
వాసిష్ఠ, తొలగనయ్యవి.
శాసన మహిమాఢ్య శాస్త్రశతముల కేనిన్

కII ఎనయు, స్వరూపానుభవ
మ్మున వానిష్ఠ యలరెండు మాఱొక్కద
మ్మును, గావునన్ నిధిధ్యా
సనమనగా దగు స్వరూప సంస్థితియే ధరన్

కII కలుగక స్వరూప సంస్థితి
వెలుపల నెవ్వండు, తండ్రి, విహరించునో దా
నలవడ దపరోక్షంబగు తెలివి యతనికి శతశాస్త్ర తీవ్ర విమర్శన్.

కII కదురగ స్వరూప సంస్థితి
కొదువవడక సహజమగుచు, గుండినవర,య
ల్లదె 'ముక్తి', యదియే నిలుకడ
యదె సాక్షాత్కారమనుచు ననదగు నవనిన్.

## జ్ఞాన స్వరూప కథనము

కII కొందరు కైలాసంబని
కొందరు వైకుంఠమనియు, గోవిదులింకన్
గొందరు రవిమండలమని
యందురు ముక్తులు వసించు నాలోకమ్మున్.

కII ఈ యెల్ల ముక్త లోకము
లీయల మున్నగు జగమ్ములెట్టులో , విభుధేం
ద్రా, యట్లు, స్వరూపమునం
దే యద్భుత విభవశక్తియే కల్పించెన్.

కII తన యాత్మ బ్రహ్మము దెలిసి
కొన వృత్తి మెలంగునేని గొనకొని యావే
శను, స్వాత్మాకారగ కా

చును, నిలబడదాత్మకన్న నుంతయు మేలై.
ద్వి॥ అరయ బ్రహ్మవు నీవె, యాచక్రినీవె,
పరమేశ్వరుడనీవె, పరమాత్మనీవె.
ద్వి॥ తన మూలమును బుద్ధి తర్కించుటొకటి
తన బుద్ధినే, తాను దర్శించుటొకటి
ద్వి॥ కొడుకు నాకెవ్వడు? పడతి నాకెవతె?
కడుమాయ యిది. నన్ను గావుమోవిభుడ.
ద్వి॥ ఇతడు ని న్నహ' మర్థమెంచు నిత్యమును
గత శోకుడైవాడు గాంచు సత్యమును
ద్వి॥ ఏయాత్మ స్ఫురణమ్మె యెద బాము బాపు
ధ్యేయ, మ్మ నలదేవ, యీ నీదు రూపు,
క॥ లోనరుగు బుద్ధి వెలుపల
రానగుచో మరల, బుధవరా, యభ్యాస
మ్మెనాబడు; జ్యోతి నెన్నడు
గానని యనుభవము నంద్రు జ్ఞానమ్మనుచున్.

ఆనంద మాత్మ కభిన్నమని తెలిసినపుడు మనస్సు అంతర్ముఖమౌతుంది ఆత్మనందుకుంటె సర్వవాంఛలూ తీరినవే, అదే మోక్షము. అంతరన్వేషణ ఆపులేక చిరమభ్యసించిన పిదప బుద్ధి, తననుసైతం నడిపించే మరేదో ఉత్తమశక్తి కలదని కనుగొంటుంది. తానుగా ఆ శక్తిని అందుకోలేదు. అందుచేత ఒక దశలో బుద్ధి వ్యాపారమాగి పోతుంది. కాని సర్వశక్తి. ఒంటిగా మిగిలే ఉంటుంది. అదే ఆత్మ సిద్ధి, పరమము, గమ్యము.

బుద్ధి తానస్వతంత్రయని, ఊర్ధ్వతర శక్తిపై ఆధారపడి యున్నానని దానిని తానందుకోనేరనని తెలియడమే వివేక ప్రయోజనము. కాబట్టి గమ్య ప్రాప్తికి ముందు అది తనను నశింపజేసికోవలెను. నిష్కామ స్థితియే మోక్షము. పరమగమ్య ప్రాప్తికి వ్యక్తిత్వ నాశన మవసరం. వ్యక్తిత్వం. నష్టమైతే బుద్ధి నష్టమూతప్పదు.

ఆత్మ సిద్ధిలేని క్షణమెరుగుదువా? ఆత్మకు వేరుగా ఎపుడైనా ఉండగలవా? నీవెప్పుడూ ఆత్మయే!

సత్ (స్థితి) - అదే చిత్ (శుద్ధ చైతన్యము) చిత్ గూడా సత్తే . ఉన్నది ఒకటే. కాకపోతే తన ఉనికి, ప్రపంచపు ఉనికి తెలియ సాధ్యమే కావు. అది స్థితికి, జ్ఞానానికి కూడా వర్తిస్తుంది. ఇంతకూ ఆ రెండూ అభిన్నాలే ఒకటే. మాట వరసకు 'చిత్' కాని సత్ అనుకుందాం. అపుడా 'సత్' జడరూపమై కూర్చుంటుంది. దాన్ని తెలిసికొనడానికి వేరే చిత్ ఒకటి అవసరమౌతుంది. అది కూడా చిత్ సత్‌కు భిన్నం కాబట్టి ఉండనే లేదు. కాని చిత్ లేక యెట్లువేరే చిత్ ను సత్ అనుకుందాం? సత్ జడం కాబట్టి చిత్ కూడ జడం కావలె. అది అసంభవం. అపుడు దానిని తెలిసేందుకు మరో చిత్ అవసరం. అది అసంభవమే కాబట్టి సత్తు చిత్తులు రెండూ ఒకటే సదృశములే.

నీ వొకటి యెల్లప్పుడూ జ్ఞప్తియందుంచుకో ఈ జగత్తు మనోకల్పితమే. మనస్సు ఆత్మలోనిది. దేహమెందు. బోయినా, మనస్సు స్వాధీనమందుండవలె. కదిలేది దేహం, ఆత్మకాదు. ప్రపంచం ఆత్మలో ఉంది అంతే.

అందరూ భౌతికకాయం దొరగిన పిదప, యీ ఆతివాహిక శరీరాలనే ధరిస్తారు. అనుకూలమైన వేరే భౌతిక కాయంగైగొన్నదాకా, యీ ఆతివాహికం తోనే వారు యితరలోకాల్లో తిరుగాడుతారు. ఈ సూక్ష్మ శరీరముతోనే జ్ఞాని బ్రహ్మలోకంలో సంచరిస్తాడని చెబుతారు. పూర్ణ విమోచనమప్పుడు, ఆ సూక్ష్మ శరీరమూ రాలిపోతుంది. ఈ వివరణమంతా పైపైన పరికించే వారికే జ్ఞానికి ఏ సంశయాలూ కలుగవు. తనది ఎట్టి పరిధులూ లేని నిర్నిబంధన

స్థితియని జ్ఞాని స్వానుభవమే.
ప్ర॥ పూర్ణ విమోచన మన్నారే, అదేమి?
మ॥ ఆతివాహిక లేక సూక్ష్మశరీరమన్నది - నిద్ర మేల్కొన్న వెంటనే అహంకారం లేచే ముందు ఆ అంతరంలో అనుభూతిమయ్యే శుద్ధ తేజస్సుకుసమము. అది చైతన్యము. అదిగూడా హృదయం నుంచి ప్రతిఫలించే కాంతియే ఆ అభాసకాంతి నమసిపోయి, మూలతేజమే హృదయంలో మిగలడంతో విమోచన సంపూర్ణమౌతుంది.
ప్ర॥ బ్రహ్మము శుద్ధ మనస్సు కావడం,బ్రహ్మము సచ్చిదానంద మగుటతో సమన్వయిస్తుందా?
మ॥ శుద్ధ మనస్సు నంగీకరిస్తే, జ్ఞానియొక్క ఆనందానుభూతిని కూడా ఆభాస కాంతిగనే గణించవలె. ఈ ఆభాసం చివరకు మూలతేజంలో లీనం కావలె. అందుచేతనే, జీవన్ముక్తి స్థితిని నిర్మల దర్పణంలోని ప్రతి ఫలనముగా చెప్పబడింది. అట్టి ప్రతిఫలనంలో కనుపించేది శుద్ధాదకాశంగాక మరేమవుతుంది? అట్టి జ్ఞాని యొక్క ఆనందాభాసం సత్యానంద సంకాశమే. ఇంతకూ యివన్నీ మాటలే. అంతర్ముఖుడవైతే చాలు, అంతర్ముఖీ మనస్సునకు . శాస్త్రాలక్కరలేదు. అవి కావలసినది తదితరులకే.
మనస్సు నశిస్తేగాని ఆత్మ సిద్ధించదు. అహంకారం ఉంటేనే సిద్ధులు వ్యక్తమౌతాయి. అహమికకును అతీతమైనది ఆత్మ అహమిక నశించిన (నష్టమైన) తరువాతనే సిద్ధించేది. అహమును తొలగిస్తే ఎవనికీ ఒరులు తెలియరారు. ఆత్మజ్ఞానికి సిద్ధులతో పనియేమి? అందమంతా ఆత్మది. శిఖధ్వజుడు తనలో (భూతాలలో) చూచేది ఆత్మానుభవ సౌందర్యాన్నే అనినది చూడాల! తలపులే విక్షేపానికి మూలం. మనస్సే లేనినాడు సునిశ్చల పూర్ణశాంతి, నెగడుతుంది. మనస్సును సర్వనాశనం చేయనంతవరకు శాంతి, ఆనందాలు, అభించుట సాధ్యం కాదు. ఆనందం లేని, తానేనా, యితరుల కానంద మీయ గలిగేది? మనస్సు లేని పక్షంలో గుర్తించవలసిన అన్యులేలేరు. అందుచేత ఆత్మజ్ఞానమే యితరుల కానంద దాయకం కాగలదు.
మ॥ వాసనలు బంధ హేతువులని, భోగ హేతువులని రెండురకాలు అహమిక నధిగమించాడు, గనుక, జ్ఞానికి బంధం కలిగించేదేది ఉండదు. బంధ హేతువు సమసిపోయినందువల్ల, ప్రారబ్ధం భోగ వాసనగ మాత్రమే నిలుస్తుంది. అందుచేతనే సూక్ష్మశరీరము ఒక్కటే జ్ఞానాన్ని కూడా మిగులుతుందంటారు.
కైవల్యం, ప్రకారం, జ్ఞానం వెలసిన వెంటనే సంచితకర్మ నశిస్తుంది. బంధభావన, లేనందున, ఆగామి అట వర్తించదు. ప్రారబ్ధం భోగంతో ముగిసిపోతుంది. ఇట్లు, చిట్టచివరి ప్రారబ్ధం నశించి, క్రమంగా దానిలోనే స్థూలశరీరమూ నష్టమవుతుంది. శరీరత్రయమూ, కర్మత్రయము తార్కికులకు ఆహ్లాదకారులే కాని, జ్ఞానిని ఏవిధంగాను బాధించేవిగావు. సాధకుడు తానెవరో కనుగొనవలెనని బోధ; అలాచేస్తే, పై చెప్పిన వివాదాల్లో, వానికి మక్కువ ఉండదు. ఆత్మను దర్శించి శాంతి స్థిరుడవు కా!
మ॥ శ్రీభగవాన్ - ఆత్మలోకమే బ్రహ్మలోక మన్నారు. బ్రహ్మైవలోకః- బ్రహ్మలోకం: బ్రహ్మయే ఆత్మ బ్రహ్మలోకం ఆత్మయే, చూడబడునది, ఆలోకింపబడునది - లోకము.
మ॥ అనుగ్రహములలో కెల్ల మౌనానుగ్రహం ఉత్తమం. అదే అత్యుత్తమమైన ఉపదేశంకూడా. జీవుడు వేరుగనే ఉండి తీరవలె. కాకపోతే, ఏది. యోచించడానికైనా ఎట్లు పొసగుతుంది? నిద్ర మేల్కొనగానే కనబడే వెలుగు మహత్తత్త్వము గుండా వెళ్లుతున్న ఆత్మ ప్రకాశం - విశ్వ చైతన్య మనబడును. అది అరూపము. అతేడా అహంకృతి పై పడి ప్రతిఫలిస్తుంది. అపుడు దేహమూ,ప్రపంచమూ గోచరిస్తాయి. ఈ మనస్సు, స్వరూపము, యీ ఆభాస చైతన్య కాంతిలో విషయాలు అగుపిస్తాయి. ఈ కాంతిని

"జ్యోతి" అన్నారు. లోక వ్యవహారాల్లో ప్రకృతుడై యుండి కూడా నిష్కాముడై, సారభూతమైన తన సహజ స్వభావాన్ని ఏమరని వాడే నిక్కమైన పురుషుడు, తాను గృహస్తునని తలపోయని గృహస్థు సరియైన సన్యాసి.

ప॥ దుఃఖము నుండి యీ ప్రపంచం వెలువడు మార్గమే లేదా?

మ॥ఒకే ఒక విధముంది. ఎట్టి పరిస్థితులలోను తనను తాను ఏమరకఉండటం. ప్రపంచంలోని సర్వ జాడ్యాలకూ. ఆత్మ విచార మొక్కటే మందు. అది పూర్ణానందం కూడా, మన సహజ స్వభావం ఆనందం. మనస్సు తన మూలంలో సదా కలవడం ముఖ్యం. మనస్సే అన్నీని, మనోనేత్రాన్ని మూయగలిగితే, అంతా చక్కబడుతుంది. తనువు, మనములతో, తనను భగవదర్పణం చేసికొనిన వాడు .ప్రపంచంలోకెల్ల ప్రసిద్ధుడుకానే కాగలడు, కామవాంఛలు రాగానే, అవి వచ్చినది ఎవరికో పరికించు. అవి నిన్ను వీడి పారిపోతాయి. కష్టసుఖాలంటే నిస్పృహ గలవాడే నజంగా సుఖి.

ప॥ ముక్తి. లభించుటలో గురువనుగ్రహానికి గల ప్రాధాన్యమెట్టిది?

మ॥ముక్తి నీకు వేరుగా ఎక్కడా లేదు. అది నీలోనే ఉంది. ముక్తికి నిజంగానే ఆతురుడైన వాడిని - గురువులోనికి లాగుకుంటాడు. వెలిగురువు లోనికి త్రోస్తాడు. గురువనుగ్రహమిదే. అజ్ఞాని అనుభూతిని- వాసనలు కప్పి ఉంచుతాయి. జ్ఞాని విషయంలో అటులకాదు. అందువల్ల ఆత్మానుభవము. విశిష్టమూ శాశ్వతము, ఏ విషయమైనా తెలిసికొనడానికి ఇంద్రియాలు ఉపకారణాలు మాత్రమే. ద్రష్టవు - నీవు ద్రష్టగానే ఉండు చూడడానికి వేరే ఏముంది.? నిద్రలో నీయొక్క స్థితి యిట్టిది. ఈ రీతిగా ఆత్మసాక్షాత్కారము అనాత్మ నిరసనమే.

ప॥ ఆత్మ ఒక్కటేనా? పెక్కులున్నవా?

మహర్షి॥ ఇది కూడా అస్తవ్యస్తమే. నిద్రలో నీవేమైనా, నేనిక్కడ నిద్రస్తున్నాను నిద్ర పోకుండా మరెందరున్నారో? అంటావా? ఇదేకాదు, మరే ప్రశ్నైనా వస్తుందా. ఏలరాదు? నీ వొక్కడవే గనుక, మరెవ్వరూ లేరు గనుక. ఆత్మ యెప్పుడూ సత్-చిత్- ఆనందము. మొదటి రెండు మూడవ స్థితిలో కూడా ఉండగలవు. మూడవది - నిద్రావస్థతోనే అనుభూతమవుతుంది. జాగ్రత్ స్వప్నాలలో ఆత్మయొక్క స్వస్వభావం నష్టమెట్లయిందన్నది ప్రశ్న. నిజంగా అది నష్టం కాలేదు. సత్యానుభవం, జీవితంలో అయితేనే మరణవేళ అనుభవానికి వస్తుంది. నిద్రలో మనస్సులేదు. ఆత్మతానుగా ప్రకాశిస్తుంది. మిగిలిన రెంటిలో వెలిగేది ఆత్మయొక్క ఆభాసకాంతియే, నిద్రలో తలపులన్నీ అణగిన పిదపనే ఆనందానుభం. ఇతరదశల్లో అది ప్రియ, మోద, ప్రమోదాలుగ వ్యక్తమౌతుంది. కాని అవియెల్ల చిత్త వృత్తులే . పుట్టుక, చావు శరీరానికి మాత్రమే, దాని నాత్మ కారోపించి - పుట్టు చావు లాత్మకని భ్రమ పడతారు. మమతను విసర్జిస్తే చిత్త శుద్ధి "అహము"ను విడిస్తే జ్ఞానము.

ఇచ్ఛ గుణము బాగా పెరిగితే అది జ్ఞానానికి తెచ్చి చేరుస్తుంది.

కోరికే మానివేస్తే ఏదివడితే అదేవస్తుంది. మనస్సు నిశ్చల మయితే -ప్రపంచం కనుపించినా,, కనుపించకున్నా- అది సమాధి.

పరిసరములు, కాలము, విషయములు - అన్నినాలో ఉన్నవి. విషయాలను నామరూపాలను బట్టి వేరువేరుగా విభజింపవచ్చు. కాని, ప్రతి పేరూ ఒక్కగా నొక్కటే అదే 'నేను'. నేనన్న తలపు ఎందుండి కలుగుతుందో, అది హృదయం. కుటీచకుడుః సన్యాసం తీసికొని కుటీరంలో నివసించేవాడు, బహూదకుడుః సన్యాసియై యాత్రల కేగేవాడు,

హంస ః ఉపాసక సన్యాసి

పరమహంసః ఆత్మ జ్ఞుడైన సన్యాసి

శుద్ధ జ్ఞానం ఉపాధియైన మనస్సుతో కూడితేనే, అది ప్రపంచాన్ని ప్రతి ఫలిస్తుంది.

మనస్సు,చిత్ సంకల్పాలమిశ్రమం. చిదాకాశం శుద్ధజ్ఞానం, మాత్రమే. అది మనస్సుకు మూలము. అకాశపదము, జడమైన భూతాకాశాన్నిగాని, శుద్ధజ్ఞానాన్ని గూడా, తెలుపుతుంది. జ్ఞానం అంటే విషయజ్ఞానం మాత్రంకాదు. అది సాపేక్ష జ్ఞానము. కాని అచ్చజ్ఞానము, ఒంటిగా, ఏకమూ లక్షణమూ, తత్త్వప్రకాశమూ అయ్యుంటుంది.సత్ - చిత్‌లు కలిసి ప్రపంచం కానైనవి.

సాపేక్ష జ్ఞానానికి అధార జ్ఞానము, మానసాకాశమును లోగొన్న చిదాకాశము. ఏకమై సదా ఉజ్జ్వల జ్యోతిగా మిగులుతుంది.

తలపుల వదలి, లో హృదయంలోకి లీనమైన మనస్సు - అదే చిత్. మనస్సుగాని, వాక్కుగాని, ఆత్మలేక వర్ధిల్లవు. ఎఱుక సత్యము. ఆ యెఱుక ఉపాధి. గతమైనప్పుడు ఆత్మ చైతన్య (self Consciousness) మనియు, అ చేతన మనియు, ఊన (sub) చేతనమనియు, అధి చేతనయనియు, మానవ చైతన్య మనియు, వృక్ష చైతన్య మనియు, యిట్లు పలువిధములుగా వర్ణిస్తావు. వీని కన్నిటికీ మారని, సమాన ధర్మము "చైతన్యము". ఈ రీతిగా రాతివలె నిద్రలో నీవును జడమవే. కాని, ఎఱుక అసలే లేందటావా?

ప॥ భగవాన్- దైవమై సర్వం నడపుతాడన్నారు. అట్లైతె, దేనికిగాని, మనమెందుకు ప్రయత్నించవలె?

మ॥ నిన్ను ప్రయత్నించమన్న దెవరు ? సర్వం దైవమే నడపునన్న విశ్వాసముంటే, యిట్టి ప్రశ్నయే రాదు.

ప॥ దైవమే సర్వం నడపునన్నదే యదార్థం. అటువంటప్పుడు, ప్రజలకీ బోధలవల్ల ప్రయోజనమేమి?

మహర్షి॥ ఉపదేశ మర్థించే వారకీ బోధలు, దైవం సర్వం చక్కజూస్తాడన్న గట్టి నమ్మకముంటే - దాన్ని పట్టుకో, నీకు నలువైపులా ఎం జరిగినా పట్టించుకోవద్దు. అంతేకాదు అక్కడశోకం ఉండవచ్చు.మోదం ఉండవచ్చు . రెంటినీ లెక్కించక దైవంలో విశ్వాసముంచు మనలనందర్నీ దైపం పరికిస్తాడనే నమ్మకం దృఢమైతేనే అది సాధ్యం. ఈ తలపులెవరి కని సాధకుడు అడుగడుగునా తనను తాను ప్రశ్నించుకుంటాడు. ఏదో ఊర్జిత, అలౌకికశక్తియే తనను నడుపుతున్న నమ్మకం కుదిరినదాకా యీ ఆచరణ సాగిస్తూనే ఉంటాడు. దృఢనమ్మకం ఉంటే, అది అప్పటికతని సంశయాలన్నీ విడిపోవును. మరే బోధలూ వానికి అవసరం లేదు.

విశ్వాసం భక్తి, జ్ఞానం, యెగం, అన్నీ ఆత్మ విచారంలో కలిసే ఉన్నవి. అందరూ జ్ఞానంలో నిబద్ధులే. ముఖ్యమైనది ఆత్మాన్వేషణ, మిగిలినవి ఉపకరణ మాత్రములు.

మ॥ సమాధి అంటే ఏమి? అది వానినైజ ప్రకృతి. దానికి రాకపోకలులేవు. నీ సారస్వతాన్ని తెలిసికో, యోగి తన అకర్మవల్ల సర్వమూ సాధిస్తాడు. యోగి అకర్మ (నిశ్చలత) అతి వేగంగా తిరుగుతున్న బొంగరం లాంటిది. వేగం కంటికగపడనిది.

సహజ స్థితిలో సుస్థిరునికి కాలమన్న మాటేలేదు. కర్మాచరణం సిద్ధించేవాడు బోధకుడుకాడు. మారకుడు. అట్టివాడు గురురూపంలో బ్రహ్మామైనా కావలె. యముడైనా కావాలి. అతడు సాధకుణ్ణి ముక్తుడు చేయడు కదా- వాని బంధనాలను మరింతగా బిగిస్తాడు కూడా.

మ॥ నేనున్నా " ననేదే సహజం. ఉనికి యొక్కటే సహజం మేల్కొనినప్పుడు కూడా నిద్రావస్థ తెచ్చుకోవలె. అదే జాగ్రత్ సుషుప్తి. నిద్రించేది, కలగనేది, మెల్కొనేది ఒక్క వ్యక్తియే. అత్మ శుద్ధ చైతన్యము. దానికెవ్వరూ, ఎన్నడూ దూరముండలేరు. యతికీ బోధ సదా ఉంటుంది. కాబట్టి జ్ఞాని సుప్రతిష్ఠితుడై యున్న స్థితికి నిద్రకు పోలిక లేదు. ఊరకేయుండు, నేను దైవమని యెఱుగు. సాధకునికి ప్రావ్యము నిశ్చలత. ఒక్క

తలపునైనా లేక ఏక్షణకాలమైనా నిలువగలిగితివా. అటుపైన నిశ్చలత కభిముఖముగా ఎంతో ముందుకు సాగినట్లే, ప్రయత్నమనవసరము. అది జాగ్రదవస్థలోనే వీలవుతుంది. ఇచ్చట యత్నమూఉంది. ఎఱుకా ఉంది తలపు అరికట్టడమూ ఉంది . అవిధంగా నిద్రలోని శాంతి లబ్ధమవుతుంది జ్ఞాని స్థితియట్టిది.

తలపులే లేని ఎఱుక నీకుంటె నీవు పరమాత్మవే నీవు ఒకచోటనుండి మరియొక చోటికి పోవడం లేదు. నీవు చలంగానే ఉన్నావు దృశ్యాలు నిన్ను విడచి వెళ్లుతుంటవి. ఆత్మస్థితి శాశ్వత స్థితి. మార్పు లేనిది, ఆత్మ సిద్ధి తాత్కాలికము. అనుకొనుట తప్పు.

నీ నైజము తలపులు లేని కేవల స్థితి. బ్రహ్మజ్ఞాని తన జాగ్రత్త తాను చూచుకొంటాడు. నీ నైజం నీవెరిగితే బ్రహ్మజ్ఞాని స్థితిని తెలియగలుగుతావు. కేవల స్థితి శాశ్వతము, జగత్తు, శరీరాలు కావు. అవి నిత్య స్థిరాలైన సత్, చిత్‌లనే తెరపై క్షణంలో మాయమయ్యే ఛాయలు, సృష్టి సర్వమూ నీ తలపులే.

"నేను" అన్నదేది? అది శుద్ధ చిత్ (ఆత్మ)కు, జడ (దేహ) మునకు మధ్య యేదో అదే అహమిక. సాధకుడు గురువు నాత్మగా లక్షిస్తే, యితరత్రా గూడా అతనికి క్రూరభావనలుండవు. అతడు, సుఖీ. అతనికే సంశయాలుండవు. ఆత్మను లోనగదా వెదుక వలసినది. ఈ వెదకుట చాలా పట్టుదలగా సాగవలె. అది సాధ్యమైతే, శారీరకంగా, గురుని సాన్నిధ్యమక్కరలేదు.

"ఈశ్వరో గురురాత్మేతి" (ఆత్మయే ఈశ్వరుడు, గురువు) దేహానికి శుద్ధ చైతన్యానికీ నడుమ యిట్టిట్టనరానిది; ఆ అహమిక. అది నిజం కాదు. తెరచి చూడనంతవరకది తంటాలు పెడుతూనే ఉంటుంది. కాన దానికై వెదకితే, అది హుళక్కి. ఆత్మ సిద్ధి అంటె శరణాగతి. సుఖదుఃఖ భావనలకు తావీయరాదు. అవి మనోవృత్తులు. ఆత్మ హృదయం సూర్యసంకాశంగా స్వప్రకాశము. కాంతి మార్పులు గుర్తించవచ్చు. ఆత్మ నీ హృదయం లోనే ఉంది. అంటే వాసనలూ అతి సూక్ష్మరూపంలో ఉన్నవి. మనస్సుకు మేధ నిలయం, సంయమము= ఏకాగ్రత, సిద్ధులన్నిటికీ సంయమనమే మార్గము- హృదయాన్ని మించి జీవుడెక్కడికి పోడు. కట్టుకొయ్యకు గోవులాగా హృదయానికి ఆత్మ బద్ధమై యుంటుంది.

ది॥ 1. కొడుకు నాకెవ్వడు ? పడతి నాకెవతె?
కడుమాయ యిది? నన్ను గావుమో విభుడ,
2. అరయ బ్రహ్మవు నీవె, యా చక్రి నీవె,
పరమేశ్వరుడనీవె, పరమాత్మనివె,
3. తన మూలమును, బుద్ధి తర్కించుటొకటి
తన బుద్ధినే తాను తర్కించుటొకటి.

కః లోనరుగు బుద్ధి, వెలుపల
రానగుచో మరల, బుధవరా, యభ్యాసమ్మొ
నాబడు, జ్యోతి నెన్నడు గానని,
యనుభవము నంద్రు జ్ఞానమ్మనుచున్

44.మహాత్ముకుడు జిడ్డు కృష్ణమూర్తిగారి (అవగాహన గ్రంధము)2. తత్వదర్శనము

దేవునిలోని నమ్మకమే మతం ఏమత విశ్వాసమైనా మనుష్యుల్ని విభజిస్తుంది. విశ్వాసం కేవలం వ్యక్తిగతమైనది. జ్ఞానం అంటే ఏమిటి? జ్ఞానం అంటే జ్ఞాపకాల పుట్ట. విషయసేకరణ కంటె అవగాహన ముఖ్యం. గతమే జ్ఞానం సాంకేతిక జ్ఞానం (ప్రపంచజ్ఞానం) భౌతిక జీవనానికి ఆధారం మానసికంగా నిబద్ధిస్తుంది. స్వేచ్ఛనివ్వదు. అది కొనసాగేది కనుక దానికి పరిపూర్ణత లేదు. దీనిచే అహంకారము పెరుగుతుంది.

నిన్ను నీవు అవగాహన చేసికొనుట". అవగాహన, యిదియే పరిపూర్ణ జ్ఞానం. అనగా ఎవరి వత్తిడి లేనిది.

ధ్యానం. అంటే ఏమిటి? అన్ని ఆలోచనల నుండి శబ్దాలనుండి మనసుకు స్వేచ్ఛ నివ్వడమే ధ్యానం. ధ్యానంలో ఏకాగ్రత అనేది. స్వార్ధ పరంగా మొలకెత్తిన అంశం. ఇది కాకుండా , అన్ని శక్తులను శ్రద్ధగా సావధానంగా సమీకరించడమే ధ్యానం. దానివల్ల ప్రేమసుమం జనిస్తుంది. వికసిస్తుంది. అందుచే యిదియే చాలా అవసరమైనది.

దేశకాలాలు:-దేశమంటే భూమి కాదు. కాలమంటే గడియారపు కాలం కాదు. దేశమంటే ఖాళీ, ఆకాశం- స్పేస్ (Space) నిరామయంగా ఉండడం. కాలమంటే మానసికమైనది, కల్పన చేసికొనిన ఊహాత్మకమైనది. అంటే క్యాలెండరులో వలె మనస్సులో గూడా విభజన చేసికొనినది,అ: ం. ఖాళీగా ఉన్నచోట ఎద్దైనా ప్రవేశించడానికి అవకాశం ఉంటుంది. అందుకే దేశాన్ని అవకాశం అనికూడా అనవచ్చు. నిండియున్నచోట వేరైంది జొరబడలేదు. ఖాళీ :ఖాళీ ఉన్నచోటు వలెనే హృదయం కూడా అలా ఉండాలి. అప్పుడు అక్కడ దేశమున్నట్లు భావించవచ్చు. చైతన్యమే కాలం, దాన్ని రక్షించడానికి యత్నిస్తున్నాము.

స్వేచ్ఛ ఎలా ప్రాప్తించుతుంది? భయం లేనపుడు ఉండే సంబంధంలోనే స్వేచ్ఛ ఉంది. కనుక మానసికంగా ఆధారపడడమే భయాన్ని పోషిస్తుంది. ఈ ఆధార పడడం నుండి స్వేచ్ఛ పొందాలి.

"తెలివి " అంటే ఏమిటి? "లోదృష్టే" తెలివి. నీదికాదు. నాదీకాదు. అది ప్రపంచం మొత్తానిది దుఃఖంలోకి కూడాచూడు. ఆలోదృష్టినుండి కరుణ వస్తుంది. కరుణలోకి చూడు. దాన్ని ఏదీ అంటలేదు.

"స్వార్థం" నుండి;"నేను" నుండి విముక్తి పొందినపుడే తెలివి ఉంటుంది. నమ్మకం లేని మనసే సత్యం చూ... నిర్భయత ఎలా ఏర్పడుతుంది?గురువు కుటుంబం, సంఘం, సంబంధించిన అధికారం - వీటినుండి విముక్తి చెందితే నిర్భయం ఏర్పడుతుంది. ప్రేమ" అంటే ఏమిటి? ప్రేమంటే శ్రద్ధ, అదే కరుణ, ఆసక్తి, భయం లేనప్పుడే నిన్ను నీవు కనుగొనగలవు, ఉదయం, లేచినపుడో, ఒంటరిగా నడిచేటప్పుడో, హఠాత్తుగా వింతైనది సంభవిస్తుంది. అది ఆహ్వానిచనిది, ప్రాధేయపడనది, ఎదురు చూడనిది. దానిని ప్రేమనో, సత్యమనో, సుఖమనో పిలువవచ్చు. ప్రేమను సాధన చేసేవాడు ప్రేమించలేడు. ప్రేమజోలికి పోకుంటే అపుడు ప్రేమ పనిచేస్తుంది. ప్రతిఫలం కోరకుండా అసాధరణమైన అనురాగ భవన ఉండడమే ప్రేమించడం అంటారు. నీకు యీ స్పందన,సాధారణ ప్రేమ భావన లేకపోతే, నీ హృదయం శూన్యంగా ఉంటుంది. ఇక జీవితాంతం బాధతో ఉంటావు. ప్రేమ మనస్సుకు సంబంధించింది కాదు.

ప్రేమ ఎక్కడ ఉంటుంది? మనస్సుకు సంబంధించిన విషయాలు లేకుండా హృదయం ఖాళీగా ఉంటే, ఆలోచన లేకుండా మనస్సు ఖాళీగా ఉంటే, అపుడు ప్రేమ ఉంటుంది. ఖాళీగా ఉండేది. ఖర్చు కానిదే! తనను తాను తెలిసికొనుట వలన సావధానత వస్తుంది. అందులో అహం' ఉండదు.

## 44.విఖ్యాత తత్త్వవేత్త -జిడ్డు కృష్ణమూర్తి-గ్రంధము-తత్త్వదర్శనం

ఎవరు వేసిన విత్తనం తాలూకు ఫలితం వారు అనుభవించ వలసిందే. నిజాన్నుండి తప్పించుకోటానికి సంజాయిషీలు అనే మార్గాలు వెదుకుతుంటారు. కాని అవి సత్యానికి దగ్గఱకు రాలేవు. డబ్బు, వదలి, మోసం వంటి వాటిపట్ల అభిలాష" లేనిచోట్ల ప్రేమ ఉంటుంది. పరిశీలించండి. ఆలోచించండి. మీలో మీరు తర్కించుకోండి. అన్ని తెలివిడి అవుతాయి. ప్రవాహవేగంలో మునిగి పోయి ఉక్కిరి బిక్కిరి అవుతున్న మనిషి, ఎలాగయినా ఒడ్డుకు చేరాలని ప్రయత్నిస్తాడు అట్లే ఓపికతో, సత్యాన్వేషణకై, వానిని అందుకోటానికై అందరూ ప్రయత్నించండి.

వివేకం, వైరాగ్యం షట్సంపత్తి మోక్షం,సాధన చతుష్టయంలో మోక్షము అనకుండా "ప్రేమ" అని దిద్దారు. హింసాభిలాషను కనుక జయించగలిగి నట్లయితే సృష్టిరహస్యాన్ని చేదింపజేసే యీ సత్యాన్ని అవగాహన చేసికోవచ్చు.

చిత్తశుద్ధి కోసం మంత్రాలు, జపాలు, దేవుళ్లు, స్వాములు, - యీరకమైన ఆశ్రయింపుల వల్ల ఉపయోగం జరగదు. మనసు ద్వంద్వ ప్రవృత్తి (జీవేశ్వర భేదభావన) లేకుండా వర్తించాలి. అలవాట్లు అనే అల్లకొల్లాల్లో మనసు అతలాకుతలం అయిపోకుండా జాగ్రత పడాలి. ఇట్లు ఎవరికివారు జీవిత పరిశీలన ద్వారా స్వస్వరూప జ్ఞానాన్ని (సత్యానేషణ) కనుగోని ముందుకు పయనం సాగించలి. ఇది యదార్థం అని నమ్మవలసిన పనిలేదు. మీకు "సత్యం" అనిపిస్తేనే వీటిని గురించి ఆలోచించండి.

తత్త్వం అంటే" నిత్య జీవితంలో కార్యాచరణ పట్ల మక్కువ ఉండటం తప్ప మరేమీ కాదు. ఇదియే "తత్త్వం" యొక్క లక్ష్యార్థము, మనస్సు మనకు అనేక సమస్యలను సృష్టిస్తుంది. వాదనలు, అభిప్రాయాలు, నమ్మకాలు,విశ్వాసాలు - చేసినంతమాత్రాన సమస్యలను పరిష్కరించుకోగల సామర్థ్యం ఉన్నదని భ్రమపడకూడదు.

మనసు, మనం ప్రశ్నించుకొనే తీవ్రతను అనుసరించి, సమాధానాలు దొరుకుతాయి. తన జీవితాన్ని , పరిసరాలను, తనలోనే అర్థం"మాదిరిగా చూసుకోవటం అన్న కిటుకు నేర్చుకున్న తరువాత యింకేమీ ప్రకియలు, ప్రకారాలు అక్కర్లేదు.

"పరిశీలన" దీనికి మొదటిమెట్టు మెదడురణగొణ ధ్వనులు చేస్తున్నంతసేపు సృజనాత్మకతకు తావులేదు. మెదడు ప్రశ్నలు వేయడం నిలిపివేయాలి. ప్రశాంతంగా ఉండిపోవాలి. మానవాళి ఎప్పుడో , ఎక్కడో తప్పటడుగు వేసింది. అందుకనే మనలోయింత స్వార్థపరత్వం గూడు కట్టుకుపోయిఉంది. ప్రతి మనిషి నేను నాది, అనిరూప భావన కల్పనలు చేసికొని ఆకోటలలో గుడు గుడు గుంజం" ఆటలు ఆడుకుంటున్నాడు. "సజీవశక్తి" (మానవుడు) విశాల విశ్వము "తప్పనిసరి అవసరం" ఉన్నది అనుకున్నప్పుడు, మనస్సు సరైన మార్గానికి మరలుతుంది.

జ్ఞానం" తెలుసుకున్న, దాని హద్దులను గురించిన పరిశీలన దానినుండి బయటపడటం. మనషి యేదో అధికారం క్రింద పనిచేస్తున్నాడు. రాజకీయం, మతం, నాయకుడు, గురువు, తెలిసినవాడే, వివేకి, తత్త్వజ్ఞుడు - యిహ ఎవరో ఒకరి అధికారం క్రింద చిక్కుకుపోయి ఉన్నాడు. అందుకే మీరు అధికారాలనుండి విడివిడి మీకు మీరేదారి చూపే దివ్వెలు"గా తయారవ్వండి. పుస్తకం తాలూకు ప్రగాఢమైన లోతులకు వెళ్లండి వాటిని ప్రాతిపదికగా తీసికొని మనము ఆలోచించి నిగ్గు" తేల్చుకొనగలిగినప్పుడే అవి మనకు అర్థం అయనట్లు జీవితంలోని ప్రతి సందర్భాన్ని నిరంతర చింతన చేయడం అవసరం అవుతుంది.

మనిషి ఉనికి ఏమిటి? ప్రయోజనం ఏమిటి? మనిషి క్రూరుడు , కర్కోటకుడు అయిపోతున్నప్పుడు వివేకము, స్ఫూర్తి, సమరస భావము లేక పోయిన తరువాత చుట్టు ఎంత సిరసంపదలు వెల్లివిరిస్తే మట్టుకు యేమిలాభం?

స్వస్వరూప జ్ఞానం లేనప్పుడు యేమీ తెలియక పోవడం- అజ్ఞానం- ఉంటుంది. తనను గురించి తనకు తెలియని మనషి అజ్ఞాని" అంటే తనుచేసే మోసాలు తన ఆశాపాశాలు, అసూయ అపోహలు యేమీ తెలియనివాడు, స్వస్వరూపజ్ఞానం (బ్రహ్మజ్ఞానం) కలవాడు స్వేచ్ఛలో తిరుగుతాడు. "సరళత" ఉండటమే తెలిసికొనిన స్థితి. ఒక క్షణం ఉన్న మనస్థితి మరోక్షణంలో ఉండదు. బొమ్మలు, చిత్రాలు, విగ్రహాలు- వీటికన్నిటికి రూపకల్పన చేస్తున్న దెవరు? అది కోరికా? కామమా? ఆలోచనా? భావనా? లేకవీటన్నిటికి చెందని మరేదైనా పదార్థమా? కోరిక, దీని మూలం ఏమిటి? కోరిక అంటే ఏమిటి? శబ్ద, స్పర్శ,రూప,రస గంధాలతో మిళితమైన భావన; ఇంద్రియ (జ్ఞానేంద్రియ) జనితమైనది. జ్ఞానేంద్రియాలన్నీ

వికసించి, పరిపూర్ణంగా వికసించి, అపూర్తి వికాసంలోనుంచి చూస్తూ ఉన్నట్లయితే అప్పుడది "ఏకముఖత", అ చూడడమే నిజమైనది. నికార్సయినది. సక్రమమైనది. జాగరత కూడా అవసరం.

కామన- భావన కామన ఎప్పుడు సాక్షికమైనదే, కామన అంటే ఏమిటి? ఇంద్రియ స్పర్శల ద్వారా కామన బయలుదేరుతుంది. ముందు చూడడం తరువాత ముట్టుకోవడం జరుగుతుంది. ఇదీ "స్పర్శ", తరువాత - ఆలోచన, భావన, స్పందన ఏర్పడుతాయి. భావన, విగ్రహాలు, ప్రతీకలు తయారు చేస్తుంది. , భావన విగ్రహాన్ని సృష్టించగానే స్పందన ప్రారంభమౌతుంది. తక్షణమే భావన"గా రూపొందుతుంది.

జ్ఞానం" ఒక ప్రతీకజ్ఞానం జీవితం అంతటికి ఆధారం, జీవితాన్ని రక్షించేది. భక్షించేది కూడా జ్ఞానానికి ?లతబద్ధలు ఉన్నాయి. అందుచేతనే - "అజ్ఞానము" అనేది కూడా ఉన్నది, జ్ఞానము అజ్ఞానము విడదీయరానిది. ఈ విడదీయలేని స్థితియే సంఘర్షణను తీసుకువస్తుంది. మనం అజ్ఞానానికి ఎక్కువ విలువ, మన్ననయిచ్చి అజ్ఞానం తాలూకు చీకట్లను మరచిపోతున్నాము. జ్ఞానం తరతరాల మానవాళి యొక్క అనుభవసారము, మీకో ఆలోచనా రూపమైన విగ్రహం, ప్రతీక ఉంటే - అప్పుడు మనస్సుకు ఏదో తృప్తి, సమాధానం ఏర్పడుతున్నాయి. అది జీవితంలో ఒక వెసులుబాటు, యాంత్రికత తీసికొని వస్తోంది.

నియత నియమబద్ధమైనది. ఈ రెండూ ఒకటే భావన, ఆలోచన వాటిని వేరుచేస్తుంది. భావన యొక్క పద్ధతి - ప్రకృతి -నిర్మాణం, ఇది.

రూపకల్పన చేసే తీరు తెన్నులు - వీటి అంతస్ఫూర్తి ఉన్నప్పుడు జరుగుతుంది. రూపకల్పన ఆగిపోతుంది. అంతఃస్ఫూర్తికి ఏ ఉద్దేశాలు ఉండకూడదు, ఇదియే పరిపూర్ణమైన జ్ఞానం, గమనిక సావధానం.

మనిషి ఎప్పుడు సత్యం కోసం వెదుకుతున్నాడు, సత్యం అంటే ఏమిటి? బుతం" అంటే ఏమిటి? భావన సృష్టివేరు - ప్రకృతి -సృష్టివేరు. శాంతికావాలంటే శాంతియుతంగా జీవించడం చేతనవ్వాలి. సత్యం అంటే పేరులేనిది. అలోచన యేం చేస్తుందో చూడండి. వాదనలు చేస్తుంది. జ్ఞాపకాలు తెస్తుంది. ఈ జ్ఞాపకాలు వైరుధ్యాలు -తర్కాలకు భిన్నమైనవి, ఏదో మహత్తర శక్తి, తేజస్సు కార్యరంగంలోకి దిగుతుంది. అదే సత్యం అంతఃస్ఫూర్తి, నిజమైన అభావ పరుడైన మనషికి మట్టుకే పరిపూర్ణమైన జ్ఞానం కలుగుతుంది. సత్యమార్గం. జ్ఞానమార్గం అనేది, సత్య వాక్పరిపాలన ఆచరణలోనే సహజంగా రావాలి! ప్రతిరోజూ వాక్కును, శరీరాన్ని బహూ జాగ్రత్తతో గమనించుకుంటూ ఉండాలి. సుఖం అంటే ఏమిటి? అది ఒక సజీవశక్తి. అంటే నేను, నాది అనేది లేకుండా, యేలాంటి వెంపర్లాటలు లేకుండాను, అన్వేషణలు సతమతం చేయకుండాను, ఉండే స్థితి, అదేనిజమైన సుఖం,

"దుఃఖం" అంటే ఏమిటి? కన్నీరు విచారం - మనషితో అనాదిగా ఉన్నాయి. దేశాలలో "దరిద్రం" ఉవ్వెత్తున కనిపిస్తు ఉంటుంది. ఒక మనిషి, ఒక వస్తువు లేకపోవడం దుఃఖం కలిగిస్తుంది. కాని, దుఃఖం యింతకన్నా లోతైనది.

"ప్రేమ" అంటే ఏమటి? మనను, మనం నిజాయతీగా పరీక్ష పెట్టుకు చూడగలగడం, ప్రేమ యదార్థమైనది. తత్త్వబోధనలను వినిగాని చదివిగాని యధాప్రకారము అమలు జరిపినప్పుడు -బోధనలకు అనుగుణమైన జీవన విధానాన్ని ఆశ్రయించినప్పుడు పవిత్రత " సాక్షాత్కరిస్తుంది.

అసూయ, అనాలోచనలతో, మనను, మనమే నాశనం చేసుకుంటున్నాము. ఒక్క యింద్రియము మట్టుకే చురుకుగా ఉంటుంది. అలాకాకుండా పంచేంద్రియాలు చురుకుగా, సున్నితంగా ఏకగ్రీవంగా పనిచేయగల సామర్థ్యం సంపాదించాలి. స్వార్థ ధోరణులకు సుదూరం అయిపోయిన మనస్సుతో ముందుతరాలు వ్యవహరించాలి. విద్య- వినయశీలత వైపు

నడిపించాలి. శాస్త్రపరిశోధనల ద్వారా బాహికంగాను, ఆంతరికంగాను అంతస్ఫూర్తితో సమగ్రముగా పరిశీలించాలి. సంతృప్తి అలవరచుకుంటూ, కారుణ్యం పెంచుకోవాలి. ఇది ఎంతో ముఖ్యమని గమనించాలి. ఇంతకు మించిన కర్తవ్యం మరొకటి లేదనే అభిప్రాయాల యదార్థతను ఎవరికివారు పరీక్ష పెట్టుకు చూచుకొని, ఆపైన తాను ఆచరించడం.ముఖ్యం. ఇదియే విధి.

మనస్సు, హృదయము, శరీరము- యీ యీూడు సమరసంగా ఉంటే (త్రికరణ శుద్ధి) అప్పుడు వికాసం (స్వేచ్ఛ) సహజరీతిని జరుగుతుంది.

## బిడ్డుకృష్ణమూర్తిగారి తత్త్వదర్శనం

ఒకప్రక్క వస్తు సంపద పెంచుకుంటూనే, ఆధ్యాత్మిక శక్తినిగూడా సంతరించుకోవచ్చును, వస్తు సంపదకు అంటిపెట్టుకోకుండా ఉండడమే, ఆధ్యాత్మిక శక్తిని సంతరించుకోవడం. అన్నమాట ఒంటరితనంలోనే మీకు నక్షత్రదర్శనం అవుతుంది. అంటేమీకు అవసరం అయినశక్తి, ఉత్సాహము, సంకల్పబలము ఒనగూడుతాయన్నమాట, సత్యం నిప్పువంటిది. ఎప్పుడూ నృత్యం చేస్తున్న దీపశిఖ. అన్నిటినీ వదిలితేగాని, మీరు అప్రాంగణానికి చేరుకోలేరు. సత్యమే ఆనందం, తెజస్సు -అన్ని (సత్యమే ఆనందం) అవుతుంది. నిశ్శబ్దత, ప్రశాంతత అలవాటు అయినప్పుడే స్వర్గద్వారాలు తెరుచుకుంటాయి. ఇంద్రియాలద్వారా సేకరించుకున్న విషయ సముచ్చయాన్ని విషముగా గుర్తించి మెదడుకు పదునుపెట్టుటయే పరిపూర్ణజ్ఞానం అనబడుతుంది. మృత్యువు చెబుతోంది. నీవు యేమీ తీసుకుపోలేవు అని ఎంతోకష్టపడి నేను నాది అని భ్రమపూరిత అహంకారము (జీవుడు) సంపాదించినదంతా యికప్తై వదిలేసి, తానుకూడా యిక్కడే అంతరించి పోతుంది. ఇదియే మాయ అనికూడా అంటారు.

ప్ర॥ స్వస్వరూపజ్ఞానం అంటేఏమిటి? స్వస్వరూపజ్ఞానమునకు ఆత్మ జ్ఞానమునకు ఎమి బేదము లేదు.

జ॥ నన్ను నేను యే ప్రమాణాలు లేకుండా, ప్రమేయాలు లేకుండా పరిశీలించుకోవడం, నావైపు, నేను చూచుకోవడం, ఎప్పుడోముందురోజుకాదు ఇప్పుడే, యిక్కడే, అనుక్షణమూ. మనస్సు ఖాళీగా లేకపోతే యీ పనులన్నీ జరగవు, నిర్భయంగా అంటే యే మాత్రం అరమరికలు లేకుండా పరిపూర్ణంగా పని చేయగల నిస్సంకల్ప మనస్సుతో ఆనందంగా నుండుట తనది అంటూ యేమీ లేనిమనిషి ధన్యతముడు, డబ్బు మనుష్యుల్ని పాడుచేస్తుంది. అంతరంగ సంవిధానమే, బయటకు ఉబుగుతూ వచ్చి మనచేత అన్ని పనులూ చేయించేది. మన బాహ్య వ్యవహారాలు అన్నింటికి మూలాధారం. అంతరంగ స్థితిస్ఫూర్తి సముద్రజల సందోహం మాదిరే. లోపలివి - బయటివి అన్ని ఒక్కటే అదే జీవిత రహస్యం

## 45.మనస్సులనగానేమి?జ్ఞానవాసిష్టము,

చాంచల్యముతోగానవచ్చు ఆత్మయే మనస్సు ఆమనస్సువలననే సర్వముగలిగెను, దృశ్యాభిముఖముగు వృత్తియే మనస్సు,

సర్వవ్యాపకమగు ఆత్మ ఎకాలమందు, తనను పరునితెలియ జేసెడి శక్తిని ధరించునో, అప్పుడు ఆ ఆత్మయే మనస్సు అనబడును.

సర్వసామర్థ్యములు గలిగి, సర్వపరిపూర్ణమై పాపరహితమై యున్న "పరబ్రహ్మము" ఏదికలదో అదియే మనస్సు, దానికంటె భిన్నమై మనస్సు అనునది మఱియొక్కటిలేదు. అ పరబ్రహ్మమునందులేని శక్తులు ఎచ్చటను లేవు. జ్ఞానశక్తి చే ప్రకాశించు దేహమునకు పరబ్రహ్మమనిపేరు.

మాయయనగనేమి?

మనస్సు, ఇంద్రియములు పోవునంతవరకు మనోమయమైనదే మాయ అంతఃకరణము ఎంత ప్రదేశమున నుండునో అంతప్రదేశంముననున్న చైతన్యమును సాక్షి సంజ్ఞచేచూపించి, ఆయంతఃకరణమువేరుగా నుండును, అందువలన అంతఃకరణము సాక్షికి ఉపాధియనబడెను. ఆయంతఃకారక ప్రదేశము నందుమాత్రముండుచు, అంతఃకరణముతో నుండకవేరుగానుండు చైతన్యము సాక్షి అనబడును. ఉపాధికలవానిని ఉపహితుడు అందురు. విశేషణ హితుని విశిష్టుడందురు.

## 46. మానవతాధర్మములు- ఫలితములుః-

మానవుని యొక్క మానవత సంయమమునందుగలదు. తనయింద్రియములను మనస్సును సంయమము (ఏకము) గావింఛుకొనినసంయనుచిత్తుడు మాత్రమే సాధన మొనర్పగలడు, ఆసాధకుడు యీశరీరంమందే,హేయఫలవిచారమొనర్చి, కనబడుచున్నబుద్ధి, గుణ, రూపలింగముల ద్వారా అనుమానించి తెలిసికొన్న ఆగ్రాహకుడగుననన్నను మాన్పించుచున్నాడు అనగా ఇంద్రియముల కంటె శ్రేష్టమైనది మనస్సు, మనస్సుకంటె శ్రేష్టమైనది బుద్ధి, బుద్ధికంటెశ్రేష్టమైన వాడను నేనే. వేదమునన్ను నేతి ,నేతీతి , అను వాక్యములే చేసినవి. బుద్ధిమంతుడగువాడు విచారణ చేసి సంసారముయొక్క గతినవలోకించినచో మానవశరీరమున పూర్ణజ్ఞానము కలుగును.

ఆత్మ అపరిచ్ఛిన్నమైనదనియు, అసంగమైనదనియునని,ననుభవమునకు దెచ్చుకొనుట యును,ప్రతిక్షణమును, నేను శరీరమునుగాను, ఆత్మను కూటస్థడను, అనుభావన కలిగి యుండుటయు గొప్పఅదృష్టము.

ఎంతలభించిన, నంతయే ఉంచుకొనవలయును.రేపు దొరకకుండినచో గర్భములో నుండగభోజనముబెట్టినవాడు బయటనుండగా బెట్టడా? పొట్టనుబెట్టినవాడెవడో అతనికేతెలియును.

అహంకారమును త్యజించి, తాను భగవంతుడనని సర్వదాభావించవలెను. ఇది ఇప్పుడే, ఇక్కడే, సాధ్యము యద్భావం-తద్భవతి, భావనయెట్టిదో, సిద్ధియునట్టిదే. ప్రకాశము,శక్తి, జ్ఞానము, ఆనందము ఆత్మకు సంసారము. వేదాంత సూత్రములను అనుభవించు జీవితముకన్న యదృష్ట జీవితము మఱియొకటిలేదు. బాహ్య ప్రపంచమునంతయుదేహాభి మానమువలన, కనబడుచున్నది. ఈ అభిమానమును తొలగించినచో ప్రపంచవిషయములు కనబడువు, వినబడవు, చూడకున్నను. వినకున్నను ప్రపంచములేదు. ప్రపంచములేకున్న, సంసారమేలేదు.

దృశ్యరూపభ్రాంతిచే ఆవరింపబడి కళంకముజెందియున్నప్పుడు ఆపరమేశ్వరుడే జీవుడు, చిత్తశుద్ధిచేత అట్టికళంకము పోయినప్పుడు ఆ జీవుడే, పరమేశ్వరుడు ఆత్మజ్ఞానమువల్ల, జీవభావమలిన రాసులన్నియు తొలగుచున్నవి.

ప్ర॥ అహంకారము ఏట్లు కలుగుచున్నది?

జ॥ భూతకాల అనుభవతలంపులవల్లను, భవిష్యత్తులను అనుభవించవలెనను కోరికరాసులవలను అహంకారము కలుగుచున్నది.

ప్ర॥ నివారణోపాయమేమి?

జ॥ మరణించిన భూతకాలమును, జన్మించని భవిష్యత్తును వదలి మనః పూర్వకముగా వర్తమానమును మాత్రమే అనుభవించుచు జీవించగలిగినచో మనము చంపిన వారమగుదుము.

అహంకారరాహిత్యమే దైవత్వము

జ్ఞానదేవ్ పరమహంస

# 47.అచల పరిపూర్ణ తత్త్వవిచారము

సచ్చిదానంద రూపమగు నాత్మకంటె సచ్చిదానంద లక్షణములకు లక్ష్యమగు కేవలాత్మ కరచరణా ద్యవయవములు గల స్థూలదేహముగాని ఇంద్రియ ప్రాణాంతఃకరణ యుక్త మగు సూక్ష్మ దేహముగాని అజ్ఞాన రూపమగు కారణ దేహముగాని, ఆత్మాకారవృత్తి జ్ఞాన రూపమగు మహాకారణ దేహముగాని, సచ్చిదానంద రూపమగు కైవల్య దేహము గాని యెప్పుడును లేనిదగుటచే, కేవలాత్మ యతీతమైనది. అట్టి అచల పరిపూర్ణ బ్రహ్మముకంటె అన్యమగునదేదియు లేదు. ఇక అది యున్నదనిగాని, లేదనిగాని యెఱుగు వాడెవ్వడు? ఎఱుగువాడు లేనప్పుడు అది యున్నదని గాని, లేదనిగాని, అట్టిదనిగాని, యిట్టిదనిగాని, యెట్లు నిర్ణయింపబడును? అదియొక పదమునకర్థమైనను, లేక ఒక వస్తు రూపముగ నుండినను గర్భమందుండుట, పుట్టుట, పెఱుగుట, వృద్ధిని పొందుట, క్షీణించుట, నశించుట అను షడ్భావ వికారములు కలిగియుండును. అది యే పదార్థ రూమును కాని దగుటచే దానికి షడ్భావ వికారములు కలుగనేరవు.

బయలుః- బయలనగా ఆకాశము. ఇది భూతాకాశము, చిత్తాకాశము, చిదాకాశము, నిరాకాశమనియు నాలుగు విధములగును, ఇందు భూత భౌతిక, పదార్థములుండుట కవకాశము నిచ్చేడి ఆకాశము భూతాకాశమనబడును. శృతుల యందు దీనికి ఉత్పత్తి నాశములు చెప్పబడినవి, దీనికి శబ్దము గుణమగును. నిరాకాశ స్వరూపము నెఱుంగని మూఢులీ భూతాకాశమునే పరిపూర్ణ బ్రహ్మమని తలంచుచున్నారు. శబ్దగుణము కలిగి, ఉత్పత్తి నాశములుగలదగుటచే అచల పరిపూర్ణ బ్రహ్మము కానేరదు.

శరీరమునకు లోపలనున్న పరిశుద్ధాంతః కరణము చిత్తాకాశము. దీనికి కూడా శృతుల యందు ఉత్పత్తి, నాశములు చెప్పబడెను. ఇది వృత్తి రూపమగు పరిణామమును పొందుచుండును. దీనిని కూడా కొందరు పరిపూర్ణ బ్రహ్మమని తలంచెదరు. పరిణామవంతమై ఉత్పత్తి నాశములు గలదగుటచే వినిది పరిపూర్ణ బ్రహ్మము కానేరదు. అంతఃకరణమునందు. పుట్టి నశించిన సంకల్పమునకును, పుట్టబోవు సంకల్పమునకును మధ్యనుండి ఆరెంటిని ప్రకాశింప జేసెడి చిదాత్మ చిదాకాశ మనబడును.ఈ చిదాకాశమును పరాకాశమనియు నందురు. ఆ పరాకాశ రూపమగు చిదాత్మ సచ్చిదానంద లక్షణములు గలది యగును. లక్షణము లైన సచ్చిదానందములు లక్ష్యమైన పరిపూర్ణ బ్రహ్మము,కానేరవు. ఈ సచ్చిదాంనద లక్షణములు అనృత, జడదుఃఖములకు ప్రతియోగు (వ్యతిరేకు) లగును. ఇవి మనస్సుచే ఊహింపబడుచున్నవి. వాక్కుచే చెప్పబడుచున్నవి. ఈ కారణముచే (వాఙ్మనస్సులకు గోచరములగుటచే) సచ్చిదానందములు అచల పరిపూర్ణ బ్రహ్మము కానేరవు. ఈ లక్షణములనే అచల పరిపూర్ణ బ్రహ్మమని తలంచుట అవివేకుల భ్రాంతి లక్షణము.

శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాది గుణములుగాని, జన్మజన్మాంతర కామకర్మాది వాసనలుగాని సృష్టి స్థితిలయాది, తటస్థ లక్షణములుగాని, సత్యజ్ఞానానందాది స్వరూపలక్షణములుగాని, రూపనామక్రియాగుణ జాతులుగాని లేక యున్నదనిగాని, లేనిదనిగాని, నిర్ణయింపబడక స్వతస్సిద్ధముగ నుండునది. నిరాకాశ మనబడును.

ఈ పరిపూర్ణ బ్రహ్మమునకు కరచరణా ద్యవయవ యుక్తమగు స్థూల దేహముగాని, ఇంద్రియ ప్రాణాంతః కరణములతో కూడిన సూక్ష్మ దేహముగాని. అజ్ఞాన రూపమగు కారణదేహముగాని, బ్రహ్మాకార వృత్తి రూపమగు మహాకారణ దేహముగాని, సచ్చిదానంద రూపమగు కైవల్య దేహముగాని లేవు. ఈ అచల పరిపూర్ణ బ్రహ్మము విశ్వ, తైజస, ప్రాజ్ఞ,

ప్రజ్ఞ, ప్రత్యగాత్మలుగాని; విరాట్టు, హిరణ్యగర్భ, అవ్యాకృత, అఖండజ్ఞ పరమాత్మలుగాని కాదు. అది ప్రమాతృ ప్రమాణ, ప్రమేయములుగాని, ద్రుష్ట దర్శన దృశ్యములుగాని; కర్తృకరణ కార్యములుగాని, సాక్షి సాక్ష్యములుగాని కాదు. అది లోపల, వెలుపల యను భేదములేక సర్వదేశముల యుండును, సర్వ కాలములంయందును, సర్వ వస్తువులయందును సంపూర్ణముగ నిండియున్నది. ఈ అచల పరిపూర్ణ బ్రహ్మము రాగద్వేషాదుల వలెను. భూత భౌతిక పదార్థముల వలెను పుట్టి నశించునది కాదు. స్వర్గ, సత్య, వైకుంఠ కైలాసాదుల వలెను. క్రమముక్తి, జీవన్ముక్తి, విదేహముక్తులవలెను. పొందబడునదియును కాదు. అనిరుద్ధము, అనుత్పన్నము, సర్వప్రపంచోపశమము, నిరవశేష కల్పనా క్షయమునగునదియే పరిపూర్ణము. దానికి క్లేశ, కర్మ, జన్మ, మరణాది లక్షణము లేవియు కలుగనేరవు. ఇది భావ పదార్థమును కాదు. అభావపదార్థమునుకాదు. భావాభావాపదార్థమునుకాదు. అనుభవ పదార్థమునుకాదు. ఈ అచల పరిపూర్ణ బ్రహ్మమునందు. దేశకాలములు జీవేశ్వరులు, బంధమోక్షములు, ఇహపరములు, స్థితిగతులు, ప్రమాణ ప్రమేయములు, సదసత్తులు, సామాన్య విశేషములు, ధర్మాధర్మములు, దేవదానవులు, వ్యష్టి, సమిష్టులు, శీతోష్ణములు, బహిరంతరములు, మొదలగు ద్వంద్వములుగాని; జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయములు, భూత భవిష్యద్వర్త మానములు, సృష్టి స్థితి లయములు; ఉత్తమ,మధ్యమాధమత్వములు మొదలగు త్రికరణములుగాని యితరములగు బహూత్వ పదార్థములుగాని లేవు.

అది అవాఙ్మానస గోచరము

## అచల పరిపూర్ణ బ్రహ్మమునకు అర్థము:-

ఈ బ్రహ్మము అదియనిగాని, ఇదియనిగాని చెప్పబడదు. ఉన్నదని కాని, లేదనికాని, తెలియబడదు. అది యంతరమని కాని, బాహ్యమనికాని, వ్యాప్యమనిగాని, వ్యాపకమనిగాని, భేదములులేనిది. ఈ యచల పరిపూర్ణ బ్రహ్మము జ్ఞానానందముల కతీతమై సర్వత్ర సంపూర్ణముగ నిండియున్నది.

ఈ అచల పరిపూర్ణ బ్రహ్మమును తెలియుట కొఱకు కల్పింపబడిన జ్ఞానలక్షణమునకు మూలమెచ్చటను లేదు. ఈ జ్ఞానము 1. స్వరూప జ్ఞానము 2. వరాజ్ఞానము 3. అపరాజ్ఞానమునని మూడు విధములు అగును.

1. విషయాకారమగు వృత్తి జ్ఞానము... అపరాజ్ఞానము
2. ఆత్మాకారవృత్తి జ్ఞానము....... పరాజ్ఞానము
3. ఆత్మ స్వరూప జ్ఞానము... సామాన్య జ్ఞానము (స్వరూప)

ఈ బ్రహ్మము ఉత్పత్తి రాగ రహితమైనది. అది పుట్టినది. కాదు. దేనిని పుట్టింపనేరదు.

ఆత్మస్వరూప జ్ఞానము ( స్వస్వరూపజ్ఞానము) వలననే యది ప్రకాశిత మగుచున్నది. ఈ జ్ఞానము మొదట లేక, చివరనుండక యొకదానిచే పుట్టింపబడక, తనకు తానే తోచుచు, తనకు తానేమటు మాయమై పోవుచున్నది.

ఇది తోచుట తోడనే జీవేశ్వరులు, ప్రకృతి పురుషులు, కార్యకారణములు, సత్త్వ రజస్తమో గుణములు, పంచభూతములు, పదునాలుగు భువనములు మొదలగునవన్నియు. తోచుచున్నవి. ఇదియే సంసారము.

ఈ సంసార రూపమగు వృక్షమునకు ఈ జ్ఞానమే విత్తనము వంటిది. ఈ విత్తన రూపమగు జ్ఞానమునకును , వృక్షరూపమేగు సంసారమునకును వేరొక కారణము లేదు. ఈ రెండును పరస్పర కార్య కారణ రూపముగ బఱగుచుండును. ఈ జ్ఞానము సర్వ సంసారమునకు కారణమైనట్లు, తనకు కూడా తానే కారణమగును. తనకు తాను కారణమగు నప్పుడది యజ్ఞానమను పేరుతో బఱగుచుండును. కార్యరూపముగ పరిణమించునప్పుడు జ్ఞాన

ప్రపంచములుగ తోచుచుండును. ఈ జ్ఞానముయొక్క చలనమే మనస్సనియు, సంసారమనియు చెప్పబడును. దీని నిశ్చల రూపమే సచ్చిదానంద బ్రహ్మమనియు, అచల పరిపూర్ణ బ్రహ్మముయొక్క లక్షణ మనియు చెప్పబడును. ఈ జ్ఞానము త్రాటియందు తోచెడి పామువలెను. ముత్యపు చిప్పయందు తోచెడి వెండివలెను (తనంతట తానే) తోచుచున్నది. రజ్జు, శుక్తుల నెఱింగినచో సర్ప రజితములు మటు మాయమగు విధమున అచల పరిపూర్ణ బ్రహ్మము నెఱింగినచో జ్ఞానము తనంతట తానే లేకపోవుచున్నది. గగనారవిందము, గంధర్వ నగరము మూలము లేకయే తోచి లోకులను భ్రమింప జేయుచున్నట్లు, ప్రజ్ఞానమును మూలములేకయే తోచి జగద్భ్రాంతిని కలిగించి మటు మాయమగుచున్నది. ప్రజ్ఞానము ఒక్కటియేయైనను నానారూపముల నొంది, నానా కర్మములాచరించి, నానా దేహములను పొంది.నానావిధములగు సుఖదుఃఖములను అనుభవించి, నానాభ్రాంతులను పొంది. నానాదైవముల నారాధించి నాశమై పోవుచున్నది.

కలుగనెడి మనుజుడు కలలో తోచెడి దేవుని పూజించుచున్నాడు. బంగారమును జూచి భ్రాంతి నొందు చున్నాడు. స్త్రీని జూచి కాముకుడు అగుచున్నాడు. పులిని జూచి భయపడుచున్నాడు. జాగ్రత్త నొందిన పిదప వీని నన్నింటిని మిధ్యగా తలంచుచున్నాడు. అవి ఆ కలయందు పుట్టనూ లేదు. జాగ్రత్తలో పోవను లేదు. ఇవి యన్నియును భ్రాంతిమాత్రమే యగును. అట్లే ప్రజ్ఞానము కూడ భ్రాంతిచే నానావిధ నామరూపములను సృష్టించి, అవి అనుకూల ప్రతియూలములుగ భావించుకొని, రాగద్వేషాదుల నొంది, పుణ్య పాప కర్మములను జేయుచు, జన్మ పరంపరలు గలవాడై నానిదుఃఖముల నొందుచున్నాడు.

పరిపూర్ణ బ్రహ్మమను జ్ఞానమును (జాగ్రత్తును) పొందినచో ప్రజ్ఞాస్వరూపము అను కలయును, ఆకలలో తోచెడి వివిధ పదార్థములు మటుమాయమై పోవుచున్నవి.

జ్ఞానము నిరాశ్రయముగ నుండ జాలదు.

పరాజ్ఞానము సచ్చిదాంనద లక్షణముల నాశ్రయించి కలుగు చున్నది. అపరాజ్ఞానము సృష్టి స్థితి లయములుగల పదార్థముల ననుసరించి కలుగుచున్నది. అచల పరిపూర్ణ బ్రహ్మము అవస్తువు అగుటచే అది జ్ఞానమున కాశ్రయము కానేరదు. ఆ యచల పరిపూర్ణ బ్రహ్మము నందాశ్రయ , అశ్రయీ భావము. సంభవింపదు. ఈ మూలములేని జ్ఞానము తనకాశ్రయమగు పదార్థములను తానే సృష్టించుకొనును. గాఢాంధకారమునందు పిశాచాదులుతో చూచుచున్నట్లును, ఆకాశమునందు నీలివర్ణము కనుపించునట్లును, మూలము లేకయే జ్ఞాన శరీరములు తోచుచున్నవి. ఈ కనుపించెడి సంసారమునకు గాని, దీని జ్ఞానమునకు గాని మూలమెచ్చటను లేదు. ఈ జ్ఞానము ఉద్బుద్ధమగు పూర్వవాసనలతో గూడి జాగ్రత్ప్రపంచమును సృపించుచున్నది, ఉద్బుద్ధమగు జాగ్రద్వాసనలతో కూడి స్వప్నప్రపంచమును సృష్టించుచున్నది. వాసనలనుద్బుద్ధములైనప్పుడది యజ్ఞాన రూపమును దాల్చుచున్నది. కావున దీని మూల మెచటను లేదు. అంతఃకరణమునందు చిదాత్మయును, దేహేంద్రియాదిజడ సంఘాతమును తాదాత్మ్యమున పొంది మొత్తమంతయు నేను అని వ్యవహరింప బడుచున్నది. ఆ నేను కు లక్ష్యమైన అంతఃకరణ విశిష్ట చైతన్యము వలననే సమస్త పదార్థములు తెలియబడుచు ఉన్నవి. ఈ సమస్త పదార్థములకు విలక్షణమై వానినన్నింటిని ఎఱింగెడి యంతఃకరణ విశిష్టమగు నాత్మయే సర్వవ్యాపకమైయున్నది.

జీర్ణించి పోవునది యగుటచే శరీరమని పేరు కలిగినది. కాలాంతరమున జీర్ణించి పోయెడి శరీరములు 1. స్థూల శరీరమనియు, 2. సూక్ష్మశరీరమనియు 3. కారణ శరీరమనియు 4. మహాకారణ శరీరమనియు 5. కైవల్య శరీరమనియు నైదు విధములగును. ఇందు కరచరణా ద్యవయవములుకల మ్రోడువలె కనిపించునట్టి స్థూల శరీరము కలదు. ఇంద్రియ ప్రాణాంతఃకరణములు గలదియై కార్యముల బట్టి యనుమానింపబడునది సూక్ష్మశరీరము.

అజ్ఞాన రూపముగా ననుభవింపబడునది కారణ శరీరము. ఈ మూడు శరీరములను అజ్ఞాత శరీరములనబడును.

చిదాత్మ సహితమగు నంతఃకరణమునందు పరాపర జ్ఞాన రూపముగ ప్రజ్వరిల్లునది - మహాకారణ శరీరము. ఇందు అపరాజ్ఞానము ఇంద్రియముల మూలమున బహిర్గతమై విషయములను పొంది వానిని ప్రకాశింపజేయుచున్నది. వాసనారహితమగు నంతఃకరణమున కలిగిన పరాజ్ఞానము ఆత్మకు అభిముఖమై దానిని విషయీకరించుచున్నది. ఈ పరాజ్ఞానమే మహాకాకణ శరీర మనబడుచున్నది. అచల పరిపూర్ణ బ్రహ్మమునకు లక్షణమై, పరాపర జ్ఞానములకు ప్రకాశకమై యుండెడి చిదాత్మ" కైవల్య శరీరమనబడును.

ఇందు మహాకారణ శరీర రూపమగు వృత్తిజ్ఞానము యితర జడ పదార్థముల నన్నింటిని ప్రకాశింపజేయుచు తాను చిదాత్మచే ప్రకాశింపబడుచున్నది. కైవల్య శరీర రూపమగు చిదాత్మ తాను స్వయముగ ప్రకాశించుచు, స్థూల సూక్ష్మ కారణ మహాకారణ శరీరములను ప్రకాశింపజేయుచున్నది.

ఇందు ప్రకాశింపబడుచున్న స్థూల, సూక్ష్మ, కారణ శరీరములు మూడును అజ్ఞాత శరీరము లనబడును.

ప్రకాశింపజేయుచున్న మహాకారణ, కైవల్య శరీరములు రెండును, జ్ఞాత శరీరములనబడును, వాస్తవముగ కైవల్య శరీర రూపమగు చిదాత్మ యొక్కటి మాత్రమే జ్ఞాత శరీరమగును. అయినను తప్తాయః పిండమువలన చిదాత్మతో కూడిన యంతఃకరణము కూడ అన్యపదార్థములను ప్రకాశింప చేయయుటచే జ్ఞాత శరీరమని వ్యవహరింపబడుచున్నది.

ఈ దేహమున కంతరముననున్న ఇంద్రియములు ఆత్మకు అతి సమీపమున నున్నవి వానికంటె ప్రాణము అంతరమై యుండుటచే నది ఆత్మకు అతిసమీపమగును, దానికంటె నంతరముగ నంతఃకరణ మున్నది. ఈ అంతఃకరణము ఆత్మకు అత్యంత సమవర్తియగును. ఈ అంతఃకరణము నందు చిదాత్మయును, దేహేంద్రియాది జడ సంఘాతమును తాదాత్మ్యమును బొంది మొత్తమంతయు నేను అని వ్యవహరింపబడుచున్నది. లక్ష్యమైన అంతఃకరణ అనేనుకు విశిష్ట చైతన్యము.వలననే సమస్త పదార్థములు తెలియబడుచున్నవి.

ఇందు చిదాత్మ రూపమగు కైవల్య శరీరమునందు ముఖ్యజ్ఞాతత్త్వమును చిదాత్మాకార వృత్తి రూపమగు మహాకారణ శరీరమునందు గౌణజ్ఞాతత్త్వమును తెలియబడుచున్నది.

అజ్ఞాత రూపములగు స్థూల సూక్ష్మ కారణ శరీరములను భూత భౌతిక పదార్థములను ప్రకాశింపచేయునది జ్ఞాత శరీరమగును ఈ జ్ఞాత శరీరము లేనిచో జ్ఞేయ పదార్థము లేవియు నుండవు. ఈ జ్ఞాత శరీరమునకు మూలము లేదు. కావున యీ గుర్తెరిగెడి జ్ఞాతశరీరము యే కాలమునందున లేదు. జ్ఞానశరీరము తోచినప్పుడే సమస్త ప్రపంచము తోచుచున్నది జ్ఞాతశరీరము లేని కాలమున ఏ పదార్థము తోచుట లేదు కావున సమస్త పదార్థములు జ్ఞాత పదార్థములే యగును.

ఈ జ్ఞాత (ఎఱుగువాడు, ఎఱుక) తన మూలమును విచాచించినచో తానే లేక పోవుచున్నది. తన లేమియే జీవేశ్వర జగత్తుల లేమి యగును.

జీవేశ్వర జగత్తులు జ్ఞాతయందే కలిగి తోచుచున్నవి. జ్ఞాత లేనిచో జీవేశ్వర జగత్తులును లేవు. జ్ఞాతమే సమస్తమునకు మూలము. ఈ జ్ఞాతకు మూలమేమియు లేదు. ఈ మూలములేని జ్ఞాత శరీరము ఉన్నంతవరకు సమస్తమును కలిగి తోచుచుండును ఈ మూలము లేని, గుర్తెరిగే శరీరము తన మూలమును విచారింపదలచినప్పుడు తానే లేకపోవుచున్నది.

తానున్నంత వఱకు తన సంపద యంతయు తన తోడనే యుండును. తాను పోవునప్పుడు తన సంపదను తన తోడనే తీసికొని పోవును. తానెచ్చటినుండి వచ్చెనో తెలియబడదు.తిరిగి

యెచ్చటికి పోవునో తెలియబడదు. మధ్యమాత్రము తన సంపదతో తోచుచు. నానావిధములగు నాట్యము లాడుచు తుదకు మటుమాయమై పోవుచున్నది.

ఇది వచ్చెడి చోటుగాని, పోయెడి తావుగాని లేనిదియే యగుటచే సర్వదాలేనిది యనియే చెప్పబడుచున్నది.

బిడ్డలు పుట్టి, చచ్చిన వానిని గూర్చి నీకెందరు బిడ్డలని యడిగినపుడు అతడు నాకు బిడ్డలు లేరని చెప్పును. అట్లే ఆది, అంతములయందు లేక మధ్య మాత్రము తోచి నానావిధ భ్రాంతులను కలిగించి -తుట్టతుదకు లేక పోయెడి జ్ఞాత సర్వత్ర లేనిదియే యని చెప్పబడుచుండును. అట్లే జ్ఞాతృ జ్ఞాన , జ్ఞేయ రూపమగు సాక్ష్యమున్నప్పుడే వానిని ప్రకాశింపజేసెడి సాక్షియుండును.సాక్షి యున్నప్పుడే త్రిపుటి రూపమగు సాక్ష్యము ప్రకాశింపబడును. కావున ఆత్మస్వరూపమగు సాక్షియును, త్రిపుటి రూపమగు సాక్ష్యమును పరస్పరా పేక్షితములై తోచుచు తుదకు మటుమాయమై పోవుచు ఉండును.కావున నివి యెప్పుడును లేనివే యని చెప్పబడెను.

విషయము లేనిదే జ్ఞానము కలుగనేరదు. పదార్థమెట్లుండునో జ్ఞానము కూడనట్లే యుండును. ఆ పదార్థము సత్యమైనను, మిధ్యయైనను, జ్ఞానము కూడ దాని ననుసరించియే యుండును. స్వప్న పదార్థములు దృశ్యములగుటచే మిధ్యలగునట్లు జాగ్రత్పదార్థములు కూడా దృశ్యములగును. కావున మిధ్యలే యగును. ఈద్వివిధ దృశ్యములు మనః కల్పితములే యగుటచేనవి రెండును మిధ్యలే యగును.

మొదట సచ్చిదానంద స్వరూపుడగు ఆత్మ అవిద్యా ప్రభావము వలన జీవ భావమును పొందుచున్నాడు.

## 48. జ్ఞాన్యజ్ఞానులభేదము (బ్రహ్మవిద్యామహోదధి.)

కూటస్థునితో కూడిన చిదాభాసుడే (జీవుడే) భోక్తయనివ్యవహరింపబడుచున్నాడు.

చిదాభాసుడు తన కధిష్ఠానమైన (వ్యాపకమైన) కూటస్థుని( పరబ్రహ్మ) యొక్క సత్యత్వమునతనయం దారోపించుకొని తన్ను సత్యమైన వానినిగభావించి భోగములను విడువజాలక యున్నాడు. జ్ఞాని సంపూర్ణ వైరాగ్యముతో మిధ్యలగు భోగ్య పదార్థములను ప్రేమింపక, భోక్తియగుతన్నే ప్రేమించుచున్నాడు. అజ్ఞాని స్రక్చందన వనితాది. విషయములను ప్రేమించునట్లు జ్ఞాని సర్వదా ఆత్మను ప్రేమించుచున్నాడు, ప్రతిపక్షులను జయించుట కొఱకు, నిరంతరము కావ్యనాటక తర్కాదులను నభ్యసించునట్లు మోక్షేచ్ఛ గలవాడు నిరతరము స్వస్వరూపచింతనానుసంధానపరుడై యుండును. కావ్య నాటకాదుల నభ్య సించెడి వారికి వాని యందు నైపుణ్యము అభివృద్ధి యగునట్లు, జ్ఞానికి నిరంతరాభ్యాసము వలన నాత్మాను సంధానమభివృద్ధి యగును.

జాగ్రదవస్థయందు కనుపించెడి వస్తువులు స్వప్నమునందు కనుపించుటలేదు. జాగ్రదవస్థ యందును. స్వప్నావస్థయందును కనుపించెడి వస్తువులు, సుషుప్తియందు కనుపించుటలేదు, కాని ఆత్మ మాత్రము ఈ అవస్థలన్నిటియందు ఒక్కరూపముగ కన్పించుచున్నది జాగ్రత్స్వప్న సుషుప్తుల యందుగల సమస్త పదార్థములను ఆత్మ యెఱుంగుచున్నది కాని ఆత్మను ఏ పదార్థము ఎఱుగుటలేదు.

ఈ జాగ్రత్స్వప్న సుషుప్తులనెఱింగెడి చిదాత్మయే బ్రహ్మము అని యెఱింగిన వానికి సర్వసంసారబంధములు శమించు (అణగు) చున్నవి.వానికి మరల జన్మమురాదు.- బుద్ధితోగూడి,విషయభోగములననుభవించెడి.చిదాభాసుడు సుషుప్తిసమాధ్యవస్థలయందులేక పోవుచున్నాడు, ఆ చిదాభాసుని యొక్కలేమికి చిదాత్మ యేసాక్షి యగుచున్నది. ఈ చిదాభాసుడు. తనలేమినెఱింగిన యెడల మఱలనతడు విషయభోగములల నపేక్షింపడు.

అహంకారము, బుద్ధి సహిత చదాభాసుడు, దేహత్రయముతో గూడినవాడై నేను మనష్యుడను నేను కర్తను, నేను భోక్తను. అనినేహత్రయము యొక్క వికారములను, కూటస్తునియొక్క సత్యత్యమును తన యందారోపించుకొని వ్యవహరించుచున్నాడు. అందువలన దేహత్రయమునందుగల వికారములు తనయందున్నట్లు భావించి వ్యర్థముగ పరితపించుచున్నాడు. ఆదేహత్రయము నేనుగాననియు నానిజస్వరూపము అధిష్ఠాన చిదాత్మ యనియు నెఱింగిన వానికి దేహేంద్రియాదుల వికారము లెంతమాత్రము నంటవు. జ్ఞానియాత్మా పరోక్షజ్ఞానము కలవాడగుటచే, నతనికిశ్రవణము చేయువలసినపనిలేదు. దృఢమైన యాత్మనిశ్చమముగలవాడగుటచే జ్ఞానికి ఏసంశయముకలుగదుకావున నతనికి, మననము చేయవలసినపనియునులేదు.

బ్రహ్మసాక్షాత్కారముగల జ్ఞానికి ప్రారబ్ధకర్మములవలన , బాహ్య వ్యవహారములు సంభవించినను, నవిమోక్షమునకు ప్రతిబంధకములు కానేరవు. అనుభవించు ప్రారబ్ధ కర్మము, నశించిపోగా తత్త్వవేత్తకు విదేహమోక్షము అవశ్యము కలుగుచున్నది. సమాధిగాని, విక్షేపముగాని, వికారవంతమైన మనస్సునకవసరమగునుగాని నిర్వికార , అసంగ చిద్రూపుడనగు నాత్మకు ఏ సంబంధమును లేదు. జ్ఞాని నిత్యానందానుభవమును బొందియున్నాడు. కావుననతడు అయానందము కొఱకు, చేయవలసినదిగాని పొందవలసినదికాని లేదు.

అతనియందుకర్తృత్వ భోక్తృత్వాదులు సంభవింపవు. జ్ఞానియొక్క ప్రవర్తనయెట్లుండినను అదియతని యాత్మజ్ఞానమునకు బాధకరము కాదు. అతనియింద్రియమనస్సులాయాపనులు చేయుచుండినను, తానువానికి సాక్షిమాత్రుడే యగుచున్నాడు. జ్ఞానిదేహేంద్రియ మనస్సులకు విలక్షణమైన సాక్షియై ప్రకాశించుచున్నాడు. కావున నతనియందు కర్తృత్వభోక్తృత్వాదులు సంభవింపవు. కర్మిష్ఠి బ్రహ్మజ్ఞాని భావమునెఱుంగడు.

విక్షేపశక్తి (లేనిదిఉన్నట్లు తోచుట) సహితమగు అజ్ఞానము యొక్క అనువృత్తి (దృఢ భావన)చే జ్ఞాని ప్రారబ్ధకర్మ ఫలములననుభవించక తప్పుట లేదు. ఏలనన,జ్ఞానము, అజ్ఞానమును, అగామిసంచిత కర్మములను మాత్రమే నశింపజేయును, కాని ప్రారబ్ధకర్మమును నశింపజేయలేదు. జ్ఞానము, ప్రారబ్ధకర్మమునకు విరోధియని తలంచినచో జ్ఞానమువలన ప్రారబ్ధకర్మము నశించినప్పుడు జ్ఞానియగు గురువు శరీరము గూడనశింపవలయును. అట్లు నశించినప్పుడు, జ్ఞానోపదేశము చేయుగురువే లేకపోవలయును. అట్లులేదుకదా.

ప్రారబ్ధభోగానంతరము ఆత్మజ్ఞాని ప్రాణము ఎక్కడకును ప్రయాణము చేయుటలేదు. అతని ప్రాణములుఅధిష్ఠానాత్మయందే విలీనములగుచున్నవి (కలియుచున్నవి) జ్ఞాని, వర్తమాన శరీరమును విడుచుటయందు పుణ్యకాల అపేక్షగాని, పుణ్యప్రదేశాపేక్షగానిలేదు. భగవద్గీతః- యదాహ్యేవైషఏతస్మిన్నదృశ్యేణ నాత్మ్యేనిరుక్తే, జనిలయనేణ్భయం.

ప్రతిష్ఠాంవిందతే దసో భయం గతోభవతి. శృతియందు "నవునరావర్తతే 2మోక్షమును.పొందిన వానికి పునర్జన్మలేదు. అనిచెప్పబడెను.

బ్రహ్మసూత్రములుః- తద్బుద్ధ యస్తదాత్మాన, స్తన్నిష్ఠాస్తత్పరాయణాః గచ్ఛంత్యే, పునరావృత్తం, జ్ఞాననిర్ధూతకల్మషాః ఈ సమస్త ప్రపంచమునందు చైతన్యమే యదిష్ఠాన రూపముగ వ్యాపించయున్నది. కావున నిది యంతయును చైతన్య మాత్రమే యగుననీవును ,నేనును, సర్వలోకములును, ఒక్కచైతన్య మాత్రమే యగునని చెప్పబడెను. కావున నిట్టి చిన్మాత్ర వాసనను దృఢముగ నభ్యసించినచో మలినములగు సమస్త జడవాసనలు నివృత్తములగుచున్నవి ఇట్లు శాస్త్రమునందు ఈ సమస్త ప్రపంచము చినాత్మమేయని చెప్పబడెను.

కర్తృ, కర్మ, కరణ,రూపముగుత్రిపుటి స్మరణరహితమైన కేవలమగు చిన్మాత్ర వాసన, యసంప్రజ్ఞాతి సమాధియందతర్భూతమగును.

సర్వేజనాసుఖీ నోభవంతు
ఓం శాంతి శాంతి శాంతి

జ్ఞానదేవ్
పరమహంస, బ్రహ్మవిద్వర
అపరోక్షానభవి.

## 49. (A) THE YOGA VASISHTA AND PRACTICAL VEDANTA OF SRI RAMA THIRDHA

Respect Yourself and everybody will respect you (111-75) Why should you consider yourself dependent on you, christ, Mohemmad, Buddha, Krishna Or any other of the saints of the world. Free you are, each and all-- Feel your independence. Feel that you are the God of Gods, the lord of lords" (111-74,75) "Depend not on others (111-82).

They, who depend upon fate or destiny lose all their merit, wealth and enjoyments. They are infact, their own enemies (111-7-3).

Those fools who believe that everything is in the hands of some other power,called fate or Destiny are utterly ruined.

He advises,us: "Having nothing" Vedanta is not pessimism (VI-93) "It is rather the highest pinnacle of optimism" (VI-92)

"VEDANTA FILLS YOU WITH ENERGY AND STRENTH" (VI-92) "Vedanta is health, physical, mental and spiritual) (V-1104) "If vedanta does not make you happy, if it does not cast off your burdens, then kick it aside (111-233)

"Where ever you are, there, the temple of Vedanta is" "Realising the Divinity in each and all, this is renunciation according to Vadanta"

"All this is mere thought" (VI6-210-11) (11-186) WORLDS. All the three worlds are constructed by the mind, by thought alone." (IV,11,28) Thought is omnipotent, Swamiji said "All your world being, but your own creation your idea; why think yourself a low, miserable sinner, why not Think yourself into a fearless, self-reliant inearnation of Divinity (11-71) Aum-Aum-Aum

The man, who gained complete Knowledge (Jnana) with his self effort, living in the body filled with bones and flesh, is Real god on earth. (Aham Brahmasmi yazurveda maha Vakya).

## 49. (B) Talks with Sri Ramana Maharshi part -I

Just as you think,so you become.

"All the universe is but my idea.

Believe it, and you will see that the world is your idea". The mind is the creatior of the world".

The man living in the body filled with Bones and flesh, who gained complete knowledge (Jnana) with his self effort, is god on earth".

Every day, when you go to bed at night,you put off the gross body

